

శ్రీ శేషు

నా తల్లి

వేంకటలక్ష్మికి

నా తండ్రి

వేంకటరమణయ్యకి



# ఈ రచయిత వే

—: ముద్రితాలు. :—

కామేశ్వరికథ (నవల)
లక్షింపతిగారమ్మాయిలు (నాటకం)
కళలు : కథలు (వ్యాసాలు)
దయ్యంపట్టినమనిషి (నవల)
మనస్తత్వాలు (కథలు)
వంటింటికుందేళ్లు (నాటిక)
అనంతం (కావ్యాలు)
శిలాప్రతిమ (నాటిక)

—: అముద్రితాలు :—

మాల్వా (నవల)
తెగనిగొలుసులోలంకెలు (నాటకం)
అధోలోకాలు (కథలు)
రాంషాహీప్రణయగాథ (కావ్యాలు)
నవల (వ్యాసాలు)
చైత్రకథ (నవల)
చిత్రవర్షం (నాటికలు)
అపస్వరాలు (కథలు)
సాహిత్యం (వ్యాసాలు)
విమర్శ (వ్యాసాలు)
కావ్యం (వ్యాసాలు)
నాటకం (వ్యాసాలు)

....అనంతమైన మహాప్రవాహం ఒకటి సాగిపోతున్నది; అది కాలప్రవాహం కావచ్చు; లేదా కాలప్రవాహంలో అంతర్భాగమైఉన్న ఉన్నతకావ్య ప్రవాహం కావచ్చు: మహాకవుల కావ్య నిర్ఝరుల మధురసంగీతాన్ని వింటూ తన్మయం పొందే జీవులంమనం. ఈ ప్రవాహం అనాది; ఈ ప్రవాహం అనంతం; ఈ ప్రవాహం ఆద్యంత రహితం.

ఎక్కడో, ఎప్పుడో ఊరిననీరు పెల్లుబికి, ఒడ్డులొరసి, పొర్లి, పల్లపుదారుల ప్రవహించి, క్షణక్షణం విపులమై, గాఢమై, సంకీర్ణమై, ఒకచోట రాజహంసవలె, మరొకచోట కదనాశ్వం వలె, ఇంకొకచోట వర్షకాల కృష్ణపయోదంవలె సమయోచిత గమనాలవిరాజిల్లుతూన్న ఆ కావ్యప్రవాహాన్ని చూచినవారికి తన్మయత్వం ఏమంతమాట!

ఈమహాప్రవాహానికి జనపదాలే మాతృస్తనాలౌతున్నవి. ఆమహా మహుల కృతులే క్షీరధారలై శాఖోపశాఖలౌతున్నవి. యుగీన కావ్యరీతులే ప్రవాహగుణ నిర్దేశకాలౌతున్నవి. దుష్టబుద్ధి, అజ్ఞాని మసూచీ విషూచీ జాడ్యబీజాలతో నిండిన వసనాల పవిత్ర జలాలకలిపినట్లు కుకవులు కావ్యప్రయోజనాల విస్మరించి ఆయా యుగాల ప్రవాహాల కలుషితం చేశారు. కాని, ప్రవాహగుణ సంపన్నమైన పవిత్రజలాలు రోగ క్రిమిసంహారకాలుకూడా.

దేవతలైన పూర్వపురుషుల వాక్కునపుట్టి, దివ్యమై చెన్నొందిన ఈ మహాప్రవాహాన్ని దూరులైన సగరాదుల చితా భస్మాలపై పనిపి వారి ఆత్మల్ని పునీతం చేయటం కోసమే ఈ భగీరథ ప్రయత్నం సాగిస్తున్నాను. ఇదుగో గంగావతరణమౌతున్నది. పరమ శివులవలె దీనిని శిరసావహించండి. శాప దూరులైన సగరులారా! మీ ఆత్మల్ని క్షాళనం చేసుకోండి. ఈ నవవేదం పఠించండి :

ఇది సాయం సంధ్య.

# గౌతమి.

..పశ్చిమాకాశపు స్వర్ణకాంతులు ఆకుపచ్చని గౌతమీ నదీజల తరంగాలపై పడి విచిత్రవర్ణాల పూసుకున్న సంధ్యా సమయంలో, శీతల జలతుషారాలతో నిండిన మందమారుతాలు మన హృదయాల స్పృశించాలనే ఆశతో, అనునిత్యదారిద్ర్య దుఃఖాలవలువల్ని ఊడ్చి, దైనందిన వేదనాపరితప్త హృదయాన్ని చేతబట్టుకొని గోదావరీనదీతీరంపై షికారుచేస్తున్నాను.

గంధర్వనాట్యం చేస్తున్నది గోదావరి. ప్రకృతివలె చిత్ర విచిత్ర చిత్రాల లిఖిస్తున్నది. పార్వతివలె వివిధగతిలాస్య విన్యాసాల ప్రదర్శిస్తున్నది. పరమశివునివలె తాండవమాడుతు న్నది. ఆమెనృత్యకోలాహలం నాహృదయంలో ప్రతిధ్వనిస్తు న్నది. ఆమె సౌందర్యం నాకన్నుల కట్టినట్లున్నది. గంభీర మనోజ్ఞభావాలు నాలో మందమారుతాలై హృదయవీణాతంత్రు లను స్పర్శిస్తున్నవి. నానుండి గోదావరి పరిగెడుతున్నది. 'పరిగెట్టవద్దు తల్లీ' అని ప్రార్థించ బుద్ధవుతుంది. కవికి ఆమె కౌగిలిలో కనుమోడ్చటంకన్న కావలసినదేముంది ?

ఆమె నిర్మలాంతఃకరణలోని మాధుర్యం చవిగొనాలనే ఆకాంక్ష! ఆప్రవాహమే నాయోచనన్ని పునీతం చేయాలనే వాంఛ! ఆలోచనలు నిస్ఫలాలనే ఆవేదన!

నాఆవేదనని ఆమెతో చెప్పుకోవాలి. అంటే అగ పుంటాను ఆమెని! ఏనాటి సంబంధమో మాఇద్దరిదీ! అంటే ఎలుగెత్తి ఆక్రోశించాను:

ఓ దివ్యగౌతమీ ఓ భవ్యగంగ!
పారకే పారకే పరుగులన్ వారి.

నీసిలి నీలాల నినదించు తరగ
చిత్రించు చిత్రాల చిత్రకారులకు

నీ చిరుతరగల నృత్యవిన్యాస
మ్మానటేశునిభంగి నడకెంచ నీవె.

నీ చిరుతరగలన్ నినదించు రవళి
నాలోన లోలోన నడయాడ నీవె.

లోలోన కనరాని లోతు పీడలను
అమృతమ్ము చిలికించు ఆర్ద్రగాత్రాల
పాడనీ పాడనీ పదిమంది కవుల
పాడనీ పాడనీ పదిమంది కవుల.

ఓ దివ్యగౌతమీ! ఓ భవ్యగంగ!
పారకే పారకే పరుపులన్ వారి.

పన్నుండు నీనుండి పరతెంచు మధువు
నాలోన లోలోన నటియింపజేసె
నీనీలి తరగలన్ నిత్యకౌగిలిని
కనుమోడ్చ నీయవే కవినైన నన్ను.
నీ నీలినీలాల నిర్మలత్వాన
పరిసరించి ప్రవహించు ప్రభయె నీ ఆత్మ
మాపైన నిండార ప్రసరించుదనుక
సుడిగొని నదియించి చోద్యమ్ము గొలుపు.

ఓ దివ్యగౌతమీ! ఓ భవ్యగంగ!
పారకే పారకే పరుపులన్ వారి.

నిష్ఫలయోచనా! నిలుచుండు చాలు;
మంజులమ్మగు దివ్య మకరంద నదము,
ఈకవీ హృదయమ్ము ప్రవహించి నిన్ను
తళుకొత్తు భావాల తన్పివేసెడిని.
ఎందుకే ననువీడి పరుగులన్ పెడుదు?
ఎన్ని శతాబ్దాల ఎరుకయే మనది!
పరివహించి పరివహించి పరుగెత్తిపోక
నామాట నాబాధ చెప్పుకోనిమ్మ.

ఓ దివ్యగౌతమీ! ఓ భవ్యగంగ!
పారకే పారకే పరుగులన్ వారి.

# చైతన్యం.

ఏమిటో నావెర్రిగాని, ఈ మహాప్రవాహం 'అనంతం' కదా ! ఎక్కడికి పోతుందిది ? నాకుముందు ఎందరు కవులీ అనుభూతుల్ని పొందలేదు ? ఎందరి ఆవేదనల్ని ఆమె వినలేదు ? ఎందరికి తన అమృతాన్ని ప్రసాదించి వారిజీవితాల పునీతం చేయలేదు ?

ఏనాటివారీ కవులు ? ఏలాటివారీ కవులు ? గుండెల్లో కుంపటితో పెదవులపై చిరునవ్వులుచిందే కవులు ఈనాటివాళ్లా? లక్ష సంవత్సరాలన్నా కనీసం వేయి సంవత్సరాలన్నా వయస్సు గలవాళ్లు. ఆ నాటిదీ గోదావరి. ధృవనక్షత్రంలాంటి కవి యశస్సు, ఆర్ద్రనయనాలతో, కంపితగళాలతో నూత్న చైతన్య స్రవంతిని ప్రపంచానికి ప్రసాదించే దీక్షాకంకణులుకదా కవులు !

ఈ మంత్రజలాల అమృతశీకరాలు నాలో రావించిన జ్ఞానబోధకు నేను బుద్ధుణ్ణయ్యాను. ఆ చైతన్యస్రవంతికి బద్ధుణ్ణయ్యాను. పూర్వకవి ప్రతిభా విశేషాలకు ముగ్ధుణ్ణయ్యాను. అందుకనే ఇంత దర్పం వచ్చింది నాలో; అనూనమైన సాంప్రదాయమే నాకీ అహంకారాన్ని కలిగించింది. ఆ అహంకారం తోనే నేనిట్లా ప్రకటించాను :

1

నవ్వే — చిరునవ్వే
ముసలీ — ముదుసళ్ళం
ముదిమీ ముదుసళ్ళం
దశ శతాబ్దులు
శత శతాబ్దులు
వయసే మా వయసే

2

సౌప్తిక నిశ్శబ్దం
ఈ ధృవనక్షత్రం.
వాలికే హిమకణాల
వాణికే నిశగాల
ప్రపంచానికే ప్రపంచానికే
ప్రసాదించుతాం.

3

అశ్రాంతము విశ్రాంతి
స్రవంతిలోనే
నూతన మేదైనా
చేతన రూపేణా
ప్రపంచానికే ప్రపంచానికే
ప్రసాదించుతాం.

4

నవ్వే చిరునవ్వే
ముసలీ ముదుసళ్ళం
ముదిమీ ముదుసళ్ళం
దశ శతాబ్దులు
శత శతాబ్దులు
వయసే మా వయసే

# తపఃఫలం

... చైతన్యం మండుతున్న అగ్నిలాంటిది. అది మన పాపాలను దహిస్తుంది; మనజీవితాలకు వెలుగిస్తుంది. వివేకి ఈ చైతన్యం ఆహితాగ్ని లాంటిది. సృష్టి గమనాన్ని, సృష్టి పరిణామాన్నీ అవగతం చేసుకోటానికే ఈ చైతన్యం సిద్ధిస్తుంది. అప్పుడు కవికి సృష్టిలోని సర్వవస్తువులకీ అర్థం గోచరిస్తుంది. పదాల అవయవార్థాల విడిచి పదసమ్మేళనంలో అలంకారిక తాత్వికార్థాలను క్రమమ్మరించటంకోసం ఈచైతన్యం తోనే వర్తిస్తాడు కవి.

ఒక సీతాకోకచిలుక కనిపిస్తుంది. దాని రెక్కలలో ముద్రించుకొన్న మనోహరవర్ణాలచూచి ముగ్ధులమౌతాం మొదట.

ఆ తర్వాత మన హృదయంలోని భావాల చిత్రివర్ణాలుకూడా జ్ఞాపకంవచ్చి దాన్ని నోరారా

"నా మూగలోని పలుకా !"

అని పిలుచుకుంటాము. అంతవఱకూ స్తబ్ధులమై తిలకిస్తూ చూస్తున్న మన ఆత్మలు ఉప్పొంగి శబ్దాల రచిస్తాయి. గానాల పలికిస్తాయి; భావాల ఒలికిస్తాయి. మనహృదయంకూడా దానితో సమంగా నర్తించాలని మథనపడుతుంది: తనలో, మరుపురాని ఆ సౌందర్యాన్ని ముద్రించుకోవాలని చూస్తుంది, మన చైతన్య మట్లాకాదు. ఆ సీతాకోకచిలుకనే

"నా జీవలోక విదితా !"

అని సంబోధిస్తుంది. విశ్వ రహస్యాన్ని ద్యోతకంచేసే మహా శక్తిని ఆ రంగురెక్కల పుర్వులో చూస్తుంది. మొదట గొంగళీ పురుగుగా — జుగుప్సాకరంగా కనిపించినదే కాలక్రమేణా అపు రూప సౌందర్యరాశిగా కనిపించటం మన చైతన్యానికి ఆశ్చ ర్యాన్ని కలిగిస్తుంది. అందుచేతనే గతకాల దౌర్భాగ్యం దానిలో నిద్రించుచున్నట్టుగా తోస్తుంది. లేపితే ఆనిద్ర వదలి జుగుప్సా కరమైన తొలిరూపం నేటికీ ఈ సౌందర్యరాశిలో గోచరిస్తుందా అన్నట్టు అనుమానం కలుగుతుంది. నేడు, ఒకప్పటి గొంగళీ పురుగువలె నిద్రావస్థలో మునిగిన మానవజాతి చైతన్య మూర్తియై ఒకనాడు సీతకోక చిలుకలవలె వికసించే రోజు రావచ్చు. ఆ ఆశ కలుగుతుంది మనకి ! నిజమే దుర్భరపర్త

మానం గల మనకు ఉజ్వల భవిష్యత్తు ఉంది. అందుకనే ఆ సీతాకోకచిలుకను విడువబుద్ధికాదు. ఆ సీతాకోకచిలుక నేర్పే పాఠాన్ని స్మరిస్తే ఇలా పాడబుద్ధవుతుంది ....

ఓ సీతకోకచిలుకా !
నా మూగలోని పలుకా !
పరుగిడుచు పారిపోతే
నా జీవలోకవిదితా !
నా దృష్టి దాటిపోకే
నీతోటి ఆటలంటే
నా గుండె పొంగిపోవు.

ఓ సీతకోకచిలుకా !
పరుగెత్తి పారిపోకే
ముద్రించు హృదయమందే
చిత్రించుకొందు నిన్నే
నీ మొదటిరోతరూపున్
కాలాన విడిచిపెట్టే
విపరీతసృష్టి స్నిగ్ధా !

ఓ సీతకోక చిలుకా !
పరుగెట్టి ఎగిరిపోకే
చనిపోవు కాలమంతా

నిద్రించుచుండు నీలో.
నావంటి దుఃఖితులలో
చైతన్యమూర్తులంతా
నీవలెనె అవతరించన్.

ఓ నీలశోకచిలుకా!
నామూగలోని పలుకా!
నాజీవలోక విదితా!
పరిగెట్టి పారిపోకే
నాదృష్టి దాటిపోకే

# కుసుమలాస్యం

.... ఒక సాయంత్రం ఇంటిదగ్గరే విశాలమైన ముందు వాకిట్లో పడకకుర్చీలో నడుమువాల్చి, కాళ్ళాడిస్తూ ఎదురుగా వీధిగుమ్మం ప్రక్కన విరియబూసిన గరుడవర్ధనాన్ని చూస్తున్నాను. ఆకుల అడుగున బంగారు పిచ్చుకగూళ్ళవలె వ్రేలాడుతున్న చీకట్లు, పైన కారునల్లని రాత్రి నక్షత్రాలవలె తల విప్పుకు నర్తించే తెల్లని గరుడవర్ధనాలూ కనిపిస్తాయి. ఎందుకో ఆ చీకట్లకు ఆకులతో ఆ గుసగుసలు! నా మనస్సు కలతపడి, వివిధ భావాలను విరియించుకొంది. నావైపుచూసి నవ్వుతాయి పువ్వులు. పువ్వుల్లో పువ్వునై ఆకుల్లో ఆకునై ఆడుకుంటాను.

ఆ సౌందర్యమే నా హృదయాన్ని మ్రోగిస్తున్నట్టుంటుంది. వళ్లుమర్చిపోయి 'హాయిహాయి!' అనుకొంటున్న నాకు 'ఔను ఔన'న్నట్లు గరుడవర్ధనాలు తలలాడిస్తాయి; నిజమే కావచ్చు. ఎంత చీకటిలో, ఎంతటి నిరాశలోకూడా మధురభావాలే మానవత్వాన్ని నిలుపుతవేమో ననిపిస్తుంది నాలోనాకే.

తలిరు విరులను తాక
ఇరులు తురిమినవేళ
చిరుగాలి చెలరేగి
పూవు పొత్తిళ్ళలో
గుబురు చివురులతోన
గుసగుసల్ ఆడినది.

అపుడె నామనసులో
భావాల దొంతరలు
మొగడు తలపులతోన
నర్తించి నర్తించి
నాలోన లోలోన
విరిసినవి కురిసినవి.

మసక చీకటి మాయ
ముసుగులో మగతగా

జిగిసోస కురియుచును
మనసార ఉపులూర
గరుడవర్ధన సతులు
పకపకా నవ్వినవి.

మంద మధురస్మితపు
విమల ముక్తాశ్రీలు
కమ్మదన మొలికింప
పూవులో పూవునై
సతులతో సుతులతో
నర్తించినానపుడు

ఆత్వదీయానంద
సౌందర్య శోభతే
స్నిగ్ధ హృదయాలతో
కైవారమొసరించి
వన్నె వన్నెల వీణ
సొగసుగా మీటినవి.

గరుడవర్ధన బృంద
సుమనాల హాసనాల
ఒలికించ పలికించ
శ్రుతికల్పి లయకల్పి

పలుమారు వాటితో
పకపకా నవ్వితిని.

అనుకోని భావాల
ఆవేశమందునే
'హాయి హాయీ హాయి'
అన్నానొ లేదో
తలలూచె తలలూచె
గరుడవర్ధన సతులు.

కార్తిక పౌర్ణిమా
కౌముదులమించి
వెలుగొంది వెలుగొంది
వెలలేనిహాసు
చిరుగాలిలో నెగిరె
గరుడవర్ధన సతులు.

ఒరపుమీరగ నెరపు
గరుడవర్ధన గముల
పొదలలో పెనురొదల
మెదలు తుమ్మెదజాలు
కొదమ చెలిగీతాల
పాడినవి పాడినవి.

అపుడు నా ఎదపలో
అనిపించెనదిఏమొ
కారుచీకట్లలో
పటు నిరాశలలోన
మానవాళిని తెల్పు
మధుర భావాలని.

## బాలల్లారా!

పుష్పాలు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకు పిల్లలు జ్ఞాపకం వస్తారు. తల్లులు మొగ్గలు తొడిగిన మొక్కలు; దరవికస్వర పుష్పాలు పి ల్ల లు. ఆ పిందెల్నీ, పువ్వుల్నీ చూస్తూంటే మనస్సులో అవిరళానందం కలుగుతుంది. చిన్నపిల్లలు, చిరునవ్వులు, స్త్రీలు, పువ్వులు లేకపోతే ఈజగత్తుకు సౌందర్యమే లేదేమో !

అనుక్షణ దుఃఖభూయిష్ఠమైన ఈ లౌకిక జ గ త్తు లో అప్పుడు పుట్టిన బిడ్డకన్నా ఆనందదాయి ఏది ? ....కాని దరిద్రంతో. రోగాలతో కృంగి కృశించిపోయిన ఈ ప్రపంచంలో పసిబిడ్డలు నేడు బండరాళ్లుగా మారుతున్నారేమో అనే ఆలోచనకూడా వస్తుంది. స్వర్గలోకంలోని ఏ అమూల్య సుఖాలను విడిచిపుచ్చి ఏశాపంవల్ల ఈలోకంలోకి అవతరించ వలసివచ్చిందో ఈ దేవతలనుకున్నప్పుడు

"కాలపరిధిపై జారిపడితిరా!"

అనిపిస్తుంది. పరాత్పరుని ప్రాంగణంనుంచి నేలమీదపడి వికసించటంకోసం రాలిపడ్డ మొగ్గలే పిల్లలేమో !

తియ్యని రేకలతో నిండిన గులాబి, వికసించని మొగ్గ మనల్ని ఊరించి, మైమరపించి, క్షణంలో నశించినట్టు మధుర స్మృతుల్ని మాత్రమే విడిచి మాయమయ్యే పసిపాపల్ని తల పోస్తే దుఃఖం ఇనుమడిస్తుంది. క్షణంలో మాయమైన ఆ క్షణ ప్రభలకోసం, ఆ హరివిల్లులకోసం ఎంత దిగులు పడతామో!

ఆలోచిస్తే వారిజీవితాధ్యాయాల్లో
"నవ్వేదల్లా ఎట్లాపోవునో
ఏడ్చేదల్లా ఎట్లామిగులునో"

స్పష్టంగా, చదివినట్టు అర్థమవుతుంది. అలాంటి పిల్లలపిల్ల కలిగినకడుపుశోకం ఎంతమాటన్నా అనిపిస్తుంది. ఆదుఃఖంలోనే

కన్నతల్లి లలికడుపులు పండిన
పూపల్లారా, పాపల్లారా
కృత్రిమమెరుగని పువ్వుల్లారా
కన్నుల విప్పని కంమల్లారా
గతియించిన ఓ చటికె వెలుగులో
మెరసి మెరసి చిరునవ్వుల నవ్వే

సిగ్గుపడే నా పాపల్లారా, పూపల్లారా
కాలపరిధిపై జారిపడితిరా

మీ చిరునవ్వుల మైమరపించే
బాలల్లారా, బేలల్లారా
ప్రకృతిలోపలి కృత్రిమ తత్వం
ఊరించును మీ వలపుల జల్లీ
కవ్వించును మీ పోలికచూపీ
అంతలోనె ఇదె పోగొట్టును మిము
క్షణప్రభలుగా వెలిగిపోదురా !
కన్నుల హరివిల్లుంచిపోదురా !
గడియో అరగడియో ఆనందాబ్ధిని
ఓలాడించిదె మాయమౌదురా
ఇంద్రధనస్సలె, ఈలపాటవలె

పూవుల్లారా, పాపల్లారా
కన్నులు విప్పని కందుల్లారా
కపటాలెరుగని బాలల్లారా
మీరే మీరే మా కన్నులలో
ప్రాపంచిక విజ్ఞాన గ్రంధములు
మీరే మీరే మాకన్నులలో
వెలుగునీడలూ సుఖదుఃఖాలూ

ఆనందాలు, సంతోషాలు
ప్రాపంచిక విజ్ఞాన గ్రంథములు
ప్రపంచముంచిన గ్రంథాలూ
ప్రపంచముండిన గ్రంథాలు.

నవ్వేదలా ఎట్లాపోవునో
ఏడ్చేదల్లా ఎట్లా మిగులునో
ఉదివెదమండీ మీ పుటలల్లో
అరమోడ్పుండీ కన్నుతామరల
పూవుల్లారా, పూపల్లారా
పాపల్లారా, బాలల్లారా
వెలుగుమాసిన — పరునిమిషంలో
ఎటునెటు పోవునో మనప్రాభవములు ?
జారిపోతిరా మారిపోతిరా క్షణప్రభలుగా.

పుట్టబోవు ఓ బాలల్లారా, పూపల్లారా
పుట్టకండి ఇక పుట్టకండి ఓ పూవుల్లారా
కాలినడకున పంపుచుండుటలు
పుత్రశోకమున నరకముండుటలు
ఎరుగన్నేరని పాపల్లారా, కంపిల్లారా
పుట్టబోవు ఓ బాలల్లారా, పూపల్లారా
పుట్టకండి ఇక పుట్టకండి ఓ పూవుల్లారా.

# ఉపేంద్రా!

.... ఆ బాధ ఎంతవరకూ వచ్చిందంటే, జీవితంలోని ఏ మంచినిగాని, ఏ ఆనందాన్నిగాని శంకించే దుఃస్థితికి తెచ్చింది. అన్నింటా, అన్నింటా దుఃఖమే కనిపించే దుఃఖ భాగుణ్ణయ్యాను.

ఎందుకు, 1944 నవంబర్ ఇరవై రెండుననుకుంటాను. సోమసుందర్ కొడుకు ఉపేంద్ర ఏడురోజుల పిల్లాడు. అత గాణ్ణి చూడాలని, నేనూ సో. సు: మాన్నూ వెళ్లాం. ఆ పిల్లణ్ణి నాచేతికిచ్చి ఆశీర్వదించమన్నారు మాతామహుడు. నేను మనస్సులోనే ఆశీర్వదించాను అప్పటి నా మనస్సులోని భీభ త్సాన్నీ, ఆవేదననీనేనిప్పుడు వెలిబుచ్చలేను. అప్పటికే నాకు ముచ్చెమటలూ పోశాయి. ఈ పిల్లవాడు నా ఆశని పరిహసించి నట్టు నా ఆశీర్వచనాన్ని వెక్కిరించినట్టు కనిపించింది. అప్పటి నా మనోభావాల్ని ఈ గీతం ప్రతిబింబిస్తున్నది.

ఉపేంద్ర నేడు ఆ గీతాన్ని చదువుతాడు—తనమీద నేను వ్రాసిన కావ్యమని. అతడు చిరంజీవి కావాలని నేడున్నూ ఆశీర్వదిస్తున్నాను.

నిన్ను చూసి నీలా గేవిచ్చిన
విరిమల్లెలు సన్నజాజులూ

దీవించే దేవతలతో
తలలను పంకిస్తున్నాయ్;
మరణించిన మూర్తులతో
నీ చిరునవ్వున తొణికే
సొగసు క్రిందినైర్మల్యం
ఏదో గుసగుసలాడుతోంది.
ఉన్నట్టుగ జడిపించే
శక్తేదో చెమరుస్తున్నది
వికటంగా హాసాన్ని;
చుక్క చుక్కకీ
మధ్యన మాగిన చీకటి
బావురుమంటూ ఉన్నది.
ఏదో భయమేస్తే
బాధకు నిట్టూరుస్తే
నా గాడ్పులె నీ హారతి.

## సుధాపరీక్ష

మృత్యువూ, జీవితమూ - ఈ రెండూ నన్ను భయపెట్టి ఈ రెండిటినీ విడదీయలేని దుస్థితిలోకి నన్ను దింపాయి.

కాని అనుకుంటానిప్పుడు :

నిజంగా భయపడవలసింది మృత్యువుకుకాదు. మృత్యువనేదెక్కడున్నది మరణంతప్ప? కనుక మరణించడమే దుఃఖభాజనత్వం.

జీవన్మృతుడు దుఃఖభాగుడు. జీవితం మనముందు పరుచుకున్న అవకాశంలాంటిది. జీవితానికి భయపడ్డ మనిషినినేను. ఆ రోజుల్లో 1945 అనుకుంటాను: ఒక సాయంత్రం, ఏటికొవ్వాకలో వరాహనదీశయ్యలో ఒంటిగా షికారుకు బైలుచేరాను.

దారిలో నన్ను పలకరించింది ఒక మానవ మస్తిష్కం. దాన్నిపుచ్చుకుని పూర్వం నిగనిగా మెరిసిన కళ్లకంతల్నీ, పూర్వం చిరునవ్వుల చిందించిన పెదాల లోపలి పళ్లనీ, పూర్వం నల్లని కేశపాశాలు విరజిమ్మిన శిరోపరితలాన్నీ స్పర్శించాను.

మృత్యువుతెచ్చిన మార్పిది. ఆ మార్పుని ఆ మస్తిష్కమే చూచుకుంటే మృత్యువుతో ఏమని మొరపెట్టుకుంటుందో అనిపించింది.

"ఓ మృత్యుదేవతా!
ఓ సత్యదేవతా!"
తరగపైపై నురుగులా
పరగ్మకొను ఎమ్మొకటి

పాడినది పాడినది
పాటొకటి పాడినది:

"నా పురెర్రి బొరుగ్గిలను
పూచె ఆనునిపూలు
నలనల్ల ముత్యాలు
నా నీలి కసుగుర్రిడ్లు —
చెప్పవే చెప్పవే
చూచినావో లేదో?"

"ఓ మృత్యుదేవతా!
ఓ తాపసీసుతా!"

మల్లెపూలావున్న
తెల్ల తెలయెమ్మొకటి
పాడినది పాడినది
పాటొకటి పాడినది.

"నా బోసినోటిపై
చిలుకరించిన చిందు
ఒలుకబోసిన వెలుగు
చిట్టి నా చిరునవ్వు
చెప్పవే చెప్పవే
చూచినావో లేదో?"

"నా మృత్యుదేవతా !
నా కాటిదేవతా !"

గుల్లసున్నమువంటి
వెల్లనగు బొమికొకటి
పాడినది, పాడినది
పాటొకటి పాడినది.

"నా కురుల జలదాలు
నలుగడల క్రమ్ముకొని
క్రమ్ముకొని, వమ్ముగని
మాయమైనాయంట
చెప్పవే చెప్పవే
చూచినావో లేదో ?"

## చావు

ప్రసూతివైరాగ్యం, స్మశానవైరాగ్యం — ఈరెండు క్షణమాత్రం మనిషిని ఆవహించి విషాద భావాలతో ముంచెత్తుతాయి. కాని, మరుక్షణంలోనే చెల్లాచెదరై పోతాయి.

ఆలోచించినకొద్దీ ఈ మృత్యువుకి మనం ఎందుకు జడవాలా అనిపిస్తుంది. బైబిల్‌లో ఆదం ఈవ్‌లకు శాపమే నిజమైతే మృత్యువును కన్నవాడుకూడా మానవుడే. అలాంటి మానవుడు మృతించటం కాలధర్మమేనేమో !

ఈ మృత్యువుని తలచుకుని ఎన్నోసారులు చావటం ఎన్నోసారులు పుట్టటం జరుగుతోంది. ఆశ, అంధకారబంధురమైన లోకానికి ఆకాశదీపమైనప్పుడు మనకెందుకీ చింత కలగాలి ?

ఆ చింతతో మానవుడు ఎందుకు తననుతానే మారణహోమం చేసుకోవాలి ?

చావునుకన్నది మానవుడు;
చావునుగన్నది మానవుడు;
చాలామారులు చచ్చాడు;
చాలామారులు పుట్టాడు;
చచ్చేఅతనిని చూచీ
చచ్చినమూర్ఖులుకానీ
చావని వాంఛలుగానీ
స్వాగతమీయకపోగా
ఏదో ఏదో అనుకుంటూ
ఏదీ ఏదీ రాదంటూ
మానవుడే తన మరణంకై
మారణహోమం చేస్తాడు
దారుణహోమం చేస్తాడు.

# దేవుడు

ఓయి దేవుడా ! ఎంతపని చేశావయ్యా ?

కనుపించనివాళ్ళకోసం కనిపించినవాళ్ళని విడిచి, వెలుతుర్ని వదలి చీకట్నితలచి, జీవాన్నిమాని కష్టెల్ని వెదకి, రత్నాల్నివీడి రాళ్లనే వెమకి అలసి సొలసిపోయేటంత మూర్ఖులుగా మనుషుల్ని తయారుచేశావా ?

అది దేవునితప్పు కానేకాదు. దేవుణ్ణి సృజించినవాడి తప్పు: తన్ను మరచి పరాత్పరుడిలోనో, పరాత్పరుణ్ణి మరచి తనలోనో సర్వశక్తుల్నీ తలపోసిన మూర్ఖులు మానపులౌతారా ! దేవుడుమాత్రం ఎవరు ?

దేవుడుచేసిన మనుషులందరూ
మనుషులుచేసిన దేవునిచుట్టూ
కాలూ కన్నూ కామం కోర్కె
చెవ్వీ చెయ్యీ అన్నీకలిగిన
కాంతా కనకం కాపీనంగల
మనుషులు చేసిన దేవునిచుట్టూ
దౌర్భాగంలో దురదృష్టంలో
ప్రేమా జాలీ శాంతీ దాంతీ

కావాలంటూ దండాలిడుదురు.
అన్నిటికోసం ఆ పరమాత్మకు
ఇళ్లూ గుళ్లూ అన్నీ కడుదురు.

ప్రేమా జాలీ శాంతీ దాంతీ
అన్నీ దేవునివంటూ అన్నా
ప్రేమా జాలీ శాంతీ దాంతీ
అన్నీ మనిషివె చూస్తే ఎన్నీ.

అంటే నిజముకు ప్రతిమానవుడూ
మానవమూర్తినె ధ్యానిస్తాడు.
టర్కీ యూదు క్రైస్తవ హిందూ
మహమ్మదీయులు మాలలు సిక్కులు
ఎవరైనా ఆ మానవమూర్తులె.
ప్రేమా జాలీ శాంతీ దాంతీ
ఎక్కడ ఉండునొ అక్కడె దేవుడు.

.... అందుకనే మనం నిజమైన దేవుణ్ణి తెలుసుకోవటం కోసం వెలుగు నీడల మిశ్రమమైన సంధ్యాసమయాన్ని విడిచి కారునల్లని జీవితాకాశంలో మిణుక్కుమనే నక్షత్రాలవంటి మానవ జీవితాల్ని పరిశీలిద్దాం. అశేషమైన మానవానుభవాన్ని చవిచూద్దాం. అపారమైనమాన వానుభూతుల్ని పరిశీలిద్దాం.

ఇదిగో అర్ధరాత్రి!

# గోదానదిపొంగింది

అటుచూడు :

ఏటేటా ఉప్పొంగిపోయే గోదావరీ పయఃపారావారాలు. పాతలంకల్ని చుచిచిపెడుతూ, కొత్తలంకల్ని సృష్టిస్తూ. దుంగల్నీ దూలాల్నీ ప్రేమించే మానవ స్వభావాన్ని అరి కడుతూ, ఏటేటా ఉప్పొంగిపోయే గోదావరి !

ఒకఏటి విషాదగాధ అది; ఒకవీటి విషాదగాధ అది.

గోదావరీ తరంగాలు లంకచుట్టునా సికతాతలాన్ని చుట్టు ముట్టినతీరు, లంకను ముంచెత్తివైచినతీరు వర్ణించటానికి భాషయే కొరతవడుతున్నదినాడు.

అంతకన్నా ఆ ఆలనుందల మూగవేదనలనుగానీ, ఆ తండ్రి నిట్టూర్పులనుగానీ, ఆ గోదావరి హదలి తన తరం గాల నామృత శిశుకళేబరాన్ని తల్లిపాదాల చెంతకు పంపిన తీరునుగాని వర్ణించటానికి ఎన్నిభాషలున్నా అసమర్థాలే.

ఆ మూగవేదనని మానవులే అర్థంచేసుకోవాలి. అంతే.

"ఓ .... రార్ .... రోయ్ !
హోరికన్నా .... హోరికన్నా !
ఓ హోర్ .... వెంకన్నాహూయ్ !
ఓ .... హోయ్ !"

"పొద్దుకుంకేసింది — గోదా
పొంగిపొరలేలాగ — ఉంచీ
పెందకాడే పసుల — తోలుక
బేగిరారా ఓరికన్నా !
ఓ .... రొర్ ర్రోయ్ !"

కన్నతల్లీ — కన్నతండ్రీ
కన్నకోసం — రేకలేస్తే
కన్నకడుపుకు
చిచ్చెపుట్టిందో
కన్నకసలే చెవినిపడదు

ప్రతీచీ దిక్కునపుట్టిన గాలులు — అల్ల నల్లనల నల్ల నల్లనై
ప్రళయకారులై
హృదయభేదులై
భైరవ భీకర ప్రళయ సమయ పర్జన్యపు గర్జ్యలచేసెను.
హోరుహోరుమని వీచేగాలికి
చెట్లతలలు ఢీకొన్నవి నేలను
తరగ లేచినది తాళంఎత్తున
ఘోరుఘోరుమని లేచే తరగకు
తరగ తలముపై నురుగు క్రమ్మినది
లంకచుట్టునా నురుగు చిమ్మినది.

ఘోరుఘోరుమను రంగత్తుంగ తరంగ సంతతులు
లంకచుట్టునా — సికతాతలమున
చుట్టు ముట్టినవి
ముట్టడించినవి !
లంకచుట్టునా — సికతాతలమున
పొంగిపొర్లినవి;
పొంగిపొర్లినవి;
ఘోరుఘోరుమను రంగత్తుంగ తరంగ సంతతులు
చూపుమేరలో — సికతాతలమున
చుట్టుముట్టినవి
పొంగిపొర్లినవి
అయ్యో కన్నా ! అయ్యో కన్నా ! వెర్రివెంకన్నా !

క్రమ్మకొచ్చే — చీకటులలో
బొమ్మలన్నీ — యింటికొచ్చెను;
కన్నమాత్రం — కానుపించదు—
కన్నకడుపున — చిచ్చుపుట్టిందో ?

వృద్ధగాత్రమున - తల్లితండ్రులు
'కన్న ఏడి ?' అనగా
అరుగులుసాచెను - ఆలమందలు
"అంబా" అనితాము;

“కన్నకొడుకు మాకడుపున చిచ్చా?”
కన్నతల్లి అడుగగన్
కంటనీటితో —శూన్యాకాశమున
తలనుతిప్పు అలా
“మీ పొట్టకోసమై — తోలినకన్నపు
కన్నదేడె తల్లీ ?”
ఆలతల్లులకు తెలుసో ఏమో
తెల్లపోయెనపుడు;
కన్నకోస మా కన్నతల్లి తా
పలవించిందపుడు
తల్లిశోకమును - కనలేకప్పుడు
ఆలు ఘోరుమని ఏడ్చె;
కడుపుమంటతో - కాలినకడుపున
కన్నతండ్రి, నిట్టూర్చె.

“తల్లులారా ! — తండ్రులారా !
పొంగిపొర్లే — తల్లిగోదా !
కన్నకోసం — ఏడ్వమన్నారా !
బొమ్మలారా — తరగలారా !
కన్నకడుపున మంట పెట్టేరా ?
ఒక్కకడుపే — ఒక్కకొడుకే
దక్కకుండా — పొట్ట పెట్టేరా ?”

తల్లి ఏడ్చెను — కన్నకోసం
తండ్రికూడా — కుమిలిపోయెను
ఆలమందలు — హడలిపోయెను
తరగపొంగులు — తరిగిపోయెను.

తల్లిశోకముకు - కరిగిన గోదా
తరిగి తరిగి తన - తరగల పిలచెను
కన్నకోసమయి - విలపిస్తూనే
ఒడ్డుకడకు తా - వచ్చిన తల్లిని
తల్లిశోకముకు - కరిగిన గోదా
అలలు పనిపికొని కడిగెను పాదాల్

తల్లిశోకముకు - కరిగిన గోదా
తల్లడిల్లెనో - చిచ్చు కడుపునకు
పణకిపోయెనో - మాతృ శోకముకు
అలల నంపినది - కన్నని తల్లికై.

కన్నకొడుకు గతి - కాంచిన తల్లీ
గోలు గోలుమని - మూర్ఛవోయినది;
నిశ్చల సమాధి - నియమించిందో
శాశ్వత నిద్రకు - తరలిన కన్నని:
కన్నకొడుకు గతి - కాంచిన తల్లీ
గోలు గోలుమని - మూర్ఛ వోయినది;

తల్లిగోదా ! తల్లిగోదా ! కడుపునిండిందా ?

# పాపాయికెవ్వంమంది

ఇటుచూడండి :

అన్నని కోల్పోయినచెల్లి రోదిస్తున్నది. పిల్లలకు కావలసినన్ని పువ్వులున్నాయి ఆమెకి. కాని ఆమెకు అన్నకావాలి. ఎక్కడనుంచి వస్తాడు అన్న !

అన్నలేని ఆటలు అఖర్లేదంటుంది ఆమె. తన నిదర్లోని కలలన్నీ చెప్పాలట ఆమె.

పిచ్చితల్లి కాకపోతే ఏనాడో దైవసాన్నిధ్యాన్ని చెందిన ఆ అన్న మళ్లీ ఎక్కడనుంచి వస్తాడు ?

" నా
నిదర్లోని కలలనెన్నొ - చెప్పాలమ్మా !
అన్నేడమ్మా
మా
అన్నేడమ్మా
ఝుమ్కఝుణా ఝుమ్కఝుణాఝుం
[నృత్యం]
పూలతోట ఈనె కొన్ని వాసంతాలు
చామంతులు సనజాజులు పూచాయమ్మా
కొన్నినన్నపై పాటపాడు — తుమ్మెద తర్లీ
అన్నేడమ్మా
అన్నేడమ్మా !

ఝుమ్కఝణా ఝణా ఝుమ్కఝుం

[నృత్యం]

సీతకోకచిలుకరెక్క రెపరెప లాడూ
కోనలోని చిన్నికలువ తేనెలచిందూ
అన్నలేని ఆటలు నాకేలనె తల్లీ!
అన్నేడమ్మా
మా
అన్నేడమ్మా!"

ఝుమ్క ఝుమ్క ఝణాఝణాఝుం

[నృత్యం]

[పాపాయి నృత్యం ఆగుతుంది. ఒక విషాదభంగిమలో నిలబడ్డ తల్లిగొంతుకలో కదలిక. కుంచుకున్నగాత్రం క్రమేణా విలోమంలో చలిస్తుంది.]

"ఓ .... పా – పా – యీ .... !"
" .... .... మ్మా .... !"

[పిల్ల నిశ్చేష్టకాగానే తల్లిలో గొప్పచలనం. పిల్లచుట్టూ నృత్యం చేస్తో]

"కంటి నీరేలనే – చిన్నరి తల్లీ
నీ
కంటి నీరేలనే – చిన్నరి తల్లీ"

" .... .... మ్మా .... !
అన్నెడమ్మా
మా
అన్నెడమ్మా !"

[పాపకు స్పృహరాగానే తల్లికి ఆశ్చర్యం. భయం]

" నిదర్రిలోని కలలనెన్నొ చెప్పాలమ్మా !
పేదరాజు పెద్దమ్మ — సంజవేళలో
నీలాల నింగిలోన — కెంపులుంచిందీ;
కెంపుమాడి నల్లబడీ — మబ్బయ్యిందీ;
నల్లమబ్బులోన మెరపు — చిందులాడింది;
మబ్బుకరిగి వడగళ్లా — వానయ్యింది;
వడగళ్లను ఏరుకొనా — నోరూరింది.
అన్నమాట అనిపించి — తెల్లపోయానే
అన్నలేని ఆటలు నాకేలనె తల్లీ !
పి—లు—వ—వే .... మ్మా !
అన్నెడమ్మా
మా
అన్నెడమ్మా!
ఝుమ్కఝుణా ఝుమ్కఝుణా ఝుం.

[నృత్యం]

[దీనంగా జాలిగా మూలనుంచి వెనుతిరిగి చూస్తుంది పాప. తల్లిలో చైతన్యం కలిగి నిలువునా కరిగిపోతూ]

" ఓ .... పా — పా — యీ .... !
నీ పిలుపు వినుట పడదే తల్లీ !
నీ కడకిక రాడమ్మా — చిన్నారి అన్నా
చిన్నారి అన్నా !"

" .... .... మ్మా .... !

"చిన్నారి చిరునవ్వును తా నవ్విన నీఅన్నా !
నేలపైని నడయాడుట చూడము తల్లీ !
మనకడకిక రాడమ్మా
చిన్నారి అన్నా
చిన్నారి అన్నా !"

" ఓ .... .... పా — పా — యీ ! ... పో !
ఒంటరిగా ఆడుకోవె చిన్నారి తల్లీ !
కొండపైని నీ అన్నేదాగెను మళ్లీ
చిదిమిన ఓ మొగ్గవోలె చిన్నైను తల్లీ !"
[తల్లి మళ్ళీ నిశ్చేష్ట అవుతుంది.]

" .... .... మ్మా .... .... !
ఎన్నో పరుగు వాసంతాల్ గడచిన కూడా
తిరిగిరాని అన్నకొఱకు ఏడ్వాలమ్మా !
అన్నయతో ఆటలాడి పరుగులు పెట్టీ
పొదలమీటి చదలదాటి ఎగురన తల్లీ
హా .... న్నా
న్నా !

[కొయ్యబారి పడిపోతుంది పాప. తల్లికి స్పృహ లేదు]

# చిరంజీవి

అనగా అనగా ఒక కొండపక్క ఊళ్లో. ఏటి ఒడ్డున గుడిసెలో ఉండేది ఒక చిట్టితల్లి. అందాల పాలవెల్లి: సుగుణాల కల్పవల్లి. రూపాన కనకవల్లి ఆ చిట్టితల్లి. ఆ ఊళ్లో అంతటా :

తరుచుగానే వినుచునుందుము .
చిట్టితల్లీ చిన్నిమాటలు:
తెల్లవారే వేళలందున
ఒంటిగానే కానిపించును;

చిట్టితల్లీ చిన్నిమాటలు
తరచుగానే వినుచునుందుము.
హితుల నెరుగదు, సఖుల నెరుగదు.
చిట్టితల్లీ చిన్ని బ్రతుకు;

గుడిసె ప్రక్కన పురిప్రవృక్షం
నీలినీడల ఒంటిగానే
చిట్టితల్లీ ఆడుకొనుచూ,
వెర్రిపాటలు పాడుకొనుచూ,
తనతో తా మాట్లాడు కొనుచూ,
యుగయుగాలకు చిరంజీవిగ
గడుపుతుంటుండి.

రంగురంగుల పూలపైపై
ఎగిరిపోయే సీతచిలుకలనో.
ఆకుపచ్చని నేలపైనే
ఆడుకొను ఏ చెవులపిల్లలనో,
చూడ సాధ్యం ఔను కానీ,
చిట్టితల్లీమాత్ర మెప్పుడు
గోచరం కాదు.

జగతిలో అచ్చెరువులెన్నో,
జగతిలో దుర్ఘటనలెన్నో,
జగతిలో దుఃఖమ్ములెన్నో,
ఇదియు నందొకటి.

"... కారుమబ్బులు దెసల క్రమ్మెను:
గాలివర్షం వచ్చితీరును;
చేలగట్లను నీదుతల్లీ
దిక్కుతోచక నిలిచిపోవును;
గొడుగు పట్టుకు వెళ్ళిరావమ్మా;
తల్లితో ఇటు తర్లిరావమ్మా:"

తండ్రి మాటలు చెవిని పడగా
శిరసుపైనే దాల్చుకొంటూ
తల్లికోసం చేలగట్లను

తడుముకొంటూ అడుగులిడినది
చిట్టితల్లీ సంజవేళల్లో.

వానరాకడ, ప్రాణపోకడ
దైవమైనా ఎరుగనేరడు;
వర్తమానపు మంచుతెరలలొ
తడుములాడే నరుల కింకెట్లు ?

కారుమబ్బులు గడ్డకట్టెను;
నేలవాసన దెసల గ్రమ్మెను;
మబ్బు కరిగీ ఏకధారగ
కుంభవృష్టిని వెళ్ళగ్రక్కెను;
చేలు గట్లూ ఏకమయ్యెను;
దిక్కులే సంద్రాలు అయ్యెను

నీటి తోపుకు, నీటి ఊపుకు,
తడుముకొంటూ, తూగులాడుతు
తల్లికోసం తండ్రి ఆజ్ఞను
పొలములంబడి వెళ్ళిపోయెను
దిక్కు తెన్నూ లేని చిట్టి.

తల్లి తండ్రీ రాత్రి అంతా
చిట్టికోసం వెదుకజొచ్చిరి——

దిక్కులన్నీ పిక్కటిల్లగ
చిట్టితల్లిని పిలచుకొంటూ.

చిట్టివెళ్ళిన జాడగానీ,
చిట్టి కంఠస్వనముగానీ,
చిట్టి నడిచిన చోటుగానీ,
చిట్టి అడవిని కానరాదయ్యెన్.

చిట్టికోసం బెంగటిలుతూ,
చిట్టికోసం కలలుగంటూ,
చిట్టికోసం ఏడ్చుకొంటూ,
తల్లి తండ్రీ తిరిగి వచ్చారు.

నాల్గురోజులు గడచిపోయెను;
వాన నీరే తరిగిపోయెను;
ఊరి వెలుపల పొలములంబడి
నేలనూతిని చిట్టి తేలింది.

ఆ కథనే నేటికీ ఆ గుడిసె ప్రక్క మర్రికొమ్మల చీకటి శ్రీమూర్తంలో కీచురాళ్ళు పాడుకొంటూంటాయి. ఆ చిట్టితల్లి చావునే స్మరించి నేటికీ అక్కడి గుడ్లగూబలు రోదిస్తూంటాయి; ఆ తల్లిదండ్రుల మూర్ఖత్వాన్ని తలచుకొని ప్రతిరోజూ తీతువు పిట్ట తిడుతూనే వుంటుంది.

## రాజరాజు

అదిగో అటు చూడు!

ఆ మొగలి డొంకల మొదళ్ళముంగల పారే పంటకాల్వ గట్టున కనిపిస్తున్న దెవరు? బ్రితుకల్లా దిగులుగా, దుఃఖంగా, అర్ధనగ్నంగా, అర్ధభోజనంతో గడిపిన ఆ రా జ రా జు ఎవరంటావ్?

ఒకప్రక్క గోదావరీ నదీజలాలు పండించే కాశ్మీర ఖండాలు! మరొకప్రక్క మధురనారికేళజలాల మించిన గోదావరీపవిత్రజలాలు!

సస్యశ్యామలమైన ఆంధ్రదేశపు సిరిసంపదలన్నీ ఆదౌర్భా గ్యుని జీవితానికి అందని మ్రానిపళ్ళయ్యా యెందుచేత?

దివ్యమైన ఆంధ్రదేశపుమట్టిలో పుట్టి, దివ్యమైన ఆంధ్ర దేశపు మట్టిలో తిరిపెమెత్తుకు తిరిగి, దివ్యమైన ఆంధ్రదేశపు మట్టిలో అనాధగా కలిసిపోయే ఆంధ్రుడా నీకు జోహారులు.

ఏ తల్లి నిన్ను కన్నది నా తండ్రీ? ఏ తండ్రి నిన్ను కన్నాడు నా నాయనా? ఏ నాయకుడు నిన్ను పాలిస్తున్నాడు?

అబ్బా! దరిద్రపు సాహచర్యంలో జీవితాన్ని సాగించ లేక మృత్యువులో మృత్తికలో లీనమైపొయ్యావా?

'జీవితం విటీక' అంటాడు ఆరుద్ర; 'ఎడారిఓడ జీవితం' అంటాడు సోమసుందర్; జీవితమంటే ఇదేనా చిట్టితండ్రీ?

వంకరాపు — వేగపారే
        పంటకాల్వ — పడతిప్రిక్కా
మొగలిడొంకల — మొదలలోనే
        పండుకొన్నాడు — తలనానుకొన్నాడు
కట్టుకొనిన — కౌపీనంతో
        అతడివల్వాలు — నిండుకొన్నాయి
శైత్యదేవత — శీతలమ్మె
        వాడివాడిలో గూడుకట్టింది
చాపలాగ — పేనుకొన్న
        మొరటుజుట్టే — ఇసుకనింకింది
ఆ నిద్రదేవి — ఆశ్లేషంలో
        మాతృదేశపు — మధురిమనంతా
దరిద్రమూర్తే — చూరకొన్నాడు
            ఆ
క్షుద్రమూర్తే — చూరకొన్నాడు.

        “ఆకలో — దాహమో !
        దాస్యమో — దరిద్రమో !
        ఏమో ! — ఏమో !”
దివ్యగౌతమి — కావేరి గంగా
        నదులవన్నీ — అతని కలలో
పొంగిపొంగి — పొర్లిపోయాయి.

ఆ

తాప్వాలమ్ముల — చాలులోన
తాళవృక్షపు — తతులఛాయా
రాజరాజై — రాజ్యమేలాడు
ఆ అంధభిక్షువు
రాజరాజై — రాజ్యమేలాడు.
దివ్యమృత్తిక — పుట్టాడతడు
దివ్యమృత్తిక — పెరిగినాడు
దివ్యమృత్తిక — కలిసిపోయి
దివ్యమౌని — దివికిపోయాడు

"ఆ-క-లో — దాహమో !
దాస్యమో — దరిద్రమో !
ఏమో ! — ఏమో !"
ఎన్నెన్నో గొంతుల్ల — చించుక
"స్వతంత్రమో, చావో" అంటూ
విపినాలన్నీ — విలపించాయి
ఇసుక పెడారుల — ప్రళయ మరుత్తులు
స్వేఛ్ఛాపూర్ణిత గభీర కంఠాల్
విప్పి విప్పి — రోదించాయి
"స్వతంత్రమో — చావో" అంటు
ప్రళయగానముల — విలయవేగముకు

నిద్రిపోవు — ఆ క్షుద్రమూర్తిలో
ప్రతిధ్వనించిన — మృత్యుమూర్తియే
"స్వతంత్రిమో — చావో" అంటు
కలత కలతగా పలికింది;
కలత కలతగా పలికింది;

# మధురస్మృతులు

ఆ ఊరిబయట మైదానంలో గుంపులవాళ్ళ గుడిసెలలో ఖడిసే నల్లజీడి చెట్టుకిృంద చాకిరాయి మీద కూర్చుని విలపించే ఆ యువకుడు ఎందుకోసమని?

అతని జీవితానికి పరమార్ధమేమిటి?

సర్వసంపదల కాలవాలమైన అతనిజన్మలో ఈలోపాన్ని సృజించిన విధాతనేమనాలి?

ఎన్నివత్సరాలైనాసరే ఎడతెగని విరహాగ్నిలో రోదించే ఆ యక్షునికి మోక్షమే కలగదా? అతని దుఃఖాన్ని వారించ టానికి మార్గమేలేదా?

ఎంతగ ఏడ్తునో గుంపులపిల్లా
నిన్ను తలచి నేను!
అయ్యయ్యయ్యో ఆనందంలో
గడిపిన ఆ రోజూ

ఎలపుకురాగా తిట్టుకొందునో
దీవెన లిస్తానో !
బ్రతుకు మకిలితో వెలుగు మాసినది
గుంపులోళ్ల పిల్లా !
దరిగానని నాశోకం నన్నిక
ముదుసలి చేసింది :
వలపు వెల్లువల దరులు తెగినవి
హృదయమందు నాకు.

చీకటి కొప్పును చెంపకుచేర్చిన
వలపు ముంజికానా !
ఎంత అందమే ఎంతతీపియే
ఎంతానందమ్మే :
నీ నవ్వుచూచితే అచ్చంతా
ఆ చందమామ నవ్వు.
నీ కన్నుల్లో నక్షత్రాలే
తళుకు మినుకుమనును.
అయ్యయ్యయ్యో ఆనందంతో
గడిపితి మారోజు.
ఊరిబయట ఆ కంకర దిబ్బను
చాప కొంపపక్క.
చాకలిబాది తయారుచేసిన

నాచు చాకి రాయిన్
చతికిల బడినే నిస్సుడిగితినే
గుంపులోళ్ల పిల్లా !

"పాలముంచినా నీటముంచినా
నీదే బలువ"ంటీ ;
"వెక్కిరించినా అక్కున జేర్చిన
బారం నీద"ంటీ ;
"బ్రితుకును, భావిని, మనసును, ఎదనును
నీకిచ్చా"నంటి ;

గుంపుల పిల్లయు నవ్వెనప్పుడే
కలువ పూవునవ్వు ;
"అయ్యయ్యయ్యో మీరంతా
ఓ పెద్దకులం దొరలు ;
ఊటుఊరునా పందుల తోలుక
బతుకు చుంచుమయ్యా :
పోనీయన్నా, నీకూనాకూ
వార మేర చాలా ;
పగడుచూసినా కులంచూసినా
నైపదు ఏమాత్రం ;
చాల్లేవయ్యా, ఊరోక్కపయ్యా
ఎంచుకను తః తంటా ;"

"గుంపులపిల్లా గుంపులపిల్లా,
నిన్ను వలచినానే !
కోరిన వరాల నిత్తువటంచును
మ్రొక్కుచుంటి నీకు."

దిగులెరుగని ఆ దేవకన్యయూ
దిగ్గున నవ్వింది;
సిగ్గెరుగని ఆ దివ్యహృదయమే
చేరదీసె నన్ను;
హాయిగ తీయగ ఆనందంతో
గడిపితిమాపూట!
ఏమయ్యామో, ఏమన్నామో,
ఏమిటి తిన్నామో
ఏమాడేమో, ఎందున్నామో,
ఎట్లా గడిపామో,
స్వర్గంలాగే తోచిందప్పుడు
చావులేని క్షణము;
గాలిలోన మేం తేలియాడితిమి
ఆ మధుర క్షణము;
ముడివిడువని మా గొంతుకలన్నీ
గుసగుసలాడేయి:

గగుర్పాటుతో వళ్ళంతా తే
చెమ్మట క్రమ్మంగ,
అమృతాస్వాదన చేశామప్పుడు
అమృత ఘడియల్లో.
హాయిగ, తీయగ ఆనందంతో
గడిపితి మాపూట.

నీది సమస్తం నాదేనంటూ
అప్పుడె అన్నాను;
ఎక్కడికైనా, ఏమైనా సరె
నాతో రమ్మన్నా.

"అంతఃపురమున ఉంచెదనే నిను
చాపగుడిసెలేలా?"

"మాట తప్పితే నాగతి ఏమిటి?
కొంప కూలిపోదా?"

"నీకోసమ్మయి మిత్రుల బంధుల
నందరి విడిచెదనే:
నీకోసమ్మయి పేరూ కీర్తీ
అన్నీ మరిచెదనే."

ఎకటపు గొంతున వెలువడు మాటల
శ్రద్ధగ ఆలించి.
గుంపులపిల్లా, చిరునవ్వంతా
పెదవుల్లో దాచె:
కన్నుల్లోపల గిరగిర తిరిగెను
ఉప్పునీటి బొట్లు:

బరువుగుండెతో, దిగులు ముఖంతో
తెల్లబోయె నామె ;
వణకే పెదవుల తొణకని మాటల
వేదన కురిపించె ;

అది చూస్తూనే ఆకర్షణతో
పెదవుల చుంబించి ;
"హంసతూలికా తల్పాలున్నాయ్
అనుభవించి నువ్వు ;
నీ పాదాలను నా తలమోడ్చుక
సేవించెద" నంటి.

ముక్కుపైన తన వ్రేలు వేసుకొని
గుంపులోళ్ల పిల్ల ;
నింగి దిక్కుగా నిగిడించె తర్జని
గుంపులోళ్ల పిల్ల.

"కొండపైన మన తప్పులు చూసే
దేవుడు ఉన్నాడు;
మన తప్పుకాయని దేవుడుకూడా
నరకం పెడతాడు.
చావు వచ్చునని భయమే లేదా
వన్నెల బుల్లోడా?"

"దేవుడంటవేం, మీకేం దేవుడు?
దేవుడసలు లేడే;
మీవాళ్లెవ్వరు పూజించరుగా
దేవుడన్నవాణ్ణి?"

గుంపులపిల్లయు నాప్రశ్నను విని
మొగలిపూల నవ్వే;
"మంచివోళ్ళకే దేముడు గీముడు;
ఆళ్ళకేంటి ఆడు?
ఎండల కొండల పుట్టల గట్టుల
తిరుగుతాము మేము;
ఆకుల అలముల తినితిరిగే మా
కేటి దేవుడయ్యా?"

నా అరచేతిని విప్పిపట్టుకుని
చేయిచూచె నామె

రేకలనన్నీ పట్టిచదివినది
గుంపులోళ్ళ పిల్ల.

గుంపులపిల్లా పాణిగ్రహణం:
వళ్ళు ఝల్లుమనగ
బుసబుస ఉబుకుచు వేడినెత్తురే
నాలో పొంగింది,
ఆమెకన్నులను ప్రేమప్రవాహం
ఉప్పున పొంగింది.

పెళ్లిరేక తనె చూపించింది
పెదవిని విరిచింది
"కోరిక ఒకచో కొమ్మ ఒక్కచో;
అంతే నీ''కంది.

అయ్యయ్యయ్యో ఆకాలమె ఈ
జోస్యం చెప్పిందో
బ్రతుకు వెలుగులే ఇరుల మునిగినాయ్
గుంపులోళ్ళపిల్లా

"పదాలుకట్టే విద్దెలు వస్తవి"
అంటూ చెప్పింది;
"పదాలుపోనీ విధాలు చెడనీ
నీవె చాలు"నంటి.

అంటినా లేదో తాచుపాములా
బుస్సుబుస్సుమంది:
"చాలును, చాలును చాల్లేవయ్యా
చాలు చెప్పినావూ;
పదాలు పోనీ విధాలు చెడనీ
నేనుంటే చాలా?
దేవుడుండెను; పాపాలున్నాయ్;
నాతోటేటయ్యా!"

"దేవుడు పోనీ పాపం రానీ
గుంపులోళ్ళ పిల్లా!
ఒక్కముద్దు నను పెట్టనిస్తివా
పున్నెమంత నీదే!"

ఆ హృదయంలో అణుపణువుననూ
జాలి నిండెనేమో
గుంపులపిల్లయు, అనురాగంతో,
ముద్దు నిచ్చెనాకు.

ఆమెకన్నులను నీరుచిమ్మటను
చూచానప్పుడె నేను:
ఉరలిన నీరము చెక్కిలిజారగ
చూచానప్పుడె నేను;

సింగినుండి ఆసీల మేఘముల
వాన రాలినట్లు
నాగుండె జారిపో నిస్తబ్ధుడనై
తెల్లపోయినాను.

"నన్ను మరచిపోరా, నాబాబా!"
అంటూ వేడినదామె;
"అమ్మయ్యో! అది వల్లకాదు నా
క"ంటూ భీష్మించి
"వినవే వినవే నాప్రియురాలా!
విడువను నే"నంటి;
"సరిలే చూదమురా; రేపుదయము!"
వెళ్లి పోయినాను.

మరునటి వుదయాన మమతలు తోపా[illegible]
తిరిగి వెళ్లినాను:
ఏమని చెప్పను? శిధిలాలున్నవి:
ఆనమాలె ఉంది.
గుంపుల పిల్లయు ఏమయ్యిందో
గుంపులాళ్లై లేరు;
గుంపులుకట్టిన గుడారమ్ముల
జాడ కూడ లేదు.

పొయ్యి పెట్టినా రాళ్ళమధ్యనా
బూడిద మిగిలింది.
బూడిదచూస్తూ చీకటిదాకా
అచటే కూర్చుంటీ ;
గుంపులపిల్లయి రాల్చిపోయిన
గుండె బూదెకూడా
పొయ్యిబూదెలో కలిపివేసుకొని
బరువుగ తిరిగొస్తి ;

బ్రతుకు వెలుగులే ఇరుల మునిగినవి
గుంపులోళ్ల పిల్లా !

# ఆడజన్మ

అటుచూడు.

ఎంత తారతమ్యమో ! నిర్జీవమైన ఒకరాతిబండని పెన వేసుకొనే లతలాగ, నిర్దాక్షిణ్యుడైన పురుషుడి చిద్విలాసాన్ని కాంక్షించే ఆమధురమూర్తి దుఃఖం !

ఆదుఃఖంలో మనకి ఆమె పవిత్రత, అతని నిరంకుశ త్వం కనిపిస్తాయి కాని, ఇటు మిత్రుడు అటు ఇల్లాలు — అం దరూ ద్రోహం చేసినా తెలియని అమాయకురైన ఆమె భర్త జ్ఞాపకం వస్తాడా ?

ఆమెకు మాత్రం తక్కువ అన్యాయం జరిగిందా ? ప్రేమించే పురుషుడే కాదంటే ఆమె బ్రతుకేంగాను ?

పురుష జీవితానికి స్త్రీ బంధనమైపోతే, ముందురాలి బంధమైపోతే ఆ స్వర్గంకూడా ఒక నరకంకాదా ;

ఆలోచించు ;

ఎవరిని మాత్రం ఏమనగలం కనుక ? అందరికీ అన్ని కారణాలూ ఉండనే ఉన్నాయి.

కారణాలకేం, కావలసినన్ని. కాని, వివేకవంతుడైన మనిషి కార్యంలోని మంచి చెడ్డల్ని పరిగణించాలా ? లేదా ?

I

"ఎందుకు, ఎక్కడికెడతా నంటవ్ ?" అన్నది అది ;
వారిరువురునూ చెట్టు క్రింద కూర్చుండిరి.
తరతరాల నిశ్శబ్దం హృదయంపై బరువెక్కెను ;
సముద్రాల లోతుల్లో పేరుకొన్న నీలంవలె
తమకన్నుల వెన్నెలలో దాగుకున్న
కలువల పరస్పరం హరించిరి.

II

"నువ్వంటే తీరని భయంనాకు" అన్నాడతను;—
"అందానికి వన్నెలు తెస్తువు ; అటుపై

చందానికి వెన్నెల పూస్తువు ; అటుపై
నా హృదయం నీ తుమ్మెద కురులల్లో చిక్కుపడీ
దారీ తెన్నూ గానక కొట్టు మిట్లాడును ;
దిక్కూ దైవం లేకనె తపియించును."

III

"ఓ అల్లానా!" అన్నది ఆడది: "అదికూడా కారణమా!
ఎన్ని చిక్కులైనా ఇట్టేవిడుతవి ;
ప్రేమకు హృదయం ఉంటేచాలును.
నాదృష్టిలో అందానికి వన్నెలు తెచ్చేవన్నీ
జాబిలి వెన్నెలలో రంగరిలిన
పూదేనియ పుప్పొడి కాంతులు."

IV

"అయినా సెలవ్ మరి," విదల్చుకొన్నాడతను;—
"మొహమాటం దేనికిలే. ఇటుచూడు!
ఎంతని తీపిని తింటాం? ఊరికె,
అదేపనిగ తినినకొద్ది మొహం మొత్తదామరి?
అయినా చిరకాలపు స్నేహితుడై
నను నమ్మిన నీమగడంటే నాకుజాలి."

V

"ఛా, అదికూడా కారణమేనా?" అన్నది ఆడది.
"కంచెకు అవతలి మల్లెను నువ్వూ

చవులూరగ వాసన జూస్తావ్
తలోసారి ఇరువురు వాసన చూస్తే పోయేదేమిటి ?
ద్వేషించే అధికారం ఎవరిది ?
అందులోన తప్పేమిటి ఉన్నది ?"

## VI

"అయితే నేనో !" అన్నాడాయువకుడు ఆమెతో !
"స్వేచ్ఛా వాయువువలె నాప్రేమయు
ప్రతిపుష్పంపై వ్రాలే రోజుల్లో
ఒకయువతికి నామాటను బాసనుచేసా తెలుసా ?
తన్నొకతనె, తన్నొకత్తినే ప్రేమిస్తానని ;
అది ఒకత్తియే మనసా ప్రేమిస్తున్నది."

## VII

"అదేమిటిలే, అదికూడా కారణమేనా ? "అన్నది అవల.
"ప్రేమ విహంగానికి స్వేచ్ఛా విహారమున్నది:
వలపు ఎరిగి జీవిక సాగించే హక్కున్నది.
నాలో చిరకాలం కరిగిన నీమూర్తిని, నాహృదయంలో
అమూల్యమై స్థిరమై నిలచిన నీమూర్తిని
చూసి చూసి ఎట్లామరపగలను చెప్పు ?"

## VIII

"పాపం, నీవా ?" అన్నాడతను. "లోగిలిలో శిశువున్నది:
చేయెత్తున కొమరిత ఉన్నది.

ఈ రెండూ నాపీడలు కనుకనె
నీమానానికి నిన్ను వదిలి నే పోతానంటున్నా.
జ్ఞానం అజ్ఞానపు సంధినిగల పిల్లలు
మన దినచర్యల పరిశీలిస్తే — అమ్మో!"

## IX

"అబ్బే! అదికూడా కారణమేనా?" అన్నది ఆడది:
"పసిబుగ్గల పాపల కేమిటి తెలుసు?
ఒక చెంపను పాలూ, వేరొక చెంపను నీరూ—
నీకౌగిలిలో నాకొమ్మల నీహృదయానికి అదుముకొని,
నాపెదవుల నీపెదవుల కలుపుకొని
ఆనందించిననూ పట్టని కుర్రలు."

## X

అతనికికోపం రగిలిరగిలి జ్వాలల నలుముఖాల చిమ్మెను;
"ఛీ ఛీ, నీబ్రతుకుకు అందంకూడానా?
నీఅందం బొగ్గయినట్లే ఉన్నది చూడ చూడ.
ఇటువాడూ, అటునేనూ—ఇంకా ఎవరో జుర్రుకొనగ
మిగిలిన పిప్పివి నీవై, నాప్రాణానికి
దాపురించి పీడించెదవా రాక్షసి?"

## XI

ఆమెయు అవమానపు హాలాహాలం దిగమింగుకొని
"ఈ మగాళ్లు, అయ్యో. ఈ మగాళ్లు!

అయ్యయ్యో, అందమైన ఈ సుగవాళ్లే
ఒకరోజున తము వలచిన, వలపించిన శరీరాన్ని
మనసారా అనుభవించి, అనుభవించి
అనంతరం శవంవలెను చూస్తారే!"

XII

అపుడే ఆయమ రోహిణియై నిప్పులు చెరిగెను.
"వన్నెల చిన్నెలాడిగా, సుందరాంగిగా
ఒక అతివను పేర్కొను అధికారం
మీకెక్కడ? మీకెవరిచ్చిరి?—చెప్పుడు మీ వాదం
నాబ్రతుకును విచ్ఛిన్నం చేసితివే
నాబ్రతుకున సట్టేటను ముంచితివే.

XIII

"చల్లని చందమామ గగనమ్మున అందమైనదే కాని
అది నిన్నెన్నడునూ కాల్చలేదు.
మా ఆయన నన్ను గణించిన కొద్దీ
శత సహస్రకాంతికరమ్ములు చాచిచాచి నే
నిన్నే నాహృదయానికి హత్తుకొంటి!
నిన్నే నాఅధిదేవత వంటిని.

XIV

"ఒక అందమైన ఆడదాన్ని ఎవడైనా చూస్తే రక్షణ
తన హృదయం ఆమెకు అంకితమని

మోకరిల్ల సంసిద్ధుడు ఔనట!
పాపం, ఉబ్బేస్తేలావైపోయే ఆడది రాంగిపోక ఏంచేస్తుంది?
తన ఉన్నతి మరచిపోయి కడు ఖి
న్నత నందుతుంది దిక్కులేని ఆడది.

XV

"ఆడది సుందరాంగి కాదా? — మిమ్ముల సూరించినంత
దూరమ్మున నిల్పినంత కాలమూ
ఆడది సుందరాంగి కాదా, చెప్పుము?
కానీ, ఒకపరి అనువిచ్చినంత తనువిచ్చిన వలపుల
సుందరాంగి చందం బొగ్గయినయట్లె!
వన్నెలాడి వలపే దుమ్మైనయట్లె!

XVI

"ఒక నిముషం నీశ్రద్ధను నా మాటలకిచ్చి వినుము.
ఆడది చెప్పరాని విషయంచెప్తా; నిటు
అడదాని చిరునవ్వులకోసం పాకులాడు
కొందరు పురుషులు దఫదఫాలు చేసే చిహ్నాల
పరికిస్తే జంతువు లనిపింతురు;
రాసుకు పూసుకు తిరిగే చేష్టల.

XVII

"తమకోరిక తీరనియంతకాలమూ పురుషులు మమ్ముల
త్రిజగతీపతి కోటీర దివ్యరత్న

రాజీనేలు వజ్రాలతురాయి వందుర్రి.
తమకోరిక తీరని యంతకాలమూ పురుషులు
పాతాళలోకంపు టిమకు సంటిలందు
దీగబ్రాక వెరచు గాఢాంధ రేఖనంటుర్రి.

XVIII

"నా స్వేదానికి విలువలకట్టేను నువ్వుకూడ నిజాని -
నాకనుపై హరివిల్లును చూసీ
నాబుగ్గను గల పుట్టుమచ్చకో
నాచుట్టూతోకాడిస్తూ.... ....చివరకు తృప్తిపడీ
నాభర్తపైన నాకుంగల ప్రేమను చంపీ
మళ్ళీ నిరసిస్తూ ఇటు నిర్లక్ష్యంతువు.

XIX

"భ్రాంతిలోన ఏస్వప్నాల్ కన్నను, మోహంతో
ఏరీతిని బాసలు చేసిన గానీ
చివరకు నీవూ ఇంతేనే అని
ఇంతకన్న ఆవంతయు నాఅవసరమే లేదని
నీ పరివర్తనే చెప్పక చెప్పెను;
నీబర్రితుకే సాక్ష్యం చెప్పెను.

XX

"అల్లిబొల్లి కబుర్లతో చెప్పరాని ద్రోహం నిజముగ
నీమిత్రుని కొనరించావోయ్ -

అయినా నిన్నేమని అనటం!
నిర్జరులని అపర్త్యులని అతివల పేర్కొంటూ
సాధారణ స్త్రీలని కనిపెట్టినట్టుగా
చివరకి నిరసిస్తూ నిందించెదవు.

XXI

"సరిలే, నిన్నేమనిలాభం! ఒళ్ళెరుగని కావరాన
కాలుజారు పాపానికి నేనే
కుళ్ళి కుళ్ళి గతియిస్తా కానీ.
ఈదరిద్రిదేశమ్మున గతులు లేని ఆడదాన్ని
అన్యాయం చేసిన క్రౌర్యానికి
నిన్నేంచేస్తేపాపం తీరును."

ఇదీ సంగతి :

మానవుల జీవితం వ్యక్తిగతంగా ఇట్లా తయారయింది. ఇంచు మించు ప్రతివాడి జీవితం ఒకపేదరాజు పెద్దమ్మ కధ.

మనుష్యులు తమ తెలివితక్కువలకీ, దుఃఖాలకీ 'అనుభవ' మని పేరుపెడతారు; వేదాంతులు ఈ 'అనుభవా'న్నే 'కర్మ' అంటారు.

ఆగోదావరి అకస్మాత్తుగా పొంగివచ్చి కుర్రిసన్యాసి వెంకన్న ప్రాణాలు బలిగొన్నదే దానికేమి 'కర్మ' వచ్చింది!

ఆపిచ్చిపిల్ల తనఅన్నని కోల్పోటానికి ఏపాపం చేసింది? శ్యామలపయోదాలే కరిగి వడగళ్ళని కురుస్తున్న సమయంలో అన్నలేని ఆశలు నాకేలనని రోదించే ఆ ఉమాయకురాలు ఏ నేరం చేసిందని?

తల్లిని తోడ్కొని రావటానికని వెళ్ళిన ఆపాప తనువే చాలించుకొన్నదిగదా– ఆతల్లిదండ్రులుగాని, ఆపాపగాని చేసిన అపరాధమేమిటి?

నాయనా : మానవ ప్రయత్నాలను మించినశక్తి, మానవకృషిని అపహాసించే అధిభౌతిక శక్తి ఇంకా ఏదో ఎక్కడో ఉండనే ఉంది. అదే అపహాసిస్తూ ఉంటుంది మాటిమాటికీ మన ప్రయత్నాల్ని.

అవునమ్మా : అదిసరే. ఆ అధిభౌతిక శక్తి పరిహాసాల మాటకేంలే. మృత్యువుకి, దయ్యానికీ నీవు శిరసొగ్గి నడవవలసిందే. అదికాదనను.

కాని; కాని—

ఆ పరాయైన గుంపుల పిల్లకోసం గోలపెట్టే కురవ్రాడి గందరగోళం విన్నావుకదా : అదేమన్నా సబబుగా ఉందీ?

అదేమిమాట బాబూ ! నువ్వు కోటివరహాలు క్రుమ్మరించు : ఆ ఆవేదన తొలగిపోదు. అది హృదయానికి

సంబంధించినది నాయనా ! దానిని అర్థం చేసుకోటానికి హృదయం ఉండాలి.

రాజరాజును చూశావుగదా ! భారత దేశపు దరిద్రనారాయణుడతను. అతనికాగతి రావటానికి కారణం ఏమంటావ్ ? ప్రారబ్ధం : కాకుంటే సమాజం.

రాకపోతే కాళ్లుపట్టుకు ప్రాధేయపడుతున్న ఆ ఇల్లాలిని తొలగద్రోసే ఆ నీచస్వభావం అతనిలో ఎలావచ్చింది? ఆడజన్మ అందుకోసం కాదుగదా !

సరే. వ్యక్తిగత జీవితాలింత భయంకరంగా ఉన్నాయి. సమాజంలో ఒకప్రక్క హిమాలయోన్నత పర్వతాలు; మరో ప్రక్క పాతాళలోక పర్యంత అగాధాలు.

ఉండవచ్చు. ఉంటే, దానిని సమతలంచేసే ప్రయత్నాలేమి సాగటం లేదా !

లేకేం ! సూక్తులు వినిపిస్తూనే ఉన్నాయి ! సిద్ధాంతాలు వల్లిస్తూనే ఉన్నారు; నేతలు ప్రవచిస్తూనే ఉన్నారు. ప్రతిఒకడు నేడు నీతికోవిదుడు; ప్రతి ఒకడూ నేడు తత్వవేత్త; ప్రతి ఒకడూ నేడు ద్రా[illegible] అయితే వచ్చిన లోపం ఏమిటి?

# మద్రాసు పర్యటన.

అన్నావ్, బాగుంది. ఈ రాజ్యాలూ రాజ్యాంగాలూ ఏమి సాధిస్తున్నాయో చూడాలని ఒకసారి ఒక బ్రహ్మరాక్షసికి బుద్ధిపుట్టింది. బుద్ధిపుట్టడం తడుపుగా శ్రీయుత బ్రహ్మరాక్షసి మహారాజులుంగారు మద్రాసు పర్యటనకని బయలుదేరారు. అలా బయలుదేరి, వారేమేమి సాధించారో, ఏమేమి పరిశోధించారో, ఏయేగృహాలకు ప్రారంభోత్సవం జరిపారో పత్రికలలో వచ్చింది. ఆవార్తలు నీకు సంక్షిప్తంగా చెప్తాను విను:

1

రాత్రిగర్భ- పగలతిస్ని
పవలుపుట్టిన శుభముహూర్తం
వేళలో తానాపులిస్తూ
నల్లరాళ్ళ పరుపువెలువడి
తన ప్రజానీకమ్ము సర్వం
పాలితమ్మెటులౌచు నుండెనొ
చూడగోరే షికారేగెను
చెన్నపురికొక బహ్మరాక్షసి

2

కొండదాటీ లోయమీటీ
పచ్చనేలల గడచి నడచీ

పెద్దమనిషికి చేతిబెత్తం
వలెను తోకను ముందువెనుకకు
ఊపుకొంటూ సాగినది తా
చెన్నపురిలో విహారానికి.

3

అయ్యయ్యో
ఏమిచెప్పను బ్రహ్మరాక్షసి వేషమందం!
ఆదివారం మెరీనాలో
రోల్సురాయున జమీందారుల
ఠీవి ముమ్మూర్తులను దాల్చింది;
తనపసందుకు తగిన రీతిని
సూటు వేసిం దంతెగాసి
(ఖద్దరే తన కెంతొ యిష్టం)
తోకచుట్టూ బెజ్జమొక
కాజాగ కుట్టించె.

4

చెన్నరాష్ట్రం రాజధానిలొ
కానుపించెను ప్రతీ లాయరు
'బారు'రూమున పేడకుప్పలొ
తోకపురుగుల చీల్చి చంపుట;
దానితో మన నాయకుని

కెంపెదవిపై ఆడింది చిఱునౌ
'భూమిలో' పనిచేసిమంగలి
కతలు గుర్తొచ్చి

5
నాలుగడుగులు చనెనో లేదో
ధన్వంతరీ కవిరాజు కన్పడె
మదన కామేశ్వరీలేహ్యం
అమ్ముతూ మూర్ మార్కెటంతా
'తెలియలేదా అణువుబాంబులు
తెలుసు ఆయుర్వేదమున కాని—
దానితో తట్టింది రాక్షసి—
తెలివికాక నిజధర్మసూత్రం:
ఇంటిపేర్ కస్తూరివారే
ఇంటిపేర్ కస్తూరివారే.

6
చూస్తూచూస్తూ సానివాడను
చేరుకొన్నది బ్రహ్మరాక్షసి;
కడుపు కక్కూర్తితో కలగి
అమ్ముకొను ఆ పెంటదిబ్బల (?)
చూచినది ఇంతగా క్రిమి
సంతతులు ఎట్లబ్బెనోయవి!

కహాము నదికంటేను ఘోరం
అతివ జీవితమంచు దలచి
ఏలకో మంత్రిత్వమీమెను
'Zoo'కి తేలేదనుచు వగచెను.

7

అంతంతలో హింసామహాసభ
ఆవరణలో పల్కరించిన
పూర్వనేస్తం "నేను స్వామీ !
షతపిశాచిని" అంటుపల్కిన
హాయిగా చిరునవ్వునౌతూ
"ఓహో నేస్తం ! ఉంటివా నువు ?
సరి సరే నేనింకపోయెద" నంచు
పల్కెను బ్రహ్మరాక్షసి స్వస్తివచనం.

8

బీదలై, నిరుపేదలై, కడుపసపసై
తారాడు కార్మికకర్షకావళి
"అన్నమన్నా, ఆకలన్నా!"
అన్నమాటకు
దేశరక్షణపేరుతో వీరాగ్రగణ్యుల
చేతులకు సంకెళ్లవేసి
జైలులో శిక్షించు విధముకు

బ్రహ్మరాక్షసి ఆత్మ పొంగెను
నరకమందున జైలుజీవిత
మెట్లు పెంపుపడంగవలెనో
అడిగితే వావుండుననుకొని.

9

ఇంకతడయక బ్రహ్మరాక్షసి
మంత్రిగారిని చూడవెళ్లెను :
[బుద్ధికే మంత్రాయనతడట]
ఒకళొకళ్లను కూలద్రోసుక
శాసనపు సభ మందిరంలో
ఓట్లతో మెట్లెక్కిపోతూ
ఒకనిమించిన పాలనము
వేరొకరు సాగిస్తూ,
కలియుగానికి కీర్తితెస్తురు
కాలరుద్రుడు కన్ను తెరచును;
ఇదిగో రానుండె పిలయం ?
ఇంక పరవా లేదటంచును
బ్రహ్మరాక్షసి వెళ్లిపోయింది.

మానవసమపార్థన.

ఈసారి అర్థమయిందనుకుంటాను : మన సమాజం ఇట్లా ఉన్నది. మన సామాజికానుభవాలు ఇట్లా ఉంటాయి.

ఏమిటనుకున్నావ్? ఈమనుషులూ, ఈ నాయకులూ, ఈ పాల
కులూ చేనిని సాధించారంటావ్?

బుద్ధియుతులంతాను కలసీ
ఏమి సముపార్జించినారు?
వసుధలో
ఏమి సముపార్జించినారు?

ఓ ఐక్యవిశ్వమా! అవిభాజ్యవిశ్వమా!
నిన్ను తున్కలు చేసిరే
బుద్ధియుతులంతాను కలసి.
చిన్ని దేశాలుగా, బుల్లి రాజ్యాలుగా
ఖండఖండాలుగా నిను చించినారే,
వలస రాజ్యాలుగా కుంచించినారే
బుద్ధియుతులంతాను కలసీ.
ఈ వ్యక్తికొక కొంత — ఆ వ్యక్తికొక కొంత
గోచిపాతల వలెనె పంచీ
చీడపుర్వులవలెనె చేరీ
నామరూపాలెల్ల నాకివేశారే—
బుద్ధియుతులంతాను కలసీ
ఏమి సముపార్జించినారు?
వసుధలో
ఏమి సముపార్జించినారు??

ఓ అమర మానవా! ఓ ఆది మానవా!!
నీ కుటుంబము చీల్చినారే
బుద్ధియుతులంతాను కలసీ.
జాతులని మతములని కులము శాఖలటంచు
తుత్తునియ లొనరించిరే,
విభజించి పాలించిరే,
బుద్ధియుతులంతాను కలసీ
నాగరిక వ్యామోహ ప కిలమ్ముగ్న బడుచు
రంగురూపాలెన్ని గదులుగా పేర్చినారే
మృత్యుహోమం వ్రేల్చినారే
కనలు మంటల కాల్చినారే
బుద్ధియుతులంతాను కలసీ
ఏమి సముపార్జించినారు?
వసుధలో
ఏమి సముపార్జించినారు??

ఓహో నిరంతమా! కాల ప్రవాహమా!!
నీ విరూపపు యాత్ర చెరచినారే
బుద్ధియుతులంతాను కలసి.
రూపమ్ము రేఖలను ఆకృతి నొసంగుచును
చారిత్ర్య ఘటనలన్
నీరూపు దిద్దినారే,

ఆద్యంత మొసగినారే
బుద్ధి యుతులంతాను కలసీ.
మతిలేని గతిలేని సామాన్య మానవుల
పీడించి తాడించి
నిలువెల్ల దోయించి
పాలించినట్టి యా
పరపీడకుల చరిత
పాడింపగా నిన్ను బంధించినారే
పరమ పుణ్యాత్ములౌచు
బుద్ధి యుతులంతాను కలసీ
ఏమిసముపార్జించినారు ?
వసుధలో
ఏమిసముపార్జించినారు ? ?

దేవాదిదేవా : ఓ అధిమానవాత్మా !!
నీరూపు వేర్పఱచి, నీకొక్క పేర్పెట్టి
నీమహాత్మ్యము నిర్ణయించీ—
బుద్ధియుతులంతాను కలసీ—
మతముగా కర్మగా మంత్రమ్ముగా ౹ుడిగ
మాన్కు చర్చలుగా తరలించి
తరతరమ్ముల మార్చినారే
బుద్ధి యుతులంతాను కలసీ;

మధుర జీవికనంత వేదనా మరణాల
విద్వేష ద్రోహాల నింపివేశారే
బుద్ధి యుతులంతాను కలసీ
ఏమిసముపార్జించినారు ?
వసుధలో
ఏమిసముపార్జించినారు ??

## బోగంది.

ఒక నాయకుడితో ఇంటర్వ్యూ కంటే, ఒకసానితో ఇంటర్వ్యూ నయమనిపించింది నాకు. నాయకుడి ముఖానికి ఎదురుగా పట్టిన అద్దం సాని. నాయకుడి సంఘ సంస్కారం సాని ముఖంలో కనిపిస్తుంది. సాని నీ సమాజ సంస్కృతీ దారిద్ర్యానికి చిహ్నం. మానవుడిలోని పశుత్వానికి బలిగా కైంకర్యం కావింపబడిన బానిస.

మన నాయకులు సంఘసంస్కర్తలు. సమాజంలోని ఎత్తు పల్లాలను సమతలం చేసివేస్తారు. అలాగే చేసివేశామని "భోగంమేళాల నిషేధం బిల్లు"ను వారు ప్రకటించిన తర్వాత నేను బోగందాన్ని ఇంటర్వ్యూ చేశాను; ఆమె అంటున్నది:

1

"నవ్వుతున్న ముఖమున్నది నాకు: అంతేకాదింకా
నాప్రియులందరి కోసం

చమత్కారమున్నది నాలో
నాతలపిగచుట్టూ పూసరమున్నది—
అందలి పువ్వులు అతిమధురాలే
అందుకె నే నానందంతో
మైమరచానని అంటారా మీర"న్నది వారాంగన.

2

"దుఃఖమెనాకీ చిరునవ్వును నేర్పెను;
పాపమె నాకీ జోస్యం నేర్పెను;
హృదయంలోపలి దుర్గంధం
క్రమ్ముకొనేందుకు కూర్చినవీ పువ్వులు;
మృత్యుముఖంలో దూర్చిన తలతో
కడసారిగ విరజిమ్మే నా నవ్వుకు
ఎందుకు నిందిస్తావోయ్?" అన్నది వారాంగన.

3

"అది గదిగో కఠిన శిలాకారాగారంలో
పీడిత జన విముక్తి గీతం
పాడిన పాపానికి బలిగా
ధనస్వామి కాహుతియై పోయిన ఖైదీ
మారక్తం మాచెమ్మట
నైవేద్యంగా ఇడుతూ
మిగిలిన కంకాళాలే నేనూ నా సోదరులూ.

4

"చూడు. ఈచిరునవ్వుల ముసుగు వెనుక చూడు
హాలాహాలం దాచుకొనే నేను;
అంతులేని దుఃఖంక్రమ్ముకొనే నేను—
అలసి అలసి సాయంత్రం సొలసిపోవు ప్రాణానికి
కల్లుముంత అర్పించీ
వళ్లుమరచి నిద్రించే వాడు
మాకన్నా శవం నయం "అన్నది వారాంగన.

5

మరచక్రంలో పడి చచ్చే నా సోదరుడూ
గనిలో పనిలో కృశ్శిన నావాడు
రిక్షాతో ఊపిరి ఆగినవాడు
రాక్షసరతిలో సుర్రెక్కెడి నేనూ చిరునవ్వుల చిందుటః
నాజీవిత మాఖరు అగు సూచన
నాముఖముకు తెలివెలుగై
నన్నింకాఆకర్షిత నొనరించును," అన్నదివారాంగన.

6

ఈచిరునవ్వును చెండాడగ తలపోసీ నిజముకు
నాదుఃఖం నాపెదవిని నిల్పానా—
తలచుట్టూ తడిగుడ్డను చుట్టేనా
నా కన్నును కరిగించి నీర మొలిపించానా? – అవును;

నిజమే నాభారం తరిగిపోవు;
నిజమే నా హృదయం తేలికౌను;
కానీ నా కడుపున బడబాగ్ని రేగు "నన్నది వారాంగన.

7

మా అవమానం మేళం నిషేధించ నెంచావే: - బతే
నా ఆకటికేమిటి చెప్తావ్?
సంఘంలో నన్నెట్లాచూస్తావ్?
నా జీవితపరమావధి కేమిటి నీమార్గం? చెప్పు ?
విషంమ్రింగి చనిపొమ్మనియా?
విలాసమై కృశించమనియా?
మొసలికంటి కన్నీరికదేనికిలే: "అన్నది వారాంగన

8

"ఈధనస్వామి నందనవనమున మందమారుతంలో
ముఖప్రీతి ముసుగుధరించుట
కుక్షింభరకవచం దాల్చుట;
దుర్యోధనలో మోసిన దుశ్శాసనులంతాకోరితే
రక్తంతో కొనుక్కున్న
చెమ్మటతో కొనుక్కున్న
నవముసుగును దాల్చనీండి," అన్నది వారాంగన.

# నాయకుడితో ఇంటర్వ్యూ.

ఆతర్వాత నాకు సేరుగా నాయకుడితోనే ఇంటర్వ్యూచేయా లనిపించింది. ముంజేతి కంకణానికి అద్దమెందుకు? ఉత్తముడైన నాయకుణ్ణి గురించి—అతడు ధీరోదాత్తుడు కావచ్చును; ధీరల లితుడుకావచ్చును; ఏమైనా కావచ్చును—అతనితో ముఖాముఖి ఇష్టాగోష్ఠి చేయాలనే ఉబలాటం నాలో బయలుదేరి ఒకరోజున వారిదర్శనం చేసుకున్నాను. ఆనాడు :

నేను : చెప్పు చెప్పు గాడిదా
కధనుచెప్పు వాడిగా
వ్రాసికొందు ఫోడిగా
నీబ్రతు కీనాటిదా ?

గాడిద : చేపలు ఎగిరినప్పుడూ
అడవులు నడచినప్పుడూ
మర్రులు ముల్లుకొనను మొలచినప్పుడూ
జాబిలి నెత్తుటి మడుగైనప్పుడూ
పాలకడలిలో శేషశయుని
బొడ్డులోంచి బ్రహ్మకు
తోబుట్టువుగా జన్మించాను.

నేను : నమోనమః !!

గాడిద : ఆఁ ! ఏమనుకొన్నవ్ ?
మాంత్రికుని శిరస్సుతోటీ
తాంత్రికుని నయనాల్ తోటీ
కొంగరెక్కలవంటి చెవులతోటీ
దయ్యంఅడుగుల నడకలతోటీ
చతుర్భుజుండనై జన్మించాను.

నేను: శుక్లాంబరధరంవిష్ణు శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయేత్.

గాడిద: నాతంబురపాట మాని
పృథ్విమీద కన్నువేస్తె
నాసంగీతపు అపస్వరానికి
శేషబాబు బుస్సుమంటె
నల్లవాడు గ్రహియించీ
నల్లవాడె శపించాడు.

నేను : ఓహో అదాకథా ?

గాడిద : వినవోయ్ గాడిదా ముందు ...
నాటినుంచి నేటిదాక
మూగనై నారహస్యాన్ని
ఎడదలోనే పడచుకొన్నాను.

నేను : ఎంతకష్టం, ఎంతకష్టం, దారితప్పిన....

గాడిద : ఓయి వెర్రివెంగళాయీ !
నావెన్నెల రోజులు నీవెరుగవ్‌లే
తియ్యని కాలం కాస్తా
నా పదఘట్టన నలగిపోయె
ఎరుగుదువా నాచెవులకు
శంఖం ఊదిన రోజుందని ?
నాడెక్కలకొస వ్రేళ్లుండిన
గతకాలం నాకుందని ?

నేను : ఆహా ! తరువాత ?

గాడిద : ఓ, ఓ, ఓ, ఓ, ఓ . .... ...

## ఆరాత్రి.

....గతాన్ని తలచుకుని నాయకుడు ఎంత ఓండ్రపెట్టినా ఆరిపోయిన దీపం గతం: భవిష్యత్తుకు వెలుగునివ్వలేదు. భూతకాల ఔన్నత్యాలోక పెసుభూతమై మానవుణ్ణి కర్తవ్యతా విముఖుణ్ణి చేసినంతకాలం అతని జీవితం ఇంగువకట్టిన గుడ్డ. నేతులునాకిన తాతల మూతులునాకి కడుపునింపుకోలేం కదా ?

ఈ భయంకర జీమూతాన్వితమైన అర్ధరాత్రి ఎప్పుడు గడు

స్తుంది ? ఈ ధాత్రికి నవవసంతోదయశ్రీలు ఎప్పుడు జనిస్తాయి?

ఈలోకానికి నవకాంతులు వస్తాయా ? ఈ మానవాళి భవిష్యత్తు కంటుందా ?

ప్రశ్నలు ! ప్రశ్నలు !! ప్రశ్నలు !!!

"దారి పొడుగునా
ముళ్లపొదలతో
మోటరాళ్లతో
గుట్టలదాటీ
నేస్తం, ఎంతవరకు మనయానం ?"
"తప్పదులే తుదిదాకా."

"ఇంతనిష్ఠురము
ఇంతకష్టమయి
ఇంత వెష్టతో
ఎంతకాలమీయానం ?"
"తెల్లవార్లురా నేస్తం."

"కన్ను కాననీ
కాళరాత్రిలో
దారిపొడుగునా
కననౌనా దీపం ?"

"కారుచీకటుల
కాళరాత్రిలో
వేగుచుక్కయే దీపం."

"అయయో
దిక్కు తెలియకా
కన్ను కానకా
తడుముళ్లాడుతు
ఎట్లాగడపడమీరాత్రి ?"

"కొసడఊపిరితో
కొనఆశలతో"

"ఇంతవరకు
ఈచీకటి దారిని
ముళ్ల పొదలనూ
రాళ్ల గుట్టలన్
కొండలదాటీ
వెలుగు పొందిరా
ఎవ్వరైనా నేస్తం?"

"శ్రీమదమాదులన్
లక్షలాదిమంది."

"అన్నల్లారా
అక్కల్లారా
మీతోసమాన
భాగస్వామిని
వచ్చానంటే
ఆదరింతురా ఒకరైన?"
"వారూ వీరూ
అతడూ ఆమె."

చీకటివలె మృత్యువు మనల్ని అహర్నిశలూ ఆవరించి మన హృదయాల్లో భయాందోళనల్ని వెదజల్లుతున్న సమయంలో,

నేటిరాజకీయాలు కేవలం వ్యాపారరంగాలై (నిజాయితీని) "ఇచ్చి (మంత్రిపదవులు) పుచ్చుకొనే" సిద్ధాంతాలమీద నడుస్తూన్న సమయంలో,

నేటిరాజకీయ పక్షాలు కొద్దిమంది స్వార్థం కోసం బహుజనుల పిచ్చితనాన్ని ప్రకోపింప జేస్తున్న సమయంలో,

నేటి సమాజంలో ఒకవర్గం—సర్వసుఖాలుపొందే వర్గం ఒకటి ఒంటి పెదవితోనే నవ్వుతున్న సమయంలో,

మనిషిలో ఏకాకితనమా! ఒంటిపులి రాకాసితనమా! బలహీనుని పారుబోతుతనమా! నీ అడుగులజాడల్లో విజ్ఞానాన్ని వెతుకుతున్నాడు మనిషి.

కాచకురా మనిషీ నీళ్లని : ద్రాక్షాసవం కాదెప్పటికీ ! వల్లించకు నాయనా నీతుల్ని; వంటబట్టవ్ ఎప్పటికీ మనకి !

భయం విడువు ముందు; భవిష్యత్తు నీదే; ఆలోచించు నరుడా ! అడుగు ముందుకెయ్యి !

ఈవర్తమాన జీవితాన్ని ఆలోచించలేను; ఇందు ఒక్క-క్షణంకూడా విశ్రమించలేను ; మంచి మలుచుకొన్న భావివైపు పరిగెడుతున్నది నామనస్సు. చిరకాలపు మానవ తపస్సు వ్రేల్చిందిక హవిస్సు.

భయంలేదు నాయనా! అర్ధరాత్రి ముగిసింది. ఇక రానున్నది ఉదయసంధ్య; అదే యుగసంధ్య. స్వర్గలోకం భూమిపై అవతరించనున్నట్టు 'అరోరాబోరియాలిస్' కాంతుల అరుణ రాగాలు ఉత్తరాదినుండి ప్రసరించటం చూడటంలేదా ?

దిగులు విడువు విద్యార్థీ !
దిగులు విడువు ధీమంతా !
దిగులు విడువు కార్మికా :
దిగులు విడువు కర్షకా !
దిగంతముల దివ్యకాంతి
దృగంతముల స్వప్నభ్రాంతి
**అదే కాంతి, అదే క్రాంతి, అదె సంక్రాంతి !**

# వైతాళికుడు.

వ్యక్తి జీవితాన్నీ, సంఘజీవితాన్నీ పరికించి, పరిశోధించి, అలసి, మెల్లగా కాళ్ళీడ్చుకొంటూ దుఃఖతిమిరాలు భాగ్యోదయారుణ రాగాలతో పెనగులాడుతున్న సమయంలో........

నేనా? నేను నేనేనా? నేను ఉన్నానా? అనే మీమాంసతో ఇదమిదమని తేల్చే శక్తిలేక, బహిర్గతమైన ప్రతీదీ నువ్వు లేవంటూంటే, అంతర్గతమైన ప్రతీదీ నువ్వే సర్వమంటుంటే— ఏదీ నమ్మలేక బ్రతకలేని మనిషి సమాజమే బందకొయ్య అనుకొంటూ....

ఓహో! ఇటువచ్చే ఓ సామాజికుడా! భోభో ఇటువచ్చే ఓ నాయకుడా! హలో! ఇటువచ్చే ఓ నాగరికుడా!

పాతగోడలకి కొత్త వెల్ల వేసే మీరంతా ఆపాతకొంపని కూల్చి కొత్తగోడలు కట్టాలని ఆక్రోశించిన ఈ నవయుగ వైతాళికుని సమాధి వద్దకి రండి. ఈ సమాజ వ్యవస్థనే మారుస్తామని ఆయనపై ప్రమాణంచేసి చెప్పండి. ఆయన ఆత్మశాంతికై ప్రార్థించండి!

ఓహోహో బాటసారి;
వింటావా? చిన్నకథను!
కలలకత ఒకింతకాదు

నిజజీవిత జన్యగాధ
సాధారణ వగగాధల
నేనసలే చెప్పబోను :
ఓహోహో బాటసారి !
ఘనుడే మన కందుకూరి ::

సాటిలేని ప్రతిభ కలుగు
అసమానుడ వీవైతే,
అదృష్టద్వారబంధముకడ
వెలిపొందిన ఓమనిషీ !
ఇటుపరుపుము సానుభూతి-
నిరుపేదయె కందుకూరి !

కళలమీటు కిన్నెరతో
పాటపాడు కవివైతే
ఈస్మశాన సమీపాన
నడయాడే బాటసారి!
గుండెపిప్పి తొంగిచూడు
స్థిరుడయ్యా కందుకూరి!

తనరచనా పటిమతోడ
ఏ సంఘం బాగుపడెనో;
తన సంస్కృతి ఘటనతోడ

ఏదేశం జ్వలియించెనో;
ఆదేశం, ఆసంఘం ఋణంపడిన
నిజపురుషుడు కందుకూరి.

నరులపైన, రచనపైన,
శ్రేయమార్గ వర్తనమున
ఏకాంతిని బరపెదవో,
ఏతీరున చూసెదవో,
అట్టివాడు: ఉత్కృష్టుడు
ఉజ్వలుడౌ కందుకూరి

స్నేహపాత్ర ఔచిత్యం
ఎవనియందు వెలిగిందో
అట్టిజీవి చల్లారుట
జాలికంటి నీటికణం
రాలదగిన సమయస్మృతి ;
ఘనుడయ్యా కందుకూరి !

## అరుణతార పొడిచింది.

నేను న్నూ ప్రమాణం చేశాను. నేనున్నూ వీరేశలింగం పంతులుగారు తీర్చిదిద్దిన ఆదర్శపథాలతో తిరుగులేని యాత్రను కొనసాగి చాలని సంకల్పించాను.

సమాజ సంస్కరణ సాగాలంటే ముందు భౌతిక బానిసత్వం తొలగిపోవాలి. ఈ బానిసత్వాన్ని ప్రతిష్ఠించేందుకే చెరసాలల్నీ, కొరడాలనీ. ఉరికొయ్యల్నీ సృష్టించి — ప్రభువులు మానవ చైతన్యాన్ని బంధించి పశుత్వాన్నిప్రతిష్ఠించారు.

ఆ పశువు విజృంభిస్తున్నది. దాన్ని చెలరేగ నివ్వకూడదు. దానిరంకెల్ని అణచివేయాలి. దానిఉరకల్ని అరికట్టాలి.

ఆ సంకల్పంతోనే పిడికిలి గట్టిగా బిగించి అరిచాను:

బోయీల్ మోసే పూలపల్లకీ !
కూలీల్ కట్టిన రాజభవనమా :
రాజులు ఎక్కే సింహాసనమా !
న్యాయంచెప్పే మునసబులారా !
స్వేచ్ఛను అణచే జైలధికారీ !
గుర్తించండోయ్ గుర్తించండి !

మీ బధిరాంధక అధికారంలో
అడుగున నలిగీ, పక్కకు ఒరిగీ
రోదించే ఆ బానిసజీవుల
ఆక్రందన ఆర్తవరావం
గుర్తించండోయ్ గుర్తించండి.

మీ బధిరాంధక అధికారంలో
స్వార్థంతో చేసిన మీ ద్రోహం

అణచిందీ అమాయకుల్ని.
రాచఱికం నాదేనంటూ
తలపోసే సైనికఖడ్గాల్
స్వతంత్రమే నాదేనంటూ
బంధించే ఇనుప గొలుసులూ,
అధికారం నాదేనంటూ
ఉరివేసే దండననీతీ,
మహారాజుల భూషణమంటూ
సామాన్యుని పీల్చే తురాయి
కొరడాలు, తుపాకిగుండ్లు
ఇవ్వన్నీ రాజరికాలా?
—ఇవ్వన్నీ ఇకపై నిలవవు.
సామాన్యుని ప్రతీకారమిక
ప్రజ్వలమై జ్వాలల చిమ్మి
అధికారుల నిరోధశక్తుల
తక్షణమే మారణహోమం
చేస్తాయని గుర్తించండి.

ఎన్నెన్నో నామాల్ రూపాల్
ధరియించెను రాక్షసతత్వం
చీకటియై, పిశాచగుణమై,
ఫాసిజమై, సామ్రాజ్యమ్మై

చెలరేగుట లింక భరింపం.
సామ్రాట్టుల దౌర్జన్యాలను
దూషించును దేవుడు నరుడు!
బానిసలై కటకటలాడే
జాతులకే నెత్తురు పొంగును;
చిరకాలపు తీరని కోరిక
నిరాశతో గుండెలు చీల్చెను —
కరుణించిన మానవ ప్రేమలు
భరియింపక నేల కూలినవి!
రెపరెపమండీకరుణ కాలినది —
కన్నీరిక కార్చంవాటికి
రాకాసికి దండంపెడుతూ
స్తుతిచేస్తూ కూచోం ఇకపై
గర్వించిన తళుకుల నిదిగో
పూజించిన దయ్యాన్నిపుడే
తక్షణమే హోమం చేస్తాం.
తిరుగుబాటు చెలరేగిందదిగో,
అదిగదిగో కోటలు కూలెను
అరుణతార పొడిచిందిక.
మానవుడా! పోయేదేమిటి?
బంధనములు, బందెలదొడ్డి;
శాసనములు దండన లికపై

లేవయ్యా ఓ మానవుడా !
మానవులే ఒకటై, సమమై
కులాల, తెగలన్, జాతుల త్రెంపీ
పరశురాములై 'రాజుల త్రోసీ
ఆటనుకట్టీ, ప్రజాస్వాములై
భూక్షేత్రం పండిస్తారు.

## సంజాయిషీ.

.... ఇంక నేను చెప్పుకోవలసిన సంజాయిషీ కూడా ఉన్నది.

సమాజమనే బ్రహ్మాండమైన యంత్రంలో నేనుకూడా ఒకచిన్న భాగాన్ని. నాకున్నూ ప్రత్యేకమైన ఆకారం, ఉపయోగం, పని ఉన్నవి.

సమాజమనే బ్రహ్మాండమైన యంత్రంలో ఒకచిన్న భాగాన్నైన నేను లేకపోతే ఆయంత్రంతిరగదు. ఆ సంగతి నాకు తెలుసు. యంత్రమే లేకపోతే నేనుకూడాలేను.

సమాజమనే శరీరానికి కవినైన నేను ఆత్మని. నేను లేని ఆశరీరం శవం; ఆశరీరంలేని నేను దయ్యాన్ని.

పుట్టుకకీ చావుకీ మధ్య నివసించే నేను నాసంజాయిషీని వినిపిస్తున్నాను.

నేనే నీజీవితాన్ని; ఆత్మని; హృదయాన్ని; మానవ నరుడా !

తాడితులకు, పీడితులకు,
కార్మికులకు, కవిస్నేహు;
కర్షకులకు, కూలీలకు;
బానిసలకు కవిస్నేహు;
'పాపాత్ముల' కవిస్నేను.
సహోదరుల చెమటపైన
శ్రామికకుల శ్రమలపైన
కావ్యాలను వ్రాస్తాను;
"సుఖస్వాప్నిక జీవితమ్ము"
నోచుకొనని 'దౌర్భాగ్యుడ;'
తీరికింతయైనలేదు
అథవా తలపోతకైన,

గాయపడుచు హాలమంతే
భూతలమున కేమి ప్రేమ?
చీల్చివైచు చక్రానిని
సముద్రిమా, ప్రేమించును?
భూగర్భాన్నిముడు గనులు
దోచుదొంగకై ఏడ్చునె?
శాంతిలేని శక్తులతో
ఓర్మిచూపు వంతెనపై
జాలిపడునె మహానదులు?

నందనవన పంద మంద
మలయానిల డోలికలో
షికారేగు తీరికయా
"పాపాత్ముల" కవిన్నాకు ?

మట్టికాము మీదేర్పగ
కుమ్మరిసారెను త్రిప్పుదు;
ఆకాశం ఉత్కర్షకు
జవాబుగా నేకట్టిన
రెక్కల విప్పుదు;
నానిర్మిత భర్మ్యహర్మ్య
స్తూపాలే భూకాంక్షల
చూపువేళ్ళు.

శిథిలకుడ్య పరిసరాన
నీడవెలుగు మిశ్రిమించు
కాంతులతో జాబిలి
వెన్నెల కురియును.
కాళరాత్రి సౌందర్యం,
కన్నతల్లి హస్తాల్లో
ఆకలిచే కుమిలే శిశువుల
రోదనలో ప్రతిబింబించును.

* * * *

ఇది భయానక దారుణ విలయ సమయ
మిందు భీభత్సదేవి తాండవ మొనర్చు:

* * * *

తాడితులకు, పీడితులకు,
కార్మికులకు కవిన్నేను;
కర్షకులకు, కూలీలకు
బానిసలకు కవిన్నేను;
"పాపాత్ముల" కవిన్నేను.
కార్మికునికి పక్కనిలచి
సుత్తివిసరి చూపిస్తా;
కూలీతో, కొడవలితో
విప్లవాన్ని సాధిస్తా;
తాపీతో చేయికలిపి
సమతల మొనరించేస్తా;
లోతులెరిగి నదుల కెదురు
చుక్కానిని పట్టిస్తా;
దూరదూర సంద్రాలకు
పడవనడిపి వలవేస్తా;
కొండచరియలోని బిలం
మందు నింపి పేలుస్తా;

ఇదిగిదిగో గొడ్డలికొన
నెత్తుటిలో స్నానమాడు ;
తాడితులకు విముక్తిలక్ష్యం,
పీడితజన స్వర్గం నాదే ;
బాధితులకు రాచబాట
ఇక నేనే చూపిస్తా !
పంటకాల్వలోని మురికి
నిక నేనే తొలగిస్తా !

[కంటిలోన వత్తిడుకొని
కాళరాత్రి పడక గదిని
ఒంటరిగా దీపంవలె
నాకోసం వేచియుండు
ప్రియురాలొక స్వప్నంలా—
అయితే నాకా ?—
తీరికింతయైన లేదు
అథవా తలపోతకైన.]

తాడితులకు, పీడితులకు
కార్మికులకు, కవినేను;
కర్షకులకు, కూలీలకు;
బానిసలకు కవినేను;
'పాపాత్ముల' కవినేను.

# యజ్ఞదీక్ష.

.... తన ఇల్లుచక్కదిద్దుకోవాలని, తన భాషను తాను అభ్యసించాలనీ ఏనాటినుండి తాపత్రయమో ఆంధ్రుడికి

.... అటు ముస్లింజులుం ఉర్దూనుతెచ్చి, ఇటు ఇంగ్లీషు 'ఈగో' ఇంగ్లీషును రుద్ది, నేడుఔత్తరాహుల 'అహం' హిందీని ఇచ్చి, తెనుగువాణ్ణి తెనుగుమాట్లాడకుండా, తెనుగువాణ్ణి తెనుగు బ్రతుకు బ్రతకకుండా చేస్తున్నవి.

ఎన్నాళ్ళు భరిస్తాడు ఆంధ్రుడు? ఆంధ్రుడు భాషాపరశేష భోగి. భూభారాన్ని భుజంమార్చుకుంటాడు; తప్పదుతే విలయం వస్తుంది.

ఓర్పులేదిక మాకు ఒక్కక్షణమైన
ఒప్పులేమీతీరు ఒక్కత్రుటియైన

ఆంధ్రుడంటే అపరఆదిశేషువు సుమ్మ
సహనమ్మ అతగాని కెనలేని సొమ్మ
ఎవడు సహియించురా తననాల్కచీల్ప ?
ఎవడు భరియించురా తన కొంపకూల్ప ?

ఓర్పులేదిక మాకు ఒక్కక్షణమైన
ఒప్పులేమీతీరు ఒక్కత్రుటియైన

తనభాష తనవేస తనువుకోయాస
బానిసత్వం తెగిళ్ళపడెనే ప్రియాస !
ఎవరు బంధించారు నాగేంద్రునిపుడు?
ఎవరు ఎదిరించారు నాగేంద్రునపుడు?



ఓర్పులేదిక మాకుఒక్కక్షణమైన
ఒప్పులేమీతీరు ఒక్కత్రుటియైన

బాలనాయసిభేటి బ్రహ్మనాయనిధాటి
దిగ్దిగంతముదాటి లేదనునుసాటి
సాదురేగితె ఇంక విడువదుర క్షణము
ప్రాణహానికి నిజం, ప్రాణమే ఫణము

ఓప్పులేదిక మాకు ఒక్కక్షణమైన
ఒప్పులేమీతీరు ఒక్కత్రుటియైన.



## అంజలి.

ఆదిశేషుడు భుజం మార్చాడు; భూలోకం కంపించి పర్వతాలు పతేలు పున్నాయి. చెట్ల తలలు నేలనుఢీకొన్నాయి. సెగలుముస్తూ, పొగలెగస్తూ లావా ప్రవహించింది. మహా సముద్రాలు కల్లోలపడ్డాయి.

బ్రహ్మతేజస్వి పొట్టి శ్రీరాముడు పరమపదించారు; ఆయన ఆత్మబలిదానం గ్రహించిన రాక్షసులు తనిశారు. శ్రీరాముని భక్తులు తమరక్తంతో తిలాంజలిఘటించి తర్పణలిచ్చారు.

ఆంధ్రులకు పర్వదినమది! చిరంతన స్వప్నఫలమది!
అర్పించండి అంజలి!

జోహార్లు జోహార్లు పొట్టి శ్రీరామా!
ఆంధ్రజాతికి నీవు అసువులిచ్చావా!

పేరుకై రాముడని అన్నారెగానీ
రాముడన నీముందు ఎంతరాస్వామీ
ఆనాడు ఆరాముడడవికేతెంచ
తోడుకొనివెళ్లెరా సతిని సోదరుని;
ఏతోడు నీకైన లేకుండనీవు
ఆకులలములుగాని అన్నమ్ముగాని
ఆరగింపకనీవు ప్రాణమిచ్చావు. ॥జో॥

కలదుకై కమ్మరా సాటిగామీకు
రాజ్యమ్మువదలుకొను గతిని రాముండు;
రాష్ట్రమ్ముసాధించు కతనగానీవు
జాతిగరువమునిల్ప జాతికాపాడ
జాతి జీవమునిల్ప జాతినిలుపంగ
ధృవతారలై చరిత నివసించినారు ॥జో॥

పంతమున భీష్ముడని యందురేగాని
పట్టిచూడగ భీష్మమెంతరా నీకు ?
తండ్రికోసమె అతడు పట్టి భీష్మింప
జాతిజీవం కొరకు భీష్మించి నిలచి
జాతికయి జీవమ్ము లర్పించి నావు. ॥జో॥

సత్యమున కీషత్తుతావులేదంటు
హృదయాన నైరాశ్యమలముకోగానే
దిక్కుతోచని మూడుకోట్ల ఆంధ్రులను
పురికొల్పి మరివిడిచి ధృవుడవైనావా ?
ముక్కోటి గొంతుకలు ఎలుగెత్తినేడు
చాటుచున్నాయిరా నీదీక్షనిపుడు ॥జో॥

శోకించకే ఆంధ్రమాతా ! పునీత !
పొట్టి శ్రీరాముడే చూపెనేదారి ;
ప్రతి ఇల్లు ప్రతిపల్లె ప్రతివాడునేడు
ఆంధ్రరాష్ట్రపుదీక్ష వహాయించినారు
ఒక్కొక్క డొక్కొక్క శ్రీరాముడౌతు
రాష్ట్రసిద్ధికి ముందు దురికారుచూడు. ॥జో॥

# మంగళం.

.... ఇంతకాలానికి గొడ్డుపోయిన ఆంధ్రభూమి ఫలించిం ది. నేడు ఆంధ్రులమంతా ఒక్కటి !

.... నిలబడింది మన తల్లి చల్లనిమూర్తి పాల వెలుగై
మనముందు.

.... అన్నల్లారా! మీ ముద్దులు కురిపించండి!

.... చెల్లాయిలూ, ఎత్తుకోండి మీపాపని.

.... బాబూల్లారా! మీబిడ్డలో మీపోలిక చూసుకోండి:

.... పేరంటాళ్లంతా మంగళం పాడండి.

కడుపు చల్లని తల్లి! మా మాతెనుగు తల్లి!
పిడికిటిని కొడవటిని దీవించవమ్మ!
మముకన్నమాతల్లి! మాపాలవెల్లి!
నీవల్లనేసాగు మాబ్రతుకుబాగు
పచ్చపచ్చనితల్లి! బంగారుతల్లి!
పాడిపసువులరాణి! పరమకళ్యాణి!
కడుపుచల్లనితల్లి! మా తెనుగుతల్లి!
పిడికిటిని కొడవటిని దీవించవమ్మ!

....అనంతమైన మహాప్రవాహం ఒకటి సాగిపోతున్నది: అది కాలప్రవాహంకావచ్చు; లేద కాలప్రవాహంలో అంతర్భాగమైఉన్న ఉన్నత కావ్యప్రవాహంకావచ్చు.

....ఏమైనా ఈ ప్రవాహం అనాది; ఈ ప్రవాహం అనంతం; ఈ ప్రవాహం చిరకాల .... ....

[ రచనాకాలం: 1944 నుంచి 1954 వరకు ]

''ఒక్కసారి ఆమె చెయ్యిపుచ్చుకుని కుదిపి మళ్ళీ 'సంగీత గారు' అని పిలిచాడు.

కళ్ళు మూసుకుని ఒక్కసారి క్షణిక కాలం తల వూపి కళ్ళు తెరిచి,

''ఓ బోయ్!'' అని గట్టిగా అరిచి పకపకా నవ్వింది.

''పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నారు. నా పేరు సంగీత అన్నంత మాత్రాన మీరు రకరకాల సంగీతాల గురించి ఎంత చెప్పినా నా బుర్ర కెక్కదు. ఇది ఇందాకా నేను మీతో మనివి చేసుకున్నాను. మళ్ళీ చెబుతున్నాను. మీరేమి అనుకోకండి. మా నాన్న నాకు తగని పేరు పెట్టాడు. మీకు సంగీత శాస్త్రంలో ఉన్న నాలెడ్జికి నా జోహార్లు. నాకు ఈ శాస్త్రంలో జ్ఞానం సంపాదించటానికి మరో జన్మ ఎత్తవలసి ఉంటుంది'' అని నవ్వింది.

''మీరు చాలా స్మార్ట్! మీకు అంతకాలం పట్టదు'' అన్నాడు.

ఇద్దరూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

''నాకు అదో పిచ్చి, ఎవరయినా దొరికితే చాలు అలా వసపిట్టలా మాట్లాడుతుంటాను. ముఖ్యంగా సంగీతశాస్త్రం, నాకు ఎవరో ఒకరు కావాలి నా బోరు వినే వాళ్ళు'' అని పెద్దగా నవ్వాడు.

''నేను మీకు సాయపడతాను'' అంది.

''థ్యాంక్స్'' అన్నాడు.

ఇద్దరూ మళ్ళీ గట్టిగా నవ్వుకున్నారు.

''మీ నుంచి ఎన్నో నేర్చుకోవాలి'' అంది ఎంతో ఉత్సాహం కనపరుస్తూ.

''ఎక్సలెంట్! అలాగే కానిద్దాం'' అన్నాడు ఎంతో హాయిగా.

''మాయింట్లో ఒక పియానో ఉంది. అది అప్పుడప్పుడు వాయిస్తూంటాను'' అంది.

''అయితే ఇంకనేం! మీకు ఈ రాగాలు చాలా సులభంగా తెలుస్తాయి.

పియానోలో సి.డి.ఇ.ఎఫ్,జి.ఎ,బి, అని ఏడు స్వరాలున్నాయి కదా కీ బోర్డు మీద. ఇవే స్వరాలను అనగా షార్ప్ స్వరాలు ముట్టుకోకుండా, డైరెక్టుగా ఫ్లాట్ స్వరాలు మాత్రం కొన్ని కొన్ని స్వరాలు సమూహంగా వాయిస్తే అది 'శంకరాభరణ రాగం' అవుతుంది. అంటే అన్నీ తెల్ల కీలు వాడాలి''.

''ఇహా పోతే! సి, డి, ఇ, -ఫ్లాట్ ఎఫ్, జి, ఎ, బి-ఫ్లాట్ కీలు కొన్ని కొన్ని సమూహంగా వాయిస్తే అది 'ఖరహరప్రియ రాగం' అవుతుంది. అంటే శంకరాభారణానికి, ఖరహరప్రియకి పాశ్చాత్య సంగీతంలో ఒక్క ఇ, బి, కీలలోనే తేడా ఉంది.''

''మీరు చెప్పినట్లు పాశ్చాత్య శాస్త్రీయ సంగీతానికి, భారతీయ శాస్త్రీయ సంగీతానికి పెద్దగా తేడా పాడాలుండవు.''

కళ్ళు మూసుకుని కాసేపు జ్ఞాపకం చేసుకుని ''మరో ఉదాహరణ తీసుకుందాం, 'కళ్యాణి రాగం'లో ప్రతి మధ్యమం ఎఫ్, షార్పు అవుతుంది. ఖరహారప్రియ రాగంలో ఉన్న గాంధారం ఇ-ఫ్లాట్ అవుతుంది. ఖరహారప్రియనే 'కాఫీరాగం' అంటారు హిందూస్థానీ సంగీతంలో. మీ నాన్నగారికి బాగా తెలుస్తుంది.....''

''ఈ సారి మీరు పియానో వాయించినప్పుడు శంకరాభరణం, ఖరహరప్రియ, కళ్యాణి రాగాలు ప్రయత్నించి చూడండి. అన్నాడు గుక్క త్రిప్పుకోకుండా''.

''ఏమిట్రా వీడు'' అన్నట్టుగా ఒక్కసారి అనంతం కేసి చూచి గట్టిగా నవ్వింది.

''మీకు పియానో వాయించటం బాగావొచ్చునన్న మాట. నాకు నేర్పగలరా'' అంది.

''నేను పియానో ఎప్పుడూ సరిగా చూడలేదు కూడా. అదో పెద్ధసైజు హార్మోనియం పెట్టె అని అనుకుంటూంటాను,'' అని పెద్ధగా నవ్వాడు.

''లేదు! లేదు మీరు చాలా కరెక్టుగా చెప్పారు. మీరు హార్మోనియం వాయిస్తారా'' అడిగింది.

''నా కేమీ రాదండి, సంగీతాన్ని వింటూ చదువుతుంటాను ఖాళీ వేళలలో. అదే నా హాబీ! మీరు మీ ఇంటికి తీసుకుని వెళ్ళి ఆ పియానో దగ్గిర కూర్చోబెడితే, ఆ

నల్ల మెట్లకి తెల్ల మెట్లకి తేడా చెప్పలేని వాణ్ణి నేను'' అని నవ్వాడు.

''నాకిప్పుడర్థమయ్యింది, మీరో గొప్ప మ్యూజికాలజిష్టు అని. మీరు నా ప్రక్కన కూర్చుంటే పియానో మీద నేనెంతయినా నేర్చుకోగలనని నా నమ్మకం. ఒక్కసారి మనం ప్రయత్నం చెయ్యవచ్చుగా'' అంది.

''తప్పకుండా! నాకేం అభ్యంతరం లేదు. కాని నాథీరీ మీకెంత వరకు పని కొస్తుందో నాకు తెలియదు. కాని ఈ కోక్‌కు సాయం ఆ వేడి వేడి పీజా తగిలిస్తే కాని నే నేమీ చెప్పలేను. నన్ను స, రి, గ, మ, ప, ద, ని, స అంటూ వెళ్ళి పీజా తెమ్మన్నారా? లేక మీరే డో, రె, మీ, ఫా, సో, లా, సి అనుకుంటూ వెళ్ళి తీసుకొస్తారా?'' అని గొల్లున్న నవ్వాడు.

నవ్వాపుకోలేక ''అమ్మో! మీరు సామాన్యులు కారు. ఏదో చాలా సీరియస్ మనుష్యులను కున్నాను'' అని ఒక్కసారి పరుగెత్తుకుని వెళ్ళి తను ఆర్డరు చేసిన పదార్థాలు గబగబా పట్టుకొచ్చింది. ఒక పీస్ అనంతానికందించి, తానొక పీస్ తీసుకుని తాపీగా మాట్లాడటం మొదలెట్టింది.

''మీరు ఈ మధ్యగా పబ్లిష్ చేసిన పేపరు ఆధారంగా తీసుకుని, నేను, మా గైడ్ కలసి ఒక పేపర్ మీరు ఆర్గనైజ్ చేస్తున్న ఇంటర్ నేషనల్ సెమినార్‌కి పంపాను. అది నా ప్రాజెక్టు థీసీస్‌లోకి వెడుతుంది. దాన్ని మీ కాన్ఫరెన్సులో చదివే యోగ్యత నాకు ఉందో లేదో తెలుసుకోవచ్చా! నాకు అంత థీరీరాదు. మీ పేపరు అర్థం చేసుకోవటానికి నాకు చాలా కాలం పట్టింది'' అంది.

ఇద్దరూ కోక్ త్రాగుతూ, పీజా తింటూన్నారు.

''మీ పేపర్ చదివాను, చాలా బావుంది. మీరనుకున్న ప్రాజెక్ట్కు పరిమితిమించి ఉంది. మీరు చక్కగా ప్రజెంట్ చేస్తారని తలుస్తున్నాను'' అన్నాడు.

''ఓ! బోయ్ నా పేపర్‌కి అనుమతి దొరికినందుకు చాలా థాంక్సు. తప్పకుండా ఒళ్ళు దగ్గిర పెట్టుకుని ప్రెజెంట్ చేస్తాను. పైగా మీరు ఎదురు గుండా కూర్చుంటే నాకు కాళ్ళు ఒణుకుతాయి'' అంది.

''అయితే నేనుండను లెండి'' అన్నాడు.

''అయ్యో! మీరు లేకపోతే నాకంత ఇంటరెస్టు ఉండదు. నెనెన్నో మీతో డిస్కస్ చెయ్యాలి''. అంది

''ఓ! అలాగే తప్పకుండా'' అని ఆపుకోలేని ఆకలితో తినడం ప్రారంభించాడు అనంతం.

ఇద్దరూ కాస్సేపు పీజా తినటంలో మునిగిపోయారు.

''మీకొక్కటి చెప్పాలి నేను'' అంది పేపర్‌తో మూతి తుడుచుకుంటూ,

అనంతానికొక్కసారి బ్రేక్ పడింది.

''చెప్పండి'' అన్నాడు

''ముందుగా నేను మీకు ఎంతో ఋణపడి ఉన్నానని చెప్పటానికి చాలా సంతోషిస్తూన్నాను. ఏమంటారా? నా ప్రాజెక్టు బేస్ మీద నాకు సనీవేల్‌లో ఒక కంపెనీలో మంచి ఉద్యోగం వచ్చింది'' అంది.

''మీరు నాకు ఋణపడేంత ఉపకారం నే నేం చెయ్యలేదే! మీరు కష్టపడి పని చేసి సంపాదించుకున్నారు మంచి ఉద్యోగం. పైగా ఋణపడి నందుకు సంతోషపడుతున్నారా. ఎవ్వరైనా ఋణపడినందుకు బాధపడతారు ఎలాగా! ఈ ఋణం తీర్చుకోవటం అని'' అన్నాడు.

''మీ ఋణం తీర్చుకోగలనని చాలా ధైర్యంగా ఉన్నాను. మీ సహకారం కావాలి నాకు'' అంది.

''నా సహకారమా? నా సహకారంతో నా ఋణం తీర్చుకుంటారా? ఇది చాలా విచిత్రంగా ఉంది. ఇలాగయితే ఋణం పెరిగిపోతుంది. నా సహకారం మీకు ఎప్పుడూ లభిస్తుంది'' అన్నాడు.

''ఇది చాలు నాకు. మీ సహకారం ఉంటే నేను దేన్నయినా జయించగలనని నాకు చాలా నమ్మకం ఉంది.'' అని ఎంతో హాయిగా నవ్వింది సంగీత.

''నా సహకారం పొందిన కొద్దీ ఋణం కూడా పెరిగిపోతుంది క్రెడిట్ కార్డులాగ'' అని ఒక్కసారి నవ్వుతూ చూచాడు ఆమె వంక.

''అందుకని క్రెడిట్ కార్డు తీసుకోవటం మానేస్తామా? ఎక్కడికి వెళ్ళినా మనతో కూడా వచ్చేది ఆకార్డేగా'' అంది కొంటెగా నవ్వుతూ.

''అందుకే అన్నారు. అమెరికా ఒక అప్పుల సామి అని! ఇక్కడ ఉండే వాళ్ళంతా అప్పారావులని'' అని పెద్దగా నవ్వాడు.

అనంతం కేసి అయోమయంగా చూచింది

''ముళ్ళపూడి వెంకటరమణ అని ఆంధ్రావనిలో ఒక గొప్ప హాస్యరచయిత గుర్తుకొచ్చాడు. ఆయన అప్పులసామిల మీద ఎన్నో రచనలు చేశాడు. నా దగ్గిర ఉన్నాయి కొన్ని పుస్తకాలు. మీరు తెలుగు చదవగలను అంటే తప్పకుండా ఇస్తాను చదవండి'' అన్నాడు.

''ఒక ఐదురూపాయల అప్పుకోసం అప్పారావు తిరగని చోటు లేదు. రమణగారికి ఈ క్రెడిట్ కార్డు వ్యవహారం తెలిస్తే అప్పుడే రాసుండేవాడు. అప్పారావు కార్డుల అప్పుకోసం తిరిగుండేవాడని. ఒక్క కార్డు అప్పుతో అప్పారావు కష్టాలన్నీ గట్టెక్కుండేవి'' అని నవ్వాపుకోలేక పోయాడు.

సంగీతకేమి అర్థం కాలేదు. వెర్రిగా చూచింది అనంతం కేసి.

''నన్ను క్షమించండి. రమణ గారి నవలలు గుర్తుకొచ్చి నవ్వాపుకోలేకపోయాను. ఏమి అనుకోకండి'' అన్నాడు.

''మీసెన్స్ ఆఫ్ హ్యూమర్‌కి హాట్స్ ఆఫ్'' అని నవ్వింది. కొంచెం వెర్రి మోహం వేసి.

వారిద్దరి మధ్య కాస్సేపు నిశ్శబ్దం ఆవహించింది.

''మీకు ఎకాడమిక్ జాబ్ ఇంటరెస్టా లేక కార్పోరేటు జాబా! అడుగుతున్నందు కేమీ అనుకోకండి, ఎందుకంటే మిమ్మల్ని చూస్తూంటే ఎకడెమిక్స్‌లోకి వెడతారనిపిస్తోంది'' అంది కొంచెం ఎంక్వయిరీ చేస్తోన్న దృష్టితో.

''నేనెప్పుడూ ఎకడెమిక్స్‌లోకే వెడదామనుకుంటూంటాను. కాని కాలం, కర్మం అన్నీ కలిసిరావాలిగా. పైగా డబ్బు కనిపించేది కార్పోరేట్ సెక్టర్ కదా! నాకు డబ్బంటే చేదు కాదు. పైగా ఎక్కడ ఉద్యోగం వస్తే అక్కడికే పోతాను. మనం ఏవంత గొప్ప

వాళ్ళమని ఎన్నుకోవటానికి. ముష్టివానికి ఛాయిస్ లేదుగా'' అని ఒక్కసారి నవ్వాడు.

''మీరు చాలా గమ్మత్తయిన మనుషులు. మీ పోటి వాళ్ళే ఇలా మాట్లాడితే మా పోటివాళ్ళేమవ్వాలి. మీరు చాలా మోడెస్టు. నిండుకుండ తొణకదంటారు'' అంది అదోలా చూస్తూ.

''నా మీద మీకు ఇంత కాన్ఫిడెన్సు వున్నందుకు చాలా సంతోషం. ముందుగా నేను మిమ్మల్ని కంగ్రాట్యులేట్ చెయ్యాలి మంచి ఉద్యోగం సంపాదించినందుకు'' అని అప్రయత్నంగా చెయ్యిచాపి షేక్‌హాండ్ ఇచ్చాడు.

సంగీతకి అపరిమితమయిన ఆనందం కలిగింది.

''కాని మా గ్రూప్ లీడర్ ఎటువంటి వాడో తెలియదు. టెక్నికల్‌గా గట్టివాడై యుంటాడని తలుస్తాను. లేకపోతే పెద్ద ఇంటరెస్టు ఏముంటుంది. కొంత ఫ్రీడమ్ ఉండాలి కదా. ఏది ఏమయినా నాకు ఎప్పుడయినా ఏదయినా చర్చించాలంటే మీకు మెయిల్ పంపుతుంటాను. నేను కోరుకునే సహకారం కొంతవరకు ఇదే'' అంది ఎంతో హాయిగా నవ్వుతూ.

''అందులో ఎంతమాత్రం సందేహం లేదు. తప్పకుండా నూటికి నూరుపాళ్ళుగా నా సహకారం ఎప్పుడూ ఉంటుంది మీకు. చాలా సంతోషంగా నేనెప్పుడు మీతో సహకరిస్తాను. మిమ్మల్ని ఒకటడగ వచ్చా'' అన్నాడు.

''తప్పకుండా'' అంది.

''మీరు చేరబోయే కంపెనీ పేరేమిటి?'' అడిగాడు.

''జిరాక్సు సాఫ్టువేర్ డెవలప్‌మెంట్ డివిజన్. ముఖ్యంగా వాళ్ళు డిఫెన్స్ సాఫ్టువేర్ డెవలప్ చేస్తున్నారుట. నిజానికి చెప్పాస్తే నాకు సాఫ్టువేర్ కన్నా హార్డ్‌వేర్‌లోనే చాలా ఇంటరెస్టుంది.''

''అక్కడికి వెళ్ళిన తర్వాత చూడాలి. పైగా గ్రూప్ లీడర్ మీద. చాలా మట్టుకు డిపెండవుతుంది. చూడాలి! చూడాలి!'' అంది, కొంచెం ఆలోచనలో పడి.

అనంతానికి షాక్ తిన్నట్లనిపించింది. ఏమీ మాట్లాడలేదు.

''వాడు మంచివాడయి ఒప్పుకుంటే మంచిదే. అటు హార్డ్‌వేర్‌లోకి మారవచ్చు. లేకపోతే ఏ మూర్ఖుడో తగిలాడంటే అంతే. నా యాంబిషన్‌కి, ఫుల్‌స్టాప్ పెట్టవచ్చు'' అంది.

అనంతం బిగిసిపోయాడు.

''ఈ అమ్మాయితో నేనే ఆ మూర్ఖుడిని అని చెప్పనా? వద్దా?'' అని మీ మాంసలో పడ్డాడు.

అనంతం ముఖంలోకి చూచి ''మీకు తెలిసిన వాళ్ళు ఎవరయినా ఉన్నారా ఆ కంపెనీలో'' అడిగింది.

''చాలామంది ఉన్నారు, మీరొక్కరూ తప్ప. ఇప్పుడు మీరు కూడా ఉంటారు. ఇక్కడంతా భారతీయులే కదా పని చేస్తున్నది. ఒక్కసారి వాళ్ళంతా ఇండియాకి తిరిగివెళ్ళిపోతే అమెరికాలో సాఫ్ట్‌వేర్ కంపెనీలు ఎత్తెయ్యాలి.'' అన్నాడు.

''వావ్! ఇది నిజమా ? ఏమయినా నాకు భారతీయులతో పెద్దగా ర్యాపో లేదు. ఇదిగో ఇప్పుడిప్పుడే మీతో కొంత మంచి ర్యాపో ప్రారంభమవుతోంది. చాలా సంతోషంగా ఉంది.'' అని ఒక్కసారి పక్కున నవ్వింది.

''పైగా ఇక్కడకు వచ్చిన భారతీయులెవ్వరూ కూడా ఇండియా వైపు చూడరు. ఏముందని ఇండియాకి వెడతారు. అదో పెంటకుప్ప. డర్టీప్లేస్, ఏదో సరదాగా ఫన్‌కోసం వెళ్ళాలంతే. అది నివాసయోగ్యమైన దేశం కాదు. అదే కాదు చాలా దేశాలున్నాయి ఆమాదిరిగా. ముఖ్యంగా అరబ్ దేశాలు. ఆడవాళ్ళు ముసుగులేసుకుని తిరుగుతారు. అటువంటి దేశాలంటే నాకు చాలా అసహ్యం'' అంది ఒక ఏహ్యాభావంతో.

''మీరెప్పుడయినా ఆదేశాలని చూచారా'' అడిగాడు.

''చూడనవసరం లేదు. న్యూస్‌పేపర్లు చెబుతున్నాయిగా. నాకు అమెరికా, యూరప్ తప్ప మరేదేశం నచ్చదు.'' అంది.

''మీరు చాలా పొర పడుతున్నారు. ఆ దేశాలు, వాటి పరిస్థితులు,వారి పద్ధతులు, సాంస్కృతిక, సామాజిక, చారిత్రిక మార్పులు అన్నీ మనం తెలుసుకోవాలి, అర్థం చేసుకోవాలి. అందులో ఒక ఆనందం ఉంది. ప్రతి మనిషికి ప్రతి జాతికి, ఒక

అయిడెంటిటీ ఉంటుంది. అది మనం గ్రహించి అర్థం చేసుకుని జీవితాలు గడుపుకోవాలి. ఒకరి సహాయం మరొకరికి కావాలి. ఎన్నెన్నో నేర్చుకోవాలి'' అని ఒక్కసారి అగి ఉపిరి పీల్చుకుని సంగీతకేసి చూచాడు.

సంగీత పెద్దగా పట్టించుకున్నట్లు కనపడలేదు.

'పాపం! అమాయకురాలు ఇంకా చిన్నది, కొంతకాలం పడుతుంది' అని ఒక్కాసారి జాలిగా చూచాడు అనంతం.

ఒక్కసారి చివాలున లేచి వాచీకేసి చూచి ''మనం బయలుదేరుదామా'' అంది.

''నాకేం అభ్యంతరం లేదు. ఇక్కడే ఉండిపోదాం అన్నా, లేక వెళ్ళిపోదాం అన్నారెడియే. ఎందుకంటే పొట్ట బరువెక్కిపోయింది. కాస్సేపుంటే ఇక్కడే నిద్రపోతానేమో ననిపిస్తోంది.'' అన్నాడు

''నా చెయ్యిపుచ్చుకుని లేవండి'' అంది.

ఆమె చెయ్యినాధారంగా చేసుకునిలేవబోయాడు. అతని బరువుకి ఆపుకోలేక ఒక్కసారి అతని మీద పడింది. ఏదో తెలియని అనుభూతి కలిగింది. తన జీవితంలో ఎప్పుడు జనగని సంఘటన సంభవించింది. ఆమె అనంతాన్ని గట్టిగా అదుముకుంది. అనంతం ఆమె నుంచి బయటపడలేక ఆలాకాస్సేపు స్థంబించిపోయాడు. ఆమె అనంతంకేసి చూచి నవ్వింది. అనంతం కూడా ఒక నవ్వు నవ్వి ఆమె కౌగిలోంచి బయటకు రావాలని ప్రయత్నించలేక కాస్సేపు ఆలా ఉండిపోయి క్షణికం పాటు ఈ లోకంలో లేడు. ఒక్కసారి తేరుకుని, కొంచెం వెర్రిమోహం వేసి ఒకవెర్రి నవ్వునవ్వాడు.

''క్షమించాలి నాకు తెలుసు మీరు నన్ను లేవనెత్తలేరని. కాని తప్పక మీ సహకారం కోసం ప్రయత్నించాను. మీరే నా సహకారం కోరుకుంటున్నారని తెలుసుకున్నాను'' అని కష్టపడి నుంచుని చెయ్యిచాచాడు.

ఆమె అతని చెయ్యిగట్టిగా పట్టుకుంది, పైకిలేవనెత్తాడు.

''చూచారా! మేల్‌డామినేషన్ అంటే ఇది. ఎందుకు ఒలింయ్‌పిక్స్‌లో ఆడవాళ్ళకు వేరు మగవాళ్ళకు వేరుగా ఉంటాయి ఆటలు. ఆడవాళ్ళు శారీరకంగా మొగవాళ్ళతో పోలిస్తే అల్పంగా ఉంటారు'' అన్నాడు.

ఒక్కసారి చిలిపిగా చూచి అనంతం చెయ్యిగట్టిగా పట్టుకుంది.

ఇద్దరూ కారులో కూర్చున్నారు. ఎవరి ఊహాలోకంలో వారు తేలిపోతున్నారు.

కారు జోరుగా హుషారుగా నడుస్తోంది.

# 7

ఆ రోజు ఇండియా కల్చరల్ సెంటర్ రాంబాబు పెళ్ళి రిసెప్షన్‌తో కిటకిట లాడుతోంది. అందులో ఎక్కువ మంది తెలుగువారు, మిగతాజనం భారతంలో వివిధ రాష్ట్రాలవారు, తతిమావారు అక్కడక్కడ తెల్ల,నల్ల దొరలతో నిండివుంది ఆ హాలు.

వీరిలో చాలామంది రాంబాబు స్నేహితులు, మరికొందరు జానకి రామయ్యగారికి అంతరంగికులు.

జానకిరామయ్య గారు, సీతాలక్ష్మిగారు, అనంతం హడవిడిగా తిరుగుతూ వచ్చేవారిని ఆదరంగా ఆహ్వానిస్తున్నారు.

రాంబాబు, అతని భార్య లత దండలతో నిండుగా ఎంతో అందంగా అమర్చబడిన సింహాసనాల మీద కూర్చుని వున్నారు. వచ్చిన వారిని జానకి రామయ్యగారు, సీతగారు, రాంబాబు అతని భార్యను పరిచయం చేస్తున్నారు.

ఎంత తెలుసున్నా పాత స్నేహితులను క్రొత్తగా ఒక క్రొత్త అనుభవంతో కలుసుకోవటంలో ఒక ఉత్సాహముంటుంది. అందులోనూ, తన భార్యని డాక్టర్‌గా పరిచయం చెయ్యటంలో చాలా ఆనందం పొందుతున్నాడు రాంబాబు.

''రాంబాబు చాలా అదృష్టవంతుడు. భార్య ఎమ్. బి. బి. ఎస్. అందులోనూ

యు.ఎస్.ఎమ్.ఎల్.ఇ.' పరీక్షల్లో ఎంతో మంచి ర్యాంకులో ఉత్తీర్ణమయింది. రాంబాబు డబ్బులు లెక్కపెట్టుకుంటూ కూర్చోవచ్చు.'' అని కొందరు అను కోవటంతో ఆహాలు గింగిర్లెత్తిపోతూంది.

ఒక మూల రాంబాబు సంతోషానికి అంతులేకుండావుంది. మారో మూల కొంత మనస్సులో అంతో, ఇంతో ఇన్ఫిరియారిటీకాంప్లెక్స్ కూడా కొంచెంగా తొంగి చూస్తోందనిపిస్తోంది.

''తంతే బూరెలగంపలో పడ్డాడయ్యా రాంబాబు'' అని కొంత క్లోజ్‌గా వున్నవారు అనుకోవటం కూడా విన్నాడు.

ఇంక పదిరోజులలో రాంబాబు పెళ్ళి రిసెప్షన్ పార్టీ వుందనగా, జానకిరామయ్య గారింట్లో జానకిరామయ్య గారు, సీత గారు, రాంబాబు, అతని భార్యామణి లతలతో ఒక సమావేశం జరిగింది. దానికి అనంతం కాన్ఫరెన్సులతో మునిగితేలుతూ రాలేక పోయాడు.

''ఒద్దండీ! బాబూ! నేను ఇంతమందిని భరించలేను. ఏదో కొంతమంది మనకి చాలా క్లోజ్‌గా వున్న తెలుగువారినే పిలుద్దాం.'' అని రాంబాబు మొరపెట్టుకున్నా విన లేదు జానకిరామయ్య దంపతులు.

''రాంబాబూ ! నువ్వు అలావూరికే నిలబడు అంతా మేం చూసుకుంటాం. ఎక్కడో విశాఖపట్నంలో పెళ్ళి చేసుకుని గుట్టుచప్పుడు కాకుండా అమెరికా వచ్చి కాపురం పెడితే ఎవరికి తెలుస్తుంది.'' అన్నారు సీతగారు.

''కార్డ్లు వేశాంకదండీ! ఇంకెందుకీతంతు.'' అని రాంబాబు మొరపెట్టుకున్నా వినిపించుకో లేదు జానకిరామయ్య గారు.

''రాంబాబు! నువ్వు మా అబ్బాయిలాంటివాడవు. నీ పెళ్ళి అంటే మా అబ్బాయి పెళ్ళిలా అనుకుంటాం మేము. మేం ఎలాగు నోచుకోలేదుగా. పిల్లలు

వుండి ఏం లాభం. నీకు తెలుసుగా వాళ్ళు అమెరికాలో పుట్టి పెరిగిన వాళ్ళు. వాళ్ళ ప్రవర్తన మా చెప్పు చేతల్లో లేదు. అందుకని మా ఆనందానికి అడ్డురాకు. డబ్బు గురించి నువ్వు బాధపడకు అంతా మేమే భరిస్తాం. మహాఅయితే ఎంతవుతుంది ఈ రిసెప్షన్‌కి'' అని ఎంతో అప్యాయంగా బ్రతిమాలి రాంబాబుని ఒప్పించారు. ఆ ఆదర్శ దంపతులు.

రాంబాబుకు పట్టలేని సంతోషం కలిగింది. వారి అప్యాయతకి ఏమీ మాట్లాడలేకపోయాడు.

''పైగా నీ భార్య డాక్టరు, రేపోమాపో ఆ అమ్మాయి ర్యాంకు చూపించి ఏ హాస్పిటల్‌ల్లోనో రెసిడెన్సీ చేస్తుంది. అది అయ్యాక ప్రాక్టీసు పెట్టిందంటే ఇక్కడి ఇండియన్ జనాభాకి తెలవాలి కదా! ఇది కొంత వరకు పబ్లిసిటీ కూడా అవుతుంది''. అని ఒకటేపోరు పెట్టరా దంపతులు.

''ఈ ఊళ్ళో ఇంతమంది తెలుగు వాళ్ళున్నారన్న మాటేకాని ఒక్క తెలుగు లేడీ డాక్టరు కూడా లేదు. ఏదో ఇదంతా పబ్లిసిటీ దృష్టితో ఇస్తున్న పార్టీ అనుకోకు. కొంత వరకు అది కూడా అవసరమే. నువ్వేం మాట్లాడకు'' అని ఎన్నోసార్లు చెప్పి ఒప్పించవలసి వచ్చిందా దంపతులు.

''అయ్యో! నా పెళ్ళి పార్టీకి మీరు డబ్బు ఖర్చు పెట్టుకోవడం నాకిష్టం వుండదు. నేనే భరించాలి. ఆ పద్ధతిలోనయితేనే ఒప్పుకుంటాను'' అన్నాడు రాంబాబు.

''అయితే! మా స్నేహితులను మేం పిలుచుకోనక్కరలేదన్న మాట. నీ ఇష్టం. మేం పట్టించుకోనవసరం లేదంటున్నావన్నమాట. అంతేనంటావా'' అన్నారు.

రాంబాబు ఏం మాట్లాడలేక పోయాడు.

''అయితే మీ ఇష్టం, ఒక్క షరతు, మనం ప్రస్తుతం షేర్ చేసుకుందాం ఖర్చు . ఆ తరువాత జమా ఖర్చులు లెక్క పెట్టుకోవచ్చు.'' బ్రతిమాలి ఒప్పించాడు రాంబాబు ఆదంపతులను.

ఆవూళ్ళో జానకిరామయ్య గారు, సీతలక్ష్మిగారు అంటే భారతీయులలో

తెలియని వారులేరు. వీరిని చాలా మంది ''స్ట్రీట్‌స్మార్ట్స్'' అంటూంటారు. ఆవూళ్ళో ఎక్కడ ఏకార్యం జరిగినా వీరి హడావిడి ఎక్కువగా వుంటుంది.

''నాకు మాత్రం ఈ ఊరిలో భారతీయులను కలవాలని వుండదా? నేను ఏది ఏమయినా అందరినీ కలవదలుచుకున్నాను. ఆమాత్రం సామాజిక దృష్టిలేకపోతే ఎలా? డాక్టర్లు రకరకాల వారిని కలుస్తుంటారు. విశాఖపట్నంలో నాకెంతో మంది స్నేహితులున్నారు. ప్రొఫెషనల్‌గా కూడా నేను అందరిని కలుసుకోవలసిన బాధ్యత కూడా వుంది. రాంబాబు! తప్పులేదు, మనం అందరినీ కలుద్దాం.'' అని ఆ దంపతులతో శృతికలిపింది రాంబాబు భార్య డాక్టరు లత.

''రాంబాబు! నువ్వు ఎంత కన్సర్‌వేటివ్ అయినా తప్పదయ్యా భార్యామణి ననుసరించటం. మీరిద్దరూ ఒకర్నొకరు అర్థం చేసుకుని హాయిగా సుఖంగా వుండాలని మీ తల్లిదండ్రులక, మీ ఫ్యామిలీకి ఇండియాలో సహాయం చేస్తూవుండాలని మేం దీవిస్తున్నాం'' అని ఆ దంపతులు రాంబాబు నోరుమూయించారు.

''నేనిప్పుడు ఎంతో హాయిగా తృప్తిగా వున్నాను. నేను ఇండియాలో మా అమ్మ, నాన్న దగ్గిర వున్నట్టుగా వుంది. నాకు జానకిరామయ్య అంకుల్, సీత అంటీ నా తల్లిదండ్రుల వంటి వారనుకుంటాను,'' అని ఎంతో తృప్తిగా అంది లత.

ఒక వెర్రినవ్వు నవ్వి ''అయ్యా! మహాత్మా! మీ దయ మా ప్రాప్తి. నాకు ఇప్పుడు ఎంతో హాయిగా వుంది. లత హాయిగా వుంటే నాకు తృప్తిగా వుంటుంది. మీ ఇష్టం నేను దేనికీ అడ్డంరాను అన్నాడు రాంబాబు కొంత తృప్తిగానే.

''ముఖ్యంగా ఈ ఊళ్ళో మన ఇండియన్ డాక్టర్‌లందరినీ పిలుస్తాం. వాళ్ళే కాదు, ఈ వూళ్ళో హాస్పిటల్‌లోవున్న హెడ్స్‌ని కూడా పిలుస్తాం. నాకు తెలియకపోయినా డాక్టర్ మురళీ కృష్ణకి తెలియని డాక్టర్లు లేరీవూళ్ళో. మన అమ్మాయి లతని అందరికీ పరిచయం చెయ్యాలి. ఆ పని మురళీకృష్ణకి అప్పచెబుతాను. రెప్పొద్దున్న లత రెసిడెన్సీ చెయ్యటం ఆరంభిస్తే ఎక్కడెక్కడికో విసిరిపారేస్తారు. సాధ్యమయినంతవరకు ఈవూళ్ళోనో, మహా అయితే ఈ వూరు చుట్టు ప్రక్కల హాస్పిటల్స్‌లోనో పని చేసేట్టు చూడగలం. మురళీకృష్ణ సహాయం ఎంతయినా అవసరం. నీకెందుకయ్యా మేం చూసుకుంటాం కదా'' అన్నారు జానకిరామయ్యగారు. రాంబాబు వీపు తట్టి.

''అంకుల్! ఆంటీ! మేం ఉత్తబొమ్మల్లా అలంకరించుకొని కూర్చుంటాం. అంతా మీరు చూసుకుంటే మాకేం కావాలి. నేను ఎంతో హాయిగా ఫీల్ అవుతున్నాను.'' అంది లత ఎంతో సంతోషం కనపరుస్తూ.

లతని చూచి ఎంతో ఉప్పొంగి పోయాడు రాంబాబు.

''అమ్మాలతా! అంతా మనం చూసుకుందాం.'' అన్నారు సీతాలక్ష్మి గారు.

''వచ్చే వారిలో రకరకాల మనుషులు, రకరకాల భావాలు కలవారు వుంటారు. మనం వారందరినీ సంతోషపరచాలి. మనం శాఖా హారులయినంత మాత్రాన వచ్చిన వారంతా శాఖాహారులుగా భావించరాదు. ఆ హాలు పెద్దది. రెండు రకాల భక్ష్యాలు అమర్చాలి. శాఖాహారులకి ఒక ప్రక్క మాంసాహారులకు మరొక ప్రక్క'' అంది లత.

రాంబాబు లత చురుకుతనానికి తెల్లమొహం వేస్తూ సంతోషించాడు.

''నువ్వు చాలా కరెక్టుగా చెప్పావమ్మా! అలాగే చేద్దాం, కాని ఈ పద్ధతి భారతంలో చేస్తూంటారు. అందుకని నువ్వు అలా అంటున్నావు నాకు తెలుసు. కాని ఇక్కడి పద్ధతి అది కాదు సుమా!'' అన్నారు సీతాలక్ష్మి గారు నవ్వుతూ.

''ఇక్కడెలా వుంటుంది'' అడిగింది లత.

''మాంసాహారం, శాఖాహారం కలిసేవుంటుంది. ఎవరినీ నొప్పించ కూడదుగామరి. ఇహపోతే, వట్టి సాఫ్ట్‌డ్రింక్సు పెడితే చాలదు. ఎందుకంటే నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు తీర్థాలు పుచ్చుకునే అలవాటుంటుంది. ఇండియాలో వున్నప్పుడు ఈ అలవాటు ఒకవేళ లేకపోయినా ఇక్కడికొచ్చాక కొందరు మొదలు పెడతారు. మొదట్లో పుచ్చుకోక రానురాను పుచ్చుకోవటం తప్పదు అనుకుని మొదలు పెట్టే వారుంటారు. ఇక్కడ దొరికింది కదా అని మొదలు పెట్టే వాళ్ళుంటారు. 'బి ఎ రోమన్ ఇన్ రోమ్' అనుకునే వాళ్ళు ఎక్కువగా వుంటారు. భారతంలో స్వచ్ఛమైన శాఖాహారులు ఇక్కడి కొచ్చి స్వచ్ఛమైన మాంసాహారులుగా మారిన వారి సంఖ్య చాలా ఎక్కువ. అదే మాదిరిగా భారతంలో టీటోటలర్‌లు ఇక్కడి కొచ్చిమారిపోతారు. ఈ భూమిలోనే వుంది మహత్యం. భారతం కర్మభూమికదా.'' అని ఓ పెద్ద నవ్వునవ్వారు సీతాలక్ష్మి గారు.

ఆమెను చూస్తూ ఎంతో ఆనందపడిపోయారు జానకి రామయ్య గారు.

''మరి మీకా అలవాట్లు ఏమీ కాలేదా?'' అంది లత

''అందరూ అలా వుంటారనుకోకు లతా! వీరు ఈ ఊళ్ళో ఆదర్శదంపతులు. ఇదే కాదు. ఎంతమంది తల్లిదండ్రులను ఇక్కడికి తెచ్చుకుని సేవ చేస్తారు చెప్పు.'' అన్నాడు రాంబాబు ఎంతో ఇదిగా.

''అయితే అంకుల్! అందరికీ నచ్చే విధంగా మనం కూడా మీట్, తీర్థాలు కూడా అరేంజ్ చేద్దాం,'' అంది లత ఎంతో చురుకుదనంతో.

రాంబాబు నోరు వెళ్ళబెట్టి లతకేసి కనురెప్ప వెయ్యకుండా అలా చూస్తుండి పోయాడు.

''లత చాలా చురుకయిన పిల్ల, ఎంత లేదన్నా డాక్టరు కదా! రకరకాల వాళ్ళను చూస్తూంటుంది ఇండియాలో. ఇక్కడ కూడా రకరకాల మనుషులని తెలుసుకోవటం మంచిది. రేపు ప్రాక్టీసు పెడితే ఏదీ క్రొత్తగా వుండకూడదు'' అన్నారు సీతాలక్ష్మిగారు లత వీపుని తడుతూ.

''ఇహపోతే మ్యూజిక్ పార్టు. రకరకాల మనుషులకు రకారకాల మ్యూజిక్ ఇష్టంగా వుంటుంది.'' అన్నారు జానకి రామయ్యగారు.

''ఉన్నాడుగదా మీ ప్రియశిష్యుడు అనంతం! అతనికప్పచెప్పండి. అతని దగ్గిరున్న సి.డి.లు, క్యాసెట్లు, ఈ ఊళ్ళో ఎవరి దగ్గిరా లేవు. అతనే చూసుకుంటాడు ఒదిలెయ్యండి అతనికి'' అన్నాడు రాంబాబు.

''చంపావ్ పో! అనంతానికి మ్యూజిక్ పార్టు ఒదిలితే మొత్తం అంతా హాలు ఖాళీచేసి భోజనం కూడా చెయ్యకుండా పారిపోతారు. ఒక్క మురళీ కృష్ణతప్ప'' అన్నారు సీతగారు పకపకా నవ్వుతూ.

''అలా అంటారేం ఆంటీ'' అంది లత.

''నీకు తెలియదమ్మా, అనంతం దగ్గిరున్నవన్నీ శాస్త్రీయ సంగీతానికి సంబంధించిన పాటలే. అక్కడే కూర్చుని ఆ కర్ణాటకం, ఆ హిందూస్థానీ సంగీతం పాటలు పెట్టి ఏ పనీ చెయ్యకుండా అక్కడేవుండి పోతాడు'' అన్నారు సీతగారు.

''అనంతాన్ని గేటు దగ్గిర నుంచో బెట్టి ఒక అత్తరు బాటిల్ ఇచ్చివచ్చిన వారందరి మీద జల్లమని చెబుదాం'' అని పొట్టపగిలేట్టునవ్వారు జానకిరామయ్య గారు.

''గేటు దగ్గిర అనంతాన్నినుంచోబెట్టటమేటండీ, అక్కడ ఎవరయినా మంచి మంచి పెళ్ళికావలసిన అమ్మాయిలను నుంచో పెడితే బావుంటుంది.'' అన్నారు సీత గారు.

''మన 'మంచిబాలుడు' అనంతం కూడా వుండాలి సీతా! నలుగురికీ తెలిసిన వ్యక్తి గదా! పోని ఇంకా ఎవరయినా అమ్మాయిలను కూడా నుంచోమని చెబుదాం. అనంతం కూడా పెళ్ళి కావలసిన వాడుకదా. అప్పుడు మంచి రంమ్‌జుగా వుంటుంది '' అన్నారు జానకి రామయ్య గారు అనంతం మీద ఏం జోకులు వెయ్యాలా అని ఆలోచిం చుకుంటూ.

''మీరూరుకోండీ. మీరు మరీను, అమ్మా! లతా! మీ పెళ్ళికి రాలేకపోయినా మేం మీ పెళ్ళి రిసెప్షన్ ఎంతో ఏంజాయ్ చెయ్యదలుచున్నాము.'' అన్నారు సీతగారు.

''మరి మ్యూజిక్ పార్టు ఏం చేశారు?'' అన్నాడు రాంబాబు.

''ఎందుకు అంత వర్రీ అవుతావ్? నేను చూసుకుంటాను'' అన్నారు జానకిరామయ్యగారు.

''అయ్యా! మహాత్మా! నాకు తెలుసు మీకొదిలేస్తే ఏమవుతుందో. మీరు జనాలికి ఒదిలేస్తారు. ఇంక వాళ్ళిష్టమొచ్చినట్లు ఎవరికి వాళ్ళు వాళ్ళకు తోచిన పాటలు వేసుకుంటూ డ్యాన్సులు కూడా చేస్తారు. బాబోయ్! నేను భరించలేను.'' అన్నాడు రాంబాబు చాలా వర్రీడ్‌గా.

''రాంబాబు! నేను ముందే చెప్పాను రకరకాల వారు వస్తారని. తీర్థం పుచ్చుకుంటూ భోజనం చేస్తూవున్న వారిని అడ్డం పెట్టలేం. వీరంతా నాగరికత కలవారే. నీకింకా పోలేదు కొన్ని కొన్ని జుగుప్సలు. నేను కొన్ని ఏళ్ళుగా నీకు చెబుతున్నా తెలియ టం లేదు. పోనీ! ఎవరి సంతోషం వారిది. నువ్వెప్పుడు ఏ పార్టీకి రాకపోవడం వల్ల ఇంకా ఆ ఇన్‌హిబిషన్‌లోంచి నువ్వు పైకి రాలేదు. తప్పేముంది. వారి వారి సంతోషం ప్రకారం కానీయ్'' అన్నారు జానకి రామయ్య గారు నవ్వుతూ.

``అంకుల్! మీరు చాలా బ్రాడ్‌మయిండ్ కలవారు. మీరు, ఆంటీ కూడా అలా తామరాకుమీద నీటి బొట్టులా అంటీముట్టనట్టువుంటూ ఇంతకాలంగా ఈ అమెరికా జీవితం ఏంజాయ్ చేస్తున్నారంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. మీకు హ్యాట్‌సాఫ్`` అంది లత.

రాంబాబు లత వంక చూచి మూలుగుతూ నవ్వాడు.

సీతగారికి నవ్వాగలేదు.

``ఒకపని చేద్దాం రాంబాబు. అక్కడ మూడు పెద్దహాల్స్ వున్నాయి కదా. ఒక హాల్లో భోజన ఏర్పాట్లు, అదే బఫే ఏర్పాటు చేసి, ఆదే హాల్లో తీర్థాలకి కూడా ఏర్పాటుచేసి, రెండో హాల్లో భారతీయ శాస్త్రీయ సంగీతం, మూడోహాల్లో పాశ్చాత్య సంగీతానికి ఏర్పాటు చేద్దాం, ఎలావుంది ఐడియా ?'' అన్నారు సీతగారు.

``బ్రహ్మాండంగా వుంది. మరి మన పెళ్ళి దంపతులు ఏ హాల్లో వుంటారు.'' అడిగారు కొంచెం కొంటెగా సీతగారి కేసి చూచి జానకి రామయ్యగారు.

``నేను చాలా సీరియస్‌గా చెబుతున్నాను మీరు కొంచెం జోకుబుద్ధిమాని వినండి, ఆ మొదటి రూం వుందిగా అదేం చిన్న రూమేం కాదు, హాలుకిందే లెక్క. అనంతం ఆడపిల్లలతో నుంచుని వుంటాడు రిసెప్షన్ దగ్గర, ఆ ప్రక్కనే వేస్తాం రెండు బ్రహ్మాండమయిన విక్రమార్కుని సింహాసనాలు`` అన్నారు ఎంతో సంతోషంగా లతకేసి చూస్తూ సీతగారు.

``అయితే రాంబాబుకు లోపల హాల్లో ఏం జరుగుతోందో తెలియదన్న మాట. బ్రతికాడు అన్నారు`` జానకిరామయ్య గారు వెక్కిరింతగా.

``మీరున్నారుగా! అందరినీ పలకరిస్తూ తిరుగుతుంటారు. నేను తిండి ఏర్పాట్లు చూసుకుంటాను'' అన్నారు సీతగారు.

``నాకు కూడా లోపలేం జరుగుతూంటుందో చూడాలని వుంటుంది ఆంటీ``!

అంది లత.

''అలాగే, ఒకసారి నువ్వు కూడా అలా అన్ని హాలులన్నీను తిరిగి అందరిని పలకరిస్తూండు అప్పుడప్పుడు'' అన్నారు సీతగారు.

''నువ్వు వెళ్ళితే వెళ్ళుగాని నేను రాను. అనంతం, నేను కబుర్లు చెప్పుకుటూంటాం అన్నాడు రాంబాబు

అంతా ఒక్కసారి గొల్లుమన్నారు.

''ఆఖరిసారిగా చెబుతున్నాను, ఇప్పుడు మనం ఖాయం చేసిన పద్ధతిలో నడుపుదాం పార్టీ ప్రోగ్రాం, సీతా! నువ్వు,లతా చూసుకోండి మెనూ. ఓకే! రాంబాబు'' అని జానకి రామయ్యగారు రాంబాబుని మెప్పించి ఒప్పించి ఏర్పాటు చేసిన పార్టీ ఇది.

సాయంకాలం ఆరున్నరకావస్తోంది. జంట జంటలుగా కార్లు పార్కు చేసుకుని దిగుతున్నారు అతిథులు.

''నాకు తెలుసు జానకి రామయ్య ఇక్కడ ఒక చిన్న భారతం క్రియేట్ చేస్తాడని,'' అంటూ భార్య అచ్చమ్మగారితో లోపలికొస్తున్నారు భమిడిపాటి.''

అనంతం జల్లిన అత్తరులో ముంచెత్తిపోతున్నారు జనం.

''హల్లో! హల్లో! హల్లో! స్వాగతం! సుస్వాగతం'' అంటూ జానకిరామయ్య గారు ఆహ్వానించారు.

రాంబాబుకి షేక్‌హాండ్ ఇచ్చి తరువాత లతచెయ్యి పుచ్చుకొని వూపేస్తూ ''కంగ్రాట్యూలేషన్స్ ! మా వూరికి ఒకే ఒక లేడీ డాక్టర్ ఆంధ్రావనినుంచి అవతరించింది.'' అని హాలు మ్రోగిపోయేట్టు నవ్వాడు భమిడిపాటి.

''అమ్మా లతా ! ఈయన ఎవరనుకున్నావ్ 'ఆటా' (అమెరికన్ తెలుగు ఎసోసియేషన్) జనరల్ సెక్రెటరీ డాక్టర్ భమిడిపాటి, ఈమె వారి సతీమణిగారు'' పరిచయం చేశారు జానకిరామయ్య గారు.

భమిడిపాటి గ్లాస్కోపంచి సిల్కులాల్చీలో వున్నారు. వెలకట్టలేని ఇండియా నుంచి తెచ్చుకున్న పట్టుచీరలో మునిగిపోయి, భారతీయ వజ్రాలు, వైఢూర్యాలతో పొదిగిన స్వచ్ఛమైన బంగారు కట్టడాలతో అలంకరించుకొని మిలమిల మెరిసిపోతూ, కిలకిలా నవ్వుతూ ఆమె తెచ్చిన పెద్ద సయిజు గిఫ్టు ప్యాకెట్‌నందిస్తూ లత తలనిమురుతూ దీవించారు మిసెస్ అచ్చమ్మా భమిడిపాటి.

ఇంత వరకూ ఇండియాలో ఏ గుడిలోనూ ఇంత ఆలంకరణతో చూచి ఎరుగదు లత ఏ అమ్మ వారిని. అలా, ఆమెకేసి చాలా విడ్డూరంగా చూస్తూ నవ్వుతూ వుండిపోయిం ది లత !

''ఇలా దయచేయండి !'' అని కూడాతీసుకెళ్ళారు ఆదంపతులను జానకిరామయ్య గారు.

లోపల హాల్లో సంగీతాలు మ్రోగిపోతున్నాయి. జనాలు చాలా హడావిడి పడుతున్నారు.

హాల్సు హాహాకారాలతో వెలకట్టలేని పట్టుచీరల కస్సు బుస్సు చప్పుళ్ళతో, ఘల్లు, ఘల్లు మంటున్న బంగారు సంకెళ్ళ శబ్దాలతో పట్టరాని జోకులతో, శాస్త్రీయ, కర్ణాటక, పాశ్చాత్య సంగీతాలతో మారుమ్రోగిపోతున్నాయి.

అక్కడక్కడ కుర్రాకారు అమ్మాయిలు, అబ్బాయిలు చాలాక్లోజుగా ఒకరి చేతులు ఒకళ్ళు పట్టుకుని వాళ్ళ గోడవల్లో వాళ్ళున్నారు.

రిసెప్షన్‌లో వున్న అమ్మాయిలు అనంతం చుట్టూ చేరి ఏమిటేమిటో మాట్లాడుతున్నారు.

అంతా గమనిస్తూ అలా నవ్వూతూ వుండిపోయాడు. రాంబాబు

''ఇతనో పెద్ద పొలిటిషియన్'' అన్నాడు రాంబాబు లతతో. భమిడిపాటిని చూపిస్తూ

పట్టించుకోలేదు లత.

''ఆవిడేమిటండీ ఆవిడ అమ్మవారిలా తయారయింది'' అంది లత.

''అప్పుడే ఏమయింది. ఇంకా చూస్తావ్ లక్ష్మి, పార్వతి, సరస్వతిని. వీళ్ళని చూచి 'రవివర్మ' తల వంచుకోవాలి.'' అన్నాడు రాంబాబు.

అర్థం కాలేదు లతకి

ఇదంతా అదో ప్రపంచంలావుందామెకు. ఇండియాలో ఎన్నో పార్టీలు చూసింది కాని ఇంత విడ్డూరమయిన వారు ఎప్పుడూ తటస్థపడలేదు.

అప్పుడే వస్తున్నారు కొమ్మినేని, వారి సతీమణి. జానకి రామయ్యగారు చాలా హడావిడిగా వెళ్ళి వారిని రీసివ్ చేసుకుని క్రొత్త దంపతులకు పరిచయం చేశారు.

లతకి కొంచెం అలవాటవటంతో ఒక మహాలక్ష్మిని చూచినట్టయింది ఒక్కసారి మిసెస్ కొమ్మినేనిని చూడగానే

''ఈయన డాక్టరు కొమ్మినేని, ఈమె వారి సతీమణి. ఈయన 'తానా' ( తెలుగు ఎసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా) కి రీజినల్ సెక్రటరీ. ఈయన ఆంధ్రావని చీఫ్ మినిష్టర్ గారికి చాలా క్లోజ్. ఇండియాలో వీరికో పెద్ద ప్లాస్టిక్ ఇండస్ట్రీ వుంది. వారానికొకసారి హైదరాబాద్ వెడుతుంటారు. ఈయన్ని పట్టుకోవటం మహాకష్టం మన అదృష్టవశాత్తు ఈ వారం ఇక్కడ వుండటం జరిగింది.'' అని ఎంతో ఇదిగా పరిచయం చేశారు జానకిరామయ్య గారు కొమ్మినేని దంపతులను.

''హేయ్ దేర్ !'' అని ఒకషేక్ హేండ్ ఇచ్చారు కొమ్మినేని రాంబాబుకు.

''మాకుకావలసిన డాక్టరమ్మ వచ్చిందిన్నాళ్ళకు'' అని మిసెస్ కొమ్మినేని ఒక్కసారి లతని గట్టిగా హత్తుకుంది. బంగారు కడ్డీలు గుచ్చుకున్నాయి లతని.

మిసెస్ కొమ్మినేని ఒక బుల్లి ప్యాకేట్ అందచేసింది లతకి.

''రండి! రండి మీకోసం ఎన్నెన్నో రకారకాల రుచులతో చేసిన వంటకాలు, తీర్థాలు ఎదురు చూస్తున్నాయి.'' అని కూడా వెంట బెట్టుకుని వెళ్ళారు జానకిరామయ్య గారు.

"ఇలాగే పెద్దరాజకీయవేత్త. ఓ పెద్ద సాంప్రామికవేత్త కూడా. 'ఆటాకి'. 'తానాకి' మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. పిక్కు ప్రసక్త పదము. వాళ్ళకే కాదు. వారి సతీమణుల మధ్య వున్నంత పరిటపాటు నాగల పాటు మరెవ్వరికి లేదు. ఈ ఊళ్ళో వీళ్ళు టాప్ చేస్తారు" అన్నాడు రాంబాబు లతతో.

"ఎందులో టాప్ చేస్తారు?" అంది లత

"రవిపద్మతో పోటీ పడటంలో. మహానుభావుడెక్కడున్నాడో కాని. ఆయన కనక వుంటే ఎంతో సంతోషించే వాడు.

"ఎందుకు" అంది.

"ఎందుకేమిటి! ఆయన సృష్టించిన పాత్రలను ఆయన ఊహించినదానికి మించి వున్నాయని" అని పెద్ద నవ్వు నవ్వాడు రాంబాబు.

లతకి అర్థం కాలేదు.

"ఎందుకండి మనకీ పొలిటిక్సు. వాళ్ళువాళ్ళు సుముఖంగా వుంటే చాలు, తెలుగు ఎసోసియేషన్ బాగుంటుంది. పోటాపోటీలుగా ఎసోసియేషన్‌ని బాగుచేసి మంచి మంచి కల్చరల్ ప్రోగ్రాములు పెట్టామని వాళ్ళ ఉద్దేశ్యంకావచ్చు, అనుకోవచ్చుగా" అంది లత.

"లతా! నీకున్న పాజిటీవ్ థింకింగు నాకులేదు, ఎప్పుడో పోయింది. నువ్వు ఇప్పుడే అమెరికాలో కాలు పెట్టావు. ఇప్పుడు నీకున్న ఉద్దేశ్యాలలో మార్పులు రాకుండా వుంటే చాలా సంతోషం. నువ్వొక ఆదర్శసతీమణివి నాకు. 'జానకి రామయ్య గారి దాంపత్యంల్లా వుంటే నాకు చాలా ఆనందంగా వుంటుంది". అని ఒక ఆవేదన ప్రకటించాడు రాంబాబు.

"మనిషిలో పరిస్థితి ప్రభావాలతో మార్పులు రావడంలో ఆశ్చర్యంలేదు. అది సహజం కూడా, అంత మాత్రం చేత ఎవరినీ ఏమనీ అనుకోవలసిన అవసరం లేదు. మనం ఎవరి ఆనందానికి అడ్డుపడకుండా వుంటే చాలు. ఎవరి ఆనందంవారిది." అని ఒక నవ్వు నవ్వింది.

శృతి కలుపుతూ ఒక వెర్రినవ్వు నవ్వి "అమ్మో నువ్వు నాకన్నా నాలుగాకులు ఎక్కువే చదివావు" అన్నాడు.

బయట మరో రోల్సు రోయస్ కారు ఆగింది. మిస్ జూలీతో దిగారు డాక్టరు మురళీకృష్ణ.

కొంచెం ముందుగా వెళ్ళి అనంతం వారికి నమస్కరించి లోపలికి ఆహ్వానించాడు.

''వావ్! డాక్టర్ అనంతం, వాట్ ఏ సర్‌ప్రయిజ్! ఇన్నాళ్ళనుంచి ఏమయ్యావ్, ఎప్పుడో చూశాను. ఫోన్‌లో మాట్లాడుకోవటమే కాని నీ దర్శనమే లేదు. మళ్ళీ ఇప్పుడు చూస్తూన్నాను నీలో ఒక మేధావిని..... వింటున్నాను..... వింటున్నాను, నీక్రెడిన్షియల్స్. నువ్వు చెప్పక పోయినా నాకు తెలుసు, నువ్వు చెప్పుకునే వ్యక్తివి కావు,'' అని అక్కడే నుంచుని అనంతంతో మాట్లాడింది జూలీ.

ఇంతసేపూ వింటూ నుంచున్నాడు డాక్టరు మురళీకృష్ణ సంతోషం ప్రకటిస్తూ,

మురళీకృష్ణ మామూలుగా సూట్‌లో వున్నాడు, జూలీ పట్టు చీరలో వుండి మెరసి పోతోంది. రాంబాబు ఇదంతా గమనిస్తున్నాడు.

''లతా ! ఆవచ్చే అయనే డాక్టరు మురళీకృష్ణ. ఆమె ఆయన కలసి వుంటూంటారు''. అన్నాడు.

''అంటే'' అంది లత.

''భార్యాభర్తల కన్న ఎక్కువగా వుంటూంటారు అన్నాడు''.

''మంచిదేగా'' అంది.

''నీకు తెలియదులే అదో పెద్దకథ'' అన్నాడు,

''పోనిద్దురూ! ఎంత హాయిగా వున్నారు వాళ్ళు. మన అనంతానికి చాలా మంచి స్నేహితులులా వున్నారు'' అంది.

''అవునవును'' అన్నాడు ముభావంగా.

లోపలి నుంచి అంతహడావిడిలోనూ గబగబా బయటకు వెళ్ళి ఆ మురళీకృష్ణ దంపతులను లోపలికి ఆహ్వానిస్తూ వచ్చి లత, రాంబాబులకు పరిచయం చేశారు జానకరామయ్యగారు.

''డాక్టర్ లత''! అన్నారు.

పరిచయాలు జరిగాయి.

లత గురించి అప్పటికే తెలుసు మురళీకృష్ణకు.

''అమ్మాలతా! నీకిక్కడ ఎంతో మంది డాక్టర్లం వున్నాం. ఇక్కడ వున్నంత ఎంకరేజ్‌మెంటు భారతంలో వుండదు. ఇక్కడ మెరిట్‌కి రికగ్నిషన్ వుంటుంది. అక్కడ కులప్రసక్తి ఎక్కువ. అన్నీ రిజర్వేషన్‌లే. నాకు తెలుసు నువ్వు చాలా పెద్ద ర్యాంకు తెచ్చుకున్నావని. మీ బోటి వాళ్ళు ఈ దేశంలో వుండాలి'' అని రాంబాబుకి షేక్‌హేండ్ ఇచ్చి, చెయ్యిగట్టిగా పట్టుకుని లతకేసి చూస్తూ మాట్లాడుతున్నారు మురళీకృష్ణగారు.

జూలీ రాంబాబుతో మాట్లాడుతోంది. ''నువ్వు చాలా అదృష్టవంతుడవు నాయన, మంచి భార్య లభించింది. మంచివాళ్ళకు మంచి వాళ్ళే వస్తారు. దేవుడు నిన్ను కాపాడతాడు'' అని రాంబాబు రెండవ చెయ్యిపట్టుకుంది జూలీ.

అనంతం రాంబాబు కేసి చూచి నవ్వుతున్నాడు. రాంబాబు అనంతాన్ని ఓకంట కనిపెడుతున్నాడు.

''హాలో పలికి పోదామా'' అన్నారు జానకి రామయ్య గారు.

''పార్టీ మేనెజింగ్ డైరెక్టర్ ఎక్కడ'' అన్నారు మురళీకృష్ణ సీత గారిని ఉద్దేశించి

''ఆమె ఆ వంట శాఖ వదిలి రాదు''. అంటూ లోపలికి దారి తీశారు.

జూలీ లతని పట్టుకుంది.

''నువ్వు చాలా సింపుల్‌గా వున్నావు.'నీలో భారతీయత ఉట్టిపడుతూంది. నువ్వు నాకు చాలా నచ్చావ్. రాంబాబు! నువ్వు ఈమెని తప్పకుండా మా ఇంటికి తీసుకురావాలి'' అని నవ్వుతూ ఎంతో హాయిగా మాట్లాడి అందరిని పలికరించుకుంటూ మురళీకృష్ణని అనుసరించింది.

అన్ని గదుల్లోను చాలా మంది వీడియో కెమేరాలు పట్టుకుని తిరుగుతున్నారు. ప్రత్యేకంగా క్రొత్త దంపతుల ముందు రెండు మూడు వీడియో

కెమేరాలు అమర్చారు. పార్టీలో ఏ అంశాన్ని వదలి పెట్టకుండా వుండాలన్న ఆకాంక్షతో వీడియో కెమేరాలుఅమర్చారు సీతగారు.

మురళీకృష్ణతో సంభాషణ లతకి ఎంతో సంతోషాన్నిచ్చింది.

''చూడండి ఆయన ఎంతమంచి వాడో, ఆయిన చెప్పింది, అక్షరాలా నిజం, మెరిట్‌కి ఎక్కడుంది రికగ్నిషన్ ఇండియాలో. పి.జి. కోర్సులో నాకు కావాలసిన సబ్జెక్ట్‌లో సీటు రాలేదు. అన్నీ రిజర్వేషనులే అక్కడ. నాకిప్పుడు చాలా ధైర్యంగా వుంది, గైనకాలజీలో నాకు తప్పకుండా ఛాన్స్ వస్తుందని'' అంది.

లతని చూచి ఒక చిరునవ్వు నవ్వాడు రాంబాబు.

అనంతం, రాంబాబు, లతల దగ్గిరకి వచ్చి కాస్సేపు ఊపిరి పీల్చుకుని ఏదో మాట్లాడుతున్నాడు.

లత పక్కున నవ్వింది.

అనంతం బుగ్గపట్టుకుని ఒకగిల్లుగిల్లి, ''వెళ్ళి అక్కడ నుంచో. పని ఎగ్గొట్టి అమ్మాయిలతో కబుర్లు చెబుతున్నావు. ఇందాకణ్ణించి చూస్తున్నాను, వెర్రి వెర్రి వేషాలెయ్యకు. లతా! నీకు తెలుసా ఈ మహానుభావుడు రేపే వెళ్ళిపోతున్నాడు సనీవేల్ కి వుద్యోగంలో చేరడానికి. అంత అర్జంటుగా వెళ్ళాలా ఇంకా రెండు రోజులు మనతో గడపవచ్చుగదా. పైగా ఇంతమంది అమ్మాయిలు చుట్టూ చేరుతున్నారు. నాకు చాలా భయంగా వుంది. ఏ వలలో చిక్కుకుంటాడోనని, జాగ్రత్తనాయనా జాగ్రత్త'' అని హెచ్చరిస్తూ లతకేసి చూచి గట్టిగా నవ్వాడు రాంబాబు.

''ఎంతో ఫ్యూచర్‌వున్నవాడండి''. ఎంకరేజ్ చెయ్యాలి అందిలత.

''అలా చెప్పండి మనవాడికి'' అని మళ్ళీ గేటుదగ్గిరికెళ్ళి అత్తరు బాటిల్ వూపుతూ నుంచున్నాడు. మళ్ళీ చేరారు అక్కడి ఆడపిల్లలు అనతంచుట్టూ.

అంతా ఇండియాలో వున్నట్లే ఆ ప్రవేశద్వారం ముందు నుంచుని, ఆ పెళ్ళి కాని అమ్మాయిలు, క్రొత్తగా పట్టు చీరెలు మొదటిసారిగా కట్టుకుని జారిపోతున్న పమిటెలు సరి చేసుకుంటూ వచ్చిన వారికి గంధం ఇస్తూ ఒక గులాబి పువ్వు తీసుకోమని ఎంతో ఆకర్షణీయంగా ఆహ్వానిస్తూన్నారు.

అనంతం తన పనిలో నిమగ్నమయి వున్నాడు.

అప్పుడే దిగారు సంగీత, వాళ్ళ అమ్మ కారులోంచి.

ఎందుకో ఒక్కసారి ప్రాణం లేచొచ్చినట్లయి గగుర్పాటు చెందాడు అనంతం.

వారిని ఆహ్వానిస్తూ కారుదాక వెళ్ళాడు.

చేతులు పట్టుకుని ఊపేస్తూ వాళ్ళమ్మకు పరిచయం చేసింది సంగీత. ఒక్కసారి అనంతాన్ని దగ్గిరకు తీసుకుని హత్తుకుని షేక్‌హ్యాండ్ ఇచ్చింది సంగీత తల్లి. అలా మాట్లాడుతూ కాస్సేపు వుండిపోయారు. ఇది కొంచెం వింతగా చూస్తుండిపోయారు అక్కడ రిసెప్షన్‌లో వున్న ఆడపిల్లలు.

''వీళ్ళు ఎలా తెలుసు అనంతానికి'' అన్నట్లు. నోరు వెళ్ళబెట్టుకుంటూ బయటకు చూస్తూండి పోయాడు రాంబాబు.

''ఎవరండీ వాళ్ళు? అక్కడే వుండిపోయారు అంతసేపు అనంతంతో మాట్లాడుతూ? లోపలికి రారేం'' అంది లత.

''వస్తారు,వస్తారు కంగారు పడకు అనంతానికి మంచి స్నేహితులులా వున్నారు,'' అన్నాడు రాంబాబు.

''ఏం మీకు తెలియదా వాళ్ళు'' అంది.

''తెలిసేవుంటుందనుకో, కాని ఎక్కడో చూచినట్లుంది కాని, జ్ఞాపకం రావటం లేదు.'' అన్నాడు.

తల్లి, కూతుళ్ళిద్దరూ చాలా తక్కువగా అమెరికా వస్త్రధారణతో తళతళలాడుతూ మెరిసిపోతున్నారు. వీరికి అందచందాలలో ఒక ప్రత్యేకత వుంది ఆ వూళ్ళో.

ఇంతలో ఎవరో ఒక పంజాబీ జంట దిగింది. ''హల్లో !'' అంటూ ఆహ్వానించాడు అనంతం.

''అనంతం నీ పని చూసుకో మళ్ళీ కలుస్తాం'' అని సంగీత, వాళ్ళమ్మా లోనికి వచ్చారు. అక్కడున్న కుర్రాకారుతో కలిసిపోయింది సంగీత.

''ఒక్కసారి లోపలికెళదాం. క్రొత్త దంపతులను చూద్దాం'' అని లాకెళ్ళింది వాళ్ళమ్మ సంగీతని.

జానకి రామయ్య ''హాల్లో, హల్లో ! వేల్‌కం'' అంటూ అరుచుకుంటూ వచ్చి వారిని లత, రాంబాబులకు పరిచయం చేశారు.

''నీ గురించి విన్నాను, నాకంతా చెప్పాడు మా ఆయన డాక్టర్ మురళీకృష్ణ'' అంది ఆ తల్లి లతని మెచ్చుకుంటూ.

''హాల్లో! ఆంటీ ! మీరా? ఎవరో అనుకున్నాను'' అన్నాడు రాంబాబు.

''నో ప్రాబ్లమ్, గాడ్ బ్లెస్‌యూ'' అంది సంగీత తల్లి.

''హల్లో'' అని పలకరించింది సంగీత కొంచెం ముభావంగా

వారిని వెంటబెట్టుకుని లోపలికెళ్ళారు జానకిరామయ్య గారు.

''ఇప్పుడు తెలిసింది ఈమె మురళీకృష్ణ మొదటి భార్య అని''అన్నాడు రాంబాబు.

''మీకు తెలియదా! ఇన్నాళ్ళ నుంచి వున్నారు ఈ వుళ్ళో'' అంది లత.

''నాకు జానకి రామయ్య గారు, వారి భార్య , ఆనంతం తప్ప మరెవ్వరూ పెద్దగా తెలియదు. ఈ ఎసోసిషన్‌నులు, ఈ మీటింగులు నాకిష్ట ముండవు,'' అన్నాడు ముభావంగా.

''అప్పుడప్పుడు అందరూ కలుస్తుండాలి, సరదాగా గడుపుతుండాలి. ఎక్కడో మాతృదేశం వదులుకొని ఇక్కడికి చేరాం కదా. ఎంతసేపూ ఎక్కడికీ వెళ్ళకుండా ఎవరినీ చూడకుండా మనవృత్తి మీదే దృష్టి పెట్టుకుని గడపటం కూడా కష్టమే'' అంది.

''నీకొకటి తెలుసా! డాక్టర్లకి మాకున్నంత టైమ్ కూడా వుండదు. రేపు నువ్వు ప్రొఫెషన్‌లోకి వెడితే నాకున్న పరిచయాలు కూడా నీకుండవు. అది ఇరవైనాలుగు గంటల వృత్తి . జాగ్రత్త చూసుకో'' అని ఒక హెచ్చరిక చిరునవ్వుతో ఇచ్చాడు.

''అప్పుడు చూసుకోవచ్చు, ఒక్కసారి నాకు లోపలికెళ్ళి ఆ హాలులో ఏం జరుగుతోందో చూడాలిని వుంది. వెళ్ళిరానా?'' అంది.

''తప్పకుండా. తొందరగారా లేకపోతే బావుండదు. వచ్చేపోయే వాళ్ళకు మనం ఇక్కడి నుంచుని దణ్ణాలు పెడుతుండాలి. ఏది నీ భార్య అంటే ఏం చెప్పను,'' అని కొంచెం ఆదుర్దా చెందాడు రాంబాబు.

''ఇప్పుడు వెళ్ళారే వాళ్ళని ఒక్కసారి కలుస్తాను. ఆ అమ్మాయి చాలా అందంగా ఎంతో నమ్రతగా, మితభాషిలా కనిపిస్తూంది'' అంది.

''ఆ అమ్మాయే డాక్టరు మురళీకృష్ణ కూతురు. ఆ తల్లి ఆయన మొదటి భార్య'' అన్నాడు.

''మరి ఆ జూలీ'' అంది లత.

''అదో కథ నీకెందుకు ఇవన్నీ . ఎవరి గొడవలు వాళ్ళవి, ఎవరి బాధలు వాళ్ళవి. నువ్వేగా ఇందాక చెప్పావ్ వేదాంతం. అన్నీ మరచిపోయి ఒక్కసారి లోపలికెళ్ళి అందరినీ పలకరించి తొందరగా వచ్చేయి. నన్ను మాత్రం రమ్మనకు'' అని అనుమతించాడు రాంబాబు.

లత లోపలికి వెళ్ళింది.

''అనంతం'' పిలిచాడు రాంబాబు.

వచ్చాడు అనంతం.

రాంబాబు, అనంతం ఏదేదో మాట్లాడుకుంటున్నారు.

ఇంతలో ''హలో! అనంతం'' అంటూ లోపలి నుంచి ఒకప్లేటులో ఏమేమో తిను బండారాలతో వచ్చింది సంగీత.

అనంతం రాంబాబుతో మాట్లాడుతూ మధ్యలో ''ఇప్పుడే వస్తావుండు'' అని సంగీతని అనుసరించాడు.

ఆ గేటు దగ్గర నుంచొని ఏదేదో మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు వారిద్దరూ. తన ప్లేట్‌లోని స్వీట్ అనంతం నోట్లో కుక్కింది సంగీత.

అనంతం బుగ్గలు బూరెల్లా చేసుకుని నములుతూ ఆమె ప్లేటులోవున్న కోక్‌ను తీసుకొని ఒక గుక్క త్రాగి తేరుకున్నాడు.

ఏవేవో మాట్లాడుకుంటున్నారు. సరిగా వినిపించటం లేదు, రాంబాబుకి ఎంత ప్రయత్నం చేసినా.

ఒక్కసారి అరిచింది సంగీత. ''మనం ఇది వరకు కలిసినప్పుడు ఎందుకు చెప్పలేదు. నేను చాలా బాధపడుతున్నాను నువ్వు చెప్పనందుకు, అయినా ఎంతో సంతోషంగా వుంది. ఓ బోయ్! యూఆర్ మై బాస్!'' అని అనంతం చెయ్యిగట్టిగా పట్టుకుని వూపేసింది.

''మాం'' అని అరిచింది సంగీత,

అంతగొడవలోనూ వైన్‌గ్లాస్ చేత్తో పుచ్చుకుని ఒక్కసారి ప్రత్యక్షమయింది సంగీత తల్లి.

సంగీత వాళ్ళ అమ్మకు ఏదో చాలా సంతోషపడుతూ చెప్పింది.

ఒక్కసారి అనంతాన్ని గట్టిగా పట్టుకుని కౌగిలించుకుని వూపేసింది సంగీత తల్లి. చేతిలో వున్న వైన్ గ్లాస్ వూగిపోయింది. అనంతానికి కాస్సేపు వూపి రాడలేదు. సంగీత తల్లి భారీ మనిషి. ఒక్కసారి నలిగిపోయాడు.

ఆ తల్లి కూతుళ్ళ సంతోషానికి అవధులు లేకుండాపోయాయి.

''ఐ విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్'' అని గట్టిగా అరిచి హడావిడిగా లోనికి వెళ్ళింది సంగీత తల్లి.

రాంబాబు కి ఆ సన్నివేశం ఎంతో జుగుప్సకలిగించింది.

ఇదంతా చూస్తూ నీరసపడ్డాడు. 'ఏమిటి వీడు! ఇంత అనురాగాను బంధాలు ఎప్పటి నుంచి ఏర్పాడ్డాయి వీళ్ళ మధ్య . వీడు ఓ పెద్ద వలలో పడుతున్నాడు. వీళ్ళు ఇది వరకు ఎప్పుడు కలుసుకున్నారు? పైగా చెప్పలేదు, అంటుంది. ఏమిటి వీళ్ళింత మురిసిపోతున్నారు. అందులో ప్రత్యేకంగా వాళ్ళమ్మని పిలిచి మరీ చెబుతోంది. పైగా వీళ్ళిద్దరికి బెస్ట్ ఆఫ్ లక్ అంటుంది వాళ్ళమ్మ' అని

అర్థం కాక గిల గిల్లాడిపోతూ అలా చాలా సేపు సంగీత, అనంతాల అన్యోన్యత గమనిస్తూ నీరసం వచ్చి ఆ విక్రమార్క సింహాసన మీద కూర్చుని ఒక్కసారి గట్టిగా

''అనంతం'' అని అరిచాడు మూలుగుతు,

అనంతం పరుగెత్తుకుంటూ వచ్చాడు.

''ఏమయింది'' అడిగాడు అనంతం

''నాకు ఒక కోక్ బాటిల్ తీసుకురా బాబు! దాహం వేస్తోంది'' అన్నాడు రాంబాబు.

''వదిన గారింకా రాలేదా'' అన్నాడు అనంతం,

''వస్తారు నాయనా! లోపలికెళ్ళారు అతిథులను పలకరించటానికి. వదిన గారిని కూడా ఒక కోక్ తెచ్చుకోమని చెప్పు. ఈ ఒక్క ఉపకారం చెయ్యి నాయనా!'' అని దీనంగా ఆశ్చర్యంగా బ్రతిమాలాడు రాంబాబు.

అనంతం సంగీతకి క్షమాపణ చెప్పిగబగబా లోపలికెళ్ళి లతని వెంట బెట్టుకుని ఒక కోక్ బాటిల్‌తో వచ్చి రాంబాబు కిచ్చి గేటు దగ్గిర కెళ్ళి తను తెచ్చుకున్న కోక్ త్రాగుతు సంగీత తో సంభాషణ కంటిన్యూ చేస్తున్నాడు.

''కోక్ ఎంత త్రాగినా దాహంతీరటం లేదు. లతా! నాకు నీరసం వస్తోంది. భోజనం చేద్దామా'' అన్నాడు రాంబాబు.

''ఇంకెతసేపండి ఒక్క అరగంట, దాంతో మనం ఇచ్చినటైము అవుతుంది. అప్పుడు భోజనం చెయ్యొచ్చు. లేకపోతే ఏం బావుంటుంది. కాస్సేపు ఓపిక పట్టండి'' అంది లత. ఇద్దరు నవ దంపతులు కూర్చుని కబుర్లు చెప్పకుంటున్నారు.

మరో కారాగింది,

దిగారు శాస్త్రి వారి సతీమణి సరసా శాస్త్రి. ఎంతో జాగ్రత్తగా కారు తలుపు మూశారు రిమోట్‌తో.

శాస్త్రి గారు ఎంతో సౌమ్యంగా మాట్లాడుతారని అవూర్లో అంతా అంటూంటారు. వారు ఇవాళ వేసిన సూటు మరోనాడు వెయ్యరని ప్రతీతి. కోటు

జేబులోంచి ఎర్రని రుమాలు ఎప్పుడూ తొంగిచూస్తుంటుంది. ఆయన వాడే సెంటు ఎక్కడిదని ఎవరయినా ఉబలాటం కొద్దీ అడిగితే ఒక చిరునవ్వు నవ్వి వూరుకుంటారు. కుర్చీలో కూర్చుంటే సూటు ఎక్కడ నలిగిపోతుందోనని భయపడుతూ మోకాళ్ళ మీద అనుకుని ఎంతసేపైనా కుర్చుని కబుర్లు చెప్పగలశక్తిగలవారు.

సరసా శాస్త్రి, శాస్త్రి గారికి సరియైన సతీమణి అని చెప్పాలి. ఆ వూళ్ళో కొంత వరకూ భమిడిపాటి, కొమ్మినేని ఫామిలీలతో పోటీపడేకుంటుంబం శాస్త్రి గారి దేనని చెప్పాలి. ఇది ఆ వూళ్ళో అందరికీ తెలుసున్న సత్యం.

శాస్త్రి గారంటే రాంబాబుకు కొంత అభిమానం. రాంబాబు అమెరికా వచ్చిన కొత్తల్లోనే శాస్త్రి పి.హెచ్.డి, పట్టాపొంది ఒక ఫ్లాట్ తీసుకుని ఇంట్లోకి కావలసిన సరుకులు ఎన్నో సమకూర్చుకుని కూర్చున్నారు. శాస్త్రి సంభాషణ ఎంతో కుతూహలంగా వింటూండే వారు జానకిరామయ్యగారు, సీతగారు కూడా. రాంబాబు కూడా అప్పట్లో శాస్త్రి తో చాలా దోస్తీగా వుండేవాడు. సాధారణంగా ప్రతి పదిహేను రోజులకి జానకిరామయ్య గారింటికి చేరి ఎన్నెన్నోడేటింగు విషయాలు చెప్పి సుష్టుగా భోజనం చేసి రాంబాబుని కూడా వేసుకుని అతన్ని రూంలో దింపి తన అపార్టుమెంట్‌కి వెళ్ళేవాడు. ఒకటి రెండుసార్లు జానకి రామయ్య దంపతులను, రాంబాబుని కూడా పిలుస్తూ పీజా భోజనం పెడుతూండేవాడు.

''ఎలాగయినా శాస్త్రి చాలా గట్టివాడయ్యా! బాగా సెటిల్ అయ్యాడు. అన్ని అమెరికా పద్ధతులకు అలవాటు పడ్డాడు. డేటింగులు చెయ్యటమే కాకుండా విషయాలు కూడా వివరంగా చెబుతూంటాడు, చాలా ఓపెన్‌గా మాట్లాడుతుంటాడు'' అంటూండేవారు జానకి రామయ్య గారు.

''అందులో తప్పేముందండి, అయన చేసేపనులు సిగ్గుపడకుండా అందరికీ చెబుతూంటాడు. చాలా మంచివాడు. ఎవరినో ఒకరిని పెళ్ళి చేసుకుని సుఖపడతాడని అనుకుంటాను'' అంటూండే వారు సీత గారు.

''ఇంట్లో ఎవరికీ తెలియకుండా డేటింగులు చేస్తూంటే. వాళ్ళనాన్న వాళ్ళు ఏమనుకుంటారు. అందులో చాలా స్తోత్రీయమైన కుంటుంబంలో పుట్టి ఇలా చెయ్యటం తప్పుకాదా'' అనేవాడు రాంబాబు.

''రాంబాబు! ఈ దేశ కాలమాన పరిస్థితులకు అలవాటు పడ్డవ్యక్తి శాస్త్రి, మంచిదే. రేపు మన పిల్లలు ఏం చేస్తారో మనం ఇప్పుడు ఊహించగలమా. ఎవరి అదృష్టం వారిది'' అంటూండే వారు సీతగారు.

''ఒకవారం ఒక అమ్మాయితోను, మరోవారం మరో అమ్మాయితోనూ డేటింగ్ చేశాను,'' అని చెబుతూ ఎన్నెన్నో కబుర్లు చెప్పి సంతోషపడుతూ, సంతోషపెడుతూండేవాడు జానకిరామయ్య గారిని సీతగారిని, రాంబాబుని.

ఒకరోజు రాంబాబుకి ఫోన్‌చేసి ''రేపు సరస్వతి అని ఒక మంచి అమ్మాయితో నా వివాహం జరుగుతుంది. అది కూడా ఫలానా చర్చిలో. నువ్వు, జానకిరామయ్య గారు, వారి సతీమణి సాక్షులుగా వుండాలి. ఆ ఆదర్శ దంపతులు ఒప్పుకున్నారు. నువ్వు కూడా రావాలి.... నేను మళ్ళీ ఫోన్ చేస్తాను అన్నారు.'' అని అర్థించాడు...

''తప్పకుండా, అంత భాగ్యం మీరు నాకు ప్రత్యేకంగా ఇస్తున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. నేను మీకన్న చాలా చిన్న వాణ్ణి అయినానన్ను ఇంత గౌరవిస్తున్నందుకు చాలా సంతోషంగావుంది'' అని ప్రతి సమాధానం ఇచ్చాడు.

ఒకవారం రోజులదాక శాస్త్రుల వారి నుంచి ఫోనూ లేదు ఏమి లేదు. జానకి రామయ్యగారు, సీతగారు, రాంబాబు ఈ విషయం జానకిరామయ్య గారింట్లో హోరాహోరి చర్చించుకుని చివరికి శాస్త్రి కి ఒక ఫోన్ చేద్దామా అని మీమాంసలు పడి,

''మనకెందుకులెద్దూ'' అని వూరుకున్నారు.

ఆ తరువాత వారం జానకి రామయ్యగారికి, రాంబాబుకి ఫోన్ చేసి

''మీరు రేపు సాయంకాలం మా యింటికి భోజనానికి వస్తున్నారు'' అని పెట్టేశాడు శాస్త్రి.

ఆ మర్నాడు రాంబాబుని కార్లో కూర్చోపెట్టుకుని జానకిరామయ్యగారు, సీతగారు,శాస్త్రి గారిల్లు చేరుకున్నారు

శాస్త్రి గారు, వారి సతీమణి సరస్వతీ శాస్త్రి, వారిసుపుత్రుడు ఐదేళ్ళ కుర్రాడు ఎదురు వచ్చి అతిధిలను రిసీవ్ చేసుకున్నారు.

అంతా సుష్టుగా భోజనాలు చేశారు.

''పోయిన ఆదివారం వచ్చిందండీ మా ఆవిడ మా అబ్బాయితో కాకినాడ నుంచి'' అన్నాడు.

''అంతా మీ పూర్వజన్మ సుకృతం శాస్త్రి గారు. మీరు చాలా ఆదృష్టవంతులు మీరు సుఖంగా వుండాలి. అన్నదాతసుఖీభవ,'' అని దీవించి కారులో బయలుదేరారు ముగ్గురూ. డ్రైవ్ చేస్తూన్నంతసేపూ పొట్టబద్దలయ్యేట్లు నవ్వుతూనేవున్నారు జానకి రామయ్యగారు.

''అయ్యా! గురూజీ ఏమిటండీయన ! ఈయన సైకాలజీ నాకేం అర్థం అవటం లేదు,'' అని అశ్చర్యం ప్రకటించాడు రాంబాబు.

''రాంబాబు! ఇదోసైకాలజీ, మనకెన్నెన్నో వ్యూహాలుంటాయి. అవినెరవేరే మార్గం కనపడదు. ఉత్సాహంవుట్టుకు పోదు. ఏదో తప్పని సరిగా కొన్ని నిబంధనలకులోనై పోతాడు మనిషి. పెళ్ళి చేసుకోవలసి వస్తుంది.'' అన్నారు గురుజీ.

''అది ఎల్లాగస్వామీ'' అన్నాడు శిష్యుడు

''నువ్వు మరీ అంతగా నన్ను డిటైల్స్ అడిగితే నేనేంచెప్పను ? బహూశా శాస్త్రి తండ్రి విపరీతమయిన కట్నం తీసుకుని వుంటాడని నాఉద్ధేశ్యం . అప్పుడు మనవాడిని కట్టిపడేశారు. మరి అమెరికా వచ్చాక ఇక్కడి జనాల విచ్చలవిడి ప్రవర్తనలు చూచి ఏమీ చెయ్యలేక 'అప్పుడే పెళ్ళయిపోయిందే' నాకు అని బాదపడుతూ, డేటింగులు చేసే దన్నూ, శక్తి లేక వూరికే సరదాగా మనందరిని బురిడీలో వేసి డేటింగు కోతలు కోస్తుండే వాడన్నమాట, డబ్బయ్యా! డబ్బు! డబ్బు ఎవరినైనా ఎంత వాడినైనా కొనేస్తుంది. అన్నారు'', జానకిరామయ్య గారు మళ్ళీపగలబడుతూ.

''మీ ఐడియాకి హ్యాట్సాఫ్'' అని పగలబడ్డాడు రాంబాబు.

''కాని నాకు శాస్త్రి ని చూస్తే జాలేస్తుందండీ. అతను ఎంతో మంచి వాడనిపిస్తుంది. ఇంకానయం, ఎవరినో పెళ్ళి చేసుకుని నీకు నాకు సంబంధంలేదు అని సరస్వతీ శాస్త్రి గారికి ఒకనోటు పంపాడంటే ఆవిడ గతేం కాను'' అన్నారు సీతాగారు.

''అది అంత సులభమేం కాదు, సీతే! ఆడమనిషి ఒప్పుకుంటే కాని మగవాడు డైవర్సు చెయ్యలేడు'' అన్నారు గురూజీ.

''ఎడ్రస్ లేకుండా తిరిగి ఇండియా మోహం చూడకుండా వుంటే దిక్కా! మొక్కా''! అన్నాడు రాంబాబు.

''మొత్తానికి పాపం! ఏది ఏమయితేనేం శాస్త్రి ఒక ఇంటివాడయ్యాడుగా సంతోషించాలి, ప్రమాదంమేం జరగలేదుగా'' అన్నారు సీతగారు జానకి రామయ్య గారిని మందలిస్తూ ఆనాడు.

ఆనాటి సంగతి ఈనాటి దాకా మరిచిపోలేదు రాంబాబు

''ఏమిటేమిటీ ! ఇప్పుడా రావడం ఇంత ఆలస్యంగానా. మీకోసం చాలా మంది ఎదురు చూస్తున్నారు. కొందరు ఇంకా తీర్థాలు కూడాపుచ్చుకోవటం ప్రారంభించలేదు. మీరు రాలేదని. సరసుగారి కోసం వెయ్యికళ్ళతో కాచుకుని కూర్చున్నారు జనం. రండి! రండి'' అంటూ జానకిరామయ్య గారు శాస్త్రి దంపతులను ఆహ్వానించారు.

అనంతానికి కూడా బాగా తెలుసు శాస్త్రి గారు. ఆదంపదులకి నమస్కారం చేసి ఆశీస్సులందుకున్నాడు అనంతం.

''డేటింగులు చేస్తున్నావా లేదా! ఏమిటీ! ఇంతమంది ఆడపిల్లలు నీ చుట్టూ తిరుగుతుంటే ఏం చేస్తున్నావు ? కానివ్వు, ఐ విష్ యూ గుడ్‌లక్'' అని రహస్యంగా అనంతం చెవిలో అంటూండటం కనిపెట్టాడు రాంబాబు కూడా.

సరసా శాస్త్రిగారు పాకశాస్త్రంలో పెట్టింది పేరు. సీతాలక్ష్మిగారికి సరస గారికి అప్పుడప్పుడు చాలా ఆర్గ్యుమెంట్లు జరుగుతుంటాయి కూడా వంట విషయాలలో.

''ఎంతలేదన్నా, శాఖాహారంలోనే అందెవేసిన చెయ్యి అని చెప్పుకుంటే ఏ లాభం, మాంసాహారంతో వంట సరుకులు తయారు చేసి మెప్పించగలితే అప్పుడు చెప్పుకోవచ్చు మన గొప్పతనం వంటలో. అది సరస గారికే దక్కుతుంది.'' అని వెక్కిరింతగా మాట్లాడుతుండే వారు జానకిరామయ్యగారు సీతగారితో సరసగారి సమక్షంలో.

''నేను ఒప్పుకుంటాను'' అనేవారు సీతగారు

''మీకు క్రొత్త క్రొత్త జ్యూస్‌లు తయ్యారుచెయ్యటంలో ఎంత అనుభవం వుందో, క్రొత్త క్రొత్త కాక్‌టయిల్స్ తయారు చెయ్యటంలో అంత అనుభవం పొందింది మా ఆవిడ'' అంటూ వాళ్ళావిడని పొగడుతుంటాడు శాస్త్రి.

రాంబాబు, లతని ఎంతగానో మెచ్చుకుని దీవించి జానకిరామయ్యగారి వెనకాల నడిచారు శాస్త్రి దంపతులు.

జానకిరామయ్యగారు మళ్ళీ తిరగి వచ్చి

''ఇంక వచ్చే వాళ్ళేవరూలేరు అంతా వచ్చేశారు, లోపలికి రండి, పాపం! చాలా అలిసిపోయారిద్దరూ'' అని అక్కడున్న ఆడపిల్లలని, అనంతాన్ని, నూతనవధూవరులను వెంట బెట్టుకుని పాకశాలలో ప్రవేశించారు.

రాంబాబుకి ఆ వాతావరణం చూస్తే కొంచెం కళ్ళు బయర్లు కమ్మాయి. ఇంతకు ముందు విన్నాడేకాని ఎప్పుడూ చూడలేదు. అందులోనూ తన పెళ్ళి రిసెప్షన్‌లో

'నా పెళ్ళి రిసెప్షన్ ఇంత ఘోరంగా జరుగుతోందా' అనుకుని కొంచెం బాధపడ్డాడు.

''కొంచెం ఓపికపట్టండి వాళ్ళ సంతోషం వాళ్ళది. నాకూ భరించటం కొంచెం క్రొత్తగానే వుంది. నిజంగా 'బి ఎ రోమన్ ఇన్ రోమ్' అన్నారు సీతాలక్ష్మి గారు కరక్టే. అలా ఉండటమే మంచిది లెద్దూరూ. వూరికే ప్రతిదానిని పట్టించుకుని ఏహ్యాబావం పెంచుకుంటూ వుండటంకన్న. భారతం కూడా ఎందులో నూ తీసిపోదులేండి'' అని గబగబా వెళ్ళి రెండు ప్లేట్లలో పదార్థాలు పెట్టుకొని ఒకటి రాంబాబుకిచ్చి తను

ఒకటి తీసుకుని తింటూ కూర్చుని సినిమా చూస్తున్నట్లు చూస్తున్నారు ఆ హాల్లో దృశ్యం.

''అనంతం! నువ్వుకూడా ఒక ప్లేటు తెచ్చుకో'' అన్నాడు రాంబాబు.

''వస్తున్నా. నన్ను కూడా చూడనివ్వు కాసేపు'' అని అదేపనిగా ఎవరి కోసమో వెతుకు తున్నాడు.

సంగీత చేతిలో జ్యూస్ వుండటం గ్రహించాడు. మరికొందరు అమ్మాయిలు వైన్ త్రాగుతూ మగపిల్లలతో డ్యాన్సు చేస్తున్నారు. మురళీకష్ణ, సరసగారు బాల్ రూండ్యాన్స్‌లో నిమగ్నమయ్యారు. శాస్త్రి, జూలీని పట్టుకున్నాడు. శాస్త్రి మాత్రం కోక్ త్రాగుతున్నాడు. సరసగారు కాక్‌టెయిల్‌లో మునిగి తేలుతూ డ్యాన్సు చేస్తున్నారు. పాశ్చాత్య సంగీతం చాలా పీక్‌లో వుంది.

సరసగారు ఆ వూళ్ళో భరతనాట్యంలో గొప్ప పేరున్న వ్యక్తి. చిన్నప్పటి నుంచి కాకినాడలో భరతనాట్యం అభ్యసించారు.

''భరతనాట్యం నేర్చుకున్నవారు బాల్‌రూం డ్యాన్సు చాలా సులభంగా చెయ్యగలరు కామోసు'' అనుకున్నాడు రాంబాబు.

కోక్ గ్లాసుతో పరుగు పరుగున వచ్చింది సంగీత అనంతం దగ్గిరకి.

''అనంతం! ప్లీజ్! నీ దగ్గిర వున్న ఆ కర్ణాటక - పాశ్చాత్య సంగీతం, సీడీలు పెట్టు వీళ్ళు ఎలా డ్యాన్సు చేస్తారో సరదాగా చూడాలని వుంది'' అంది.

''బావుండదు సంగీతా, వీళ్ళు ఒక పద్ధతికి అలవాటు పడ్డారు కదా! అలాగే వెళ్ళనియ్యి, నీకు రాదా డ్యాన్సు'' అడిగాడు అనంతం.

''నాకు ఒచ్చును. కాని కోక్ తాగుతున్నాను కదా. ఇన్‌వాల్వమెంటు తక్కువగా వుంటుంది. మా అమ్మ వైన్‌ప్రిఫర్ చేస్తుంది పార్టీలో. అందుకని నేను వట్టి కోక్ తీసుకుంటాను. మళ్ళీ ఇంటికి డ్రైవ్ చేసుకుంటూం వెళ్ళాలి గదా'' అంది.

''ప్లీజ్! ఒక సి.డి. పెట్టు'' అని అర్థించింది.

ఇదంతా చూస్తూ ఆశ్చర్యంగా అలావుండిపోయాడూ రాంబాబు.

''అనంతం'' అని ఒక్క అరుపు అరిచాడు. ఆగందర గోళంలో అతని అరుపు ఆ పాశ్చాత్య సంగీతంలో కలిసిపోయింది.

ఆ కర్ణాటక క్లాసికల్ వస్తున్న హాలులో మనుషులే లేరు.

''ఇదేం సీడీ'' అడిగింది సంగీత?

''ఈ రాగం పేరు కోలాహలం'' ఇది కూడా ధీరశంకరాభరణరాగంలోంచి పుట్టినదే. దీనిలో కూడా పాశ్చాత్య సంగీత ప్రభావంలేక పోలేదు. ఈ పరిస్థితికి చాలా బాగానప్పేరాగం ఇది.'' అని ఒక సి.డి. తన బ్యాగ్‌లోంచి తీసి ఇచ్చాడు.

సి.డి.పెట్టింది సంగీత

పెద్దకన్ఫ్యూజన్ చెలరేగింది హాలులో. జనాలకి అడుగులు తడబడ్డాయి. అలిసిపోయి కూర్చుని త్రాగేవారు త్రాగుతున్నారు, లెక్చర్లుకొట్టే వాళ్ళు కొడుతున్నారు.

రాత్రి పన్నెండు గంటలయింది.

జనాలకి మాటలుతడబడుతున్నాయి. డ్రైవ్ చేసే వారి భుజాలు పట్టుకుని అభ్యాగతులను పట్టించుకోకుండా బయటకు నడిచారు.

రాంబాబు, లత జనాల్లో కలిసిపోయారు.

జానకిరామయ్యగారు సీతగారు హాయిగా భోంచేస్తున్నారు.

అనంతం, రాంబాబు, లత, జానకిరామయ్య దంపతులును వెతుక్కుంటూ వెళ్ళారు.

''భోజనాలయ్యాయా''? అడిగారు సీతగారు.

''ఏదో మీదయవల్ల'' అన్నాడు రాంబాబు.

''రాంబాబూ! ఇవాళ నేను కనీసం ఐదుకిలోమీటర్లు జాగింగ్ చేసుంటాను కళ్యాణవేదికలో ఆ మూల నుంచి ఈ మూలకి'' అంటూ ఆయన కిష్టమయిన పదార్థాలను ఎంతో హాయిగా కూర్చుని భోజనం చేస్తున్నారు.

హాల్సు ఖాళీ అయ్యాయి.

# 8

కాలప్రవాహము క్రొత్త క్రొత్త సమస్యల్ని సృష్టిస్తుంది. కొన్ని కొన్ని సమస్యలు పరిష్కరిస్తుంది. తానొకటి తలిస్తే దైవమొకటి తలిచినట్లు కొన్ని పరిస్థితులను కల్పిస్తుంది. జీవితాలతో ఆడుకుంటుంది, నవ్విస్తుంది, కవ్విస్తుంది, ఏడిపిస్తుంది.

మానవుడు ఏదీ తను కలిపించుకున్నది కాదేమోననిపిస్తుంది. మానవునకందని సృష్టిరహస్యం అది.

దొర్లిపోతున్నాయి రోజులు, నెలలు, సంవత్సరాలు...

ఆరోజురాత్రి ఎనిమిదిగంటలయింది. జానకిరామయ్యగారింట్లో మరోసారి ఫోను మ్రోగింది.

''హల్లో! ఆ..... అవును..... నేనే మాట్లాడుతున్నాను..... వచ్చేయ్ రాంబాబు, నువ్వు మళ్ళీ నాకు ఫోన్ చేసి చెప్పాలా?..... భలే వాడివయ్యా..... నాతో అపాయింట్ మెంటేమిటి, పైగా నీకు నేను అపాయింట్ మెంట్ ఇవ్వాలా! నువ్వు ఎక్కడ దొరికావయ్యా! ..... కొంపతీసి నువ్వు కూడా అమెరికా పౌరసత్వానికి అప్లికేషన్ పెట్టవా..... ఆ... ఆ... ఆ..... అవును! ఎప్పుడొస్తుంది లత..... ఓ!-ఈ వీకెండుకి రాదా? నువ్విక్కడికి రా అన్నీ మాట్లాడుకుందాం. నీకోసం భోజనానికి కాసుకుని వుంటా''.

''నాదగ్గిర మోహమాటమేమిటయ్యా నీకు ..... ఆ.....ఏమిటీ? అనంతం మొయిల్ ఇచ్చాడా? ఏమని..... సరేలే నువ్వు ఎలాగూ వస్తున్నావుగా, తీసుకురా నీతో, ఓ.కె.'' అని ఫోన్ పెట్టేశారు.

''సీతా! రాంబాబు వస్తున్నాడు భోజనానికి'' అరిచారు జానకిరామయ్యగారు. ''ఏవో వున్నవి పంచుకుతిందాం! రానివ్వండి'' అంది సీతగారు వంటింట్లోంచి కొంచెం విసుగ్గానే.

''ఇలారా! ఇక్కడికొచ్చి కూర్చో'' అన్నారు.

''ఈ రాంబాబు పరిస్థితి ఏమీ నాకు నచ్చటం లేదండి, చివరికి అతనికి ఏ పిచ్చిలాంటిదో ఎక్కటం కాకుండా అందరికీ పిచ్చెక్కిస్తున్నాడు'' అన్నారు సీతగారు వంటింట్లోంచి హాల్లోకివస్తూ.

''సీతా! నువ్వు మరీ చెబుతావ్. రాంబాబు చాలా మంచివాడు. ఎంతో మెచ్యూరిటీ గల వ్యక్తి. అతనికి పిచ్చంటావేమిటి'' అన్నారు.

''పిచ్చి గాక మరేమిటి చెప్పండి. ఎంతసేపూ తను అనుకున్నదే జరగాలంటాడు. పాపం! లత గురించి పట్టించుకోడు. ఈ మగవాళ్ళంతా ఇంతేనేమో. వాళ్ళనుకున్నదే రైటు అనుకుంటారు. పైగా మనదగ్గిర కొచ్చి ఎన్నిసార్లు గోలపెట్టుకుంటాడు. చెప్పిందే చెప్పటం. విసుగెత్తి పోతోంది. ఇతను చెప్పే కథలు వినలేక'' అన్నారు సీతగారు కొంచెం నిష్ఠూరంగా.

''చస్తాడా చెప్పు! సమస్యలు. ఏం చేస్తాడు చెప్పు. మనం తప్ప ఎవరున్నారు పాపం! అతనికి చెప్పుకునేందుకు. ఏదో చెప్పుకోనియ్యి'' అన్నారాయన.

''మనం ఏం చెయ్యగలం. అందులోనూ భార్యాభర్తల మధ్య గొడవల్లో మనం ఎలా తలదూరుస్తాం, అప్పటికీ చెబుతూనే ఉన్నాం. అయినా లతకి మాత్రం వుండదా వ్యక్తిత్వం. ఏమో! ఆ అమ్మాయంటే నాకు చాలా ఇష్టం. చూస్తే చాలా జాలేస్తుంది. ఎంతో యాంబిషన్ కల వ్యక్తి. రాంబాబు కూడా ఆ అమ్మాయి వ్యక్తిత్వం గౌరవించాలి'' అన్నారామె.

''ఏమిటో! ఎవరి బాధలు వాళ్ళవి. మనం పెద్దవాళ్ళం. వాళ్ళు చెప్పుకునే బాధలు, సుఖాలు విని కొంత పరిష్కార మార్గం కూడా చెప్పటంలో తప్పులేదుగా'' అన్నారాయన.

ఈ వ్యవహారాలు ప్రతి రోజు రాంబాబు పెళ్ళయిన మరసటి సంవత్సరం నుంచి జరుగుతునే ఉన్నాయి.

అప్పటికే సిరాక్యూస్‌లో ఒక పబ్లిక్ హెల్త్ సెంటర్‌లో రెసిడెన్సీ చేస్తూంది లత. పదిహేను రోజులకొకసారి బఫెలో వస్తూపోతూంటుంది. వచ్చినప్పుడల్లా పెద్ద రాద్ధాంతం జరుగుతూ ఉంటుంది భార్యాభర్తలిరువురి మధ్య.

''మా నాన్న నాకు ఎంతో డబ్బు ఖర్చు పెట్టి మెడిసిన్ చదివించాడు. నేను చాలా పెద్ద ర్యాంకులో ప్యాసయ్యానని మా అమ్మా, నాన్న ఎంతో పొంగిపోయారు.''

''మా అమ్మాయి అమెరికా వెళ్ళి పెద్ద డాక్టరు పట్టాపుచ్చుకుని ప్రజలకు సేవ చెయ్యాలని అంటూండేవాడు మా నాన్న. నన్ను సింగపూర్‌లో యు.ఎస్.ఎమ్.ఎల్.ఇ. పరీక్ష వ్రాయటానికి ఎంతో ఖర్చుపెట్టి పంపాడు. అందులో ఎంతో హైర్యాంక్‌లో వచ్చానని చాలా సంబరపడిపోయారు. ఎంత ప్రయత్నంచేసినా అమెరికా వీసాదొరకలేదు. ఏదో మీదయవల్ల అమెరికా రావటం, నాకు కావలసిన గైనకాలజీ సబ్జెక్టులో రెసిడెన్సీ చెయ్యటం తటస్థించింది. మీకు మద్రాస్ ఐఐటిలో ఫ్యాకల్టీలో స్థానం వచ్చిందని నన్ను నా చదువు మధ్యలో మానిపించి మీతో కూడా ఇండియా రమ్మంటంలో ఏమయినా న్యాయంవుందా'' అంటూంటుంది లత.

''నిన్ను నేను పెళ్ళి చేసుకున్నాను. భర్త ననుసరించవలసిన బాధ్యత నీకుండక్కర లేదా?'' అని గద్దించేవాడు రాంబాబు.

''నాకూ స్వాతంత్ర్యం ఉంది. పై చదువులు చదువుకోవాలని వుండదా! ఛాన్సు వచ్చినప్పుడు'' అంది.

''ఆ ఛాన్సు కల్పించింది నేను, నా అభిప్రాయం గౌరవించవలసిన బాధ్యత నీకు లేదా'' అన్నాడు.

''నా స్వాతంత్ర్యం కూడా చూడవలసిన బాధ్యత మీకు లేదా?'' అంది.

''లతా! నాకు సంసార బాధ్యత ఎక్కువగా వుంటుంది. మన హిందూ సాంప్రదాయ పద్ధతి నాకు వంటబట్టినట్లు నీకు లేదని నాకు చాలా బాధగా వుంది'' అన్నాడు.

''నాకీ సంప్రదాయాల మీద నమ్మకం లేదు. ఏది ఏమయినా నేను ఇక్కడ స్పెషలయి జేషన్‌లో పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీ పొందాలి. నేనకున్నది సాధించగలగాలి, అప్పుడు నాలుగు రాళ్ళు సంపాదించుకోవాలి. అప్పుడు ఇండియాలో వుండాలా అమెరికాలో వుండాలా అన్నది నిర్ణయించుకోవాలి. మీకున్నట్లుగానే నాకుకూడా ఎన్నో కోరికలుంటాయి. అంతగా కావలిస్తే మీరు ఇండియాకి వెళ్ళి ఐఐటిలో చేరండి. మీ యాంబిషన్ నెరవేరుతుంది. నాకేం అభ్యంతరం లేదు.''

''కనీసం నన్ను పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీ పొందనివ్వండి, ఇండియాలో ఎలాగూ నాకోరిక నెరవేరదు. నేను ఎన్నో కాలేజీలకి పెట్టాను అప్లికేషన్‌లు, నా క్వాలిఫికేషన్‌లు చూచినవాళ్ళు లేరు. అన్నీ రిజర్వేషనులు, ఇన్ఫ్లూయెన్సులు. నేను అక్కడ ఎంట్రెన్స్‌లో మంచి ర్యాంకు తెచ్చుకున్నా ఏం లాభం లేకపోయింది. నాకు కావలసిన శాఖలో సీటు రాకపోతే నేను చాలా బాధపడి ఏడ్చాను. మా నాన్న ఓ దారుస్తూండేవాడు.''

''నీకెందుకు నాది బాధ్యత. నువ్వు అమెరికా వెళ్ళి డిగ్రీ సంపాదిస్తావు. నాకు తెలుసు, అని ఎంతో ప్రోత్సహించేవాడు మానాన్న. చివరికి అన్నీ నెరవేరాయి అనుకుంటే మళ్ళీ మీరే ఇలా అంటే ఏమయినా న్యాయం వుందా. నేను మీరు ఇండియాకి వెళ్ళటానికి అభ్యంతరం పెట్టటంలేదుకదా. ముందు మీరెళ్ళండి, నేను తరువాత డిగ్రీ తీసుకుని వస్తా నన్నానుగా. డిగ్రీ తీసుకున్నాక ఇక్కడ ఉద్యోగం చెయ్యను సరేనా!''

''నేను కూడా డిగ్రీ తీసుకుని మిమ్మల్ని చేరుతాను'' అంది ఎంతో ఒప్పించే ధోరణిలో.

ఒక్కసారి షాక్ తిన్నాడు రాంబాబు.

''అంటే ఏమిటీ నీ ఉద్దేశ్యం. నన్ను ఇండియాకి పొమ్మని, నీఒక్కత్తివీ ఇక్కడుంటావా?'' అన్నాడు వెర్రి మోహం వేసుకుని.

''నన్ను మీరు అర్థం చేసుకోవటం లేదు'' అంది.

''ఏమిటి నీ నిర్ణయం''రెట్టించి అడిగాడు.

''మీ నిర్ణయాన్ని బట్టి నా నిర్ణయం'' అంది కొంచెం కోపంగా

''అంటే నేను ఇండియాకి వెళ్ళటానికి నిర్ణయించుకుంటే నువ్వు నాతో రాకుండా తరువాత వస్తావన్నమాట'' అన్నాడు.

''మీరు ఇండియాకి వెళ్ళటమే జరిగితే, నేను ఇక్కడుండటం, పోష్టుగ్రాడ్యుయేట్ డిగ్రీ తీసుకోవటం జరుగుతుంది'' అంది కొంచెం మొండిగా.

''అంటే నీ పట్టు నువ్వు విడవవన్న మాట'' అన్నాడు.

''నాకు ఈ పట్టు విడుపులతో సంబంధం లేదు. నాకున్న పట్టు అలా పట్టు విడువకుండా నా ఎంబిషన్ నెరవేర్చుకుని కాలం కలిసివస్తే కొంత డబ్బు కూడా సంపాదించుకుంటాను'' అంది కొంత కసిగా.

''నాకు ఎంతో ప్యూచర్ వుంది ఐటి లో'' అన్నాడు.

''నాకు చాలా ప్యూచర్ వుంది అమెరికాలో... మీకు మాత్రం ఇక్కడ మంచి ప్యూచర్ లేదని ఎందుకనుకోవాలి..... ఏమిటండీ మీసంపాదన ఇండియాలో, ఎదుగూ పొదుగులేని జీవితం. ఇక్కడ నాకు కొన్ని కొట్ల రూపాయల్లో వుంటుంది సంపాదన. ఇద్దరం ఇక్కడే వుండి హాయిగా గడపొచ్చుగా జీవితాలు'' అంది ఒక్కసారి భరించలేక.

''లతా!'' గట్టిగా అరిచాడు.

''నువ్వు చాలాదూరం వెడుతున్నావు, చాలా ఇన్‌సల్టింగుగా మాట్లాడుతున్నావు. నాకు కోపం వస్తే మనిషిని కాను'' అన్నాడు.

''ఏమిటండీ! పెద్దకోపం! ఎందుకోసం! దేనికని? నేను డిగ్రీ తెచ్చుకుని స్వతంత్ర్యంగా సంపాదన మొదలెడతాననా? మీరింత ఘోరమయిన మనుష్యులని తెలుస్తే నా కథ వేరుగా వుండేది'' అంది చాలా దురుసుగానే.

''ఏం! విడాకులిస్తావా?'' అన్నాడు కోపంగా.

''అంత ఘోరమయిన దాన్నేంకాదు నేను. ఒకళ్ళ స్వాతంత్ర్యం, ఒకళ్ళు అర్థం చేసుకుని ఒకళ్ళని ఒకళ్ళు గౌరవించుకుంటూ బ్రతకమని నా ఉద్ధేశ్యం. ఇప్పుడు విడాకులు ప్రసక్తి ఎందుకొచ్చింది. ఆలోచనలు అంత వరకు వెళ్ళాయన్న మాట. పైగా ఆ నిర్ణయం తీసుకోవలసింది నేను మీరు కాదు'' అంది కొంచెం గట్టిగానే.

ఏం మాట్లాడాలో తోచలేదు రాంబాబుకి. కొంచెం భయం కూడా వేసింది, కాని ప్రదర్శించలేదు.

ఈ గొడవలు ఈ మధ్యగా ఇద్దరి మధ్య కొంచెం ఎక్కువగానే జరుగుతున్నాయి. లత, సీతగారితోటి, రాంబాబు జానకిరామయ్యగారు. సీతగార్లతో మొరబెట్టుకోవటం చాలా సార్లు జరిగాయి.

ఈసారి ఈ వీకెండుకు లత రావటం లేదని తెలిసి భయపడటం ప్రారంభించాడు రాంబాబు.

'కొంప తవ్వి ! సిరాక్యూస్ నుంచే విడాకుల పత్రాలు పంపూతుందేమో'నని భయపడి వెంటనే జానకిరామయ్యగారికి ఫోన్ చేశాడు.

అనుకున్న ప్రకారం రాంబాబు ఆ రాత్రి జానకిరామయ్యగారింటికి చేరాడు.

అప్పటికే భోజనాలకి తయారయి కూర్చుని రాంబాబు కోసం చూస్తున్నారు, ఆ దంపతులు.

'' అయ్యా! మహాత్మా! మిమ్మల్ని బోరుకొడుతున్నందుకు ఏమీ అనుకోకండి, మనస్సే మి బావుండక వచ్చాను.'' అని మొదలు పెట్టాడు సాద.

''రాంబాబు! ఇంకనువ్వేం బాధపడకు ఇందులో బాధపడవలసిందేం లేదు,'' అన్నారు సీతగారు,

''మీరెప్పుడూ లతని వెనకేసుకొస్తారు. నన్ను గురించి ఆలోచించరు, కనీసం మా గురువుగారు నన్ను సముదాయిస్తారు.'' అన్నాడు వెర్రిగా నవ్వుతూ జానకిరామయ్య గారి కేసి చూచి.

''నువ్వు మాత్రం ఇప్పుడిండియాకి ఎందుకు వెళ్ళటం. ఇక్కడ బాగానే వుందిగా మళ్ళీ ఇంకో సంవత్సరం పొడిగించాడుగా ఉద్యోగం. ఈలోగా ఆ అమ్మాయికి డిగ్రీ పూర్తి అవుతుంది... కోట్లు సంపాదిస్తూందయ్యా'' అన్నారు గురూజీ.

''ఏమిటి సార్! మీరుకూడా, నాకు ప్రతి ఏడాది గండమే ఉద్యోగం పొడిగిస్తాడా లేదా అని. ఎన్నాళ్ళు సార్! నాకీ చాలీ చాలని బ్రతుకు, ఈ టెంన్షను. వీళ్ళ దయా, దాక్షి

ణ్యాల మీద ఎంతకాలం జీవిస్తాను. హాయిగా మద్రాస్ ఐఐటిలో క్వార్టర్స్ ఇస్తున్నారు. పెర్మనెంట్ ఉద్యోగం. హాయిగా ఎవ్వరి మీదా ఆధారపడకుండా రిసెర్చి చేసుకోవచ్చు, పి. హెచ్. డి. కుర్రాళ్ళుంటారు, ఐదారేళ్ళలో తప్పకుండా ప్రొఫెసర్‌నవుతానని కాన్ఫిడెంన్సు వుంది. అందులోను ఆ డాక్టర్ రావ్ నన్ను ప్రొఫెసర్ చేస్తేగాని రిటైర్ అవ్వడు. అది ఆయన లోపాయకారీగా నాతో చెప్పాడు. ఇక్కడ నాకు విసుగెత్తిపోతోంది'' అన్నాడు చాలా బాధపడుతూ.

''ఎన్నాళ్ళు టైము ఇచ్చారు చేరటానికి'' అడిగారు సీతగారు.

''మొన్ననే కదా! ఆర్డర్లు వచ్చాయి. ఒక సంవత్సరం దాకా ఇస్తారు. ఇంకా కావాలంటే మరో సంవత్సరం కూడా ఇవ్వవచ్చు. అలా జరిగిన కేసులున్నాయని కూడా చెప్పారు డాక్టరు రావ్'' అన్నాడు ఎక్కడలేని కాన్ఫిడెన్సు తెచ్చుకుంటూ.

''ఇంక నువ్వేం మాట్లాడకు రెండేళ్ళ దాకా. రండి అన్నం చల్లారిపోతోంది. భోం చేద్దురు గాని'' అని సీతగారు లేచి భోజనాల హడావిడిలోకి దిగారు.

''ఏవంటాడు అనంతం'' అన్నారు గురూజీ.

''నేనేం చెప్పదలుచుకోలేదు. మీరీ మెయిల్ చదివితే అర్థం అవుతుంది. మనుషులు ఇంత ఘోరంగా తయారవుతారని నేనెప్పుడూ ఊహించలేదు'' అన్నాడు బాధగా.

''సరేలే, తరువాత చదువుతా'' అని రాంబాబు దగ్గిర నుంచి అనంతం ఇచ్చిన మెయిల్ జేబులో పెట్టుకున్నారు గురూజీ.

''ఏం పెళ్ళి చేసేసుకున్నాడంటావా! మనల్ని పిలవకుండానే'' అన్నారు సీతగారు గట్టిగా హాయిగా నవ్వుతూ.

''ఏమోనాకు తెలియదు'' అని భోజనానికి లేచాడు, మాట మార్చుతూ...

''తాతగారెలా ఉన్నారు గురూజీ ! పోయిన వారం చూచాను ఆయన్ని'' అన్నాడు.

''ఏం చెప్పమంటావ్, ఎప్పుడూ వున్నదే. ఇండియాకి వెళ్ళి పోతాను, దశరథ రాముడెల్లా వున్నాడో! అని అంటూ ఏడుస్తూంటాడు. ఈ జబ్బుకున్న లక్షణమే అది,

మాట్లాడితే ఏడుస్తాడు. ఇది ఆయన, మేము ఏ జన్మలోనో చేసుకున్న పాపం'' అని కొంచెం బాధపడుతూ అన్నారు గురూజీ.

''ఇక్కడున్నంతకాలం అక్కడి వాళ్ళ గురించి, అక్కడున్నంతకాలం ఇక్కడివాళ్ల గురించి ఆలోచించటం సహజమే. ఈ పరిస్థితిలో ఆయన్ని పెద్దకొడుకు దగ్గిరకి ఎలా పంపిస్తాం. ఆయనతో ఇంకో ఇద్దరు వెళ్ళాలి దిగపెట్టడానికి. అయినా అక్కడ మా బావగారు మాత్రం భరించగలరా! ఆసుపత్రి ఖర్చులు. మా తోటికోడలు సూటిపోటి మాటలు పడుతూ కాలక్షేపం చెయ్యగలరా మా మామగారు. ఈ పరిస్థితులలో ఏది ఏమయినా ఆయన్ని ఇండియాకి పంపే ఆలోచనేలేదు'' అన్నారు సీతగారు.

''ఈ వయస్సులో కొంత చాదస్థం ఉంటుంది. మా పిల్లల ప్రవర్తన ఆయనకు నచ్చదు. ఆయన్ని చూస్తే పిల్లలకి ఎలర్జీ. ఆయనకు ఆ హోంలోనే హాయిగా ఉంది. చేసేవాళ్ళు చూసేవాళ్ళు ఉన్నారు. టైముకి మందులిస్తారు. కాస్సేపు అలా నడిపిస్తారు. అన్ని బాధ్యతలూ వాళ్ళే చూసుకుంటున్నారు. మనకి మాత్రం ఇవన్నీ చెయ్యటానికి టైమెక్కడుంటుంది చెప్పు! ఏదో రోజు విడిచి రోజు నేను, సీత వెళ్ళి కాస్సేపు కూర్చుని మాట్లాడుతాం. నా ఉద్దేశ్యంలో ఆయన ఆ హోంలో వుంటేనే మంచిదనిపిస్తుంది. ఈ కుర్ర కుంకలగోల వుండదు. రోజు రాద్ధాంతమే కదా ఇంట్లో. నువ్వు చూస్తూనే వున్నావ్ ఇంతకాలంగా'' అని ఒక వెర్రి నవ్వునవ్వి బోజనాలకి ఉపక్రమించారు జానకీ రామయ్యగారు.

''అయ్యా! నాకు ఈ అమెరికా తెల్ల దొరలపద్ధతే మంచిదనిపిస్తుంది ఒక రకంగా చూస్తే'' అన్నాడు రాంబాబు సావుకాసంగా భోజనం చేస్తూ.

''ఏమిటి సంగతి ? నువ్వు కూడా దిగుతున్నావు నెంపాదిగా గ్రంథంలోకి '' అన్నారు సీతగారు నవ్వుతూ.

''అది కాదండీ! నా ఉద్దేశ్యం. నిజంగా ఈ ఆప్యాయతలు, ఈ అనురాగాలు అనవసరు అనిపిస్తుంది. ఇవి ఇంకా కొన్ని బాధలను సృష్టిస్తాయే తప్ప పరిష్కార మార్గాలుండవు. ఎవరికి వారే చివరికి. ఎవరి బ్రతుకు వారిది. ఇక్కడ చూడండి! కనీసం తల్లితండ్రులను చూచినా చూడకపోయినా వాళ్ళు పోయాక ఏడాదికొక్కసారి సిమెట్రీకి వెళ్ళి ఒక దండ వాళ్ళను పాతుపెట్టిన చోట వుంచి కాస్సేపు మోకాళ్ల మీద కూర్చుని కళ్ళు మూసుకుని ప్రార్థించి ఇంటికివెడతారు. నేను చూస్తూంటానుగా రోజూ, మా

ఇంటి ముందేగా వుంది ఓ పెద్ద సిమెట్రీ'' అని ఒక నవ్వు నవ్వాడు రాంబాబు.

భోం చేస్తూన్న సీతగారు, గురూజీ రాంబాబు వంక అదోలా చూచారు

''ఇప్పుడిప్పుడే కొంచెం కొంచెం అర్థమవుతోంది నీకు అమెరికా జీవితం ఇన్నేళ్ళ తరువాత'' అన్నారు గురూజీ.

''నాకన్న బాగా అర్థం అయ్యింది అనంతానికి. నేనే చాలా ప్రాక్టికల్ మ్యాన్ అనుకున్నాను, నన్ను మించిపోయాడు. నేనెప్పుడూ ఊహించలేదు అలా జరుగుతుందని''అన్నాడు రాంబాబు కొంచెం సస్పెన్సు చూపిస్తూ.

''నాయనా! నువ్వు మమ్మల్ని చంపకచెప్పు ఒక్కసారి. అనంతం పెళ్ళి అయిపోయిందంటావా!.....మంచిదేకద! ఉత్తరం తీసి చదివేస్తాను'' అన్నారు గురూజీ జేబులో చెయ్యిపెట్టి సస్పెన్సు భరించలేక

''ఆగండి! ఆగండి! అప్పుడే చదవకండి నేను వెళ్ళాక హాయిగా చదువుకోండి'' అన్నాడు రాంబాబు.

''రాంబాబూ! ఆ ఒక్క ముక్క చెప్పు హాయిగా భోం చేస్తాం'' అన్నారు సీతగారు.

''అన్నీ మరిచిపోండి! ప్రస్తుతం ఎవ్వరి గురించి ఆలోచించకుండా భోం చేద్దాం. అందుకే కదా నేనిక్కడికి వచ్చింది. అంతా రిలాక్స్ అవ్వండి. నేను వెళ్ళాక మీరు ఉత్తరం సావుకాశంగా చదువుకోండి'' అని హాయిగా భోజనం చేస్తున్నాడు.

ఎప్పటిలాగే సీతగారు చేసిన పదార్థాలని పొగుడుతూ హాయిగా భుజించి సెలవు తీసుకుంటూ ''సీతమ్మగారు! మీ భోజనం చేస్తే నాకు చాలా తృప్తిగా వుంటుంది. ఏ ఆలోచనా మనస్సులో పెట్టుకోకుండా వెళ్ళి హాయిగా నిద్రపోతాను. గురూజీ! ఆ కుర్రాడి గురించి నాకనవసరం. అసలే నేను నా గొడవలతో చస్తూంటే మళ్ళీ వీడొకడు. మీరే ఆ ఉత్తరం చూచి, మీకు తోస్తే నా బదులు కూడా మీరే మెయిల్ చెయ్యండి వాడికి. ఈ అమెరికా ప్రపంచాన్ని స్వర్గం అనాలో, నరకం అనాలో నాకేం తెలియటం లేదు. నాకు తిక్కరేగుతే ఒకటి రెండు వారాల్లో ఇండియాకి వెళ్ళి ఐఐటిలో చేరి పోతాను. ఇంకెందుకు? ఎన్ని సార్లు తిట్టుకుంటూ జీవితాలు గడుపుతాం! వస్తాను సీతగారి చేతి భోజనం చేశాక నిద్ర ముంచుకుని వస్తోంది''అని బయలు దేరాడు.

రాంబాబుని పంపించి ఆ ఆదర్శ దంపదులిద్దరు హాల్లో కూర్చుని కాస్సేపు విశ్రమించారు.

అనంతం పంపిన మెయిల్ చదవటం ప్రారంభించారు జానకిరామయ్య గారు.

సాధారణంగా ఈ మెయిల్‌లో సందేశాలు, ముఖ్యంగా వ్యక్తిగతమైన సందేశాలు పంపేవారు వారి వారి మాతృబాషలలో ఇంగ్లీషులో నే పంపుతూండటం పరిపాటి.

జానకిరామయ్యగారు చాలా ఫ్లూయంట్‌గా తెలుగు లేఖ చదువుతూన్నట్లుగా ఎంతో సులువుగా చదవటం ప్రారంభించారు.

'' ప్రియమైన మిత్రుడు రాంబాబుకి '' అని ప్రారంభించారు.

''మనకెందుకిచ్చాడండి ఈ ఉత్తరం రాంబాబు అతనికి వ్రాసినది. కుర్రాళ్ళు, కుర్రాళ్ల వాళ్ళిష్టమొచ్చినట్లు రాసుకుంటారు. ఏం బావుంటుంది, మనం చదివితే '' అన్నారు సీతగారు.

''అయితే మనకెందుకిచ్చాడంటావ్ రాంబాబు ఈ ఉత్తరాన్ని చదవమని అంత రహస్యాలేమి వుండవులే. మనం కూడా సరదాగా చదువుదాం ఏమని వ్రాశాడో'' అని ఒక్కసారి నవ్వారు.

మళ్ళీ మొదలెట్టారు.

''ప్రియమైన మిత్రుడు రాంబాబుకి !''

అని మళ్ళీ ఒక్కసారి కాగితం వెనక్కి త్రిప్పారు.

''చదవండీ'' అన్నారు సీతగారు

''ఉండు, ఉండు కంగారు పడతావేం. ఆ.....ఇక్కడ ఆఖరిని వ్రాశాడు. ఏమని? ఈ ఉత్తరం జానకిరామయ్య అంకుల్‌కి, సీతఆంటీకి కూడా చూపించవలెను'' అని కూడా వ్రాశాడు.''

''ఇహా ఫరవాలేదు. మన కార్యక్రమం ప్రారంభించవచ్చు'' అని ఒక్కసారి

గొల్లున నవ్వారు. ''ఎవరయినా మరొకరికి వ్రాసిన ఉత్తరం చదవటంలో ఉన్న ఆనందం మనకి ఎవరయినా వ్రాసినది చదవటంలో వుండదు సీతా!'' అని ఎంతో కుతూహలంగా చదవటం ప్రారంభించారు.

''నీ దగ్గిర నుంచి తరుచూ మెయిల్ రావటం లేదు. నేను వ్రాస్తున్నంత ప్రాంప్ట్‌గా నువ్వు రాయటం లేదు. నీ సలహా నాకు ఇప్పుడు చాలా అవసరం. నాకు తెలుసు నువ్వు ఏం సలహా ఇస్తావో. ఒక్కసారి గురువుగారి తోటి, సీతగారితోటి కూడా యోచించి మెయిల్ చెయ్యి. నాకు వారితో ముఖాముఖీ సంప్రతించటం కొంచెం మొహమాటంగా వుంది. ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియదు. అందుకనే నీకు వ్రాస్తున్నాను''

ఒక్కసారి ఆపి ''ఏమిటీ చంపేస్తున్నాడు ఇంట్రడక్షన్‌తో అసలు సంగతి రాయడేం!'' అన్నారు గురూజీ.

''చదవండీ! ఏంరాశాడో?'' అన్నారు సీతగారు,

''భరించలేకపోతున్నావు కదూ! సస్పెన్సుకి అవునా?'' అని గట్టిగా నవ్వారు.

''మీరు ఉత్తరం చదవటం పూర్తి చేస్తారా లేక నన్ను వెళ్ళి పడుకోమన్నారా'' అడిగిందామె.

''అయితే విను! విను'' అని మళ్ళీ చదవటం ప్రారంభించారు.

''వయస్సుతో వచ్చే మార్పులే కావచ్చు, సృష్టి రహస్యమే కావచ్చు! నాకేం తెలియటం లేదు. ఇంతవరకూ నాకెప్పుడు లేని మార్పులు నాలో వస్తున్నాయనిపిస్తోంది.''

చదవటం ఒక్కసారి మాని సీతగారి కేసి చూచి ''మన అనంతం కవిత్వంలో పడ్డాడు. సృష్టిరహస్యం అంటున్నాడు. అంటే ప్రేమలో పడుతున్నాడంటావా?'' అన్నారు గురూజీ.

ఒక్కసారి చెవులు మూసుకుని ఆయన చెప్పేది వినక, చదవమని సౌంజ్ఞ చేశారు సీతగారు.

గబగబా చదవటం ప్రారంభించారు గురూజీ.

''చదవండి సరిగ్గా'' అని ఒక్కసారి విసుక్కున్నారు సీతగారు.

''అయితే విను'' అని మళ్ళీ చదవటం ప్రారంభించారు.

''ఇంక ఆపు లేకుండా చదవాలి. మధ్యలో ఆపుతే, నేను వెంటనే పడుకునేందుకు వెళ్ళిపోతాను''అన్నారు ఆమె.

''అయితే నేనూ వచ్చేస్తాను నీకూడా పడుకునేందుకు. రేపు సావుకాశంగా చదవుకుందాం, ఇవ్వాళ సావుకాశంగా పడుకుందాం'' అన్నారు హేళనగా.

''సరే! చాలు మీ సరసప్రసంగాలు'' అందామె.

''నన్నేం చెయ్యమంటావ్. అనంతం ఉత్తరం చదువుతోంటే నాక్కూడా ఏవేవో లేని పోని ఆలోచనలు మనసులోంచి తొంగిచూస్తున్నాయి'' అన్నారు మళ్ళీ నవ్వుతూ.

''చాల్లేండి! ఇంకా మొదట్లోనే వున్నారు, మీ కవిత్వం కట్టిపెట్టండి. మీరు చదువుతారా? నన్ను చదవమన్నారా?'' అందామె.

''నీకిచ్చినా చదవలేవు. ఇది తెలుగుని ఇంగ్లీషులో రాసిన ఉత్తరం'' అన్నారు మళ్ళీ హేళనగా.

''మీ జోకులు కట్టిపెట్టి చదవండి ఆపులేకుండా'' అందామె కొంచెం సీరియస్‌గానే. ''అయితే విను, మళ్ళీ నన్నాపు చెయ్యకు మధ్యలో. ఎంత మంచి రసవత్తరమైన ఘట్టం వచ్చినా సరే''అని ఒక్కసారి ఆమెకేసి కొంటిగా చూచి చదవటం ప్రారంభించారు.

''ఆభగవంతుని సృష్టిరహస్యం ఇప్పుడిప్పుడే అర్ధమవుతోంది. ఆడ,మగ అని రెండు రకాల వారిని ఎందుకు సృష్టించాడో ఇది వరకు మనం ఒకసారి చర్చించుకున్నాం. నీకు జ్ఞాపకం వుందో లేదో.. నాకు మళ్ళీ స్మృతిలోకి వస్తూంది.''

''ఇంక నిన్ను ఈ ధోరణితో బోరుకొట్టదలుచుకోలేదు. అసలు విషయం వ్రాస్తున్నాను''. సీతగారి కేసి చాలా సిరియుస్‌గా చూచి వెంటనే చదవటం ప్రారంభించారు.

''నేను, సంగీత అదే మన మురళీకృష్ణగారి అమ్మాయి, వివాహం చేసుకునేందుకు నిర్ణయించుకున్నాము''

ఒక్కసారి ఆపి''చూశావా సీతా! ఎంత పని చేశాడో!మన అనంతం. ఇంకా సంగీత మొదటి భర్త ఈ ఊళ్లోనే టాక్సీ నడుపుతున్నాడు'' గురూజీ సీతగారికేసి చూచి చాలా ఆదుర్దాపడ్డారు.

''ఏముంది ఇందులో, ఆ కుర్రాడితో ఎప్పుడో విడాకులయిందికదా! చాలా మంచి పని చేస్తున్నాడు అనంతం. అతను చాలా విశాలహృదయం కలవాడు'' అన్నారు ఆమె.

''అది కాదు సీతా! నేనన్నది. అనంతం వాళ్ళ అమ్మకి, నాన్నకి తెలుసో తెలియదో పాపం! ఈ సంగతి '' అన్నారాయన.

''రేపు మన పిల్లలు కూడా ఇలాగే చేశారంటే బాధపడుతూ కూర్చుంటారా మీరు. మన పిల్లలు కూడా ఇలాగే చేస్తారు కూడా. నా కలాగేం అనిపించదు, అందులో తప్పేముంది''అన్నారామె.

''అవుననుకో! కానిఒక్కముక్కయినా చెప్పాడుకాడు మురళీకృష్ణ ఈ విషయం గురించి''అన్నారు ఒక వెర్రి నవ్వునవ్వి.

''మురళీకృష్ణ ఎక్కడున్నాడండీ. అప్పుడే సెల్ఫాళ్ళుగా జూలీని వేసుకుని హాలీడేయింగ్‌లో వున్నాడుగా. అతనికి మాత్రం తెలుసో, తెలియదో. అయినా అతను పెద్దగా పట్టించుకునే వ్యక్తి కూడా కాదు..... సరే! పూర్తి చెయ్యండి ఉత్తరం''అందామె.

''సరేవిను!''అని మళ్ళీ చదవటం మొదలెట్టారు.

''రాంబాబు! నేను ఇదేదో చాలా రహస్యంగా వుంచుతున్నాననుకోకు. మా నాన్నకి అమ్మకి కూడా వ్రాశాను ఈ విషయం, వాళ్ళు ఏమని వ్రాశారో తెలుసా? ''

''నిన్ను ఆ భగవంతుడు, కాపాడుతాడు. చాలా సంతోషం. ఇవే మా దీవెనలు. అని మూడుముక్కలు వ్రాసి క్రింద అమ్మ, నాన్న, అని మరీ వ్రాశారు. అది చూడగానే నా సంతోషానికి అవధులు లేకుండా పోయాయి. మా తల్లిదండ్రులు చాలా గొప్ప మనుష్యులు అని నేను చాలా గర్వంగా చెప్పుకునే కాలం మళ్ళీ ఆసన్నమయ్యింది.''

''సంగీత చాలా తెలివైనది, ఎంతో చురుకైనది, ఇప్పుడు సంగీత శాస్త్రంలో ఎంతో జ్ఞానం సంపాదించింది. రోజూ నాతో చర్చిస్తుంది. ఇప్పటికి నాకు సరైన జోడీ లభించినందుకు చాలా సంతోషంగావుంది''

''నా సెక్షన్‌లోనే పని చేస్తుంది, కనుక నాకు తెలుసు ఆమె చురుకుతనం''.

''రాంబాబు! ఇంకోసంగతి, వచ్చేనెల నేను సంగీత ఇండియాకివెడుతున్నాం. మా అమ్మ, నాన్నకి సంగీతని పరిచయం చేస్తాను. వీలవుతే అక్కడే మా వివాహం జరుగుతుంది. మళ్ళీ ఇండియాకి వెళ్ళాక నేను నీకు మెయిల్ ఇస్తాను. ఇక్కడికి తిరిగివచ్చాక నేను, సంగీత బఫెలో ఎలాగు వస్తాం, అప్పుడు మా పెళ్ళి పార్టీ ఇస్తాం. ఇది మా నిర్ణయం. ఇది గురుజీకి సీతగారికి తెలియచేయి. ఈ ఉత్తరం జానకిరామయ్య అంకుల్‌కి సీతా ఆంటీకి కూడా చూపించవలసినదిగా కోరుతున్నాను. ఇహ వుంటాను. నీ ప్రియమిత్రుడు అనంతం'' అని ఏకధాటిగా ఉత్తరం చదవటం ముగించి సీతగారి కేసి చూసి,

''సీతా! అది సంగతి'' అని ఒక వెర్రి నవ్వు నవ్వారు.

సీతగారు ఒక్కసారిలేచి ఒళ్ళు విరుచుకుంటూ ఆవలించి,

''అందరికంటే ఎక్కవగా నేను సంతోషపడుతున్నాను. ఇంకా మీకు చాదస్తం వదల్లేనట్లుంది'' అందామె.

''నాకు ఎప్పుడో ఒదిలిపోయింది. బావుంది...... చాలా..... సంతోషకరమైన వార్త. ఇంకా రాంబాబుకి వదల్లేదను ఒప్పుకుంటాను. కథ కంచికి మనం నిద్రకి'' అని ఆవలిస్తూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

ఇద్దరూ లేచి నిద్రకుపక్రమించారు.

***

# 9

''పోస్ట్!''

తలుపుకొట్టి అరిచాడు పోష్టుమాన్ వెంకన్న, సుబ్బరామయ్య మాష్టారింటి ముందు నిలబడి. మాష్టారు స్కూలునించి ఇంకా రాలేదు. రాజేశ్వరమ్మగారు సగం పనిలో వుండి చెయ్యి తుడుచుకుంటూ వచ్చి తలుపు తీశారు.

''అమ్మా! అబ్బాయిగారు ఉత్తరం రాశారు అమెరికానుంచి,'' అని ఆమెచేతికిచ్చి సైకిలెక్కి వెళ్ళిపోయాడు వెంకన్న.

రాజేశ్వరమ్మగారు తలుపు గడియబెట్టి లోపలికెళ్లారు.

ఈ మధ్యగా మాష్టారు స్కూలికి, ఇంటికి మధ్యలో ఎక్కువగా తిరుగుతున్నారు. ఏ ఘడియనైనా కొడుకు నుంచి ఉత్తరం రావచ్చునన్న ఆకాంక్షతో.

అనంతం ఆ మధ్య తన పెళ్ళి నిర్ణయం గురించి వ్రాసిన ఉత్తరం ఆదంపదుల మనస్సును కలచి వేస్తోంది. ఎన్నోసార్లు దానిని గురించి చర్చించుకున్నారిద్దరూ.

''వాడు ఇండియాలోనే వుంటే ఇలా జరిగివుండేది కాదేమో రాజేశ్వరీ! నేను అనంతం గురించి ఇంత ఇదిగా ఎప్పుడూ ఊహించలేదు. మనకి ఒక్క ముక్కయినా చెప్పకుండా వాడు ఈ నిర్ణయానికి వచ్చాడు. ఏమయినా బావుందంటావా! ఇది న్యాయమంటావా?'' అన్నారు మాష్టారు బాధపడుతూ.

రాజేశ్వరమ్మగారు మాట్లాడలేదు.

''మన ఇంటిగౌరవం, ప్రతిష్ఠ ఏంకాను. నాన్న బ్రతికి వుంటే అసలు వీడ్ని అమెరికా పంపిచి వుండేవాడుకాదు. పైగా పరిస్థితి ఇంతదాకా వచ్చిందని తెలిస్తే ప్రాణాయమం చేసుకొని వుండేవాడు. నాన్న ఎంతనిష్టా పరుడు. ఎంతో గౌరవంగా బ్రతికిన వ్యక్తి'' అన్నారు తన తండ్రి బ్రహ్మయ్యశాస్త్రిగారిని తలుచుకుంటూ.

''ఈ ప్రపంచాన్ని వదిలేసి వెళ్ళిపోయిన వ్యక్తులు మనంచేసే పనులలో ఎలా పాలు పంచుకుంటారండీ, వారి గౌరవం వారితోనే వుంటుంది. మనంచేసే పనులవల్ల వారి గౌరవానికే భంగము కలుగదు! చదువు సంధ్యలు సంపాదించుకుని, ఎవరి బ్రతుకులు వారు చూచుకున్నవారికొక వ్యక్తిత్వం వుంటుంది. నా ఉద్దేశ్యంలో అనంతం, మామగారికి మనవడే కాదు సరైన శిష్యుడు కూడా. మామగారు ఎంతో విశాలహృదయులు. అనంతం ఆయన దగ్గర వేదమే కాకుండా వేదాంతం కూడా నేర్చుకున్నాడు చిన్నతనంలోనే, మామగారే వున్నట్లయితే వాడి వివాహం ఆయన చేతుల ద్వారానే జరిగి వుండేదేమో. మన చేతులలో ఏముంది. వాడికి అలా రాసిపెట్టివుంది. కానియ్యండి, అంతా దైవ నిర్ణయం'' అంటూ వూరడిస్తున్నారు రాజేశ్వరమ్మగారు మాష్టారుని.

''అది సరే! రాజేశ్వరీ! ఆ అమ్మాయి కుల గోత్రాలు, కుటుంబపరిస్థితులు, మనకేం తెలియవు. అనంతం ఇవేమి పట్టించుకునే వ్యక్తి కూడా కాదు. నాకు తెలుసు, అనంతం ఒకవెర్రివాడు. తప్పకుండా వీడిని ఆ అమ్మాయి బుట్టలో వేసుకుందేమోనని నా నమ్మకం. ఏమిటంటావ్! రాజేశ్వరీ నాకేం తోచటం లేదు.'' అంటూ కంటినీరుకూడా పెట్టుకున్నారు మాష్టారు.

మాష్టారుని వూరడిస్తూ బాధపడి దుఃఖించారు రాజేశ్వరమ్మ గారు.

''నాకన్న నీకే ఎక్కువ ధైర్యం రాజేశ్వరీ! నన్ను సముదాయిస్తూ నువ్వు దుఃఖిస్తున్నావు. ఒద్దు! ఒద్దు! నువ్వు బాధపడకు,'' అన్నారు మాష్టారు కళ్ళుతుడుచుకుంటూ.

ఈ విషయం వారిద్దరి మధ్యే తిరిగేది తప్ప మరెక్కడికీ ప్రాకేది కాదు.

ఒకరినొకరు సముదాయించుకుంటూ వుండేవారు. వారింటిలో ఈ మధ్యగా చాలా నిశ్శబ్దం అలుముకుంది.

మాష్టారు ఇంటిముందు సైకిలాపి సైకిలు బెల్లు మ్రోగించారు. మాష్టారి కదో అలవాటు. ఇంటికి చేరుకుని సైకిలు బెల్లు మ్రోగిస్తారు. ఎప్పటి లాగే రాజేశ్వరమ్మ గారు వీధీ తలుపుతీశారు. మాష్టారు సైకిలుకి స్టాండు వేస్తూ,

''నేనూ మళ్ళీ తొందరగా వెళ్ళాలి. అన్నం వడ్డించు. అబ్బాయి మళ్ళీ ఎమన్నా వ్రాశాడా,'' అంటూ ఇంట్లోకి వచ్చారు.

''అదిగో ఇప్పుడే వచ్చింది ఉత్తరం ఆ బల్ల మీదుంది.'' అని చూపించారామె.

''ఏం నువ్వు విప్పిచదవలేదా!'' అన్నారు.

ఏమీ సమాధానం చెప్పలేదామె.

''లేచి కాళ్ళు కడుక్కోండి భోజనం చేద్దురుగాని'' అన్నారామె పట్టలేని దుఃఖాన్ని అపుకుని కళ్ళు తుడుచుకుంటూ.

''ఎందుకు రాజేశ్వరీ బాధపడుతున్నావు, వూరుకో'' అని దొడ్లోకి కాళ్ళు కడుక్కునేందుకు వెళ్ళారు మాష్టారు.

ఇదివరకల్లా ఎప్పుడూ వీధి తలుపు తీసుకుని పోస్టుమాన్ కోసం కాచుకుని కూర్చునేవారు రాజేశ్వరమ్మగారు. ఎప్పుడూ వీధి తలుపు తీసే వుండేది. ఈ మధ్యగా పోస్టు గురించి పెద్దగా పట్టించుకున్నట్లు కనిపించటంలేదామె.

అబ్బాయి దగ్గిర నుంచి ఉత్తరం వస్తే అమె ముందుగా గబగబ కవరుచింపి కళ్ళజోడు కోసం కాస్సేపు వెతుక్కుని తెచ్చుకుని, కనీసం రెండుమూడుసార్లు ఉత్తరం చదువుకుని దానితో అనంతం పంపిన చెక్కు వెనుక సంతకం చేసి మాష్టారు కిచ్చేవారు. ఇది ఎప్పుడూ కొన్ని సంవత్సరాలుగా, అనంతం ఇండియా ఒదిలినప్పటి నుంచి జరుగుతున్న సంగతి.

ఈసారి ఎందుకో ఆమె ఆ ఉత్తరం కేసి కూడా చూడకుండా ఆటేబులు మీద పడేసి, దానికేసి చూస్తూ కంటి నీరు కారుస్తూ మాష్టారు కోసం ఎదురుచూస్తూండి పోయారు.

మనం ఎందుకింతగా బాధపడి ఆలోచిస్తున్నావము. అనంతం నిర్ణయానికిఎందుకు మనకు వాడి మీద ఇంత ఆశ, మమకారం, వాడికీ వయస్సు వచ్చింది. వివాహం మనిషి వ్యక్తిత్వానికి సంబంధించిన విషయం. అనంతం తానూఒక వ్యక్తినని, నాకూ వ్యక్తిత్వం ఉందని నిరూపించుకున్నాడు,'' అని మనస్సు కుదుటపడుచు కుని చెబుతూ మాష్టారి ని వూరడిస్తున్నారామె.

మాష్టారు వట్టి బోళా బోళీ మనిషి. ఏదొచ్చినా తట్టుకునే వ్యక్తికాదు. పైకికనబడరు, లోపల మధనపడుతుంటారు, ఒక్క ముక్క కూడా పైకి ఏదీ చెప్పకునే వ్యక్తి కాదు.

మాష్టారుని చూచి రాజేశ్వరమ్మ గారు బాధపడుతుంటారు.

''పోనీ ఒక్కసారి కంతేరు చిన వెంకటాచారికి కబురు చెయ్యండి. అతను మన అంతరంగికుడు. ఒక్కసారి ఆయనతో కూడా ఈ విషయం సంప్రదించండి మనస్సు కాస్త తేలికబడుతుంది. ఎన్నిసార్లు మనం చెర్చించుకుంటాం'' అన్నారు. రాజేశ్వరమ్మ గారు. ఈ విషయం తెలిసినప్పటి నుంచి

''వాడు మాత్రం ఏం చెబుతాడు రాజేశ్వరీ! నీ వెర్రికాని, పైగా వాడు పిల్లపెళ్ళి వ్యవహారంతో సతమతమవుతున్నాడు. ఎలాగూ వాడితో చర్చించకుండా ఏ విషయం మాత్రం నేను దాచి పుచ్చాను ఇంతవరకూ. ఎవరయినా ఈ ప్రపంచంలో ఏదయినా మనం చెప్పకునే ఒకే ఒక అంతరంగిక వ్యక్తి వాడు కాక మరెవరు మనకి. ఒకటి,రెండు రోజులలో కంతేరు వెళ్ళి చినవెంకడితో కూడా మాట్లాడతాను.'' అన్నారే కాని ఇంతవరకు పడలేదు.

కాళ్ళు కడుక్కుని మోహం తుడుచుకుంటూవొచ్చి, లోపలికొస్తూ అన్నారు మాష్టారు.

''రాజేశ్వరి! నాకు చాలా ఆశ్చర్యంగా వుంది.'' ఇంతవరకు నువ్వు ఆ ఉత్తరం చదవనందుకు, ఏమిరాశాడో ఏమిటో'' అంటూ ఒక్కసారి అటేబులు మీద వున్న కవరుని పట్టుకుని చూచారు.

''చాలా బరువుగా వుంది రాజేశ్వరీ, ఏవో ఫోటోలు కూడా పంపినట్లున్నాడు. బహూశా చెక్కు కూడా వుండి వుంటుంది'' అన్నారు.

''ఆ ఉత్తరం అలా వుంచి, ముందు భోజనం చెయ్యండి. మళ్ళీ వెళ్ళాలి, పనుందన్నారు కదా. ఇప్పుడీఉత్తరం చదవటం ప్రారంభిస్తే స్కూలుకి వెళ్ళటం పడదేమో కొంచెం ఓపిక పట్టండి'' అన్నారామె.

''ఏం ఫరవాలేదులే, చూద్దాం ఏం రాశాడో'' అని ఒక్కసారి, ఆగలేక కవరు చించి చూశారు.

అందులో ఏవో ఫోటోలు, ఒక పెద్ద ఉత్తరం, ఒక పదివేల డాలర్ల చెక్కు కనిపించాయి.

''ఈ వ్యవహారం చూస్తే ఇప్పుడప్పుడప్పుడే తెమిలేట్టులేదు, తరువాత చదువుతాను టైములేదు. ఈలోగా నువ్వు చదువుకో'' అని భోజనానికి ఉపక్రమించారు మాష్టారు.

భోజనం చేస్తున్నంతసేపూ, 'ఏం రాశాడో ఏమిటో, పిచ్చి వెధవ !' అనుకుంటూ భోజనం ముగించి హడావిడిగా సైకిలెక్కి స్కూలుకి వెళ్ళిపోయారు మాష్టారు.

తలుపేసుకొని మాష్టారుని తలుచుకుని నేలమీద అలా కూలబడి కూర్చుని ఏవేవో తలుచుకుంటూ దుఃఖించసాగారు, ఆసాధ్వి.

తను బాధపడితే మాష్టారు విపరీతంగా కలత చెందుతారు అని తెలుసామెకు. ఆఉత్తరం జోలికి వెళ్ళకుండా నాలుగు మెతుకులు కతికి వంటి ంటి గడపమీద ఎప్పటిలాగే చెంగువేసుకుని నిద్రపోయారు రాజేశ్వరమ్మ గారు.

ఆ సాయంత్రమంతా మనస్సు మనస్సులో లేదు మాష్టారుకి. తొందరగా పని ముగించుకుని ఇల్లు చేరి బెల్లు మ్రోగించారు. ఆమె తలుపు తీసి వెళ్ళి కుర్చీలో కూర్చున్నారు. మాష్టారు ఆ టేబులు మీద కవరు అలాగే వుండటం చూచి

''రాజేశ్వరీ! ఉత్తరం చదివావా'' అన్నారు

''లేదు!'' చాలా ముభావంగా అన్నారామె.

''అదేమిటి రాజేశ్వరీ! అమెరికాలో వున్న కొడుకు దగ్గర నుంచి ఉత్తరం వస్తే చదవకుండా అలా ఉత్తరం కేసి చూస్తూ కూర్చున్నావా ఇంతసేపూ'' అన్నారు మాష్టారు.

''నాకు అనంతం గురించి ఏమీ బాధలేదండి, మీ ఆరోగ్యం నాకు చాలా ముఖ్యం, ఈ ఆలోచనలన్నీ మనస్సులో పెట్టుకుని మీ ఆరోగ్యంపాడుచేసుకుంటారేమోనని భయం'' అంటూ చాలా బాధగా దుఃఖించసాగారు ఆమె.

తలనిమురుతూ ''ఊరుకో రాజేశ్వరీ నా ఆరోగ్యం గురించి బాధ ఎందుకు చెప్పు. నన్ను సత్యం డాక్టరు గారు బాగానే చూసుకుంటున్నారు. నాకు బాగానే వుందిగా, హాయిగా వున్నాను. అనంతం గురించి నువ్వే నా కన్న ఎక్కువగా బెంగ పెట్టుకుం టున్నావు. అవునా! బాధపడకు. ఏమీ జరగదు అన్నీ సజావుగా జరుగుతాయి''. అని ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుంటూ ఆమెని సముదాయించి ఉత్తరం చదవటం ప్రారంభించారు మాష్టారు.

''అమ్మకు, నాన్నకు నమస్కారములు మీరు వ్రాసిన మూడు పంక్తుల ఉత్తరం అంది సంతోషించినాను''

ఒక్కసారి పట్టలేని దుఃఖం ఆపుకోలేక పమిటచెంగు నోటికి కప్పుకుని దుఃఖం ఆపుకునేందుకు ప్రయత్నం చేస్తున్నారామె.

ఉత్తరం చదవటం ఆపి ''ఊరుకో రాజేశ్వరీ! ఎందుకు బాధపడతావ్ ఊరుకో! ఊరుకో!!'' అని సముదాయించసాగారు మాష్టారు.

''అది కాదండీ! మనం ఎప్పుడయినా వాడికి మూడు ముక్కల ఉత్తరం వ్రాశామా! వెర్రివెధవ మనం వ్రాసిన మూడు ముక్కల ఉత్తరం ఎంతో కుతూహలంగా తెరిచి ఆ మూడు ముక్కలు ముప్పై సార్లు చదువుకుని ఎంత బాధపడి వుంటాడోనని బాధేస్తోంది'' అని బడబడా ఆపులేకుండా ఏడవసాగారు.

మాష్టారు ఏమీ చెయ్యలేక ఏదో తప్పు చేసిన వానిలా ఆమెకేసి చూస్తూ అలా వుండిపోయారు.

మాష్టారుకేసి చూచి కళ్ళుతుడుచుకుంటూ ''చదవండి, వాణ్ణి తలుచుకుని జాలేసి దుఃఖం ఆపుకోలేక పోయాను,'' అన్నారామె ఒణుకుతూన్న బొంగురుపోయిన కంఠం తో.

మాష్టారు మళ్ళీ ఉత్తరం చదవటం ప్రారంభించారు.

''అమ్మా! ఆ అమ్మాయి చాలా చురుకైనది. చాలా తెలివైన పిల్ల. ఆమె పేరు సంగీత. నేనంటే ఎంతో ఇష్టపడుతుంది.'మంచి స్నేహితురాలు. నా సెక్షన్‌లోనే పని చేస్తుంది. బఫేల్లోలోనే ఆ అమ్మాయితో పరిచయమయింది.''

''సంగీత పియానో వాయిస్తుంది. కర్ణాటక సంగీతంలో ఎంతో మక్కువ చూపిస్తుంది. ఇంతవరుకూ నేను ఎవరితోనయినా సంగీత శాస్త్రం గురించి మాట్లాడుతున్నానంటే వీరిద్దరే వ్యక్తులు నాకు.''

''ఇండియాలో నాన్న, తాతలతో చర్చించుతూ ఎంతో నేర్చుకున్నాను.''

''సంగీతకి పాశ్చాత్య సంగీతంలో ప్రావీణ్యం వుంది. ఇప్పుడు కర్ణాటక సంగీతాన్ని స్టాఫ్‌నోటేషన్ లో వ్రాయటం కూడా నేర్చుకుని నాతో చర్చిస్తుంది. నేను కూడా ఆమె నుంచి ఎన్నో విషయాలు నేర్చుకున్నాను.''

మాష్టారు ఒకసారి ఉత్తరం చదవటం ఆపుచేసి రాజేశ్వరమ్మగారికేసి చూశారు.

ఆమె ఏమీ మాట్లాడకుండా అలా ఎటో చూస్తుండి పోయారు.

''రాజేశ్వరీ! ఏమిటి ఆలోచిస్తున్నావు'' అన్నారు.

ఒక్కసారి ఈ ప్రపంచంలోకి వచ్చారామె.

''ఏమీ లేదండి ఆపిచ్చి వెధవని తలుచుకుంటె జాలేస్తోంది. వీడికీమనస్తత్వం ఎక్కడి నుంచి వచ్చిందా అని ఆలోచిస్తున్నాను.'' అన్నారామె.

''ఎంతసేపూ సంగీత, సంగీతం అంటాడే కాని ఆ అమ్మాయి కులగోత్రాల గురించే మీ రాయడే,'' అని వాపోయారు మాష్టారు,

''వాడికి కులగోత్రాలు యోచించే మనస్తత్వం లేదు. వాటి గురించి మీరు , మామగారు చర్చించుకుంటుంటె వింటూ కూర్చునేవాడు. వాడి మనస్తత్వం చాలా సున్నితమైనది. వాడికీ వయస్సు వచ్చింది. జీవితంలో కొన్ని ముఖ్యమయిన నిర్ణయాలు తీసుకునే పరిస్థితి వచ్చింది. సరే! చదవండి ఇంకా ఏం రాశాడో'' అన్నారు ఆమె.

మళ్ళీ చదవటం మొదలుపెట్టారు మాష్టారు.

''తాత చెప్పిన మాటలు ఇంకా ఈ నాటికీ నా చెవుల్లో గింగురుమంటున్నాయి. తాత, కుంటి మాష్టారు వేదాంతం మీద చర్చలు నేనింకా మరిచిపోలేదు.''

''అన్ని విధాలుగాను సంగీత నాకు చాలా నచ్చిన పిల్ల, అందువల్ల నేనే ఒక నిర్ణయానికి వచ్చాను. నాకు తెలుసు నువ్వు, నాన్న కూడా ఈ పెళ్ళికి తప్పకుండా ఒప్పుకుంటారని, అదే విషయం నేను ఆ మధ్య వ్రాసిన ఉత్తరంలో వ్రాసిన వెంటనే మీ దగ్గిర నుంచి వచ్చిన జవాబుని ఆధారంగా తీసుకుని సంగీతకి మాట ఇచ్చాను.''

''అప్పటి నుంచి నేను, సంగీత కలసి ఒక జాయింట్ ఎక్కవుంటు కూడా బ్యాంకులో ఓపెన్ చేసుకున్నాము. సంగీత ఎంతో జాగ్రత్తయిన పిల్ల. చాలా పొదుపరికూడా. డబ్బు ఎంతో జాగ్రత్తగా ఖర్చు పెట్టి ఎలా దాచుకోవాలి, ఎలా వృద్ధి చెయ్యాలి, అని ఎప్పుడూ నాకు చెబుతూంటుంది. నాకిప్పుడు హాయిగా వుంది. ఒక అమ్మాయి నావిషయాలలో ముఖ్యంగా ఫైనాన్షియల్ వ్యవహారాలలో ఎంతో జాగ్రత్త చూపుతోంది. మీకు తెలుసు, నాకు ఈ వ్యవహారాలేమి పట్టవని.''

''నాకనిపిస్తుంది, ఇప్పటికి నాకు సరియైన అమ్మాయితో పరిచయం కలిగినందుకు చాలా సంతోషంగా వుంది.''

మాష్టారు ఉత్తరం చదవటం ఆపి ఒక్కసారి ఎక్కడికో చూస్తుండిపోయారు. రాజేశ్వరమ్మగారు మాష్టారుకేసి చూస్తుండి పోయారు. కొంతసేపు ఇద్దరి మధ్య నిశ్శబ్దం అలుముకుంది.

''రాజేశ్వరీ! అనంతం ఒక వ్యవహారకర్త అయ్యాడు. చాలానే నేర్చుకున్నాడు ఆ అమ్మాయి దగ్గిర. బాగుపడే లక్షణాలేనంటావా అన్నారు ఏమనాలో తెలియక

రాజేశ్వరమ్మగారు మాట్లాడలేదు.

''అనంతం పంపుతున్న డాలర్లు నువ్వు కూడా ఎంతో జాగ్రత్తగా మీ జాయింట్ ఎక్కువుంట్లో దాచి వృద్ధి చేస్తున్నావుకదా. నువ్వు మాత్రం ఏం తక్కువ చేశావ్. ఇప్పటికే ఎన్నో లక్షలు పేరుకుపోయింది ఇండియన్ బ్యాంక్‌లో, ఏం చేస్తావ్ రాజేశ్వరీ! ఆ సొమ్ముతో'' అడిగారు మాష్టారు.

రాజేశ్వరమ్మ గారు మాట్లాడలేదు.

''అనంతం తన కుటుంబంతో ఇండియాకి తిరిగి వచ్చేవరకు డబ్బుపోగుచేస్తాండు. అప్పుడు ఒకవేళ వాడు ఇండియాలోనే స్థిరపడితే ఒక పెద్ద బంగాళా కట్టుకుంటాడా డబ్బుతో. పెళ్ళాం పిల్లలతో హాయిగా గడుపుతాడు. మనలాగ ఏ నెలకా నెల ఎలాగడుస్తుందిరా అని బాధ పడనవసరం లేదు, ఏమంటావ్ రాజేశ్వరీ'' అన్నారు.

ఆమె మాట్లాడలేదు.

''రాజేశ్వరీ వీడి వ్యవహారం చూస్తే అసలు ఇండియాకి వచ్చేలా లేడు.వస్తాడంటావా?'' అన్నారామె కేసి చూచి ఆవేదన ప్రకటిస్తూ.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

మాష్టారు కూడా కాస్సేపు మౌనం వహించారు.

''చదవండి ఇంకా ఏం రాశాడో అన్నారామె''. కొంచెం ఊపిరి పీల్చుకుని.

ఉత్తరం బల్లమీద పెట్టి ఒకసారి వంటింట్లోకి వెళ్ళి మంచి నీళ్ళు త్రాగి ఒక గ్లాసుతో మంచి నీళ్ళు తెచ్చి ఆమెకిచ్చి మళ్ళీ కూర్చీలో కూర్చున్నారు.

రాజేశ్వరమ్మగారు మాష్టారుకేసి చూస్తుండిపోయారు.

''బాధపడుతున్నారా'' అడిగారామె.

''లేదు రాజేశ్వరీ, నాన్నని తలుచుకుని సంతోషపడుతున్నాను. నాన్న చెప్పిన వేదాంతం వాడికి వంటబట్టినట్లుగా నాకు వంట బట్టలేదని బాధపడుతున్నాను,'' అన్నారు వేదాంత ధోరణిలో.

''రాజేశ్వరీ! మిగతా విషయాలు నువ్వు చదవరాదు'' అన్నారు.

ఆయన మోహంలో ఒక చెప్పలేని నిస్సాహాయత స్పష్టమౌతోంది.

''ఆకళ్ళజోడు ఎక్కడుందో, వెతుక్కునే ఓపిక లేదండీ. మీరే చదవరాదు'' అన్నారామె.

ఆబల్ల మీదున్న ఉత్తరం తీసి మళ్ళీ చదవటం ప్రారంభించారు మాష్టారు.

''నాకు డ్రైవింగ్ వచ్చినా ఇంకా కారు కొనుక్కోకపోవటం ఇక్కడి వారందరికి చాలా ఆశ్చర్యంగా వుంది. ప్రస్తుతం ఆఫీసు వారిచ్చిన కారుతోనే కాలక్షేపం చేస్తున్నాను. ఇన్నాళ్లైనా కారు కూడా కొనుక్కోలేదు అనంతం అని ఆశ్చర్యపడుతుంటారు స్నేహితులు. ఈ దేశంలో ఇంతకాలంగా వుండి కారు కూడా కొనుక్కోని ఒకానొకవ్యక్తి నేనే ఏమో అనిపిస్తుంది. దానికి టైము రావాలి. నేను పెద్దగా పట్టించుకోను. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, ఈ మధ్యగా సంగీత నన్ను తన కారులోనే ఆఫీసుకు తీసుకెళ్ళి మళ్ళీ సాయంకాలానికి నన్ను డ్రాప్ చేస్తూంటుంది.''

''రోజు రాత్రిళ్ళు ఎక్కడికో బయటకు వెళ్ళి భోజనం చేస్తూంటాము. నాకున్న కట్టుబాట్లు భోజనం విషయంలో సంగీతకి లేవు. ఆమె ఎక్కడబడితే అక్కడ చాలా సులభంగా గడిపేసుకుంటుంది. ఇదే అమెరికాలో పుట్టిపెరిగిన పిల్లలలో వున్న మంచి లక్షణం, నాకు చాలా నచ్చిన విషయం. ఇక్కడి వారు మనలాకాక జీవితాన్ని ఎంతో తేలికగా తీసుకుంటారు. అసలయిన ప్రాక్టీకల్ ఫిలాసఫీ వీళ్ళల్లోనే వుందనిపిస్తుంది నాకు. మనం చెప్పుకుంటున్న వేదాంతం, నాకిక్కడ కనిపిస్తుంది. ఇక్కడ ఎవరికి వారే యమునా తీరే అన్న పద్ధతి ఎక్కువగా వుంటుంది. బ్రతికినంతకాలం హాయిగా ఎవరినీ నొప్పించకుండా బ్రతకటానికి ప్రయత్నిస్తారు. అదీ ఒకరకంగా ఆలోచిస్తే హిందూ ఫిలాసఫీ అనిపిస్తుంది.''

''మేమిద్దరం కలిసి తిరగటం మా స్నేహితులంతా గమనించారు, ఎంగేజ్మెంటు పార్టీ ఇవ్వమని పీకేశారు. మొన్న నామధ్యనే ఎంగేజ్మెంట్ పార్టీ కూడా ఇచ్చాము. అప్పుడే మీకు వ్రాశాను ఉత్తరం మా నిర్ణయం గురించి. ''

''ఇండియాకి వెళ్ళి పెళ్లి చేసుకుందాం అన్నాను సంగీతతో. మా పేరెంట్సు, ఇక్కడేవున్నారు, వాళ్ళు ఇండియాకి రాను, మాకు ఇండియాలో ఎవ్వరులేరు,

అందుకని ఇక్కడే పెళ్ళి చేసుకుందాం అంది సంగీత. మాస్నేహితులంతా ఎంతో బలవంతం చేశారు.''

''మీరు ఎన్నాళ్ళు కలిసి తిరుగుతారు. మీ తల్లితండ్రుల నుంచి కూడా ఆశీస్సులు వచ్చాయి కదా! కానివ్వండి. మేమంతా సాక్షులం పెళ్ళిఫొటోలు ఇండియాకి పంపించండి. వాళ్ళు చాలా సంతోషిస్తారు అని బలవంతం చేశారు. మేము ఇంతకాలంగా కలిసి తిరుగుతూండటం మీకు కూడా ఇష్టం వుండదని నాకు బాగా తెలుసు. అందుకని సరే మీ ఇష్టం కానివ్వండి అని ఒప్పుకున్నాను.''

''క్రితం ఆదివారం సెయింట్ పాట్రిక్స్ చర్చిలో నాకూ సంగీత కీ వివాహం జరిగింది.''

మాష్టారు ఉత్తరం చదవలేక పోయారు. చదవటం ఆపుచేశారు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. కంఠం ఒణికింది. ''రాజేశ్వరీ! ఒక గ్లాసు మంచి నీళ్ళు పట్రా'' అన్నారు.

ఆమె కంగారుగా భయపడుతూ మాష్టారు దగ్గిరకి చేరి. పమిట చెంగుతో ముఖం తుడిచారు.

''ఏమండీ ఏమయింది, మీకు ఎలా వుంది ఒంట్లో, చెప్పండి చెప్పండీ!'' అని భయోత్పాతంతో ఆవేదన పడ్డారు.

''రాజేశ్వరీ! నాలో సత్తువ క్షీణిస్తోంది. నాలుక పొడారిపోతోంది. మంచి నీళ్ళు పట్రా'' అన్నారు.

ఆ మంచం మీద వున్న తలగడా కింద వున్న మాత్తర్ల సీసా గబగబా తెరిచి ఒకటి రెండు మాత్రలు నాలుక కిందపెట్టుకున్నారు.

మాష్టారు కొంత కాలంగా బి.పి., షుగరుతో బాధపడుతున్నారు.

ఆమె గబగబా వంటిట్లోకి వెళ్ళి గ్లాసుతో మంచి నీళ్ళు పట్టుకొచ్చారు. ఆ నీళ్ళతో మాష్టారి ముఖం తుడిచి మంచం మీద పడుకోబెట్టారు.

''ఫరవాలేదు రాజేశ్వరీ! నువ్వు కంగారుపడకు. ఏమిటో నాకు తెలియకుండా ఒక్కసారి కళ్ళు చీకట్లు కమ్మాయి. నీరసం వచ్చి కళ్ళు తిరిగినట్టయింది.

బహాశా దీన్ని షాక్ అంటారేమో నాకు తెలియదు. ఒక్కక్షణం, అదేమిటో! అంతా చీకటి గా అనిపించింది.'' అన్నారు ఒణుకుతోన్న కంఠంతో.

''మీరుకాస్సేపు అలా పడుకోండి మంచినీళ్ళు త్రాగండి'' అని నీళ్ళు పట్టించారు. మీద పోసుకుంటూ గబగబా మంచినీళ్ళు త్రాగారు. విసురుతూ మంచం మీదకూర్చుని వున్నారు రాజేశ్వరమ్మగారు.

''పోని ఒకసారి సత్యం డాక్టరుగారికి కబురు చేద్దాం అండి'' అన్నారు ఆవేదన పడుతూ.

''ఇప్పుడేం వద్దు. నాకు బాగానే వుంది. రాజేశ్వరీ! నువ్వు ఎలా వున్నావు'' అడిగారు మాష్టారు పడుకునే

''బాగానే వున్నాను. ఎందుకండీ అంత బాధపడతారు. ఊరుకోండి హాయిగా విశ్రాంతి తీసుకోండి'' అన్నారు.

ఆమెకేసి చూశారు మాష్టారు.

''రాజేశ్వరీ!'' పిలిచారు మాష్టారెంతో నిస్సహాయతతో. ఆ పిలుపులో ఎంతో నిస్పృహ వుంది.

రాజేశ్వరమ్మ గారు ఆపుకోలేని దుఃఖంతో ఒక్కసారి మాష్టారి ముఖం చూడలేక పోయారు.

''ఎందుకండీ బాధపడతారు, వాడుహాయిగా పెళ్ళి చేసుకున్నాడు. వాడికి కావలసిన అమ్మాయిని చేసుకున్నాడు'' అన్నారు ఒణుకుతోన్న కంఠంతో.

కాస్సేపు వారిద్దరి మధ్య మౌనం అలుముకుంది.

''రాజేశ్వరీ! అసలా అమ్మాయి ఎవరో, కులం ఏమిటో, గోత్రం ఏమిటో, మతం ఏమిటో, శాఖహారులో, మాంసాహారులో ఏమి తెలియదు. ఈ పిచ్చి వెధవ ఆ విషయాలేమి వ్రాయడు. సంగీతం అంటాడు, సంగీత అంటాడు. నా బుర్ర తిరిగి పోతోంది'' అన్నారు మాష్టారు ఎంతో బాధపడుతూ.

ఆమె ఏమీమాట్లాలేదు.

చేతితో సౌజ్ఞ చేస్తూ కళ్ళుముసుకుని పడుకోమని మూగపోయిన కంఠంతో మాష్టారుని ఊరడిస్తూ విసురుతూ కుర్చున్నారామె.

కొంతసేపు మళ్ళీ ఇద్దరి మధ్య మౌనం ఆవహించింది.

కాస్సేపు తేరుకుని ''రాజేశ్వరీ! నువ్వు చదువు ఇంకా ఏమంటాడో'' . అన్నారు మాష్టారు.

ఆమె ఒకసారి వంటింట్లోకి వెళ్ళి గూట్లోవున్న కళ్ళజోడు తెచ్చుకుని, సరిచేసుకుని బల్ల మీద ఉత్తరం తీసుకుని ఒకసారి మాష్టారు కేసి చూచారు.

''ఫరవాలేదు! నాకు బాగానే వుంది, చదువు రాజేశ్వరీ, ఇంక ఈ ప్రపంచంలో ఏ విషయానికైనా నేనింక లొంగబోను. ఇలా నా ప్రక్కనే కూర్చో రాజేశ్వరీ!'' అన్నారు మాష్టారు.

వస్తూన్న దుఃఖాన్ని అణుచుకుంటూ మాష్టారు ప్రక్కనే కూర్చుని కాస్సేపు విసిన కర్రతో విసురుతూ మాష్టారుకేసి చూస్తూ వుండి పోయారామె.

''రాజేశ్వరీ! నువ్వు నా ప్రక్కనేవుంటే నాకు ఎక్కడ లేని ధైర్యం వస్తుంది. ఫరవాలేదు. చదువు రాజేశ్వరీ'' అన్నారు మాష్టారు అలాగే పడుకుని.

ఆ చుట్టు ప్రక్కల వారు ఆదంపతులని ఆదర్శ దంపతులుగా భావిస్తారు. ఆ ప్రక్కనే వున్న రాజు వీర్ని పార్వతీ పరమేశ్వరుగా భావించి రోజుకొకసారి వారిని దర్శించి నమస్కారం చేసి భోగట్టా కనుక్కుని వెడుతుంటాడు.

ఆమె ఒక చేత్తో మాష్టారుకి విసురూతూ మరో చేత్తో ఉత్తరం పట్టుకుని చదవసాగారు.

''అమ్మా! నేను, సంగీత కలిసి ఇండియాకి రెండు మూడు వారాలలో వస్తున్నాం. మళ్ళీ కరెక్టుగా ఎప్పుడోచ్చేదీ తెలియపరుస్తాను. అక్కడ మీ ఇష్ట ప్రకారం హిందూ సాంప్రదాయ పద్ధతిలో వివాహం చేసుకుంటాం. సంగీతని కూడా నేను ఒప్పిస్తున్నాను.''

''అసలు సంగీతకి ఇండియాలో పెళ్ళి చేసుకోవటం పెద్దగా ఇష్టం వుండదు. దాని వెనుక ఒకపెద్ద కథ వుంది. అది ఈ సందర్భంలో చెప్పుకోవటం అంతసమంజసం కాదు. అయినా నాకు తప్పుగా అనిపించటం లేదు.''

ఒక్కసారి రాజేశ్వరమ్మగారు ఉత్తరం చదవటం ఆపి అనుమానంగా మాష్టారుకేసి చూశారు.

''రాజేశ్వరీ! మనం పాషాణాలం, ఫరవాలేదు, ఇంక ఎన్ని దెబ్బలకయినా ఓర్చుకోగలం. చదువు రాజేశ్వరీ!'' అన్నారాయన ఎక్కడ లేని ధీమా ప్రదర్శిస్తూ,

మళ్ళీ చదవటం ప్రారంభించారామె.

''సంగీతకి ఇంజనీరింగు మొదటి సంవత్సరం చదువుతుండగా ఇండియాలో మెడిసెన్ చదువుతున్న కుర్రవానితో వివాహం జరిగింది.''

రాజేశ్వరమ్మగారికి ఒక్కసారి ఒణుకొచ్చింది. ఉత్తరం చేతిలోంచి జారిపోయింది. ఆపుకోలేని దుఃఖం పొర్లిపొర్లి వచ్చింది. మాష్టారుకి నోటమాటరాలేదు. వెల్లకిలా పడుకుని అలా చూస్తుండిపోయారు. కళ్ళంట బటబటా నీళ్ళు కారుతున్నాయి. రాజేశ్వరమ్మ గారి చెయ్యి గట్టిగా పట్టుకున్నారు. మరో చేత్తో ఆమె కంటి నీరు తుడుస్తున్నారు. ఆమె పమిట చెంగుతో మాష్టారి కళ్ళుతుడిచారు.

''మీరు బెంగపెట్టుకోకండి, జరిగిందేదో జరిగింది. మనం ఎందుకు ఇంత దుఃఖ పడుతున్నామో నాకు తెలియటం లేదు. ఆ జగన్నాటకంలో మనం సూత్రాధారులం మాత్రమే'' అని ఒణుకుతున్న కంఠంతో మాట్లాడుతూ ఒక్కసారి దుఃఖం ఆపుకోలేక మాష్టారుకి విసురుతూ బడబడా ఏడ్చారు.

''ఊరుకో రాజేశ్వరీ! నువ్వు చెప్పినట్లు మనం సూత్రధారులమే, ఏడవకు రాజేశ్వరీ'' అని సముదాయించారు మాష్టారు.

కాస్సేపు వారిద్దరి మధ్య మాటామంతీ లేదు. కళ్ళల్లో తడి ఆరిపోయింది.

''అమ్మాయికి ద్వితీయ వివాహం'' అన్నారు అప్రయత్నంగా.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

''రాజేశ్వరీ! ఉత్తరం చదువు''

''ఏముంది చదవటానికి''

''చదువు రాజేశ్వరీ! ఇంకా ఏం రాశాడో! వెర్రి వెధవ''

''వాణ్ణి చూస్తే జాలేస్తోందండీ.'' అని ఒక్కసారి బాధపడ్డారామె.

''పోనిలే రాజేశ్వరీ! ఫరవాలేదు! చదువు''

ఆమె చదవటం ప్రారంభించారు.

''ఆ వివాహం ఆమెకు సుతరాము ఇష్టం లేదు. ఆ కుర్రవాడు ఇండియాలో చాలా పలుకుబడి వున్న ధనవంతుల కుటుంబంలోంచి వచ్చిన వ్యక్తి. సంగీత నాన్నకి వారితో ఇండియాలో ఎన్నో లావాదేవీలు వుండుట మూలంగా ఈ పెళ్ళి తలబెట్టి చివరికి సంగీతకి ఆ కుర్రవానితో వివాహం చేశారు. ఆ కుర్రవాడు ఎంతసేపూ ఇండియాలో తన తండ్రికున్న పలుకుబడి ఆస్తి వివరాలు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తూ కష్టం అంటే ఏమిటో తెలియక ఎంతసేపు సంగీత కుటంబం మీద ఆధారపడుతూ తన తండ్రి ఇండియా నుంచి పంపే రూపాయలు డాలర్లుగా మార్చుకుని జీవించటానికి ప్రయత్నించటం సంగీతకి ఇష్టం లేకపోయింది. ఈ కుర్రవాడు సంగీత కుటుంబానికోక లయబిలిటీగా తయారయ్యాడు. సంగీత చదువుకు కూడా కొంత అంతరాయం కలిగింది. దానితో ఆమెకు, వాళ్ళ అమ్మకు విసుగెత్తి ఆ కుర్రవాణ్ణి తన స్వయం శక్తితో బ్రతకమని బయటకు పంపారు. చివరికి సంగీతకి ఆ కుర్రవానికి విడాకులు జరిగింది. ఇది సంగీత నాతో చెప్పుకుని చాలా దుఃఖించింది.''

''సంగీత ఎంతో తెలివైన వ్యక్తి, ఎంతో వ్యక్తిత్వం గలపిల్ల. నాకు, ఆ అమ్మాయికి జరిగిందంతా తెలిశాక చాలాబాధ పడ్డాను. ఇంత చురుకైన అమ్మాయికి అంత అన్యాయం జరగటం నాకు ఇష్టంలేక పోయింది. ప్రతిమనిషికి ఎన్నో ఆశలు, ఆశయాలువుంటాయి. అవి నెరవేరే వరకు నిద్రపోరు ఇక్కడివారు. ఇది నాకు చాలా నెచ్చిన విషయం'' .

''సంగీత నా మీద ఎంతో ఆశ పెట్టుకుంది. ఇది ఎన్నోసార్లు నాతో సంప్రదించింది. కనీసం ఒక అమ్మాయికి ఇంత అన్యాయం జరిగినప్పుడు నేను చూస్తూవూరుకోవటం నాకు ఇష్టం లేకపోయింది. ఎప్పటికయినా నేను ఎవరినో ఒకరిని వివాహం చేసుకుని స్థిరపడాలని కోరుకుంటున్నాను. అది మీకు తెలుసు. అప్పుడు నా కనిపించింది. నాకోసం ఒక అమ్మాయి ఇంతగా వేచి వుంది వివాహానికి, నేను మాత్రం ఆ అమ్మాయిని ఎందుకు వివాహం చేసుకోకూడదు అనిపించింది. ఆ అమ్మాయిలో వున్న గుణగణాలు నాకు నచ్చినప్పుడు మీకు అభ్యంతరం వుండకూడదు అనిపించింది.''

''వివాహం విషయంలో నాకు ప్రత్యేకంగా ఏ కోరికలు లేవు. నాకోసం ఒక అమ్మాయి కాచుకుని వుండగా! నేను ఇంకా ఎవరికోసమో కాచుకుని వుండటం, నాకు ఇష్టం వుండదు. మీరు కూడా ఇదే పద్ధతిలో ఆలోచిస్తారని నాకు తెలుసు. అందుకని మరో ఆలోచన పెట్టుకోకుండా సంగీత ఇష్టానుసారంగా నేను ఆమెను వివాహం చేసుకోవటం జరిగింది. అందుకు మీరు నన్ను క్షమించి ఇష్టపడతారని మీ మనస్థత్వమే నాకు చెబుతుంది.''

రాజేశ్వరమ్మగారు ఉత్తరం చదవటం ఆపి మాష్టారుకేసి చూచారు.

మాష్టారు ఆమెకేసి మౌనంగా చూచారు.

మళ్ళీ చదవటం ప్రారంభించారామె

''అమ్మా! మీకో సంతోషకరమయిన విషయం. నాన్నతో కూడా చెప్పు ఎంతో సంతోషిస్తాడు. అది ఏమిటంటే, నాకు బఫెలో యూనివర్శిటిలో ఫ్యాక్టలీలో, మా ప్రొఫెసర్ ఆఫర్ ఇచ్చాడు. ఇప్పుడు వచ్చేంత జీతం రాదు. ఇందులో సగం మాత్రం వస్తుంది. కాని నాకు టీచింగ్‌లోను, రిసెర్చిలోనూ, ఉన్న ఇంటరెస్టు ఎక్కడో ఒక కంపెనీలో ఎవరి క్రిందో పని చెయ్యటంలో లేదు. నాకు ఆ యూనివర్శిటీలో ఎంతో స్వేచ్ఛ వుంటుంది. రిసెర్చి స్కాలర్లు వుంటారు. రీసేర్చికి, టీచింగ్‌కి ఎంతో అవకాశం వుంటుంది. ఇండియా వచ్చి తిరిగి వెళ్ళగానే బఫెలో యూనివర్శిటిలో చేరుతాను. సంగీతకి కూడా బఫెలోలో ఏదో ఒక ఛాన్సు రాకపోదు. ఇండియానుంచి అమెరికాకి తిరిగి వెళ్ళగానే, సంగీత కాలిఫోర్నియాకు, నేను బఫెలోకి వెడతాము. మేము బఫెలోలో స్థిరపడటానికి ఎక్కువ కాలం పట్టదని అనుకుంటున్నాను. ఇది సంగీతకి కూడా ఇష్టమే.''

ఉత్తరం చదవటం ఒక్కసారి ఆపారామె.

మాష్టారు రాజేశ్వరమ్మగారు ఒకరినొకరు చూసుకున్నారు, ఎవరూ ఎవరితోనూ మాట్లాడలేదు.

''ఇంకా వుందా? చదవటానికి'' అడిగారు మాష్టారు. నిర్లిప్తంగా

''వుంది''

''కానియ్యి''

అమె చదవటం ప్రారంభించారు.

''అమ్మా! ఆ అమ్మాయి ఇండియాకి రావటం ఇదే ప్రథమం. ఎంతో ఉత్సాహం చూపుతోంది. ఎన్నెన్నో చోట్లకు టూర్ చేద్దామని పెట్టుకుంది. చాలా ప్లాన్లు వేసుకుంటోంది. ఆ అమ్మాయికి వున్న టైము మూడువారాలు మాత్రమే. ఈ మూడు వారాలలోను ఇండియాలో కాలుపెట్టగానే మొదటి వారం దక్షిణ ఇండియాకి టూర్ పెట్టుకుంది. తరువాత రెండోవారంలో ఉత్తరానికి కొన్ని ముఖ్యమయిన చోట్లకి వెళ్ళటానికి నిశ్చయించుకుంది. ఇంక ఒక్కవారం మిగులుతుంది. ఆ టైముకి మద్రాసు చేరుకునేటట్లు ప్లాను వేసింది. నాకు కూడా ఈ ప్లాను బాగానే వుందనిపించింది. ఎందుకంటే, ముందుగా, తిరగవలసినవి అయిపోతాయి. నేను ఎలాగు ఉద్యోగం మారుతున్నాను, కాబట్టి నేను ఎక్కువకాలం మీతో గడప వచ్చును. సంగీత ఒక్కవారం మాత్రం మనతో గడుపుతుంది. అదిప్లాను. నేను సంగీతని తీసుకుని ఆయా ప్రాంతాలకి తీసుకువెళ్ళవలసి వస్తుంది. పాపం! ఆ అమ్మాయికి ఇక్కడి పద్ధతులు, చాలా క్రొత్త, భాషా జ్ఞానం లేదు. నేను సంగీతతో వుండి తీరవలసివస్తుంది. ఈసారికి తిన్నగా తణుకు రాలేక పోతున్నందుకు ఏమీ అనుకోరని తలుస్తాను.''

''అమ్మా! నువ్వు, నాన్న కలిసి మద్రాసు రావలసిందిగా అర్థిస్తున్నాను. సంగీత చాలా సంతోషిస్తుంది. నాకు కూడా తృప్తిగా వుంటుంది. అప్పుడు మనం అందరం కలిసి మద్రాసు నుంచి తణుకువెళ్ళవచ్చు.''

ఆమె ఉత్తరం చదవటం ఆపుచేసి ఎటో చూస్తుండి పోయారు.

మాష్టారు కూడా మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ ఇంటికప్పుకేసి చూస్తూండి ఒక్కసారి కళ్ళుమూసుకున్నారు.

"రాజేశ్వరీ!" పిలిచారు మాష్టారు

ఆమె వినిపించుకోలేదు.

"రాజేశ్వరీ!" మళ్ళీ పిలిచారు

"ఊ!"

"తొందరగా ముగించు," నాకు నిద్రవస్తోంది అన్నారు.

ఆమె చాలా యాంత్రికంగా చదవటం ప్రారంభించారు.

"అమ్మా! ఐఐటి గెష్టుహౌస్‌లో మీకు, నాస్నేహితుని ద్వారా ఒక ఎ.సి. రూం బుక్ చేశాను. ఒక రెండు మూడు రోజులు నేను, సంగీత, నీ తోటి నాన్నతోటి మద్రాసులో గడుపుదామని వుంది. నేను ఇది వరకు మద్రాసులో చదువుతున్నప్పుడు నువ్వు ఒక్కసారి కూడా రాలేదు. ఇప్పుడయినా వస్తావని తలుస్తాను. ఆ తరువాత మనం తణుకు వెళ్లాక అక్కడ కేశవస్వామి ఆలయంలో హిందూ సాంప్రదాయ పద్ధతిలో మీకు తృప్తికరంగా మేము వివాహం చేసుకుంటాము. వెంటనే సంగీత అమెరికాకి వెళ్ళిపోవలసి వుంటుంది. నేను మాత్రం ఒక నెల మీతో తణుకులో సరాదాగా గడుపుతాను."

"నాకు బాహాటంగా పెద్ద ఎత్తులో పెళ్ళి చేసుకోవటం ఇష్టంలేదు. దైవసన్నిధిలో జరుగుతుంది. మీరు, ఆచారి బాబాయ్, పిన్ని వాళ్ళ ఫ్యామిలీ వుంటే చాలు. చాలాసింపుల్‌గా చేసుకుంటాం. మీరు ఇష్టపడతారని నాకు తెలుసు కాబట్టి ఇలా చొరవతీసుకుని వ్రాస్తున్నాను. మీ మనస్సు నేను నొప్పించటం లేదని తలుస్తాను, నాన్నతో చెప్పు."

"ఇప్పటికే చాలా కాగితాలు నింపాను. మళ్ళీ వ్రాస్తాను మీరు మద్రాసు ఎప్పుడు చేరుకునేది. దీనితో నేను, ఆ అమ్మాయి ఫోటోలు, నావి పంపుతున్నాను. ఓ పదివేల డాలర్ల చెక్కు కూడా పంపుతున్నాను. అక్కడ బ్యాంక్‌లో లక్షలు, లక్షలు పేరుకుపోతోంది. అది హాయిగా ఖర్చుపెట్టుకుని ఈ సారయినా ఒక ఇల్లు

కొనుక్కుంటారని తలుస్తాను. నేను ఎప్పుడూ దాని గురించే ఆలోచిస్తూంటాను. అమ్మా! నువ్వు నాన్నతో చెప్పిచేయించు.''

''సంగీత మన ఇల్లు చూస్తే ఏమనుకుంటుంది. ఎంతో గారాబంగా పెరిగిన పిల్ల. మన ఇంటి పరిస్థితులు చూస్తే అసలు మన ఇంట్లో కాలుపెడుతుందా అనిపిస్తుంది. తణుకులో ఒక మంచి హోటల్‌లో సంగీతకి ఎ.సి.రూం బుక్ చేద్దాం.''

రాజేశ్వరమ్మగారు ఒకసారి కళ్ళు మూసుకుని తలవంచుకున్నారు. మళ్ళీ కళ్ళు తెరిచి చదవటం ప్రారంభించారు.

''నేను మన పరిస్థితులను న్యూనత చేస్తూన్నానని అనుకోరని తలుస్తాను. అది నేనెన్నడూ చెయ్యలేను. కాని ఆ అమ్మాయి పెరిగిన పరిసరాలు, పద్ధతులు వేరు. నేను మళ్ళీ మీకు తెలియ పరుస్తాను మాష్టారు. ఇంతే సంగతులు. ఉత్తరం వ్రాయవలెను. ఇట్లు నమస్కారములతో అనంతం.''

ఉత్తరం చదవటం ముగించి కళ్ళజోడు తీసి ఒకసారి మాష్టారుకేసి చూశారామె.

మాష్టారు అప్పటికే సన్నగా గుర్రుపెట్టి నిద్రపోతున్నారు.

రాజేశ్వరమ్మగారు వీధి తలుపుతీసుకుని బయటికి వచ్చి అటుఇటూ చూచారు. ప్రక్కఇంటి పార్వతమ్మగారిని పిలిచారు.

''పిన్నిగారూ! రాజున్నాడాండి,'' అడిగారు.

''లేడమ్మా! కాస్సేపట్లో వస్తాడు. ఏదయినా చెప్పమంటావా'' అంటూ బయటకు వచ్చారు పిన్నిగారు.

ఆ చుట్టుప్రక్కల ఏదొచ్చినా పార్వతమ్మగారు వారి తమ్ముడు రాజు కలుగ చేసుకుని చేతనయినంత సహాయం చేస్తుంటారు. రాజు సరేసరి రోజూ ఒకసారి మాష్టారుని, రాజేశ్వరమ్మగారిని కలిసి పోతుంటాడు.

'' పిన్నిగారూ మాష్టారుకి ఒంట్లో సుస్తీగా వుంది. ఒకసారి సత్యం డాక్టరుగారికి కబురు చెయ్యమని రాజుతో చెప్పండి. కంతేరు, చినవెంకటాచారిగారికి కూడా ఒకసారి రమ్మని ఫోన్ చెయ్యమని చెప్పండి'' అని ప్రాధేయపడ్డారు

రాజేశ్వరమ్మగారు.

''అలాగే చెబుతానమ్మా!, ఏమయింది మాష్టారుకి ''అడిగారు పిన్నిగారు.

''మళ్ళీ బి.పి.వచ్చిందండి. ఏమిటో ఆయనకేదైనా వస్తే నాకు స్థిమితం వుండదు,'' అన్నారామె.

''అమ్మా! రాజేశ్వరీ! అబ్బాయి ఉత్తరం వ్రాశాడా? ఎలా వున్నాడు! అడిగారు పిన్నిగారు.

''వ్రాశాడు పిన్నిగారు, కులసాగా వున్నాడు'' అని చాలా ముభావంగా చెప్పారామె.

''ఏమిటోనమ్మా! అబ్బాయి దేశం కాని దేశంలో వుండడం, వాడిమీదపంచ ప్రాణాలు పెట్టుకుని జీవిస్తోండటం. ఎందుకొచ్చిన దేశాలమ్మా అవి. చేతికందొచ్చిన ఒక్కగానొక్క కొడుకు. మీరిద్దరూ ఇక్కడ బాధపడుతూ కూర్చోవటం.. మనకెందుకమ్మా ఆ దేశాలు. ఇక్కడ మాత్రం ఏం తక్కువ. ఆమాత్రం సుఖాలు ఇక్కడ మాత్రం రావా? ఇలా అంటున్నానని ఏమీ అనుకోకమ్మా. ఏదో పెద్దదానిని కనుక నాకు తోచింది చెబుతున్నాను'' అన్నారు పిన్నిగారు.

రాజేశ్వరమ్మగారు ఏమీ మాట్లాడలేదు. ఒక్కసారి కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయి.

''బాధపడకమ్మా అనంతం వచ్చేస్తాడులే. మంచి కుర్రాడు,ఎంతో తెలివైనవాడు. మీరెంతో అదృష్టవంతులు అటువంటి పుత్రుణ్ణి కన్నందుకు. ఎంత పరాయిదేశాల్లో వున్నా అనంతంలో ఆ నమ్రత, మంచి, మర్యాద, ఆప్యాయత ఇంకా ఎప్పటిలాగే వున్నాయి.''

'' అమ్మా! రాజేశ్వరీ! ఎప్పటికయినా అనంతం తప్పకుండా తిరిగివచ్చి మిమ్మల్ని కంటికి రెప్పలాగ చూచుకుంటాడు. నువ్వు వెళ్ళి మాష్టారుని చూచుకోమ్మా, నేను రాజురాగానే చెబుతాను'' అని రాజేశ్వరమ్మగారిని ఇంట్లోకి పంపి పిన్నిగారు లోపలికి వెళ్ళి తలుపేసుకున్నారు.

***

# 10

అమెరికాలో అంతులేని చిక్కుల్లోపడి, భార్యామణితో గొడవలు భరించలేక, తాను అనుకున్నది సాధించలేక, అట్లాంటిక్ సముద్రంలో మునిగి బంగాళాఖాతంలో తేలి మద్రాసు ఐ.ఐ.టి. ఫిజిక్స్ ఫ్యాకల్టీలో చేరి, ఎక్కడలేని కాన్ఫిడెన్సు తెచ్చుకుంటూ తారామణి అతిధిగృహంలో తాత్కాలికంగా వుంటూ, కాలక్షేపం చేస్తున్నాడు రాంబాబు. రోజుకొకసారి డిపార్టుమెంటులో మెయిల్ ఓపెన్ చేసి అమెరికా సంగతులు తెలుసు కుంటూంటాడు.

అనంతం ఇచ్చిన మెయిల్ చూచి ఆశ్చర్యపడి ఒక్కసారి చిరాకుపడ్డాడు.

''రాంబాబు ! నేను,సంగీత రేపు ఇండియాకి చేరుకుని తారామణి గెస్టుహౌస్‌లో రెండురోజులుండి అక్కడి నుంచి రెండు వారాలు ఇండియా టూర్ చేసి మళ్ళీ ఆపై ఆదివారం తిరిగి ఐ.ఐ.టి చేరుకుంటాము. మా నాన్న అమ్మ కూడా ఆవేళే, బహూశా మాకన్న ముందుగా మద్రాసు చేరుకుంటారు. నాకూ,సంగీతకి ఒక ఎ.సి. డబుల్ రూం, మా అమ్మ,నాన్నకి కూడా ఒక ఎ.సి. డబుల్ రూం బుక్ చెయ్యవలసిందిగా నిన్ను కోరుకుంటున్నాను. అక్కడికి వచ్చిన తరువాత చాలా సంగతులు మాట్లాడుకోవాలి నీతో. నీవు ఐ.ఐ.టిలో చేరావని తెలిసి చాలా సంబరపడ్డాను. నాకు ప్రస్తుతం అక్కడ కంప్యూటర్ సైన్సు డిపార్టుమెంట్ ఫ్యాకల్టీ లో ఓపెన్ ఆఫర్ ఇచ్చారు. అక్కడ నేను ఒక స్పెషల్ టాక్ వారి కోరికపై ఇస్తున్నాను. వారికది చాలా ఇష్టమయిన సబ్జెక్టు, చూద్దాం! ఏం జరుగుతుందో. అంతా ఆపై వాడి దయ మన ప్రాప్తి, మరి వుంటాను. ఇట్లు నీప్రియమిత్రుడు అనంతం'' అని ముగించాడు మెయిల్.

''ఏం చేస్తాం! తప్పదు ఒకానొకప్పుడు మంచి స్నేహితుడు. ఎంతో మేధావి ఇప్పుడింతగా తయారవుతాడని ఊహించలేకపోయాను. మేధావులకి కొంచెం వక్రబుద్ధి వుంటుందంటారు, బహూశా ఇదే కామోసు. అనంతం దాన్ని ఋజువు చేస్తున్నాడు''. అనుకుని అప్రయత్నంగా ఇష్టంవున్నా లేకపోయినా అనంతం అర్థించిన ప్రకారం తారా మణి గెస్టు హౌస్‌లో రెండు రూంలు బుక్ చేశాడు రాంబాబు.

ఒక్కసారి తన చరిత్ర గుర్తుకొచ్చింది రాంబాబుకు. 'వీడు వట్టి అమాయకుడు ఐఐటిలో ఉద్యోగం చేస్తాడుట. ఆ అమ్మాయి అమెరికాలో పుట్టి అక్కడే పెరిగింది. వీణ్ణి ఇండియాకి రానిస్తుందా. ఇండియా నుంచి అమెరికా వెళ్లిన ఆడపిల్లలు ఇండియాకి గుడ్‌బై చెప్పి శాశ్వతంగా అమెరికాలో వుండిపోవటానికి ప్రయత్నిస్తోంటే , అక్కడే పుట్టి పెరిగిన ఆడపిల్ల ల కిదో నరకరూపం అని తెలియని పిచ్చివాడు అనంతం. ఎటూ ఆలోచించుకోలేని దద్దమ్మ వీడు. ఆ అమ్మాయి సంగతి తెలియదు వీడికి, ఎందుకూ పనికిరాని సన్నాసి. ఆ అమ్మాయి బుట్టలో వీడెలా పడ్డాడో. పైగా ఒకసారి డైవోర్సు కూడా అయిన అమ్మాయి.' అనికొంత జాలిపడుతూ అనంతాన్ని తిట్టుకున్నాడు రాంబాబు.

అనుకున్న ప్రకారం అనంతం ఫ్లైటు అర్థరాత్రి పన్నెండు గంటలకు మద్రాసు ఎయిర్ పోర్టు చేరుకుంది. బయటకు దిగారు అనంతం, సంగీత.

ఒక్కసారి ఆమె వైపు చూచి చిరునవ్వు నవ్వాడు ఏదో సాధించిన వాడిలా. సంగీత ఏదో ఒక మాయా ప్రపంచంలో అడుగు పెట్టినట్లు అదోలా చూచింది అనంతంకేసి.

''ఇది మన కర్మభూమి. చూచావా సంగీతా, ఎంత అందంగా వుందో, ఈ వాతావ రణమే వేరు. ఇది ఏదేశానికి అందని ఒక అపురూపమయిన అందమయిన మహాదేశం. నాకెంతో సంతోషంగా వుంది. ఇప్పుడు నేను ఈ నేలమీద ఒక్కడినీ కాలు మోపటం లేదు. నీతో కలిసినడుస్తున్నాను. ఇన్నిసార్లు ఇండియా వచ్చానే కాని ఈసారి నాకేదో మార్పు కనిపిస్తోంది. బహూశా మనిద్దరం కలిసిరావటమేమో. నాకు పట్టలేని

ఆనందంగా వుంది,'' అని ఎంతో సంతోషం వ్యక్తం చేస్తున్నాడు అనంతం.

సంగీత ఏదో ప్రపంచంలోకి తొంగిచూస్తుంది. అనంతం ఏం మాట్లాడుతున్నాడో సరిగా తెలియటం లేదు.

ఇద్దరు సామాను ట్రాలీ మీదతోసుకుంటూ బయటకు వచ్చారు. ఒక్కసారి బయటి జనాభానిచూచి విస్తుపోయింది సంగీత. ఆ అరుపులు, అరణగొణధ్వనికి కొంత భయపడింది. అట్టలమీద పేర్లురాసి తోసుకుంటూ రెండు చేతులతో పైకెత్తి చూపిస్తున్నారు కొందరు టాక్సీడ్రైవర్లు. బండ్లుతోసుకుంటూ బయటకు రావటం బ్రహ్మప్రళయంగా భావించింది సంగీత. ఏవేవో మాట్లాడుతున్నాడు అనంతం. సంగీత ఈ ప్రపంచంలో వున్నట్లు లేదు.

సంగీతని చూస్తే నవ్వొచ్చింది.

''సంగీతా! ఇప్పుడు ఇండియాలో జనాభా ఒక బిలియన్‌కి చేరింది''. అన్నాడు.

''వావ్ !'' అని ఇంగ్లీష్‌లో ఒకగావుకేక పెట్టింది.

''చూస్తే తెలుస్తోంది. ఇక్కడే ఇలావుంటే ఇంకరైల్వేస్టేషన్‌లు, బస్సుస్టాండులు తలుచుకోలేం'' అంది.

''అప్పుడే ఏమయింది. మనం బయట ప్రపంచాన్నింకా చూడలేదు''. అన్నాడు. నాకిప్పుడే భయంగా వుంది. ఇంకబయటి ప్రపంచాన్ని చూస్తే వెంటనే తిరుగు ప్రయాణం కట్టవలసివస్తుందేమో''. అందిభయపడుతూ.

''ఏమీ భయపడకు, జ్ఞాననేత్రం తెరిచి చూడు ఏం చూచినా''. అన్నాడు నవ్వుతూ.

''నీకున్న అనేత్రం నాకులేదు. నన్నేం చెయ్యమంటావు''. అంది దెప్పుతూ.

ఇద్దరూ టాక్సీ చేసుకుని ఐఐటికి బయలుదేరారు. ఆరోడ్లు, ఆ ట్రాఫిక్, ఆకారు డ్రైవర్ల కేర్‌ఫ్రీ రాష్ డ్రయివింగు చూచి కళ్ళు మూసుకుని, ఒక కాలితో బ్రేక్ నొక్కినట్లు ముందు సీటుని గట్టిగా తొక్కుతూ అప్పుడప్పుడు కళ్ళుతెరుస్తూ

పొలికేకలు పెట్టింది సంగీత.

డ్రైవరు ఏదో తమిళంలో మాట్లాడాడు. సంగీత డ్రైవరు సీటుని గట్టిగా పట్టుకుంది.

''వావ్! వావ్! మై'' అంటూంది. ఆ కారులు, ఆ లారీలు కుడినుంచి ఎడమ నుంచి అతివేగంగా డ్రైవ్ చేసే తీరు చూచి, రెండు చేతులతో కళ్లు మూసుకుని మళ్ళీ తెరుస్తూంది.

అనంతం టెన్షన్‌పడుతూ నవ్వుతూ కూర్చున్నాడు.

టాక్సీ ఐఐటిలో ప్రవేసించింది.

ఒక్కసారి ఊపిరిపీల్చుకున్నాడు అనంతం. కొన ఊపిరిలోంచి మెల్లిమెల్లిగా ఊపిరి పీల్చటం ప్రారంభించింది సంగీత.

''సంగీతా ఎలా వుంది ఐఐటి'' అన్నాడు.

''అప్పుడే అడగకు, నన్ను కాస్త తేరుకోనివ్వు.'' అని మరుక్షణంలో ఒక్కగావుకేక పెట్టింది.

''ఏమేజింగ్! వావ్! ఎన్ని లేడిలో'' అంది.

''ఇది డీర్ ఫారెస్టు ఇక్కడ లేడిలే కాదు కోతులు, పాములు, ముంగీసలు, కూడా వుంటాయి.''

''రేపు ఉదయం నీ ఇష్టం వచ్చినట్లు తిరుగు, ఫోటోలు తీసుకో, నీ విడియో కెమేరా విశ్రాంతి లేకుండా తిరుగుతూనే వుంటుంది ఇంక'' అన్నాడు నవ్వుతూ.

''ఐలవ్! దిస్ ప్లేస్. రేపటి నుంచి నీ పని నీది నాపని నాది'' అంది కొంత హాయిగా ఫీల్ అవుతూ.

టాక్సీ తారామణి గెస్టుహౌస్ చేరుకుంది. అప్పటికే తారీ కు మారి రెండు గంటలు దాటింది. అంతా నిశ్శబ్దంగా వుంది. సెక్యూరిటీ గార్డు ఆఫీసులో తాళాలు తీసుకుని అనంతం పేర బుక్ చేసిన రెండు రూములు చూపించాడు.

ఆరాత్రి ఎంతో హాయిగా నిద్రపోయారు ఆ నూతన దంపతులు.

తెల్లవారింది.

రాంబాబు బి.టెక్. టీచింగ్‌తో సతమతమవుతున్నాడు. ఉదయం ఎనిమిది గంటలకే మొదలవుతుంది, ఇన్‌స్టిట్యూట్‌లో పని. తొందరగా తెమిలి బ్రేక్‌ఫాస్ట్ చేసి గెస్ట్ హౌస్ ఆఫీసురూంకి వెళ్ళి లిస్టు చూచాడు. అనంతం పేరుతోవున్న రూములు ఛెక్ ఇన్ చేసివున్నాయి. తొందరగా అ రెండు రూముల దగ్గిరకి వెళ్ళి చూచాడు. అవి ప్రక్క, ప్రక్క రూములు. అందులో ఒకటి తాళం పెట్టివుంది. మరోరూములోపల గడియ పెట్టివుంది. అనంతాన్ని డిష్టర్బు చెయ్యటం ఇష్టం లేక అక్కడినుంచి ఆఫీసుకి బయలుదేరాడు రాంబాబు.

ఆ అలికిడికి లేచాడు అనంతం. బయటికి వచ్చి దూరంగా నడిచివెడుతున్న రాంబాబుని చూచి ఒక పొలికేక పెట్టాడు.

''రాంబాబు'' అని

రాంబాబు పరుగెత్తుకుంటూ వచ్చి అనంతాన్ని గట్టిగా పట్టుకున్నాడు. కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారిద్దరూ.

''నాకు క్లాసుకు టైం అవుతోంది, మళ్ళీకలుద్దాం. మీకు అన్ని ఏర్పాట్లు చేశాను. బ్రేక్‌ఫాస్ట్, లంచి, రాత్రిభోజనం వగైరా, వగైరా. ఓ.కె. నీ టైముని బట్టి ఒకసారి ఫిజిక్స్ డిపార్టుమెంట్ కొచ్చి నన్ను కలుసుకో'' అని చెప్పి తొందర తొందరగా డిపార్టుమెంటుకి వెళ్ళాడు రాంబాబు.

అనంతం, సంగీత బయటకు పోవటానికి తయారయ్యి బ్రేక్‌ఫాస్ట్ తీసుకునేందుకు డైనింగ్ హాల్ చేరారు. సంగీత హాఫ్‌పాంటు, బనీనులో వుంది. జుట్టు పూర్తిగా వదిలేసు కుంది. కళ్ళకి గాగుల్సున్నాయి. వీడియో కెమేరాతో వున్న బ్యాగ్ భుజానికి వేళ్ళాడు తూంది. అనంతం మామూలుగా ఒక సాదాపాంట్, టీ షర్టులో వున్నాడు.

అక్కడికి ఒక స్టూడెంట్ అనంతాన్ని వెతుక్కుంటూ వచ్చాడు.

''సార్ ! మీరు డాక్టర్ అనంతం కదా'' అని  ఋజువు చేసుకుని తనని కూడా పరిచయం చేసుకున్నాడు.

''సార్! నేను కంప్యూటర్ సైన్సు ఫైనల్ ఇయర్ చదువుతున్నాను.''

''సార్ ! మీ టాక్  రేపు ఉదయం పదిగంటలకు మా డిపార్టుమెంట్‌లో ఏర్పాటు చేశాము, మా హెచ్.ఓ.డి. మీరు వచ్చారో లేదో చూచి రమ్మని నన్ను పంపారు,'' అని ఎంతో నమ్రతగా మాట్లాడాడు.

''నేను కొద్ది సేపటిలో మీ  హెచ్.ఓ.డి.కి ఫోన్ చేస్తాను, చాలా థాంక్సు'' అని ఆ కుర్రవానిని పంపాడు అనంతం. ఆ కుర్రవాని ప్రవర్తన, ఆ నమ్రతకి ఆశ్చర్యపడింది సంగీత.

''ఈ కుర్రవాడు చాలా మంచి వాడులా వున్నాడు కదూ'' అంది.

''ఇక్కడ చదువుకునే కుర్రవాళ్లంతా చాలా బుద్ధిమంతులు. చాలా తెలివైన వాళ్ళు ఈ కుర్రవానికి ఐఐటి ఎంట్రెన్సు పరీక్షల్లో చాలా హై ర్యాంకు వచ్చి వుంటుంది.''  అన్నాడు.

''నీకెలా తెలుసు''  అంది.

''లేకపోతే కంప్యూటర్ సైన్సులో సీటు రాదు'' అన్నాడు.

''నీకూ వచ్చిందిగా హై ర్యాంకు'' అంది.

''ఇప్పుడు నాసంగతులు ఎందుకు. సాధారణంగా ఈ దేశంలో వున్న చాలా మంది విద్యార్థులు కష్టపడి చదువుకుని ఎంట్రెన్సు పరీక్షలలో మంచి ర్యాంకులు పొంది డిగ్రీ పూర్తి చేసి మొత్తం అంతా అమెరికా వెళ్లిపోతారు. ముఖ్యంగా ఐఐటిలో ఇది ఎక్కువగా జరుగుతూంటుంది. దీన్నే బ్రయిన్ డ్రెయిన్ అంటారు'', అన్నాడు.

''నువ్వు అంతేగా'' అంది.

''అవును నేనూ అంతే. నాకు మాత్రం ఎందుకు ప్రత్యేకత, నేనూ

నలుగురుతో పాటు నారాయణ. ఈ జన ప్రవాహంలో నేనూ కొట్టుకుపోతూంటాను. ఎప్పుడు, ఎందుకు, ఎక్కడికి చేరుకుంటానో తెలియదు. గాలి ఎటు వీస్తే అటుకొట్టుకుపోతాను, ఒక ప్రత్యేకత లేదు'' అన్నాడు ఒక వేదాంతధోరణిలో.

''మళ్ళీ నువ్వు వేదాంతంలోకి తొంగి చూస్తున్నావు. ఏదయినా మాట్లాడటానికి భయంగా వుంది నీతో, వెంటనే వేదాంత ధోరణిలోకి పోతావు. కాస్సేపు అన్నీ మరిచిపోయి హాయిగా గాలి పీల్చుకుని ప్రస్తుతం గురించి ఆలోచించు. రేపు గురించి ఆలోచించకు. నాకు అనిపిస్తుంది, వేదాంతం ఒక నెగెటివ్ అలోచన. మనం ఏం చెయ్యగలం, అని చూచుకుని దానిని ప్రయత్నం చేసి కృషి చేసి అందులో కష్టపడి ఫలితం సాధించి ఆనందం పొందటానికి ప్రయత్నం చెయ్యాలి. ఏ పనీ చెయ్యలేనివాడు వేదాంతం చెబుతాడు. ఎందుకూ పనికి రాని వాడు వేదాంతం చెబుతాడు. నేను క్రియావాదిని. ఆకాశంకేసి చూచిమాట్లాడను, గాలిలో దీపం పెట్టను'' అని కొంచెం విసుగ్గా విసిరింది కాఫీ సిప్ చేస్తూ సంగీత.

ఒక్కసారి సంగీత కేసి చూచి చిరునవ్వు నవ్వి

''సంగీతా! నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. భగవద్గీతలో శ్రీ కృష్ణ సందేశం ఇప్పుడు నీ నోట్లోంచి వింటున్నాను, నిన్ను చూచి ఎన్నో నేర్చుకుంటున్నాను'' అన్నాడు ఎంతో సంతోష పడుతూ.

''నాకు ఆ సందేశాలు ఏమీ తెలియవు, ఓ.కె. అన్నీ మరిచిపో, ఒకసారి మొత్తం ఐఐటి అంతా తిరుగుదాం ఇవాళ. రేపటి నుంచి నీదారి నీది, నాదారి నాది. ఈ మూడు వారాల తరువాత మళ్ళీ నీ తోవ నీది నా తోవ నాది అంది.''

''అంటే''

''అంటే! నేను కాలిఫోర్నియాకి, నువ్వూ బఫెలోకి'' అంది ఒక్కసారి జుట్టు సరి చేసు కునేందుకు తల అటూ, ఇటూ త్రిప్పుతూ

''ఓ! అదా!'' అన్నాడు

ఆరోజు ఉదయం అంతా సంగీతని ఐఐటిలో నడిపించాడు అనంతం. సంగీత అలుపులేకుండా వీడియో కెమెరాని తిప్పుతూనే వుంది. అన్ని డిపార్టుమెంట్లు, క్లాసు రూములు, హాస్టల్స్, ఓపెన్ ఎయిర్ థియేటర్, స్టూడెంట్సు యాక్టివిటి

సెంటరు, స్విమ్మింగ్ పూల్, స్టేడియం, ఒక్కటి కూడా వదలకుండా ఆఖరికి తను చదువుకున్న రోజుల్లో కూర్చున్న క్లాసురూములతో సహా ఎంతో ఆనంద పడిపోతూ సంగీతకి చూపించాడు.

ఇద్దరూ అలిసిపోయి తారామణి గెస్టుహౌస్‌కి చేరుకుని భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నారు.

ఆ రోజు సాయంకాలం కెమెరా పుచ్చుకుని సంగీత స్విమ్మింగ్‌పూల్‌కి వెళ్లాడూతూ '' నన్ను కాస్త ఫ్రీగా ఒదిలెయ్యి! నువ్వు, నీ ఫ్రెండు మాట్లాకుకోండి'' అంది.

''మరి నువ్వు రాంబాబుని కలియవా!'' అన్నాడు.

''చూద్దాం! నాకు చాలా పనుంది. తరువాత కలుస్తాను, మీ చాదస్తం కబుర్లు నాకు బోరు, ఓ.కే, నీ ఫ్రెండ్‌తో ఎంజాయ్ చెయ్యి'' అంటూ ఒక్కసారి బైబై చెప్పి వెళ్ళింది.

అలా చూస్తూండిపోయి రాంబాబు కోసం కాచుకుని కూర్చున్నాడు అనంతం.

'అనంతం' అరిచాడు రాంబాబు క్రిందనుంచి

అనంతం బయటికి వచ్చాడు.

''క్రిందకి రండి కాఫీ త్రాగుదాం'' అన్నాడు రాంబాబు.

అనంతం రూము తాళం పెట్టి క్రిందికి దిగాడు.

''ఎక్కడ నీ భార్యామణి'' అడిగాడు.

''కెమెరా తీసుకుని స్విమ్మింగ్ పూల్ కెళ్ళింది.'' అన్నాడు.

''కెమెరాతో స్నానం చేస్తూందా'' అడిగాడు నవ్వుతూ,

''ఇవ్వాళ ఫొటోలు తీసుకుంటుందిట, రేపు స్నానం చేస్తుందిట'' చెప్పాడు అనంతం.

సరే! రా! మా తారామణి స్పెషల్ కాఫీ రుచి చూద్దువుగాని అని అనంతాన్ని, డైనింగ్ హాలుకి తీసుకెళ్ళి ఏవో స్నాక్సు కాఫీ ఆర్డరు చేశాడు రాంబాబు.

ఇద్దరూ మళ్ళీ చాలా కాలానికి బాతాఖానీలోపడ్డారు.

''ఎలావుంది డిపార్టుమెంట్'' అడిగాడు అనంతం.

''ఎక్సలెంటు! నాకు అన్ని సదుపాయాలు ఇచ్చారు. బి.టెక్. టీచింగ్ ఎంజాయ్ చేస్తున్నాను. చాలా కష్టపడి ప్రీపేర్ అవవలసి వస్తోంది. అమెరికాలో ఇంతకష్టపడి టీచింగ్ చెయ్యరు. పైగా ఇక్కడి స్టాండర్డ్సు చాలా ఎక్కువ. కుర్రవాళ్లనుంచి మంచి రెస్పాన్సుంది. చాలా తెలివైన కుర్రాళ్ళు. ఇక్కడి కొచ్చాక నిన్ను బాగా అర్థం చేసుకోవటం ప్రారంభిం చాను. నీకు చెప్పవలసిన వాణ్ణి కాదు. నీకు తెలుసుగా ఇక్కడి ప్రమాణాలు'' అన్నాడు.

''నాకు తెలియవు. టీచర్సుకే తెలుస్తాయి ఇక్కడి ప్రమాణాలు'' అన్నాడు అనంతం.

''నీలోతులు నాకింకా అందుకునే పరిస్థితి రాలేదు. ఇంకాటైము పడుతుందేమో'' అన్నాడు నవ్వుతూ రాంబాబు.

''ఇంకా సంగతులు చెప్పవయ్యా రాంబాబు'' అడిగాడు.

''ఏమున్నాయి, రిసెర్చి కోసం కొన్ని ప్రాజెక్టు వ్రాస్తున్నాను'' అన్నాడు.

''నేను నీ ప్రొఫెషన్ గురించి అడగటం లేదు. ఇక్కడ ఎన్నాళ్ళుంటావు''. అడిగాడు అనంతం.

''శాశ్వతంగా, మళ్లీ అమెరికాలో కాలు పెట్టదలచుకోలేదు'' అన్నాడు, ఒక్కసారి ఖచ్చితమయిన ధోరణిలో.

''అదికాదు రాంబాబు! ఈ తారామణిలో ఎన్నాళ్లుంటావ్''

''అదా! వాళ్ళు పొమ్మనేవరకు'' నవ్వాడు రాంబాబు.

''వీళ్ళు నాలుగురోజుల కన్నా వుండనియ్యరు కదా! అందుకని అడిగాను'' అన్నాడు అనంతం.

''ఐబటి వారు నాకు త్వరలో ఒక పడకగదితో వున్న క్వార్టర్సు ఇస్తారు. అంతవరకూ ఇక్కడే'' అన్నాడు.

''అప్పుడు కాని తీసుకురావన్నమాట మావదిన గారు డాక్టరు లతమ్మ గారిని'' ఎంతో ఇదిగా అడిగాడు అనంతం.

''జానకి రామయ్యగారు నీకు మెయిలివ్వలేదా'' అడిగాడు రాంబాబు.

''ఇచ్చారు'' అన్నాడు.

''ఇస్తే మరి ఇలా మాట్లాడుతావేం'' అన్నాడు.

అనంతానికి ఏం అర్థంకాలేదు.

''నువ్వు ఇక్కడ చేరావని మెయిల్ ఇచ్చారు. ఇంకేం విశేషాలు లేవు అందులో'' అన్నాడు.

''మళ్ళీ కథ మొదటి నుంచి చెప్పమంటావా?'' అడిగాడు రాంబాబు.

అనంతానికి అర్థంకాలేదు.

''లత ఇప్పుడప్పుడే రానంది ఇండియాకి. తన రెసిడెన్సీ అవ్వాలిట, అప్పుడు కొంత సంపాదించాలిట, అప్పుడు ఇండియాకి వెళ్ళేదీ లేందీ నిర్ణయించుకుంటుందిట. నాకు మాత్రం అక్కడ విసుగెత్తిపోయి వచ్చేసాను''. అన్నాడు ఒక్కసారి ఊపిరాడకుండా.

''రాంబాబు! నేను మీ అంతరంగిక విషయాలలో జోక్యం కలుగచేసుకుంటున్నానని అనుకోకు. నాకు తెలుసు నీ మనస్థత్వం. ఎలాగయినా నీకు కొంచెం తొందరెక్కువ ! చాలా పొరపాటు చేశావ్,'' అన్నాడు.

''ఇండియాకి తిరిగి వచ్చి మంచి చోట, అందులోను నాకిష్టమయిన చోట ఉద్యోగం చెయ్యటం తప్పంటావా?'' అడిగాడు రాంబాబు.

''అదికాదు రాంబాబు! ఇక్కడ నీకింకా జాయినింగ్ టైము ఇస్తారు కదా, అది ఉపయోగించుకోకపోయావా. అప్పటికి లతగారికి కూడా అయిపోతుందేమో అక్కడి చదువు'' అన్నాడు.

''అది అంతులేని చదువు. పైగా నాకు అక్కడ మళ్ళీ కాంట్రాక్టు వస్తుందని గ్యారంటీ ఏమిటి. లత పెట్టే భోజనం చేస్తూ కూర్చోమంటావా? చాలు చాలు, ఆ పాలేరు బ్రతుకులు మనకొద్దు, ఆ చేసే పాలేరు తనం ఈ పుణ్యభూమి మీద చేస్తే ఏమన్నా పుణ్యం పురుషార్థం వుంటుంది. నేను ఇక్కడ చాలా హాయిగా వున్నాను. సైకిలు కొనుక్కున్నాను, వెళ్ళిపోతున్నాయి రోజులు'' అన్నాడు ఎంతో ధీమాగా, కొంత నిస్పృహ కనిపిస్తోంది అతనిలో.

''నీలో! ఇంత మార్పూకూడాలేదు రాంబాబు! నిన్ను చూస్తే ముచ్చటేస్తుంది నాకు, నువ్వు ఏమీ బాధపడకు. లత గారు రెసిడెన్సీ అయ్యాకవస్తారు. మన ఐఐటి హాస్పిటల్ ల్లోనే డాక్టరు ఉద్యోగం వస్తుంది. ఇద్దరూ హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చు'' అని రాంబాబుని ఉత్సాహపరిచి, ''రా! వరూ రూంలో కూర్చుందాం'' అని రాంబాబుని తన రూంకి తీసుకెళ్ళాడు అనంతం.

''ఏమిటి నీ ప్లాను'' అడిగాడు రాంబాబు.

''ఏముందీ! మూడు వారాలు సెలవు. రెండు వారాలు తిరుగుడు, మూడోవారం తణుకు లో ఉంటాం. ఆ వారం చివరలో సంగీత కాలిఫోర్నియాకి, నేను బఫెలోకి తిరుగుప్రయాణం'' అన్నాడు అనంతం.

అదోలా ముఖం పెట్టి అర్థం అవనట్లు చూచాడు రాంబాబు.

''నీకు తెలియదా! నాకు బఫెలో యూనివర్శిటీలో ఫాకల్టీలో ఆఫర్ వచ్చింది'' అన్నాడు.

''బావుంది చాలా సంతోషం, మరి నీ భార్యామణి?'' అడిగాడు రాంబాబు.

''బఫెలోకి వస్తుంది. ఆమాత్రం ఉద్యోగం బఫెలోలోనే దొరుకుతుంది'' అన్నాడు అనంతం.

''పిచ్చివాడా! బఫెలోలో సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలెక్కడున్నాయి. అంటే మనిద్దరం

ఒకే బోటులో ప్రయాణం చేస్తున్నామన్న మాట. నా భార్య నా కోసం అమెరికానుంచి వచ్చి ఐఐటి ఆసుపత్రిలో డాక్టరు ఉద్యోగంలో చేరటం, నీ భార్య నీకోసం కాలిఫోర్నియాలలో సాఫ్టవేర్ ఉద్యోగం వదిలి బఫెలోకి రావటం, బావుంది కదూ. అన్నాడు అనంతంకేసి ఎంతో లోతుగా చూస్తూ

అర్ధంకాక ఒక వెర్రిమొహం వేశాడు అనంతం.

''హాయ్! దేర్'' అంటూ ప్రవేశించింది సంగీత

రాంబాబు, సంగీతల మధ్య చాలా ఫార్మల్ గా ఉభయ కుశలోపరి జరిగింది.

''ఇవాళ మీరిద్దరూ నా అతిథులు'' అని ఆ దంపతులని వెంటబెట్టుకుని డైనింగ్ హాలుకి బయలు దేరాడు రాంబాబు.

ఆ మర్నాడు ఉదయం తొమ్మిదిన్నరకే సంగీత తన కెమేరాతోను, అనంతం తన టాక్ కి ప్రెపేర్ చేసిన ట్రాన్స్పరెన్సీలతో వున్న ఫైలుతోను బయలుదేరారు.

''నువ్వు కూడా వస్తున్నావా'' అడిగాడు అనంతం.

''నా ప్రాజెక్టు ఇంకా పూర్తి కాలేదు. నేను లంచి టైముకి తారామణి చేరుకుంటాను, ఓ.కే. బైబై,'' అని చెప్పి వెళ్ళిపోయింది.

అనంతం కంప్యూటర్ సైన్స్ డిపార్టుమెంటుకి చేరుకుని హెచ్.. డి. ని కలిశాడు.

అక్కడ సెమినార్ హాల్ కిటకిటలాడుతోంది. ఆ డిపార్ట్మెంట్ వారే కాక ఇంకా మేథమెటిక్స్, ఫిజిక్స్ డిపార్టుమెంట్ నుంచి కూడా కొంత మంది ఫ్యాకల్టీ అనంతం టాక్ వినటానికి ఎంతో కుతూహలంగా వచ్చారు.

రాంబాబు క్లాసు ముగించుకొని హడావిడిపడుతూ చేరుకుని అనంతాన్ని కలిశాడు.

తను చదువుకుంటున్న రోజుల్లో తనకు పాఠాలు చెప్పిన గురువులని కలిసి ఎంతో విధేయతతో ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాడు. ప్రస్తుతం హెచ్. ఓ. డి. దగ్గరే తన బి. టెక్., ప్రాజెక్టు చెయ్యడం కూడా జరిగింది. అక్కడున్న వారందరూ చాలా పరిచయస్థులే అని చెప్పాలి. అక్కడ కలిసిన ప్రతి స్నేహితుడూ, తన గురువులూ కూడా తనను అమెరికా నుంచి వచ్చేసి ఐఐటి ఫ్యాకల్టీలో చేరమని సలహాలిచ్చిన వాళ్ళే ఎక్కువగా కనిపించారు.

లెక్చర్‌కి ముందుగా అనంతాన్ని అక్కడున్న ఫ్యాకల్టీకి, రిసెర్చి స్కాలర్‌లకి పరిచయం చేస్తూ వచ్చారు. హెచ్. ఓ. డి.

అనంతం అమెరికాలో చేసిన రిసెర్చి, దాని ప్రాముఖ్యత, అతను క్రొత్తగా డెవలప్ చేసిన సాఫ్టువేర్ గురించి మాట్లాడుతూ ఆ వచ్చిన శ్రోతలకు పరిచయం చేశారు హెచ్. ఓ. డి.

లెక్చరు ప్రారంభమయింది. మధ్యమధ్యలో కొందరు ప్రశ్నలు వేస్తూ సరియైన సమాధానాలు పొంది తృప్తిని ప్రకటిస్తున్నారు. కొందరు రిసెర్చి స్కాలరులు తమ తమ అనుమానాలను తెలియచేసుకుని విషయాలు అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నారు.

ఇంతలో ఒక చిన్న కుర్రవాడు ఒక ట్రేలో టీతో వున్న కప్పులు, కొన్ని బిస్కట్ ప్యాకెట్లుతో ప్రవేశించి ఒక్కొక్కరికి అకుర్చీల మధ్యగా నడుస్తూ ఇస్తున్నాడు. ''ఇష్'' ''ఉష్'' మంటూ కొందరు ఆ కుర్రవాణ్ణి హెచ్చరిస్తూ బిస్కట్లు తింటూ వాడిచ్చిన టీ కప్పులందు కుంటున్నారు

అనంతం కాసేపు తన లెక్చరు అపుచేశాడు.

''తొందరగా ఇచ్చిపో'' అని సెమినార్ సెక్రటరీ కొంత నెమ్మదిగానే దూకుడుగా చెప్పాడు. ఆ కుర్రవానితో. హడావిడిపడుతూ తన పని ముగించుకుని బయటికి వెళ్ళాడు, ఆ టీ కుర్రాడు

అనంతం టీ తాగుతున్నాడన్న మాటే కాని ఆ కుర్రవానికేసి చూస్తూవుండి పోయాడు. వాడిని చూడగానే ఎంతో జాలి, బాధ కలిగింది. మరకలతో వున్న ఆ చిన్ని లాగు, ఆ మాసిన చేతులులేని బనీను చూచి జాలిపడ్డాడు. తను ఇస్తున్న మోడరన్ టాపిక్ మీద లెక్చరుకి తానే మనస్సులో కొంచెం అదోలా ఫీల్ అయ్యాడు.

మొత్తానికి లెక్చరు ఎంతో సక్సెస్‌ఫుల్‌గా ముగిసింది. అందరూ చప్పట్లుకొట్టారు. అందరూ అనంతాన్ని కంగ్రాట్యూలేట్ చేసి వెళ్ళిపోయారు.

రాంబాబు సెమినార్ హాలు బయటికి వచ్చి వెయిట్ చేస్తున్నాడు అనంతం కోసం. ఇంతలో అనంతం, హెచ్.ఓ.డి. కలిసి ఏదో టెక్నికల్ విషయాలు మాట్లాడుకుంటూ సెమినార్ హాలు బయటికి వచ్చారు. రాంబాబుకి హెచ్.ఓ.డి.ని పరిచయం చేశాడు అనంతం.

''ఒక పది నిమిషాలలో మీ ఫ్రెండుని పంపించేస్తాను.'' అని రాంబాబుకి చెప్పి అనంతాన్ని తన రూంకి తీసుకువెళ్ళారు.

కాసేపయాక అనంతం బయటికి వచ్చి రాంబాబుతో కలిసి తారామణికి బయలుదేరాడు. టైము చూసుకున్నాడు, పదకొండున్నరదాటుతోంది.

డిపార్టుమెంటు ఫస్టుఫ్లోర్ వరండాలో నెమ్మదిగా నడుస్తున్నారిద్దరు.

అదే వరండాలో ఒక ప్రక్కగా ఒక ముసలి కూలీ శ్లాబ్‌కి కన్నం పెడుతున్నాడు పెద్ద చప్పుడు చేసుకుంటూ. ఆ బిల్డింగ్‌మొత్తం కదిలిపోయేట్టు కొడుతున్నాడు. దెబ్బ దెబ్బకీ మధ్య చాలా టైము తీసుకుంటూన్నాడు. ఆ చప్పుడు లో ఒకళ్ళ మాట ఒక్కళ్ళకు వినిపించటం లేదు.

''ఏం చేస్తున్నాడితను'' అడిగాడు అనంతం.

''ఒక ఫ్లోర్‌కి మరోఫ్లోర్‌కి కన్నాలు పెడుతున్నాడు. మా డిపార్టుమెంటులో కూడా ఇలాగే కొట్టి చంపేస్తున్నారు. క్లాసురూములకి చాలా న్యూసెన్సుగా ఉంది'' అన్నాడు రాంబాబు చికాకు పడుతూ.

''ఎందుకు కన్నాలు'' అడిగాడు

''దేశం చాలా ముందుకి పోతోంది కంప్యూటర్ టెక్నాలజీలో. కంప్యూటర్ నెట్ వర్కింగ్ చేస్తున్నారు. ఇలా ఐఐటిలో చేరగానే వెంటనే ఒక కంప్యూటరు, ప్రింటరు, యు.పి.ఎస్. ఇంటర్‌నెట్ కనెక్షన్‌తోసహా ఇస్తున్నారిప్పుడు. వీడు కన్నాలు పెడితే కాని మనకా ఫెసిలిటీస్‌రావు'' అన్నాడు నవ్వుతూ.

ఆ కూలీని చూడగానే ఎక్కడలేని బాధ కలిగింది అనంతానికి.

''మానవునకు కనీసావసరాలు ఏర్పాటు చెయ్యలేని మనదేశం కంప్యూటరైజేషన్, ఇంటర్ నెట్, ఐటి గురించి మాట్లాడటం చాలా హాస్యాస్పదంగా ఉంది కదూ!'' అన్నాడు అనంతం.

ఒక్కసారి అనంతం కేసి చూచి

''నువ్వు, నేను ఏం ఉద్ధరిస్తాం, మన గొడవ మంది. మన సుఖాలు మనవి, దేశం గురించి ఆలోచిస్తూ కూర్చుంటే మన పనులు జరగవు. రా! తొందరగా ఈ రణ గొణ ధ్వనిలోంచి పోదాం'' అంటూ అనంతాన్ని లాక్కుపోయాడు రాంబాబు.

''సంగీత ఈ పాటికి వచ్చేసి వుంటుంది. రా! త్వరగా పోదాం'' అన్నాడు అనంతం.

''ఫరావా లేదులే ఇంకా టైముంది. ఏమంటాడు హెచ్.ఓ.డి.'' అడిగాడు రాంబాబు.

''ఎసోసియేట్ ప్రొఫెసర్ పోస్టు ఆఫర్ చేస్తున్నాడు. వచ్చి చేరవలసిందిగా ఎంతో ప్రోత్సహిస్తూ మాట్లాడాడు.''

''అంతమెల్లిగా చెబుతావేమిటి. హార్టీకంగ్రాట్యులేషన్స్'' అని గట్టిగా కుదిపేశాడు అనంతాన్ని.

అనంతం మొహం అంతా విప్పారినట్లు కనపడలేదు.

''నువ్వేమన్నావ్' అడిగాడు రాంబాబు కుతూహలంగా

''చాలా థాంక్స్'' చెప్పి కొంచెం టైము ఇవ్వమని అర్థించాను.

''ఒప్పుకున్నాడా'' అడిగాడు రాంబాబు.

''నీ ఇష్టమొచ్చినంత టైము తీసుకో, కాని ఒక్క షరతు. మమ్మల్ని డిసప్పాయింటు చెయ్యకు. అమెరికాలో వున్న వాళ్ళని నమ్మటంకష్టం. ఇక్కడ కూడా నీకు ఎన్నో సదుపాయాలు రిసెర్చికి కావలసిన ఫండ్సు వుంటాయి. ఎంతో స్వాతంత్ర్యముంటుంది. అక్కడ అమెరికా డిఫెన్సు ప్రాజెక్టులలో పని చేస్తున్నావు కదా! అది వారికి ఉపయోగకరంగా వుంటుంది. మనదేశం వచ్చి నువ్వు మనదేశానికి ఉపయోగపడే రిసెర్చి చెయ్యవచ్చు. ఇండియన్ డిఫెన్సు రిసెర్చికి కన్సల్‌టెంటుగా తోడ్పడవచుగా. ఐఐటి లాంటి ప్లేస్‌లో పని చెయ్యటం ఒక బూన్ అనుకోవాలి'' అని ఎంతో బాగా మాట్లాడారు.''

''ఇంక నువ్వే ఒక నిర్ణయం తీసుకోవాలి. నేను చూడు, ఎవ్వరినీ లక్ష్యపెట్టలేదు, చివరికి నా భార్యని కూడా, నా నిర్ణయం నాదే. పైగా ఇది మనభారతం. మా బాగా చెప్పాడు హెచ్.ఓ.డి. ఇంకా ఎందుకు ఆలోచిస్తావ్! త్వరగా ఒకనిర్ణయానికి వచ్చెయ్. నాకు తెలుసు నీ పరిస్థితి, నిన్ను బాగా అర్థం చేసుకునే వాణ్ణి నేనే అని ఒప్పుకుంటావా?'' అడిగాడు రాంబాబు.

''ఏమిటి నీ ఉద్దేశ్యం'' అడిగాడు అనంతం.

''నా ఉద్దేశ్యం నీకు తెలుసుగా! మరి నీ ఉద్దేశ్యం?'' తిరిగి అడిగాడు రాంబాబు.

''తెలీదు''

''ఇంత ఎక్సలెంటు ఆఫర్‌ని తిరగకొట్టావంటే చాలా ఇబ్బందులలో పడతావ్. కళ్ళు మూసుకుని ఏదయితే అది అయిందని ఏమీ అలోచించకుండా ఇక్కడ చేరిపో. మీ అమ్మా గారు, నాన్న గారు కూడా చాలా సంతోషిస్తారు. నేను కూడా మాట్లాడతాను వాళ్ళతో'' అని చాలా ప్రోత్సహకరంగా మాట్లాడుతున్నాడు రాంబాబు.

ఇద్దరూ నడుచుకుంటూ తారామణి చేరారు.

అప్పటికే సంగీత నీరసంగా మంచం మీద పడుంది.

''నువ్వు వచ్చి ఎంతసేపయింది సంగీతా'' అడిగాడు అనంతం.

''చాలా సేపయింది'' అంది ఎంతో అసంతృప్తి ప్రకటిస్తూ

''నీ ప్రాజెక్టు కంప్లీట్ చేశావా'' అడిగాడు.

''ఓరి దేవుడా! ఈ వాతావరణం, ఈ చమటలు నేను భరించలేను. అందుకే వెంటనే వచ్చి కడుపుకాల్చుకుంటూ నీకోసం వెయిట్ చేస్తున్నాను'' అంది.

''అయ్యో ! అయామ్ సారీ! తొందరగా వెళ్ళి భోజనం చేసి రెస్టు తీసుకోవచ్చుగా'' అన్నాడు.

ఇదంతా చూస్తూనుంచున్నాడు రాంబాబు, అనంతం రూం బయట.

సంగీత, అనంతం బయటికి వచ్చి రూం లాక్ చేసి రాంబాబుతో కలిసి డైనింగ్ హాల్‌కి వెళ్ళారు.

ఆ మరునాటి ఉదయం సంగీత, అనంతం భారత దర్శన్ కి బయలుదేరారు.

దేశంలో వున్న రంగులన్నీ తనకెమెరాలోకి ఇముడ్చుకుంటూంది సంగీత. గుళ్ళు, గోపురాలు, కొండలు, సముద్రాలే కాక ముఖ్యంగా మురికివాడలు, పేదరికం, బట్టలులేని చిన్నచిన్న పౌరులు ఇంకా ఎన్నెన్నో తన కెమెరాలో కుదించుకుంటూంది. అంతా చూస్తూ ఆమె వెంట ఒక వెర్రివానిలా తిరుగుతున్నాడు అనంతం.

''ఇందులో కొన్ని ఫోటోల మీద చాలా డబ్బు చేసుకోవచ్చు, అమెరికాలో. నాప్రాజెక్టుకి చాలా ప్రయోజనాలున్నాయి ఏమంటావ్ అనంతం'' అంది సంగీత ఎంతో సాధించినట్లు.

''ఇంత కుళ్ళులో ఎలా వుండగలవు. బైటి నీకో స్వర్గం క్రింద భావిస్తున్నావు.

ఎసోసియేట్ ప్రొఫెసర్ ఆఫర్ చెయ్యగానే వచ్చేయటమేనా. నీ జీతం నెలకి మూడువందల డాలర్లన్న మాట. నీ నిర్ణయానికి హ్యాట్సాఫ్. ఓగాడ్! సేవ్ ది కింగ్,'' అంటూనే వుంది. భారతావనిని తన గుప్పిట్లో పెట్టుకుంది సంగీత. అనంతం అంతులేని మహాభారతావనిని అర్థం చేసుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాడు.

క్షణికకాలంలో రెండు వారాలు దొర్లిపోయాయి. కాన్ఫరెన్సు సీజనుకాదు కాబట్టి రెండు మూడు వారాలు ఏకధాటిగా వుంచుకోగలిగాడు తారామణిలో ఆ రూములు.

సంగీత ప్రయాణబడలికతో రూంలో ఒళ్ళు తెలియకుండా నిద్రపోతోంది. అమెరికాలో శ్రమించి బీరు త్రాగి పడుకునే స్థితి ఇండియాలో లేకుండా చేశాడు అనంతం. ఇండియాకి బయలుదేరేటప్పుడు సంగీత దగ్గిర 'ఇండియాలో సాఫ్టడ్రింక్సే తప్ప హాట్ డ్రింక్స్ ముట్టను' అని చేతిలో చెయ్యివేయించుకున్నాడు.

''ఎందుకు నీకిన్ని ఇన్హిబిషన్స్ .నాకు కావలసినట్లు నేనుండటానికి నువ్వెప్పుడూ అభ్యంతరం పెట్టలేదే, ఇండియాలో నీకెందుకీ అభ్యంతరం'' అంది.

''అమెరికాలో గాని, ఇండియాలో కాని నేను వాటి జోలికిపోనని నీకు తెలుసుగదా. ఈ ఒక్కసారి నన్ను కాదనకు. ఎలాగో ఓపికపట్టు. పైగా లిక్కరు షాపులు చాలా తక్కువగా వుంటాయి.'' అని ఎన్నో చెప్పి మొత్తానికి ఒప్పించాడు అనంతం.

రాంబాబు అమెరికాలో ఏదో సందర్భంలో చెప్పిన మాటలు గుర్తొకొచ్చాయి. 'ఇండియా నుంచి అమెరికాని తలుచుకుంటే అదో వెర్రి మొర్రిగా వుంటుంది. అదే అమెరికా నుండి ఇండియాని తలుచుకుంటే అంతా మాసిపోయి, కుళ్ళిపోయినట్లు కనబడుతుంది. కొందరు ప్రముఖులకి' .... ఏవేవో పిచ్చి పిచ్చి ఆలోచనలో పడి కొటు మిటలాడుతున్నాడు అనంతం.

'ఏది చూచినా జ్ఞాననేత్రంతో చూడు' అంటూంటాడు అనంతం.

వీడో పిచ్చివాడు' అనుకుంటుంది సంగీత.

'ఎందరో మహానుభావులుద్భవించిన భూమి ఇది. ఈ దేశంలో నీకు, కుళ్లు, బురద కనిపిస్తోందనటం తప్పు. ఇది బురదకాదు, ఇది కుళ్లు కాదు, ఇది మానవతకు ఎన్నో గరిష్ట ప్రమాణాలు కల్పించిన మహాదేశం. జాగ్రత్తగా పరిశీలించు' అని చెబుతూ వచ్చాడు అనంతం.

భారతాన్ని వేర్వేరు ధృక్పదాలతో చూచి వచ్చారు ఆ దంపతులు.

''ఏ మివాయ్ మైడియర్ షేక్స్‌పియర్'' ఎలా వుంది భారతం అనుకుంటూ వచ్చాడు రాంబాబు కన్యాశుల్కంలో గిరిశం లాగ.

''ఉష్! సంగీత నిద్రపోతోంది. నీ రూంకి వెళ్ళి మాట్లాడుకుందాం'' అని తలుపు దగ్గిరగా వేసి బయలుదేరాడు అనంతం.

''బయటికి పోదాం. ఈ ప్రక్కనే ఒక చిన్న రెస్టారెంటుంది'' అన్నాడు రాంబాబు.

''ఇంకా మా అమ్మ, నాన్న రాలేదు. బహూశా సర్కారు ఎక్స్‌ప్రెస్ లేటయి వుంటుంది. నేను సెంట్రల్ స్టేషన్‌కి వెళ్ళి ట్రైన్ వచ్చేదాకా వెయిట్ చెయ్యవలసింది. చాలా పొరపాటు చేశాను. మా ట్రెయిన్ ఎగ్మోర్‌లో ఆగింది. అప్పటికే విసుగెత్తి పోయివుంది సంగీత. సరె! అక్కడి నుండి ఐఐటికి చేరుకునేప్పటికి ఇంకా తెల్లారలేదు. మా నాన్న తిన్నగా వచ్చెయ్య గలడనుకో! ఎప్పుడో నేను ఐఐటిలో చదువుతునప్పుడు ఒకటి రెండుసార్లు వచ్చాడు, ఏటైంలోనైనా వాళ్ళు రావచ్చు. నీ రూంలోకాని, బయట కాని వెయిట్ చేద్దాం నీ కిబ్బంది లేక పోతే'' అన్నాడు కొంచెం వర్రీపడుతూ అనంతం.

''సరే నీ ఇష్టం! మా రూంకి పోదాం పద అక్కడే వెయిట్ చేద్దాం.'' అని అనంతాన్ని తన రూంకి తీసుకెళ్ళాడు రాంబాబు.

ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

''ఇంతకీ ఏం నిర్ణయించుకున్నావు'' అడిగాడు రాంబాబు.

''నాకేం తెలియటం లేదు!'' అని చెప్పుకుంటూ పోతున్నాడు.

''ససేమిరా, ఇండి యాకి నేను, రాను పైగా నేను ఇండియాకి ఎలా వస్తాననుకున్నావ్. ఈ కుళ్ళుదేశానికి నేను రాను. మూడు వందల డాలర్ల జీతం కోసం నువ్వు ఈ దేశం వస్తున్నావంటే నిన్ను ఎలా అర్థం చేసుకోవాలో నాకు తెలియటం లేదు. నీకిష్టమయిన పనికి నెనెప్పుడూ అడ్డం రాను. నీకు తెలుసు నేను చేసే పనులకు నువ్వెప్పుడూ అడ్డం రావని, కావాలంటే నువ్వు ఇండియాకు వచ్చేయ్, నేను అమెరికాలోనే వుంటాను. నువ్వు ఇండియాకు వచ్చి స్థిరపడినంత మాత్రాన నేను కూడా వచ్చేస్తానని నువ్వెలా అనుకుంటున్నావు. నీ ఇష్టం నీది, నాఇష్టం నాది'' అని ఏమిటేమిటో మాట్లాడుతూంది అన్నాడు.

ఏం మాట్లాడకుండా అనంతం కేసి చూస్తూ కూర్చున్నాడు రాంబాబు.

''ఇది నీకో తీరని సమస్య. నాకు తెలుసు. రోలొచ్చి మద్దెలతో మొర పెట్టుకుందిట'' అని ఒకవెర్రినవ్వు నవ్వాడు రాంబాబు.

''నేను ఎన్నోసార్లు మొదటినుంచి సంగీతతో చెబుతూనే వున్నాను. నేను మా అమ్మ నాన్నకి ఏకైక పుత్రుణ్ణి వారి యోగక్షేమాలు నాకు చాలా అవసరం వారికి ఏలోపము రానియ్యకుండా చూడటమే నా కర్తవ్యం. ఒకవేళ ఏదయినా మంచి ఆఫర్ ఇండియానుంచి వస్తే నేను ఇండియాకి వెళ్ళాలి, మా తల్లిదండ్రులను దగ్గిర బెట్టుకుంటాను, అని చాలాసార్లు చెప్పాను, '' అన్నాడు అనంతం.

''ఏమనేది సంగీత'' అడిగాడు రాంబాబు.

''ఓ ఫైన్! నో ప్రాబ్లెమ్ అంటూ వచ్చింది. ఇక్కడ నాకు ఆఫర్ వచ్చిందని చెప్పగానే ఏ ం మాట్లాడ లేదు, దాన్ని గురించి పట్టించుకోలేదు. తరువాత ఈ టూర్‌తో చాలా మార్పులు వచ్చాయి సంగీతలో. ఒక ఏహ్యాభావం కలిగింది భారతంపై. ఇక్కడ మురికివాడలు, పేదరికం, అమెరికాలో చూపి డబ్బు సంపాదించటం ముఖ్యంగా భావించి దేశంలో కుళ్ళంతా తన కెమేరాలో పెట్టుకుంది. గుళ్ళు, గోపురాలు పై నుంచే చూచింది, కాని దైవదర్శనం చేసుకొనేందుకు నిరాకరించేది.''

''రాంబాబు! నువ్వు నాకు చాలా క్లోజ్ ఫ్రెండువి. నీతోకాక మరెవరితో చెప్పుకోగలను. నువ్వు నాతో నీ అంతరంగిక విషయాలు చెప్పుకున్నావు. ఇంక నాటర్న్ వచ్చింది. నువ్వు నా గోడు విని సలహా ఇవ్వవలసిందిగా కోరుకుంటున్నాను.'' అని ఎంతో బాధగా చెప్పుకు పోతున్నాడు అనంతం.

''నువ్వు సంగీత ఉద్దేశ్యం సరిగ్గా కనుకున్నావా! నువ్వు ఇండియాలో వుండు, నేను అమెరికాలో వుంటా అంటే దాని అర్థం ఏమిటి'' అని అడిగాడు రాంబాబు.

''నాకూ అర్థం కావటం లేదు'' అన్నాడు అనంతం చాలా బాధగా ఏదో తప్పుచేసిన వాడిలా.

''నీ కథ, నా కథ ఒకే త్రోవలో నడుస్తున్నాయి. ఎప్పటికైనా లత ఇండియాకి రాబోతుందా అని నేనొక వెర్రి వాడిలా కనిపెట్టుకుని కూర్చున్నాను. నువ్వు ఇండియాకి వస్తే సంగీతనీతో ఎలా వస్తుంది అనుకుంటున్నావు. అసలే ఆ అమ్మాయి అక్కడ పుట్టిపెరిగిన పిల్ల. ఇలా అంటున్నానని నువ్వు ఏమీ అనుకోకు. ఒకవేళ నీతో ఇండియాకి వచ్చినా నీ తల్లి తండ్రులను, వారుండే గృహా పరిసరాలను వారి పద్ధతులను చూచి వెంటనే తిరుగు ప్రయాణం కడుతుంది. ఇది సత్యం, నా మాట నమ్ము, నిన్ను బాధ పెట్టేమాటలు కావివి, నువ్వు చాలా తెలుసున్న వాడివి, మహాజ్ఞానివి. నీకు నీ తల్లిదండ్రుల మీద అమితమైన గౌరవం అప్యాయత కలవాడివి. నీ జీవితం, నీ కథ నేను నా జీవితంతో పోల్చలేను. నీకున్న బాధ్యతలు నాకు లేవేమోననిపిస్తుంది, ముఖ్యంగా తల్లిదండ్రుల విషయంలో'' అని ఏమి మాట్లాడాలో తోచక ఒక్కసారి తలపట్టుకున్నాడు రాంబాబు.

ఇంతలో ఒక అరుపు విన్నారిద్దరూ

''అనంతం! రాంబాబు'' అని పొలికేకలు వినవచ్చాయి.

''సంగీత గొంతులా వుంది'' అని ఒక్కసారి బయటికి వచ్చాడు అనంతం.

అనంతం ఫష్టు ఫ్లోర్‌లో వున్న రూం, రాంబాబు గ్రౌండ్‌ఫ్లోర్‌లో వున్న రూంకి ఎదురుగాకనిపిస్తూంటుంది.

''రాంబాబు! బయటికిరా సంగీతపిలుస్తోంది. ఎవరో వ్యక్తి ఆ ప్రక్కనే

నిలుచుని వున్నాడు,'' అని తొందర తొందరగా తన రూంకి వెళ్ళాడు అనంతం.

''ఇతడెవరో రూం తలుపుకొట్టి తలుపుతోశాడు. అతడి వేషం మాట చూస్తే నాకు భయం వేసింది. నువ్వెక్కడికి వెళ్లావ్ నాతో చెప్పకుండా'' అని భయపడుతూ చెప్పింది.

ఆ ప్రక్కనే ఒకాయిన తెల్ల పంచి భుజం మీద ఒక కండువా, చొక్కావేసుకుని ఉన్నాడు. ఒక చేతిలో పసుపు పచ్చని చిన్న గుడ్డసంచి వుంది. అతడు చూడటానికి ఏదో ఎక్కడో వైష్ణవాలయం పూజారిలా కనిపించాడు. మాసినగెడ్డం, ఒక పెద్దముడి, తల ముందరి భాగం గుండుతో ఉంది. జుట్టు కనుబొమ్మలు కొంచెంగా నెరిసి వున్నాయి. చెవులకి రింగులున్నాయి. నామాలుపెట్టుకుని వున్నాడు. చూడటానికి నల్లని రంగు, మోహంలో ఒక అమాయకత్వం కనబడుతూంది. కాళ్లకి పాత చెప్పులు వేసుకొని వున్నాడు.

అతనికి దగ్గిరగా వెళ్ళి చూచాడు అనంతం.

''అనంతం ఎక్కడ వుంటాడు బాబు'' అడిగాడా వ్యక్తి.

''నేనేనండి అనంతాన్ని, తమరెవ్వరు?'' అడిగాడు అనంతం.

''నేనేరా బాబు! ఆచారి బాబాయిని, కంతేరు నుంచి వస్తున్నాను,'' అన్నాడా వ్యక్తి.

ఒక్కసారి అనంతం ఆయన్ని పట్టుకుని దగ్గిరగా తీసుకున్నాడు.

''బాబాయ్ ఎవరో అనుకున్నాను, మిమ్మల్ని చూచి చాలా కాలమైంది ఎంత సేపయింది వచ్చి, మీరొక్కరే వచ్చారా? ఎలా వచ్చారు? అమ్మా, నాన్న, తణుకు నుంచి వచ్చారా?'' అడిగాడు అనంతం ఎంతో ఆతృతగా

ఇదంతా చూస్తూనుంచున్నాడు రాంబాబు!

సంగీతకిదంతా అర్థమయినట్లులేదు. రూంలోకి వెళ్ళి తలుపేసుకుంది.

''బాబాయ్ మీరు విశ్రాంతి తీసుకోండి ఇదే మీ రూము ''అని ఆ ప్రక్కనే ఉన్న రూంకి తీసుకెళ్ళాడు అనంతం.

''బాబాయ్ మీరు చాలా కష్టపడి వుంటారు ఇక్కడికి చేరటానికి . నాకు తెలుసు, నాకు రాయవలసింది మీరు వస్తున్నట్లు. నేను స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకునేవాణ్ణి'' అన్నాడు అనంతం ఎంతో క్షమాపణ చెబుతున్న రీతిలో.

''ఈ మాత్రానికి నువ్వెందుకురా రావటం. అందులోనూ నువ్వు కూడా ఇవాళే చేరివుంటావు. నిన్ను మళ్ళీ స్టేషన్‌కి రప్పించటం అంత మంచి పద్ధతి కాదు'' అన్నాడు ఆచారి చొక్కా విప్పుకుంటూ.

''ఇక్కడ తమిళం మాట్లాడటం రాకపోతే ఆటో వాళ్ళు చాలా మోసం చేస్తారు బాబాయ్'' అన్నాడు అనంతం

''ఈ మోసాలు ఎక్కడలేవురా! దేశం అంతాటా వున్నాయి. భారతావనికి చెదపట్టింది. దీనిని ఒదిల్చే మరో అవతార పురుషుడు పుట్టాలి. దేశాన్ని ఏలుతున్న ప్రభువులే దేశాన్ని మేసేస్తూంటే వీరెంతరా. పాపం! వాళ్ళకు మాత్రం ఏముందని. వాళ్లు కూడా బ్రతకాలిగా'' అన్నాడు. ఆయన తీరులోను, మాటల్లోను ఏదో తనకు తెలియని ఒక మహోన్నతమయిన వ్యక్తిత్వం కనిపించింది.

''అవును బాబాయ్ మీరు చెప్పింది నిజం.''

''బాబాయ్! మీరు స్నానం చెయ్యండి, నేను కాఫీ, టిఫెను తీసుకొస్తాను ఈ లోపుగా'' అన్నాడు.

''వద్దురా! బాబు, నేను ఏమీ తీసుకోను, ఇలా ఎక్కడికైనా వస్తే టిఫెనులు అవి తినను, కాఫీ ఫరావాలేదు, అది స్టేషన్‌లోనే తాగాను. నాకు ఎక్కడికెళ్లినా వీలుపడదురా! అదో చాదస్తం. పైగా నా పొట్టకి ఏదీ సరిపడదు. కూడా. ఆ ఆవకాయిపడితేగాని మన యంత్రం పని చెయ్యదు.'' అని ఒక్కసారి నవ్వాడు సంచీలోంచి తువ్వాలు తీస్తూ.

అనంతం బాబాయ్‌ని రూంలో ప్రవేశబెట్టి బయటికి వచ్చాడు.

రాంబాబు అనంతం కోసం బయట వెయిట్ చేస్తున్నాడు.

''అనంతం నిన్ను మళ్ళీ కలుసుకుంటాను, తరువాత మాట్లాడుకుందా.

నువ్వు ఆయన్ని చూసుకో'' అని తన రూముకి వెళ్ళాడు రాంబాబు.

అనంతం రూంలోకి వెళ్ళి తలగడాలో తలదూర్చి దుఃఖించసాగాడు.

''ఎందుకలా బాధపడతావ్'' అడిగింది సంగీత కొంత నిర్లక్ష్యంగా.

''మా అమ్మ, నాన్న రాలేదు, ఆచారి బాబాయిని పంపారు.'' అని ఒక చిన్న పిల్లవాడిలా బాధపడుతున్నాడు.

''నువ్వు, మీ ఆచారి బాబాయ్‌తో కలిసి మీ వూరు వెళ్ళి మీ అమ్మని నాన్నని చూచి రావచ్చుగా, దీనికింత బాధపడతావెందుకు'' అంది.

ఒక్కసారి సంగీతకేసి చూచి ''సంగీతా! జీవితాన్ని ఇంత చులకనగా తీసుకొవటం మంచి పద్ధతికాదు. నువ్వు అమెరికాలో పుట్టి పెరిగావు. నీ కర్థం కావు ఇక్కడి అప్యాయతలు, మమతలు, మమకారాలు. నువ్వు కాస్సేపు మాట్లాడకు'' అన్నాడు విసురుగా.

సంగీత విస్తుపోయి చూసింది.

కాస్సేపు వారిద్దరిమధ్య నిశ్శబ్దం ఆవరించింది.

''నేను నీతో మీవూరు రావటానికి సంసిద్ధం కావటం లేదు. నాకు మహా బోరుకొడుతోంది. నేను నీతో ఎన్నోసార్లు చెబుతూ వచ్చాను, నీతో మీ వూరు వచ్చి గుళ్ళో పెళ్ళి చేసుకోవటం అన్నది చాలా సిల్లీగా వుంది. ఇంక చాలు, ఈ దేశాన్నికళ్ళారా చూచాను. ఈ నిరక్షరాస్యత, పేదరికం, ఈ కొట్లాటలు, అసభ్యప్రవర్తన, అపరిశుభ్రత నేను భరించలేను. నేను రేపు అమెరికా వెళ్ళిపోవటానికి నిర్ణయించుకున్నాను.'' అంది కోపంగా ఒక నిర్లక్ష్యభావంతో.

''సంగీతా!'' అరిచాడు అనంతం.

''అరుస్తావెందుకు, నేను మాత్రం అరవలేకనా, మర్యాదగా, నెమ్మదిగానే చెబుతున్నాను. నాకు మీ వూరు రావటానికి వీలు పడదు. ఈ దేశంమంతా తిరిగి వచ్చిన నాకు మీ వూరి పరిస్థితులు, పరిసరాలు, మనుషుల ప్రవర్తన, ఏ విధంగా వుంటాయో ఉహించలేనను కున్నావా! మీ ఆచారి బాబాయే ఒక ఎగ్జాంపుల్. ఈ దేశం అంటే నాకెక్కడ

లేని జుగుప్సా భయాలతో కలిగిన భావన ఏర్పడింది. ఈ మలినాన్ని నువ్వు తీసివేయగలవా! ఈ దేశాన్ని నువ్వు ఉద్ధరించగలవా? ఈ కుళ్ళులో పుట్టి పెరిగిన నీకు నీ చూట్టూ వున్న మలినం కనిపించదు. మనం కలిసి కాపురం చేద్దాం అని నీకు వుంటే నువ్వు నాతో అమెరికా వచ్చేయ్. ఈ దేశం గురించి మార్చిపో, ఇటువంటి దేశాలు దూరంగా నిలబడి చూడవలసిన దేశాలు. అప్పుడు దీనిలో ఒక అందం, చందం, ఒక పచ్చదనం చూడగలం.'' అని ఆపులేకుండా తనకు తోచిన విధంగా చెబుతోంది.

''నీకు ఎం చెప్పినా అర్థం చేసుకునే పరిస్థితి ఇంకా రాలేదే అని బాధపడుతున్నాను. నువ్వు చాలా తెలివైన పిల్లవని సంతోషించాను. నువ్వు ఇంత దారుణంగా ఈ దేశాన్ని అర్థం చేసుకుంటావని నేను నమ్మలేకపోతున్నాను. మనిషిని మనిషిలా అర్థం చేసుకో. ఇది ఒక మహోన్నతమయిన దేశం. నువ్వు ఎంతసేపూ ఒక జుగుప్సా భావంతో చూస్తున్నావ్, అందుకే నువ్వు పేదరికాన్ని నిరక్షరాస్యతను, అపరిశుభ్రతనే చూడగలుగుతున్నావు. కాని మనిషినిలోని మమత, మమకారం, ఆప్యాయత, ఓర్పు, త్యాగబుద్ధిని పరిశీలించలేక పోతున్నావు. మనిషిలో ఇన్ని గొప్ప గుణాలు గల దేశం భారతదేశమొక్కటే. ఎంతో మంది త్యాగమూర్తుల నిచ్చిన దేశం ఇది. లేమిలో ఉన్న తృప్తి కలిమిలో లేదు. ఇదే భారతీయత, ఇది ఒక సంస్కృతి. అది ఒక వేదాంత ధోరణి. పేద వానిలో ఉన్న భారతీయత ధనవంతునిలో చూడబోము. ధనవంతులు పాశ్చాత్య పద్ధతులకు మొగ్గుతారు. పాశ్చాత్య దేశాలు మెటీరియలిజమ్‌లో చాలా ఉన్నత స్థాయిలందుకున్నారు. ధనం ఉన్న చోట మెటీరియలీజందే పైచేయి. అసంతృప్తి అధికమించి మానవత నసిస్తుంది. అంటే మానవుడు తను తయారు చేసిన మేషిను చేతిలో కీలుబొమ్మలా తయారవుతాడు. అది మంచి పద్ధతి కాదు.''

''సంగీతా! ఎంతో గొప్ప గొప్ప మేధావులే ఈ దేశాన్ని అర్థం చేసుకోలేకపోయారు. ఇక మనమెంత!'' అని చాలా ఉదాసీనంగా చెప్పాడు

''ఓ.కె. నీతో మాట్లాడి లాభం లేదు. యూ ఆర్ ఎ బిగ్‌నట్ '' అని కెమెరాపట్టుకుని విసురుగా బయటకు వెళ్ళింది.

''సంగీతా!'' అరిచాడు.

ఆమె వినిపించుకోలేదు. బయటికి వచ్చి చూచాడు ఆమె కనుమరుగైంది.

తలుపు తెరిచే వుంది.

లోపల పక్కమీద పడుకున్నాడు అనంతం.

ఆచారి బాబాయి స్నానం జపం ముగించుకుని అనంతం రూంలో ప్రవేశిస్తూ

''ఏరా! బాబు! ఎలా వున్నావు, ఏమిటి కథ. ఇంత సేపయివచ్చి మనం ఇంకా ఏమీ సరిగ్గా మాట్లాడుకోనేలేదు'' అన్నాడు.

''రండి! బాబాయ్ కూర్చోండి, కాఫీ తెప్పించనా?'' అడిగాడు.

''ఒద్దురా బాబు, ఇప్పుడేమీ వద్దు'' అని హాయిగా కూర్చీలో కూర్చున్నాడు ఆచారి.

''బాబాయ్! అమ్మానాన్న, ఎందుకు రాలేదు కులాసాగా వున్నారా!'' అడిగాడు అనంతం.

''వారికేం రా! నిక్షేపంలా వున్నారు, అమ్మాయి ఏది'' అడిగాడు ఆచారి.

''ఇప్పుడే అలా బయటకు వెళ్లింది, వచ్చేస్తుంది'' అన్నాడు.

''ఒరేయ్! మాతరం మనుష్యులుకు కొన్ని కట్టుబాట్లు, పద్ధతులు వుంటాయిరా. అదులోంచి బయటికి రావటానికి మాతరం కాదు, కొన్ని తరాలు పడుతుంది. మేము బయట ప్రపంచాన్ని మాకున్న ధృక్పదంతోనే యోచించి చూస్తుంటాము. అది ఈ తరం వారికి నచ్చవచ్చు నచ్చకపోవచ్చు..... ఏదో మాట్లాడేస్తున్నానని భావించకు, చిన్న తనంలో తాతగారి వద్దకొంత విద్యనభ్యసించావు.....నాకు నిన్ను చూస్తే ఎంతో ముచ్చటేస్తుంటుందిరా..... ఎంతో తెలివైన కుర్రాడివి, విదేశాలు వెళ్ళావు, ఎన్నో నేర్చుకున్నావు.... నేనెప్పుడూ చెబుతుంటాను, మా పిలల్లకి నీ గురించి ''అగాడు ఆచారి.

'ఏం చెబుదాం అనుకుంటున్నాడో ఆచారి బాబాయ్' అని ఎంతో శ్రద్ధగా వింటున్నాడు అనంతం.

''నాన్న ఎక్కడికీకదలటం మానేశాడురా. కనీసం, కంతేరు కూడా రావడం లేదు. ఈ మధ్య ఆస్కూలుతోటే సరిపోతోంది. అమ్మ సరేసరి, నాన్న కదిలితేగాని అమ్మ కదలు గా. పైగా ఎక్కడికివెళ్ళినా ఏం తిన్నాపడటం లేదు నాన్నకి. అమ్మ,నాన్నకి కావలసినట్టుగా వండి పెట్టి ఆయన ఆరోగ్యం కనిపెట్టుకుంటూంటుంది.'' అన్నాడు ఆచారి.

''నాన్నకెలా వుంది బాబాయ్'' అడిగాడు అనంతం ఆతృతగా.

''శుభరంగా వున్నాడు, శుద్ధభయస్తుడు రా, ఏది తింటే ఏమవుతుందోనని భయం. అమ్మే నాన్నని వెళ్లవద్దని చెప్పింది. అందుకే వాళ్ళు రాలేదు.'' అని తటపటాయించాడు ఆచారి.

అనంతానికి అచారి బాబాయ్‌ని చూస్తే అనుమానం వచ్చింది.

''బాబాయ్‌! మేము త ణుకు లో కేశవస్వామి ఆలయంలో పెళ్లి చేసుకుందాం అని సంగీతని ఒప్పించి తీసుకొచ్చాను. అమ్మానాన్న ఏమనుకుంటున్నారు,'' అడిగాడు అనంతం.

''ఆ పని మాత్రం చెయ్యకురా అనంతం. ఒకసారి చర్చిలో పెళ్ళిచేసుకున్నాక మళ్ళీ గుళ్ళో పెళ్ళి బావుండదని వారి ఉద్ధేశ్యం. ఒకే పిల్లని రెండుసార్లు పెళ్ళి చేసుకోవటం అన్నది మన ఆచారం కాదురా'' అన్నాడు ఆచారి.

అనంతానికి చెమటలు పట్టాయి. వెళ్ళి ఫ్యానుస్పీడు హెచ్చించాడు.

''బాబాయ్! నన్నేం చెయ్యమంటావ్ ఇప్పుడు'' అడిగాడు అనంతం ఎంతో కలవరపడుతూ.

''అమ్మాయి ఒప్పుకుందా'' అడిగాడు ఆచారి.

''లేదు నేను ఒప్పిస్తున్నాను'' అన్నాడు అనంతం.

''ఇది అమ్మా,నాన్న దృష్టిలో కూడా మంచి పద్ధతికాదు. నాదృష్టిలో కూడా ఇది మంచి పద్ధతి కాదనిపిస్తుంది'' అన్నాడు ఆచారి.

అనంతం ఒక్కసారి బయటకువెళ్ళి గట్టిగా అరిచాడు.

''రాంబాబూ'' అని.

రాంబాబు క్లాస్ ప్రెపరేషన్ చేసుకుంటూ బయటి వచ్చాడు.

''ఒక్కసారి నువ్వు నా రూం కి రా'' అన్నాడు.

రాంబాబు అనంతం రూం చేరుకున్నాడు.

''బాబాయ్! ఈయన పేరు రాంబాబు. నాకు మంచి స్నేహితుడు. ఈ మధ్యనే అమెరికా నుంచి వచ్చి ఇక్కడ ఫ్యాకల్టీ లో చేరాడు. నాకు చాలా అంతరంగికుడు. నువ్వు నాతో మాట్లాడినా ఇతనితో మాట్లాడినా ఒకటే'' అని పరిచయం చేశాడు.

''ఇతను చాలా చిక్కుల్లో వున్నాడండి, నేను మాత్రం ఏం తీసిపోలేదులెండి. మనం మనం కూర్చుని కొన్ని సమస్యలు పరిష్క రించుకోవాలి. మీరు పెద్దవారు ముఖ్యంగా అనంతం విషయం తేల్చుకుందాం.'' అన్నాడు రాంబాబు ఎక్కడ లేని నవ్వుతెచ్చుకుంటూ.

''ఈ అమ్మాయిని తీసుకుని తణుకు వెడదామని అనుకుంటున్నావా!'' అడిగాడు ఆచారి.

''అవును'' అని ప్రశ్నార్థకంగా చూచాడు అనంతం.

''బాబూ! అనంతం! నా మాట విని ఆ అమ్మాయిని తీసుకుని నువ్వు అమెరికా వెళ్ళిపో. మీ అమ్మ,నాన్న కూడా మీరిద్దరూ రావటానికి ఇష్టపడటం లేదురా. ఆ అమ్మా యి అమెరికాలో పుట్టి పెరిగింది. మన పరిసర ప్రాంతాలు, మన పద్ధతులు చూచి అసహ్యించుకోవటం వారి కిష్టం లేదురా. ఆ అమ్మాయిని అమెరికా పంపి నువ్వు ఒక్కడివి తణుకు రావటం కూడా వారికిష్టం లేదురా. వారికిష్టం లేని పని చేస్తే వారు సహించలేరురా'' అన్నాడు అచారి ఎంతో వారించే విధంగా.

''అమ్మా,నాన్న నన్ను తణుకు రావద్దని చెప్పారా బాబాయ్!'' అడిగాడు చాలా బాధపడుతూ.

''ఆ అమ్మాయిని ఒప్పించి తీసుకురావటం వారికిష్టం లేదు. తరువాత ఆ అమ్మాయి రాకుండా నువ్వు ఒక్కడివి రావటం కూడా వారికిష్టం లేదు'' అన్నాడు ఆచారి చాలా ఉదాసీనంగా.

''ఇండియాకి వచ్చాక కూడా అమ్మా నాన్నని చూచే యోగ్యత నాకు లేదా'' అని దుఃఖం ఆపుకోలేకపోయాడు అనంతం.

ఆచారి, రాంబాబు అనంతాన్ని ఊరడిస్తున్నారు.

''మరోసారి వద్దువుగాని అమ్మని, నాన్నని చూడటానికి. నీ ఉద్దేశ్యమేమిటి బాబు'' అడిగాడు ఆచారి రాంబాబుని.

''పెద్దల నిర్ణయమే నా నిర్ణయం'' అన్నాడు రాంబాబు చాలా ధీమాగా

ఒక్కసారి రాంబాబు కేసి చూచాడు అనంతం.

'రాంబాబు తలవంచుకున్నాడు,

కొంతసేపు ఎవరుమాట్లాడు కోలేదు.

సంగీత ఒక్కసారి విసురుగా ప్రవేశించింది రూంలోకి. అక్కడి వారిని పట్టించుకున్నట్లులేదు.

కెమేరాను, గాగుల్సుని ప్రక్కమీదకు విసిరి బాత్‌రూంలోకి ప్రవేశించి గట్టిగా తలుపేసుకుంది.

''రాంబాబూ! బాబాయ్‌ని రూంకి తీసుకువెళ్ళు. నేను, సంగీత భోజనానికి తయారయి వస్తాం. అందరం కలిసి భోజనానికి వెడదాం'' అన్నాడు అనంతం.

రాంబాబు ఆచారిని తీసుకుని వెళ్ళాడు.

సంగీత బాత్‌రూంలోంచి బయటికి వచ్చింది.

''సంగీతా! నీ ప్రాజెక్టు కంప్లీటయిందా'' అడిగాడు అనంతం.

''ఇంకా కాలేదు మీ బాబయ్‌కి ఒకఫోటో తియ్యాలి'' అంది.

''నిజామా! వెరీనైస్'' అని అనంతం గబగబా ఆచారి రూంకి వెళ్ళి.

''బాబాయ్! రండి భోజానానికి వెడదాం'' అని చెప్పి వారిని తన రూంకి తీసుకు వచ్చాడు.

''బాబాయ్! ఈమే సంగీత'' అని పరిచయం చేశాడు.

ఆచారి సంగీతని దీవించాడు.

''నాకు ప్రత్యేకంగా మళ్ళీ పరిచయం చేస్తున్నావు. ముందుగా నేనే కదా ఈయన్ని చూచాను.'' అని అక్కడ కుర్చీ జరిపి ఆచారిని ఆ కుర్చీలో కూర్చోమంది ఇంగ్లీషులో, అమెరికా పద్ధతిలో.

ఆచారి, సంగీత చేస్తున్న మర్యాదకి సంతోషించి అనంతం కేసి చూచి కొంచెం మొహమాటపడ్డాడు.

''బాబాయ్! నీకు సంగీత ఒకఫోటో తీస్తుందిట కూర్చోబాబాయ్'' అన్నాడు అనంతం.

''నాకెందురా ఫోటో మీరూ మీరూ తీసుకోండి. ఎవరయినా చూస్తే ఈ కోతి నెక్కడ నుండి తెచ్చారు అనుకుంటారు'' అన్నాడు ఆచారి ఆయాయకంగా నవ్వుతూ.

''ఏమిటి మాట్లాడుతూన్నాడు'' అని అడిగి తెలుసుకుని పొట్టబద్దలయ్యేట్టు నవ్వింది'' సంగీత.

అనంతం, రాంబాబు బిగిసిపోయి ఆచారి బాబాయి ఏమనుకుంటాడో అని అనుకున్నట్లు ఒకరినొకరు చూచుకున్నారు.

చిన్నగా నవ్వమని చెప్పమంది అనంతంతో సంగీత.

అనంతం ఏమి మాట్లాడలేదు

''ఫరవాలేదు అలాగే సహజంగా వుంటుంది, తియ్యి''. అన్నాడు రాంబాబు.

''కొంచెంగా నవ్వమంటూంది బాబాయ్, సంగీత'' అన్నాడు అనంతం.

ఆచారి పళ్ళికిలించాడు.

''ఇప్పుడు మీరనుకున్నట్లుగా వస్తుంది ఫోటో'' అని ఒక్కసారి కెమెరా క్లిక్ చేసి పకపకా నవ్వి.

''చాలా థాంక్స్'' అంది ఆచారితో చాలా హాయిగా ఫీలవుతూ.

అందరూ కలిసి భోజనానికి బయలు దేరారు.

''ఈ రోజు సాయంకాలం నన్ను సర్కారు బండి ఎక్కించరా బాబూ అనంతం'' అన్నాడు ఆచారి బోజనం చేస్తూ.

''అదేమిటి బాబాయ్! అప్పుడే వెళ్ళిపోతారా?'' అడిగాడు అనంతం.

''నేనిక్కడుండి ఏం చేస్తానురా! నాకు ఈ భోజనాలు ఈ వసతులు కుదురవురా, నేనొచ్చిన పని అయింది. ఇంకా వుండి ఏం ప్రయోజనం. నాన్న అమ్మ కూడా నాకోసం రేపు సర్కారుకి ఎదురు చూస్తుంటారు'' అన్నాడు.

''నేను, అనంతం వచ్చిమిమ్మల్ని ఈ రోజు సర్కారు ఎక్స్‌ప్రెస్ ఎక్కిస్తాం'' అని హామీ ఇచ్చాడు రాంబాబు.

''ఆయన చెప్పినట్లే చెయ్యి అనంతం. మనం వారిని నొప్పించకూడదు'' అన్నాడు రాంబాబు.

ఈ గొడవలేమి పట్టించుకొన్నట్లు లేదు సంగీత.

''బాబాయ్ మొహమాటపకుండా భోజనం చెయ్యండి'' అన్నాడు మర్యాదగా.

''నాకు మొహమాటమేమిటిరా! నేను మీ నాన్న, పొదలాడ గంగారెడ్డి హోటల్‌కి ప్రొద్దుటే ప్రత్యేకంగా వెళ్ళి ఇడ్లీపోటీ పెట్టుకున్నే వాళ్ళం. ఆగంగారెడ్డి చేతులడి పోయేవి మాకు ఇడ్లీలు వడ్డించలేక'' అని పక పకా గట్టిగా నవ్వాడు ఆచారి.

సంగీత ఆచారి కేసి ఆదోలా చూచింది.

భోజనాలు చేశాక అనంతం, ఆచారిని రాంబాబు రూంకి తీసుకువెళ్ళాడు.

ఇవేమీ పట్టించుకోకుండా సంగీత రూంకి వెళ్ళి తలుపు లేసుకుని నిద్రపోయింది.

# 11

చిన వెంకటాచారి, అనంతాన్ని మద్రాసులో కలిసి వచ్చినప్పటి నుంచీ సుబ్బారామయ్య మాష్టారుకి స్థిమితం లేదు. రాజేశ్వరమ్మగారు ఎంత ధైర్యం తెచ్చుకుని ఆయనను ఓదార్చినా మనోవ్యధ నుండి బయటపడటం ఆయన వల్లకావటం లేదు. స్కూలికి వెళ్ళి, వెళ్ళక, వున్న సెలవుంతా ఖర్చుబెట్టి, ఒక మతిస్థిమితం లేని మనిషిగా తిరుగుతున్నారు. ఎవ్వరితోటీ మాట్లాడటం కూడా మానేశారు. రాజేశ్వరమ్మ గారు ఏమీ చెయ్య లేని పరిస్థితి సంభవించింది. రాను, రాను, బి.పి. ఎక్కువవటం, షుగరు బాగా కనిపించటం జరిగింది. సత్యం డాక్టరు గారు ప్రతి రోజు వస్తూ పోతూండే పరిస్థితి వచ్చింది. చివరికి స్కూలుకి కూడా వెళ్ళలేక అలా మంచాన్నంటుకు పోయారు. చినవెంకటాచారి ఏ రోజు విడవకుండా కంతేరు నుండి ఒక్కసారయినా వచ్చి మాష్టారుని చూచి రాజేశ్వరమ్మగారికి ధైర్యం చెప్పి వెడుతూండే వాడు.

మనిషికి చివరికి, తీసుకుని. తీసుకుని పోయే పరిస్థితి వచ్చి ఆఖరిసారిగా ఊపిరివదిలారు మాష్టారు.

సుబ్బరామయ్య మాష్టారి మృతదేహం ప్రక్కనే కూర్చున్నారు ఆయన భార్య రాజేశ్వరమ్మగారు.

నోట మాట లేదు.

ఎవరొచ్చినా అలా వచ్చిన వారికేసి చూచి బిసిగిపోయి కూర్చున్నారు పమిటతో నోరు కప్పుకుని.

ఆమె కంటి నీరెండిపోయి ఎంతోకాలం అయింది. మాష్టారు మంచాన పడ్డప్పటినుంచి ఆయనకు చాకిరీతో సరిపోయిందామెకు.

''ఇంతకన్నా మహాభాగ్యం నాకేం కావాలి'' అని ధుఃఖిస్తూండేవారు.

రాజేశ్వరమ్మగారు మహా మనిషి. ఆ అదృష్టం ఏమిటో కాని వారిద్దరికీ కుదిరిన అనుబంధం మనం ఎక్కడో కాని చూడం.

పురాణాల్లో చెబుతూంటారు, 'సీత' 'అనసూయ' 'సుమతి' ఇంకా ఎందరినో చెబుతుంటారు.

మన ఎదురుగానే వుంటూంటారు క ందరు మహా వ్యక్తులు. వీరిని గుర్తు పట్టే అవకాశం కూడా వుండదు మనకు.

ఆ చుట్టుప్రక్కల ఆడవాళ్ళు రాజేశ్వరమ్మగారి వెనకాల కూర్చుని వున్నారు. కొందరు మగవాళ్ళు ఆ ప్రక్కగా కూర్చుని వున్నారు.

బయట హడావుడిగా వుంది. జనం వస్తున్నారు, పోతున్నారు. మాష్టారు గురించి ఆ వూళ్ళో అందరికీ తెలుసు. అధికారుల్లో అసలు పలుకుబడి లేని వ్యక్తి. అందుకే అయన్ని ఇష్టమొచ్చినట్లు తిప్పేశారు జిల్లాపరిషత్తు ప్రబుద్ధులు.

ఎవర్కైనా ఎక్కడికైనా ట్రాన్సఫర్ కావాలంటే ముందుగా మాష్టారునే బదిలీచేసి ఆఫలానా వ్యక్తిని మాష్టారు స్థానంలో వేసేవారు జిల్లా పరిషత్తు అధికారులు.

ఎక్కడికి బదిలీ చేసినా నోరెత్తకుండా వెళ్ళి పనిచేస్తుండేవారు.

ఆఖరి ఐదుసంవత్సరాలు మహాకష్టంమీద మాష్టారు, రాజేశ్వరమ్మగారి ప్రోద్బలంమీద వెళ్ళి జిల్లా పరిషత్తు అధికారులను బ్రతిమాలవలసివచ్చింది.

అప్పులబాధ భరించలేక , ఆ.. వున్న రెండు ఎకరాల భూమి అమ్మవలసి వచ్చింది. అమెరికానుంచి కొడుకు ఎంత సొమ్ము పంపినా అందులో ఒక్క కానీ కూడా ఆశించని వ్యక్తులు. వున్నదంతా అప్పులు చేసి కొడుకు చదువుకే పెట్టేశారు.

తండ్రి బ్రహ్మయ్యశాస్త్రిగారు ఇచ్చిన ఆ ఒక్క ఇల్లు అట్టేపెట్టుకున్నారు మాష్టారు కంతేరులో. అదేనా చాలా పాడుబడిపోయేస్థితికి వచ్చింది. అది బాగుచేయించుకొనే స్థితికూడా లేదు మాష్టారుకి.

మొత్తానికి తణుకు బదిలీ అయిన తర్వాత ఆ రెండెకరాలు అమ్మి అప్పులలోంచి బయటపడి కొంత వూపిరి పీల్చుకున్నారు.

గతనాలుగేళ్ళుగా తణుకులో స్థిరపడ్డారు.

ఇంకో సంవత్సరం సర్వీసుంది మాష్టారుకి, ఇంతలోనే ముంచుకుపోయింది.

అంతకీ రాజేశ్వరమ్మగారు చెబుతూనే వుండేవారు.

''మనం చెయ్యవలసిన విధి మనం నిర్వర్తించాం. అన్నీ తెలుసున్నవారు మీరు. మీరే ఇంతగా బాధపడటం అంత మంచిది కాదు. నేను మీకు చెప్పదగినదాన్ని కాదు. ఎన్నో శాస్త్రాలు చదివారు. నాకు ఏవేవో చెబుతూండేవారు.'' అంటూ బాధపడుతూ ఉండేవారు. కాని పైకి కనబర్చేవారు కాదు ఆ మహాసాధ్వి. ఆ చుట్టుప్రక్కలవారు అమెనో దేవతలా ఆరాధించేవారు.

కబురు తెలిసి మాష్టారింటి చుట్టూచేరారు ఎంతో మంది విధ్యార్థులు. కొందరు దుఃఖం ఆపుకోలేక గట్టిగా ఏడ్చారు. మిగతా మాష్టార్లు ఆ విద్యార్థులను వూరడించారు.

'మనం వుండే పరిస్థితులు, సహవాసం, ఆహారనియమాలు మనిషి ప్రవర్తన మీద చాలా పని చేస్తాయి. కొందరు అదృష్టంవల్ల అన్నీ సమకూడతాయి. మనిషిలోని మంచిని చూడ కలుగుతాం!'

ఏవేవో చెబుతూండేవారు మాష్టారు.

ఎన్నోసార్లు ఎంతో మందితో అవకాశం వచ్చినప్పుడల్లా, పిల్లలకి పాఠం చెప్పే పద్ధతికి అలవాటు పడటం మూలాన, ఎన్నో నీతికథలతో, ఉపమానాలతో, ఎన్నెన్నో పురాణ కథల నిర్వచనాలతో మాట్లాడుతూ. చెప్పవలసిన విషయాలు చెబుతూండేవారు.

మాష్టారు మాట్లాడుతూంటే ఎంతో ఆసక్తిగా వింటూండేవారు వారి స్నేహితులు, విద్యార్థులు. అవూరిలో మాష్టారు ఒక మహావ్యక్తి, ఒక మేధావి క్రింద పరిగణింపబడేవారు.

ఎవరో ఆ వూళ్ళో వున్న చుట్టాలు వచ్చారు. కాని వారికి అర్హతలేని కారణం వల్ల మొత్తం అంత్యక్రియలకి సన్నాహాలన్నీ ఆ పురోహితుని చేత చేయించవలసి వచ్చింది.

ఇదంతా రాజేశ్వరమ్మగారు పట్టించుకున్నట్లు లేదు.

ఆ చుట్టుప్రక్కల పెద్దమనుష్యులు పూనుకొని అంత్యక్రియలకి తతంగం జరిపించటం ప్రారంభించారు.

ప్రక్కనేవున్న పార్వతమ్మగారు కాఫీతెచ్చి ''పోనీ కాస్త కాఫీ అన్నా పుచ్చుకోమ్మా నిన్నటినుంచి ఏమీ తినలేదు. మా కోసం అయినా తీసుకో అమ్మా! మన చేతిలో ఏముంది. అంతా కాలవైపరీత్యం. బ్రతికున్నవాళ్ళం పోయిన వాళ్ళకోసం ప్రాణం తీసుకోలేం కదా'' అని కొంచెం కొంచెంగా రాజేశ్వరమ్మ గారికి చెబుతున్నారు.

రాజేశ్వరమ్మగారి మనస్సు ఎక్కడుందో, ఏమి ఆలోచిస్తున్నారో, ఎవరిని గురించి ఆలోచిస్తున్నారో ఎవరికీ తెలియని విషయం కాదు.

ఆమెలోకంవేరు. జీవితంలో ఎన్నో సార్లు ఉపోషాలు చేసిన వ్యక్తి ఆమె. మాష్టారి కుటుంబాలు, రాజేశ్వరమ్మగారి తండ్రిగారి కుటుంబాలు ఎంతో చెప్పుకోదగ్గ మనుష్యులు. చాలా స్తోత్రీయులు.

చాదస్తులు అని మాత్రం చెప్పలేము. చాదస్తులు అంటే మూర్ఖులు అని అర్థం కాదు. చాదస్తులు అంటే ఏదో కొన్ని మంచి పద్ధతులు, కొన్ని ఎవరికీ హాని చెయ్యని నియమాలు పాటించువారు అని అనుకోవచ్చును.

మాష్టారికుటుంబీకులు చాలా మట్టుకు సరిపెట్టుకునే మనుషులు.

''మనం ఒకరిని ఇబ్బంది పెట్టకూడదు. మనం ఇబ్బంది పడినా ఫరవాలేదు.'' అనుకునే మహా వ్యక్తులు. వీరి కుటుంబాలలో ఎంతో చెప్పుకోదగ్గ వ్యక్తి సుబ్బరామయ్య మాష్టారి తండ్రిగారు బ్రహ్మయ్యశాస్త్రిగారు, గొప్ప మనిషి. ఇప్పుడు లేరు.

వచ్చిన వారు కొందరు ముక్కుమీద వేలేసుకున్నారు. ''ఏం లాభం, వున్న ఒక్క కొడుకూ అమెరికాలో వున్నాడు. మాటలా! ఒక్కక్షణంలో అక్కడినుంచి వూడిపడటానికి''.

''వాడికేం గొడవలున్నాయో!'' అనుకున్నారు కొందరు.

రాజేశ్వరమ్మగారు ఒక్కసారి ప్రక్కనేవున్న పార్వతమ్మగారి చేయి ఎడమ చేత్తో పట్టుకుని కుడిచేత్తో పమిట పైకి లాక్కుని నోటికడ్డం పెట్టుకొని తలదించుకొని

కళ్ళుమూసుకుని దుఃఖిస్తున్నారు.

పార్వతమ్మగారు ఒక్కసారి రాజేశ్వరమ్మగారి తలనిమిరారు.

రాజేశ్వరమ్మగారు లేవబో యారు. కాని జవసత్తువలున్నట్టులేవు.

పార్వతమ్మ సహాయంతో లేచి బాత్‌రూం వైపు వెళ్ళారు.

''కళ్ళు తిరుగుతాయమ్మ, నేను కూడా వస్తానుండు'' అని పార్వతమ్మగారు కూడా వెళ్ళారు.

రాజేశ్వరమ్మగారు బాత్‌రూం బయటకు చమటలు క్రక్కుతూవచ్చి ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. పార్వతమ్మ కేకలు విని నలుగురూ వచ్చి మొహం మీదనీళ్ళు చల్లారు. వెంటనే తెలివివచ్చింది రాజేశ్వరమ్మగారికి.

తెలివిరాగానే విపరీతమయిన దుఃఖం పొర్లి పొర్లి వచ్చింది. హిస్టీరియాలాగ వచ్చి గడగడ వణికిపోయారు. అక్కడున్న వారంతా కంగారు పడ్డారు. ఇంతలో ఒకాయన బయటకెళ్ళి అక్కడున్న కుర్రవాళ్ళతో

''సత్యం డాక్టర్ గారిని'' వెంటనే తీసుకురండి అని కబురు పెట్టాడు.

అంతక్రితమే సత్యం డాక్టరు గారు మాష్టారు ఇంటి నుంచి వెళ్ళి ఒక గంట అయివుంటుంది.

వెంటనే హడావుడిగా వచ్చారు సత్యం డాక్టరుగారు.

ఉన్నవే మాష్టారుకి రెండు రూముల పోర్షను. ఒకటి వంటగది, వాకిలికి, భోజనాలకి, పడకకి, ఎవరయినా వస్తే కూర్చునేందుకు అన్నింటికీ ఆ రెండవగది. వెనుకదొడ్డి అక్కడ కాపురాలున్న వారందరికీ ఉమ్మడి. అక్కడ ఒక నుయ్యి, నాలుగు మరుగుదొడ్లు, అక్కడ కాపురాలున్న నలుగురికీ ఉపయోగపడుతూంటాయి.

మాష్టారిమృతదేహం అదేగదిలో మధ్యగా వుంచటం వల్ల, రాజేశ్వరమ్మగారికి అదేగదిలో ఒక మూల చోటుచేసి తలగడావేసి పడుకోపెట్టవలసివచ్చింది.

సత్యం డాక్టరుగారు రాజేశ్వరమ్మగారి బి.పి.చూచి ఒక్కసారి కనుబొమ్మలు ముడివేశారు. అందరూ భయపడ్డారు.

''ఏమయింది బాబు మా రాజేశ్వరికి'' అని భయపడుతూ ఆదుర్దాగా అడిగారు పార్వతమ్మగారు.

''ఏం ఫరవాలేదు. ఆమెని పడుకోనియ్యండి.'' అని నిద్రకు ఇంజక్షనిచ్చి వెళ్ళిపోయారు డాక్టరుగారు.

రాజేశ్వరమ్మగారికి ఒళ్ళు తెలియడం లేదు. మూలుగుతున్నారు.

జనం అంతా ఏదో తెలియని బాధతో విస్తుపోయిచూస్తున్నారు.

కొందరు ఎవరిళ్ళకు వారు నెంపాదిగా వెడుతున్నారు.

విద్యార్థులలో ఒకడు ఒక పెద్ద దండతో లోపలికి వచ్చాడు. అతనితో విద్యార్థులంతా కూడా వచ్చారు. జనంతో ఆ గదితొక్కిసలాడింది. కొందరు ఈ జన ప్రవాహం భరించలేక మాష్టారికి నమస్కారం చేసి వెళ్ళిపోతున్నారు.

ఆ కుర్రవాడు మాష్టారి దేహం మీద దండపరచి ఒక్కసారి దుఃఖం ఆపుకోలేక బయటకు వెళ్ళిపోయాడు. అక్కడున్న విద్యార్థులంతా ఎవరికి వారు వెళ్ళిపోయారు.

రాజేశ్వరమ్మగారు ఒళ్ళు తెలియని నిద్రలోకి వెళ్లిపోయారు.

అక్కడున్న వారికెవరికీ ఏం చెయ్యాలో అర్థం కావటం లేదు.

''ఇదేం సజ్జాపురం, వేల్పూరూనా అంతతొందరగా వచ్చి వెళ్ళటానికి. ఎక్కడో అమెరికాలో వున్నవాడు ఎలా వస్తాడు'' అనుకొన్నారు కొందరు.

''అసలు వాడికి కబురందిందో లేదో.... అందుతే ఎంత, అందక పోతే ఎంత..... పోయినవాడు ఎలాగు పోయాడు. ఎవరొచ్చిమాత్రం ఆపగలరు. ఇలాగే జరగాలనేముంది'' అన్నారు కొందరు ఎక్కడలేని వేదాంతం ఒలకబోస్తూ.

ఆ ఇంటికి సంబంధించిన వ్యక్తులు ముగ్గురే. అందులో ఒక వ్యక్తి ఈ ప్రపంచానికి దూరమయ్యాడు. మరో వ్యక్తి ఏమీ సంబంధం లేక అలా పడివుంది. మరో వ్యక్తి ఈ దేశంలోనే లేడు.

పార్వతమ్మగారికి దుఃఖం ఆగలేదు. డెభ్బైయోపడిలో పడ్డ మనిషి

''పాపం రాజేశ్వరిని ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోయాడు సుబ్బరామయ్య. వున్న ఒక్క కొడుకు అమెరికాలో ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో ఎవరికీ తెలియదుట. నా అన్న వాళ్ళెవరూ లేరు రాజేశ్వరికి. ఎవరిజీవితాలు ఎలా గడుస్తాయో వూహించలేరు'' అని గొణుకుతున్నారు, పార్వతమ్మగారు.

అక్కడున్న కొద్ది మందికి ఏం చెయ్యాలో తెలియటంలేదు. వుండాలో వెళ్ళాలో తెలియటం లేదు.

బయట పురోహితుడు కొంచెం కొంచెంగా హడావుడి చెయ్యసాగాడు. పార్వతమ్మగారి తమ్ముడు రాజు అక్కడందరికీ తలలో నాలుకలాగ వుంటుంటాడు.

రాజు పార్వతమ్మగారి చెవిలో ఏదో చెప్పి హడావుడిగా బయటకు వెళ్ళి పురోహితుణ్ణి కొంత హడావుడి చేశాడు. తతంగం ప్రారంభమయింది బయట.

''కొడుకు చాలా ప్రయోజకుడయ్యాడు. మంచి చోట ఇంజనీరింగులో సీటు దొరికింది. చాలా బ్రిల్లియంట్‌గా ప్యాస్ అయ్యాడు. విదేశాలు వెళ్ళి పెద్ద పెద్ద డిగ్రీలు సంపాదించాడు. మంచి ఉద్యోగంలో స్థిరపడ్డాడు. తరువాత ఏమయ్యిందో ఎవరికి అర్థం కాలేదు'' అనుకుంటూ ఇంటి మోహం పట్టారు కొందరు.

పురోహితుడు మంత్రాలు చదువుతో నెత్తి మొత్తుకుంటూ ''ఎవరి ఖర్మ ఎలా ఉందో అంతా ఆభగవంతుడి నిర్ణయం. సరేకానివ్వండి,'' అని మళ్ళీ హడావిడిగా తనపనిలో మునిగిపోయాడు.

ఈ మధ్యగా మాష్టారు, రాజేశ్వరమ్మగారు చాలా మధనపడుతూండటం గమనించారు ఆ చుట్టుప్రక్కలవున్న కొందరు స్నేహితులు.

కొడుకు దగ్గిరనుంచి ఉత్తరాలు రావటం లేదని ఒకటి రెండుసార్లు అంటూండేవారు పార్వతమ్మగారితో.

'అనంతం ఉత్తరాలు కూడా రాయటం మానేసి అప్పటికే దాదాపు కొన్ని నెలలు కావస్తోందిట. కారణాలు తెలియటం లేదుట. మాష్టారు వ్రాసిన ఉత్తరాలకి జవాబులు లేవుట' అనుకుంటూన్నారు అక్కడికొచ్చిన కొందరు వ్యక్తులు.

ఏమీ పైకి చెప్పుకునే వారు కాదు ఆ దంపతులు.

'ఒకవేళ అడ్రస్సు మారిందేమో. మారితే మాత్రం వ్రాయకుండా ఉంటాడా. అయినా ఇన్నాళ్ళుపడుతుందా! మనోవ్యాధితో కృషించిపోయారా మహావ్యక్తులు' అనుకుంటున్నారు మరికొందరు.

ఆ చుట్టుప్రక్కల వారు మాష్టారిని, రాజేశ్వరమ్మగారిని ఆది దంపతులుగా చూస్తూండేవారు.

రాజుకి వీరంటే మహాగురి. రోజూ ఒక్కసారయినా వచ్చి ఏంకావాలో కనుక్కుని మరీ వేళ్ళేవాడు. కొడుకు మీద బెంగతో మనోవ్యాధితో బాధపడుతూన్నారని ఎప్పుడో గ్రహించాడు రాజు.

మనోవ్యాధికి మించిన వ్యాధి లేదు. ఈ వ్యాధి మనిషిని ఏమయినా చేస్తుంది.

భార్యాభర్తలిరువురి మధ్య అతి సన్నిహితమయిన విషయం చాలా పాతబడిపోయింది. ఎన్నిసార్లు చర్చించుకుంటారు. కొడుకు మీద ఆశవదులుకుని జీవచ్ఛవాలుగా జీవిస్తున్నారు ఈ దంపతులు.

ఆయనకు, తనకూ కాస్త వండిపడెయ్యటమూ, అనాలుగు గిన్నెలు తోముకోవటం రాజేశ్వరమ్మగారి దినచర్య.

మాష్టారుగాని, రాజేశ్వరమ్మగారు కాని ఎక్కడికీ వెళ్లేవారు కాదు. అయినా ఎక్కడికి వెడతారు అలవాటు కూడా లేదు. ఇద్దరికీ కూడా మూగ బ్రతుకులు క్రింద తయ్యారయ్యాయి.

ఈ మధ్య కాలంగా వారింట్లోంచి సంగీతం కూడా వినిపించటంలేదు. ఇది వరకల్లా ఎప్పుడూ హిందూస్తానీ కాని కర్ణాటకసంగీతంకాని వారింట్లోంచి వినిపిస్తూండేది.

ఎవరో వస్తున్నారు, వెడుతున్నారు మృతదేహానికి నమస్కారం చేస్తున్నారు.

''మాష్టారులాంటి మహా మనిషిని మనం ఇంక చూడలేము, అఖండుడు, మహామేధావి, ఎంతో కష్టపడి చదువుకుని చివరికి ఎక్కడికి వెళ్ళటానికి వీలు లేక తల్లితండ్రుల ప్రోద్భలంతో ఈ మాష్టరుగిరీలో స్థిరపడ్డారు'' అనుకున్నారు కొందరు స్నేహితులు.

కబురు తెలిసి కంతేరు నుంచి ఆదరాబాదారగా వచ్చాడు చివ వెంకటాచారి.

రాజేశ్వరమ్మగారి పరిస్థితి చూచి ఎంతో ఆరాటపడుతూ దుఃఖించటం ప్రారంభించాడు.

''నాకున్న ఒక్క స్నేహితుడూ వెళ్ళిపోయాడు, ఆ మహాతల్లిని ఈ పరిస్థితుల్లో వదిలేసి'' అంటూ వాపోయాడు.

చిన వెంకటాచారి, మాష్టారు చిన్ననాటి స్నేహితులు.

చినవెంకటాచారి తండ్రి పెద వెంకటాచార్యులవారు, మాష్టారు తండ్రి బ్రహ్మయ్య శాస్త్రిగారు చాలా స్నేహితులు, ఆ ఉరిలో ఇరువురు చాలా గౌరవనీయులు.

బ్రహ్మయ్యశాస్త్రిగారికి పౌరోహిత్యం వంశపారంపార్యంగా వచ్చినట్లే పెదవెంకటాచార్యుల వారికి వైష్ణవాలయ అర్చకత్వం వంశపారం పర్యంగా వచ్చింది. పెద వెంకటాచార్యులువారు అంతో ఇంతో ఆయుర్వేదం, హోమియోపతి వైద్యాలలో అనుభవం సంపాదించిన వ్యక్తి.

ఆ ఉళ్లో జనం వచ్చి ఆయనచే వైద్యం చేయించుకుంటూండేవారు. ఆయన వారి దగ్గిర ఒక్క కాని కూడా ఆశించేవారు కాదు. ఎప్పుడయినా ఆ ఉళ్ళో జనం వైద్యం చేయించుకుని, కొబ్బరికాయలో అరటిపళ్ళ గెలలో ఫీజుక్రింద ఇచ్చుకునేవారు, ఆయన హస్తవాసి మంచిదని ఆ వూరే కాక ఆ చుట్టు ప్రక్కల గ్రామాల వాళ్ళు కూడా వస్తూండేవారు.

కొడుకు చినవెంకటాచారి చదువులో ప్రయోజకుడు కాలేడు అని గ్రహించి కూడా బాధపడేవారు కాదు పెదవెంకటాచార్యులవారు. ఎలాగూ ఆలయ అర్చకత్వం ఉంది, కొద్దోగోప్పో వైద్యం చెయ్యటం నేర్చుకోలేకపోతాడా అని ధైర్యం వుండేది.

రావాడసూర్న కొడుకు కనకడు, పెదిరెడ్డి కొడుకు వీర్రెడ్డి, చినవెంకటాచారి మంచి స్నేహితులు. పేకాటలు, పొలం గట్లమ్మట పనిపాటు లేకుండా తిరగటం పెద్దాయనకిష్టం వుండేదికాదు. సిగరెట్లు కూడా తాగుతున్నాడని తెలిసి చాలా బాధపడి బ్రహ్మయ్య శాస్త్రిగారితో చెప్పుకుని మదనపడుతూండేవారు పెదవెంకటాచార్యులవారు.

బ్రహ్మయ్యశాస్త్రిగారు ఇవన్నీ ముందే గ్రహించి సుబ్బరామయ్యని కొంచెం బలవంతం మీదే కూర్చోబెట్టి - నాలుగష్టాలు చెప్ప ప్రయత్నించారు.

సుబ్బరామయ్య తెలివైనవాడనే చెప్పాలి. తండ్రి చెప్పే వేదం నేర్చుకున్నాడు కాని, దీన్ని ఒక వృత్తిగా స్వీకరించటానికి నిరాకరించేవాడు.

శాస్త్రి గారికి ఎప్పుడయినా అశ్వస్తతగా వున్నప్పుడు సుబ్బరామయ్యచేతికి చెంబుతగిలించి తిరిగి రమ్మనేవారు. ఇష్టంలేకపోయినా తిరిగివస్తూండేవాడు సుబ్బరామయ్య.

సాయంకాలం పూట సుబ్బరామయ్యకి చిన్న వెంకటచారిని కలవకపోతే తోచేదికాదు. సుబ్బరామయ్య, చినవెంకటాచారికి చదువు మీద దృష్టి పెట్టమని సలహా ఇచ్చేవాడు.

కనకడు, వీర్రెడ్డితో తిరగవద్దని మాత్రం చెప్పేవాడుకాదు. సుబ్బరామయ్య అందరితోటి చాలా స్నేహంగా ఉండేవాడు. సుబ్బరామయ్య అంటే ఆ ఉళ్ళోవున్న కుర్రకారు అందరికీ తెలుసు చాలా చెలివైనవాడు అని.

బ్రహ్మయ్య శాస్త్రి గారు చాలా ఆచార నియమాలు పాటించే వ్యక్తి కాబట్టి అదే కొంతవరకు ఒక క్రమపద్ధతిగా వచ్చిందేమో అనిపిస్తుంది సుబ్బరామయ్యకు కూడా.

వృత్తిమీద జీవించేకాలం పోతోందని కూడా భయపడ్డారు శాస్త్రిగారు.

'వీడికి అదీ ఇదీ రాక భ్రష్టుడవుతాడేమో' అన్న భయం కూడా వేసింది.

పౌరోహిత్యానికి పనికి రాడేమోననిపించింది శాస్త్రిగారికి సుబ్బరామయ్య వ్యవహారం చూస్తే.

చివరికి పెనుగొండ హైస్కూల్లో చేర్చారు సుబ్బరామయ్యని.

ప్రొద్దున్నే తల్లి కమలమ్మగారు పెట్టిన చద్దెన్నంతిని పుస్తకాలు పట్టుకుని పెనుగొండ బయలుదేరేవాడు.

బ్రహ్మయ్యశాస్త్రిగారి ప్రోద్బలంవల్ల చినవెంకటాచారిని కూడా తండ్రి పెదవెంకటాచారిగారు పెనుగొండ హైస్కూల్లో చేర్చారు.

సుబ్బరామయ్య, చినవెంకటాచారి కలిసి స్కూలుకి వెళ్ళేవారు. సాయంకాలంకి ఇంటికి తిరిగివచ్చి స్కూల్లో ఇచ్చిన హోం వర్కు చేసుకునేవారు. ఆవూరి పిల్లలతో చాలా సంఖ్యంగా వుంటుండేవారు. ఆ విధంగా సుబ్బరామయ్య, చినవెంకటాచారి చాలా ప్రాణస్నేహితులయ్యారు.

''బ్రాహ్మణత్వం కులం కాదు. మనోస్థితి మాత్రమే. అదికుల వృత్తిగా అనుకుని జీవించటం మానవ జాతికే గొప్ప అపచారం. ఈ ఆచార నియమాలు మానవుని ఒక క్రమపద్ధతిలో నడుపుతాయి. ఈ నియమాలు ప్రతి మానవుడు పాటించవచ్చు. ఈ నియమాలు ఒక కులానికి సంబంధించినవి కావు.''

''అలా అనుకోవటం చాలా పొరపాటు. మానవులంతా ఒకే జాతి. ఏ మానవుడయినా బ్రమ్మణత్వం లేక బ్రహ్మత్వం పొందగలడు. అప్పుడే అతడు మహానుభావుడు. అవతారపురుషుడు, దేవుడు అంటారు. దీనికి తార్కాణం బ్రహ్మ ఋషి విశ్వామిత్రుడు, మహాముని వాల్మీకి''

అంటూ చిన వెంకటాచారితో వాదం పెట్టుకునేవాడు సుబ్బరామయ్య.

ఆఖరికి బ్రహ్మయ్యశాస్త్రిగారితో కూడా ఒక రోజున వాదించేప్పటికి ఆయన బుర్ర తిరిగిపోయింది.

''వీడు చాలా వేదాంతధోరణిలోకి ప్రవేశిస్తున్నాడు. బ్రతుకు తెరువుకిది పనికిరాదు'' అని గ్రహించారు.

''ఇహ లాభంలేదు. వీణ్ణి కాలేజి చదువులకి పంపవలసిందే'' అని నిశ్చయించుకున్నారు.

తల్లి కమలమ్మగారికి సుబ్బరామయ్య వాదం వింటూంటే ఇదంతా నిజమేమో ననిపించేది.

బ్రహ్మయ్యశాస్త్రిగారు కాస్త పట్టువిడుపువున్న మనిషి. ప్రతి విషయం భార్యతో చెర్చించేవారు.

''కాలేజీ చదువు చెప్పించే యోగ్యత మనకు లేదు'' అని అంటూండేవారు భార్య కమలమ్మగారితో.

''కానియ్యండి చూద్దాం వాడి అదృష్టం ఎలావుందో'' అంటూండేవారు కమలమ్మగారు.

చివరికి సుబ్బరామయ్య పెనుగొండ హైస్కూల్లోకి ఎస్.ఎస్.ఎల్.సి.లో ఫస్టు, చినవెంకటాచారి చాలా సాదాగాను ప్యాసయ్యారు. చినవెంకటాచారి పెద్దగా పట్టించుకోలేదు.

బ్రహ్మయ్యశాస్త్రిగారికి తన కొడుకు స్కూలు ఫస్టు వచ్చినందుకు ఒక మూల సంతోషం వేసినా మరోమూల గొంతులో వెలక్కాయ పడ్డట్టయింది.

''వీణ్ణి పై చదువులకి ఎలా పంపగలను. చాలా డబ్బు ఖర్చుతో కూడిన పని.'' అని ఆలోచించారు. శాస్త్రిగారు వేదం ఒక్క కాని ఖర్చులేకుండా అభ్యసించారు వారి తండ్రి దగ్గర.

ఇది వంశపారం పర్యంగా వచ్చిన విద్య కాబట్టి ఆలా జరిగగిపోయింది.

ఏ విద్య అయినా ఆకాలంలో వంశపారంపర్యంగా వచ్చేది. ఇదే కులాల క్రింద తయారయ్యాయితప్ప, కులం ముందుపుట్టి విద్య తరువాత పుట్టలేదు.

ఇది బ్రహ్మయ్యశాస్త్రిగారికి, రైతు రావాడ సూరన్నకి బాగా తెలుసు.

చివరికి సుబ్బరామయ్యని వెంటపెట్టుకుని నర్సాపురం బయలుదేరివెళ్లి, వాళ్ళకాళ్ళు వీళ్ళకాళ్ళు పట్టుకుని బి.ఏ.లో చేర్చి అక్కడొక చిన్నగది తీసుకొని సుబ్బరామయ్యను వెంకటరామయ్యగారు, పరంధామయ్యగారు మొదలయిన కొందరు తెలుసున్న భ్రహ్మణుల ఇళ్ళలో వారాలకి కుదిర్చి వచ్చారు శాస్త్రిగారు.

''ఇహపైనవాడి ఖర్మ దైవనిర్ణయంపై ఆధారపడి వుంటుంది. మనం వాడికయ్యే ఖర్చు భరించలేము. ఈ రెండెకరాలపైన ఆదాయం వాడి చదువుకి వుపయోగించే సత్తవు మన దగ్గరలేదు'' అనుకుంటుండేవారు ఆ దంపతులు.

ఇంతలో హైస్కూలు ఫస్టు వచ్చిన వారికి స్కాలర్‌షిప్ ఇస్తున్నారని తెలిసి సంతోషించారు. ముఖ్యంగా చినవెంకటాచారి ఎంతో సంతోషపడ్డాడు.

'నా స్నేహితుడంటే ఏమిటనుకున్నావ్. వాడు మహా మేధావి' అంటూండేవాడు వాళ్ళనాన్న పెదవెంకటాచారిగారితో.

వైష్ణవులు వారింటికి ఎవరినీ భోజనానికి పిలవరు, మరి ఎవరిళ్ళల్లోనూ భోజనం చెయ్యరు. అది వైష్ణవ సంప్రదాయం.

కనుక చినవెంకటాచారి బయిటకు వెళ్ళి ఎక్కడో చదువుకునే ప్రసక్తే లేదు. అర్చకత్వం, వైద్య వృత్తుల్లో తండ్రిగారికి చేదోడు వాదోడుగా వుంటూ తను చెయ్యవలసిన పనులలో ఒక క్రమపద్ధతి చూపుతూ గడుపుతూ వచ్చాడు.

బి.ఏలో రికార్డు స్థాపించి ప్యాస్ అయ్యాడని తెలిసి చాలా సంతోషించారు. కమలమ్మగారు, శాస్త్రిగారు, చినవెంకటాచారి.

నర్సాపురం కాలేజీ ప్రిన్సిపాల్, టీచర్ల ప్రోద్బలంతో కాశీ విశ్వ విద్యాలయంలో ఎమ్.ఏ. లో చేర్చి అక్కడే వున్న వేదం చదువుకునే కళాశాల వసతిగృహంలో పెట్టి భోజనానికి, వసతికి ఏలోపం లేకుండా చాలా తక్కువ ఖర్చుతో చదువు అయ్యేటట్లు ఏర్పాటు చేసివచ్చారు శాస్త్రిగారు.

అదే మొదటిసారి శాస్త్రిగారు, కమలమ్మగారు కాశీవెళ్ళి విశ్వనాధుని దర్శించుకుని రావటం.

ఎమ్.ఏ. చదువుతూ అటు వేదాభ్యాసం చేస్తూ ఇటు యూనివర్సిటీ సంగీత శాఖకి వెళ్ళి శాస్త్రీయ సంగీతంలో చాలా లోతుపాతులు తెలుసుకున్నాడు సుబ్బరామయ్య.

ఎమ్.ఏ. అయిన తరువాత రాజేశ్వరమ్మగారిని వివాహం చేసుకుని మాష్టరుగిరిలో చేరి ఆంధ్ర దేశానికి పరిమితం అయి కాలం గడుపుతూ వచ్చారు.

చిన వెంకటాచారి దుఃఖానికి అవధులు లేకుండా వున్నాయి.

ఆ చుట్టు ప్రక్కల వారంతా అతన్ని వూరుకోబెట్టారు.

ఇదేమీ తెలియక అలా నిద్రావస్థలో పడి దొర్లుతున్నారు రాజేశ్వరమ్మగారు.

రాజు, చినవెంకటాచారిని బయటకు తీసుకుని వెళ్ళి చాలా ఓదార్చాడు.

''ఇప్పుడు మనం చెయ్యవలసిన పని గురించి అలోచించండి'' అన్నాడు రాజు.

'ఇందులో ఆలోచించవలసిందేమీలేదు. మాసుబ్బరామయ్యకి అన్నీ నేనే. స్నేహితుడనే కాదు కొడుకుని కూడా'' అని పెద్దగా పట్టలేకుండా దుఃఖించాడు.

కార్యక్రమం అంతా చిన వెంకటాచారి చేతులమీదుగా జరిగింది.

సుబ్బరామయ్యగారి మృతదేహం ఇల్లువదిలి చేరవలసిన చోటుకి చేరుకుంది.

రాజేశ్వరమ్మగారు ఒళ్ళుతెలియకుండా పడున్నారు. ప్రక్కనే పార్వతమ్మగారు రాజేశ్వరమ్మగారిపై చెయ్యి వేసుకుని ధుఃఖిస్తున్నారు.

***

# 12

న్యూయర్క్, కెనడీ ఇంటర్‌నేషనల్ ఎయిర్‌పోర్టులో టేకాఫ్ చేస్తూంది ఎయిర్ ఇండియా విమానం. అందులో కిటికీ ప్రక్కనే కూర్చుని బయటకు చూస్తున్నాడు అనంతం. 'భారతానికిదేనా ఆఖరి తిరుగు ప్రయాణం' అనుకున్నాడు.

ఆ క్షణంలో మనస్సు ఒక్కసారి కలవరపడింది. కంటినీరు గిర్రున తిరిగింది. మళ్ళీ తమాయించుకుని మనస్సులో అమెరికాకి గుడ్ బై చెప్పి ఇంకా కిటీకీలోంచి చూస్తూనే వున్నాడు.

అట్లాంటిక్ సముద్రం పైన ఆకాశంలోకి చొచ్చుకుపోతోంది విమానం.

ఎన్నెన్నో జ్ఞాపకాలు, ఏవేవో మాయని మచ్చలు మనస్సుని కుదిపేస్తున్నాయి. విమానం జోరుగా పోతోంది.

''నాన్న ప్రమాద పరిస్థితులలో ఉన్నాడు, ఒక్కసారి చూచిపో'' అని అచారి బాబాయ్ రాసిన ఉత్తరం అమెరికా చేరటానికి నెలాళ్లు పట్టింది. ఉత్తరం రాసిన రోజే అనంతానికి ఫోన్ చెయ్యటానికి ఎంతో ప్రయత్నం చేశాడు ఆచారి. కాని ప్రయోజనం లేకపోయింది. అనంతం బఫెలోలోనే వుంటే ఇట్టే పట్టుకోవచ్చు. ఏమి తోచక చివరికి అదే రోజున ఉత్తరం కూడా రాయవలసి వచ్చింది. ఆరోజు సుబ్బరామయ్య మాష్టారు ఈ ప్రపంచాన్ని వదిలిన రోజు.

''నాన్నపోయి ఈనాటికి నెలాళ్ళు దాటింది. ఒక్కసారి అమ్మని చూచిపో'' అని రాసిన రెండో ఉత్తరం చేరటానికి మరో రెండు వారాలు పట్టింది. తాను ఉళ్ళో లేకపోవటం వల్ల వచ్చిన అనర్థాలకి చాలా బాధపడి దుఃఖించాడు అనంతం.

''నాన్నపోయాక అమ్మ ఎక్కడుందో, ఆచారి బాబాయ్ రాసిన ఉత్తరంలో ఏదేమీ లేదు'' అనుకుని చింతించసాగాడు.

సంగీతకి, తనకీ ఈ మధ్యగా కంప్యూటరు ద్వారా చాలా ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి.

''నువ్వు ఇండియాకి వెళ్ళటానికి నేనెన్నడూ అభ్యంతరం తెలుపలేదు. నువ్వు వెళ్ళినా నేను కూడా నీతో వస్తానని మాత్రం అనుకోకు. నేను బఫెలోకి కూడా నీకోసమని ఈ సాఫ్ట్‌వేర్ ఉద్యోగం వదులుకుని రాలేను. నాకు అక్కడ నా ఫీల్డులో ఎలా వస్తుందనుకున్నావు ఉద్యోగం, అది జరగనిపని. మంచి ఉద్యోగం. మంచి జీతం, హోదా వదులుకుని బఫెలో ఎవడు వెళ్ళమన్నాడు నిన్ను. ఆఫ్‌కోర్సు నీకు నచ్చిన ఉద్యోగం టీచింగ్. అదినాకు తెలుసు. మంచిదే, నేనేం అభ్యంతరం పెట్టలేదే?..... భార్యాభర్తల సంబంధం అనుబంధం గురించి ఎన్నెన్నో మాట్లాడావ్. అవన్నీ ఇప్పుడేమయ్యాయి. నన్ను నీ భార్య క్రింద నువ్వు అనుకుంటే కాలిఫోర్నియాలోనే వుండి వుండేవాడివి. నువ్వు కాలిఫోర్నియాలో వుంటావో, బఫెలోలో వుంటావో, ఇండియాలో ఉంటావో నువ్వే నిర్ణయించుకోలేకపోతున్నావు. నువ్వు ఆడినట్లు నన్ను కూడా ఆడమంటే నీకు ఏమయినా బావుంటుందా, అది తప్పుకాదా? ఎంతసేపూ నిన్నే నువ్వు దృష్టిలో పెట్టుకుని మాట్లాడుతున్నావు.''

.....''మీతల్లితండ్రులకి డబ్బు పంపుతున్నావుగా, వారు దానితో సుఖంగా కాలక్షేపం చెయ్యవచ్చునే. కావాలనుకుంటే నువ్వే అప్పుడప్పుడు ఇండియాకి వెళ్ళి చూడవచ్చునే''.

''ఏమయింది నీ ఆలోచన. నన్ను నీభార్యలాగా గుర్తించగలిగే శక్తి కూడా నీలో నశించింది. ఎంతసేపూ అమ్మ, నాన్న, ఇండియా అని మాట్లాడటం అంత మంచి పద్ధతి కాదు.''

''నేను ఇవన్నీ పట్టించుకునే మనిషిని కాను. నన్ను నువ్వు బాగా చూచుకున్నావు''.

''నేను కూడా నిన్ను స్నేహితుని కన్న ఎక్కువగా చూచుకున్నానే. నేను నీద గ్గిర ఎన్నో నేర్చుకున్నాను. నేను నిన్ను సాంకేతిక రూపంగానే కాక అనేక విశిష్టమయిన రూపాలలో చూచి అర్థం చేసుకున్నాను. నీకేమయింది. నువ్వు ఇక్కడే వుండవచ్చుగా. నీకు స్వాతంత్ర్యం వుంటుంది అని ఎకడెమిక్ లైనుకి మారినంత మాత్రాన నన్ను కూడా నీతో రమ్మనటం నేను నిన్ను పెళ్ళి చేసుకున్నాననేగా నీ ఉద్దేశ్యం''

''భారతీయ యువకులంతా ఇలాగే వుంటారా? ఏదీ తేల్చుకోలేని యువకులు భారతీయులు. పైగా ఇక్కడ పుట్టిపెరిగిన పిల్లలని ఎ, బి, సి, డిలు అని ప్రత్యేకమైన బిరుదునిచ్చి అవమాన పరూస్తూండటం అంతమంచిపద్ధతి కాదు''

''ఇండియాలో పుట్టిపెరిగి అమెరికాకి వచ్చి స్థిరపడడానికి ప్రయత్నం చేసే వ్యక్తులలో ఉన్న కన్ఫ్యూజన్ మాలో లేదు''.

''డాక్టర్ అనంతం! కాదు, కాదు ప్రొఫెసర్ అనంతం! నీకు నా జోహర్లు!''

....................................

....................................

''.....ఇక్కడ నాకు చాలా మంచి స్నేహితులున్నారు. ఇప్పుడు నా కంపెనీ, అదే ఇది వరకు నీ కంపెనీకి ప్రెసిడెంటు నన్ను ఎంతో గౌరవించి ఉన్నతమైన ప్రమోషనులు ఇస్తానని ప్రామిస్ చేశాడు. ప్రస్తుతం నీవు వదిలేసిన పొజిషన్‌లో ఉన్నాను నేను. నీకు తెలుసు నాజీతమెంతో, వేరే చెప్పనవసరం లేదు. ఇది ఒదులుకుని నేను బఫెలో ఎలా వస్తానని ఆశిస్తున్నావు''

''అమ్మనాన్న అంటూకూర్చునే వ్యక్తివి నువ్వు. ఎప్పుడయినా ఇండియాకు పారిపోయే వ్యక్తివి నువ్వు''.

....................................

........... ........................

''మా బాసు నా వెంట తిరుగుతున్నాడు. నేను కూడా ఎలా కాదనగలను. నాకు ఒక బోయ్‌ఫ్రెండు కావాలి. అది నీకు తెలుసు, నాకు తెలుసు నువ్వు నాకడ్డురావని...''

.....................................

.....................................

''.....ఈ పరిస్థితులలో మనం కొన్నాళ్ళు విడివిడిగా వుండటం ఎంతయినా మంచిది. నాకు తెలుసు నువ్వు నాకు విడాకులు కోరవని. నేను కోరితే గాని జరగని పని అది''.

.....................................

.....................................

''.....నువ్వు చాలా మంచివాడివి, కాని ఒక వెర్రివాడివి. ప్రపంచజ్ఞానం నీకు శూన్యం, ప్రపంచజ్ఞానం చాలా అవసరం. నువ్వు కొన్ని పరిధులు పెట్టుకున్నావు. అవి దాటి బయటికి వచ్చేశక్తి లేదు నీలో. ఇది నీతో నా అనుభవం. నాకు పరిధిలు లేవు. అది నీకు తెలుసు, నువ్వు కూడా ఎంతో మెచ్చుకునే వాడివి నన్ను''.

.....................................

.....................................

''నాకు పెళ్ళి మీద నమ్మకం లేదు. ఈ ప్రపంచం అంతా మేల్ డామినేటేడ్ సొసైటీ ఇది నేను సహించను. ఆడదాన్ని చదరంగంలో ఒకపావులా ఉపయోగించుకునే సొసైటీ ఈ ప్రపంచమంతా నిండివుంది. నేను దీన్ని మనస్ఫూర్తిగా వ్యతిరేకిస్తాను. ఇది భారతీయులలో చాలా ప్రబలంగా ఉంటుంది''.

.....................................

.....................................

''కాని నేను నీలో ఎప్పుడూ మగవానిలో ఉన్న ఆ మేల్ డామినేషనుతో కూడిన సహజ గుణాన్ని చూడలేదు. నేను నిన్ను ఎప్పుడూ ప్రేమిస్తున్నాను, ఆరాధిస్తున్నాను. ఒక మహత్తర మేధాశక్తి నీలో చూచాను. ఎప్పుడూ జాలిపడుతుంటాను నువ్వు ఎలా బ్రతుకుతావో అని, అంత[illegible] [illegible]చేత నేను నా జీవితాని[illegible] [illegible]ం చేసి, నీతో

ఇండియాకి వచ్చి, ఆ మురికి కూపంలో బ్రతకలేను. నన్ను నువ్వు బాగా అర్థం చేసుకోగలవని నాకు తెలుసు''

....................................

....................................

''మన పరిస్థితులన్నీ గమనిస్తున్నాడు మా బాసు. నాకు ఇక్కడ ఎవ్వరు లేరు ఏది చెప్పుకుందామన్నా, ఎవ్వడు నా వెంటపడితే వాణ్ణి గౌరవించి వాడితో తిరిగి తృప్తి పొందుతాను''

''మా అమ్మని రమ్మని రాశాను. అమెకు కూడా వయస్సు మళ్ళింది. నాతోటే ఉంటుంది. నా స్వాతంత్ర్యం నాది, మా అమ్మ స్వాతంత్ర్యం మా అమ్మది. మా అమ్మ నన్ను ఎప్పుడూ దేనికీ అడ్డుపెట్టలేదు. మా నాన్న కూడా అంతే. మీ తల్లితండ్రులను కూడా నువ్వు అమెరికాకి తెచ్చుకుని వారికి విడిగా సదుపాయం సమ కూర్చవచ్చుగా, దానికీ నీకిష్టం వుండదు. వారు ఈ దేశానికిరారు అంటూంటావు, ఈ సమస్య ఇప్పుడప్పుడే తీరేదికాదు.....''

....................................

....................................

''మనం విడిపోయి విడాకులు ఇచ్చుకోవటమే మంచి పద్ధతి. నాకేమీ అనిపించదు. ఇది రెండోసారి అనుకుంటాను. కాని ఇహముందు ఇలా జరగదు. మనం విడిపోయినా నువ్వు నా మనస్సులో వుంటావు''.

''నీవు నేర్పిన విద్యయేనీరజాక్షి, అని నువ్వు నాతోటి చాలాసార్లు అంటూండే వాడివి, నేను మరిచిపోలేను. అవును నిజానికి నువ్వు నేర్పిన విద్యయే నీరజాక్షి! ఓ...కే... ఒకే..... టేకిటీజీ, పరిస్థితులు చాలా హాయిగ తేలికగా తీసుకుని మనకితోచిన విధంగా మనం బ్రతుకుదాం''

''నేను నిన్ను మనోవృత్తి అడగను. నాకు కావలసినంత డబ్బుంది. నువ్వు ఇండియాకి వెళ్ళి నీ తల్లితండ్రులకు నువ్వు సంపాదించిన సొమ్ము ఖర్చుపెట్టుకో. నేను కూడా సంతోషిస్తాను.

....................................

....................................

''నువ్వు అమెరికా శాశ్వతంగా వదిలి ఇండియాకి వెడుతున్నావని తెలిసింది. చాలా సంతోషం. ఎక్కడో అక్కడ నువ్వు సంతోషంగా వుంటే, నేను చాలా సంతోషంగా వుంటాను. ఎక్కడవున్నా నా గురించి నువ్వు ఏమీ అనుకోకు. నాకు నువ్వు ద్రోహం చేశావని నేనెన్నడూ తలంచను''.

.....................................

.....................................

''మన విడాకులు ఖాయమైనందుకు నేను సంతోషపడుతున్నాను. ఎప్పటిలాగే మనం స్నేహితులలాగే వుంటాం. బయట మా బాస్ హారన్ కొడుతున్నాడు, నేను త్వరగా వెళ్ళాలి. ఎప్పుడయినా ఎక్కడయినా కలుసుకున్నప్పుడు పాతసంగతులు మాట్లాడుకుని ఆనందిద్దాం, టేక్ఇట్ ఈజీ. బి హ్యాపీ''

ఈ సంగతులు ఒకరినొకరు మెయిలుద్వారా తెలుసుకుంటూ వచ్చారు.

''సంగీతా! ఈ ప్రపంచంలో నన్ను అర్థం చేసుకున్న ఒకే ఒక వ్యక్తివి నువ్వే. నన్ను అ పార్థం చేసుకోవని నాకు తెలుసు. నీలాంటి వ్యక్తులు చాలా అరుదుగా వుంటారు. నీదొక పరిశుభ్రమైన, చాలా తెలివైన మనస్సు. నీకు నా జోహర్లు! నిన్ను నేను మొదటి సారిగా కలిసినప్పుడే అర్థం చేసుకున్నాను. నీదొక చిన్నపిల్ల మనస్థత్వం. అది నాకు చాలా ఇష్టం.

.....................................

.....................................

''సంగీతా! నేనొక సామాన్య మానవుణ్ణి. భారతంలో ఒక కుగ్రామంలో ఒక స్తోత్రీయమైన కుటుంబంలోంచి వచ్చిన వ్యక్తిని. నేను పెరిగిన వాతావరణమే వేరు. మా తాత వద్ద ఎన్నెన్నో నేర్చుకున్నాను. ఆయన ఒక మహోన్నతమయిన వ్యక్తి. చాలా పేదరికం లోంచి వచ్చిన మహా పండితుడు. అటువంటి వారు చాలా అరుదుగా వుంటారీ ప్రపంచంలో. ఆయనొక ఇన్స్టిట్యూషన్. మా తాత చెప్పిన వేదాంతమే నన్ను మా కుటుంబంలో వున్న అర్థంలేని కట్టుబాట్లలోనుంచి తొలగించింది. నాకు కుల, మత విచక్షణలేమి తెలియవు. ఇవి మనిషికి, మనిషికి మధ్యలో నిలబడే పాషాణాలతో అమర్చిన గోడలు. ఈ సంగతులు ఎన్నోసార్లు మనం చర్చించుకున్నాం. ఈ గోడలు మనకి అడ్డురాకూడదు''.

''నీతో వివాహం అయిన తరువాతే మా అమ్మ నాన్నకి మన వివాహం గురించి ఉత్తరం రాశాను. వారు సంతోషించారు. కాని వారు ఆ పాషాణాలతో కట్టిన గోడలు బ్రద్దలు కొట్టే శక్తి కోల్పోయారు. నేను దానిని లక్ష్యపెట్టలేదు''.

.....................................

.....................................

''సంగీతా! నీ మెయిలు నన్ను ఎంతో చైతన్యవంతుని చేస్తూంది. కాని నేను అచేతనుణ్ణి, నేను నీ జీవితానికి అడ్డురాను. నా తల్లి దండ్రులే ముఖ్యమని కూడా అనలేను. నిన్ను ఒదులుకునే శక్తి కూడా నాకు లేదు. నేను ఏదీ తేల్చుకోలేని వ్యక్తిననినాకు తెలుసు. చూస్తూ చూస్తు నాకోసం బ్రతుకుతూ బాధపడుతున్న తల్లితండ్రులను ఎలా ఒదులుకోగలను. నువ్వు నన్నొక దగాకోరు మనిషిగా భావించవని నాకు బాగా తెలుసు. నేను ఏం మాట్లాడాలో ఎలా మసలుకోవాలో తెలియని స్థితిలో ఉన్నాను''.

''నాకు ఈ ధనం ఈ హోదాల మీద నమ్మకం లేదు. నా మనస్సు ఒక పాషాణంగా మారింది. ఒక్కోసారి నాకనిపిస్తూంటుంది, నేను ఎందుకు బ్రతుకుతున్నానా అని. నాలో నేను ఒక హిప్రోక్రట్‌గా భావించుకుంటూంటాను. నన్నేం చెయ్యామంటావు చెప్పు.

.....................................

.....................................

''అమెరికాలో పుట్టి పెరిగిన ఆడపిల్లల గురించి నేనెన్నో విన్నాను. అవి కల్లబొల్లి కబుర్లని నువ్వు నిరూపిస్తున్నావు. నాకు చాలా సంతోషంగా వుంది. నాకు తెలుసు నువ్వు మాత్రం కన్ఫ్యూజ్‌డ్ దేశీవి కాదు''.

''నువ్వు అమెరికాలో పుట్టి పెరిగిన స్వచ్ఛమైన ఖచ్చితమైన సిటిజన్‌వి. నీలో హిపోక్రసీ లేదు. దానికి అర్థం కూడా నీకు తెలియని వ్యక్తివి నువ్వు. నాకు చాలా సంతోషంగా వుంది. అమెరికా సంస్కృతి నీకు వంటబట్టినట్లు, నాకు వంటబట్టలేదు. ఇది చాలా సహజమైన వ్యవస్థ. దీనిలో తప్పులేదు, తప్పుఅన్న ప్రసక్తే లేదు.

''అమెరికా మహోన్నతమైన దేశం. దీని చరిత్ర ఐదు వందల సంవత్సరాలకి పరిమితమై నప్పటికీ, యూరోపియన్‌దేశాల నుంచి ఇక్కడికి వలసగా వచ్చినవారు ఎంతో కష్టపడి వారి సాంకేతిక పరిజ్ఞానంతో ఈ దేశాన్ని ఎంతో అభివృద్ధి దేశంగా చేసుకుని సుఖజీవితాలను అనుభవిస్తున్నారు. అదృష్టవశాత్తు ఇక్కడ ఉన్న భూగర్భసంపద

ఏదేశంలోనూ లభించదు. ఈనాడు అమెరికా ప్రపంచానికొక మహావైభవంతో వెలుగుతూన్న దేశమని ఒక గుర్తింపు సంపాదించుకోగలిగింది. అన్ని రంగాలలోనూ ముందజవేసిన దేశం.''

''ఈ ప్రపంచంలో దేశదేశాల మధ్య సంభవిస్తున్న కలహాలతో తాను కూడా పాలు పంచుకుని పరిష్కారమార్గాలను వెతుకుతున్న దేశమిది. ఈనాడు ఈ దేశం చెప్పినదే వేదం. ఏదేశమైనా సరే కొంత స్వలాభాపేక్షతోనే ముందంజ వేస్తుంది. ఇది వేదం, ఇది సత్యం, ఇందులో నాకు తప్పు కనిపించదు, ఇది సహజం.''

''భారతం ఇప్పుడిప్పుడే ఈ విషయాలు తెలుసుకుని కొంతవరకు తన ప్రవర్తన మార్చుకునేందుకు ప్రయత్నం చేస్తూంది. ఎన్నో కట్టుబాట్లతో మహోన్నతమైన సంస్కృతితో వెలుగుతూన్న దేశం భారతం. ఎంతో క్రమశిక్షణతో మెలిగిన దేశం భారతం. ఇప్పుడు ఎటు గాలి వస్తే అటుపోతూంటుంది. దీనిని నువ్వు పాశ్చాత్య పద్ధతి అను, మరొకటి అను తప్పులేదు. ప్రస్తుతంలో భారతావనిలో గాలి పశ్చిమంగా వీస్తోంది. ఇదేగాలి అమెరికాకి చేరి స్తంభించిపోతోంది. ఆ గాలిలో కొట్టుకొచ్చిన నాకు ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోవటం చాలా కష్టతరమయిన పని. భారత సంస్కృతి, సంప్రదాయంలో పుట్టిన నాకు ఇంకా జ్ఞానోదయం కాలేదు. నీవు చెప్పినట్లు నేనొక 'ఇండియన్ బొరన్ కన్ఫ్యూజడ్ దేసీ ఇన్ అమెరికా'. అని గ్రహించాను. నువ్వు చాలా చక్కగా చెప్పావు. నాలోఉన్నక న్ఫ్యూజన్ నీలో లేదు ఇది సత్యం''.

..........................................

..........................................

''నేను ఈ మధ్యగా చాలా చోట్ల తిరిగ వలసివస్తోంది కాన్ఫరెన్సుల పేరు చెప్పుకుని. నీకు మెయిలు ఇవ్వలేనందుకు ఏమీ అనుకోవని తలుస్తాను''.

..........................................

..........................................

''సంగీతా! నిన్ననే ఇండియానుంచి ఒక షాకింగ్ న్యూస్ వచ్చింది. మా తండ్రిగారు పరమపదించి రెండునెలలు దాటింది. మనం ఇండియాలో వుండగా ఆయన అస్వస్థగా ఉన్నారుట, ఆచారి బాబాయి అప్పుడునాతో ఏమీ చెప్పలేదు. నన్ను నీతో బాటు అమెరికాకి తిరిగి వెళ్ళిపొమ్మని కబురుపెట్టారు. అప్పుడు నేను ఒక్కసారి

మద్రాసు నుండి తణుకు వెళ్ళి మా తల్లితండ్రులను చూచి రావలసిందని ఇప్పుడు బాధపడుతున్నాను''.

.................................

.................................

''సంగీతా! నన్ను మర్చిపో, ఈ అధమాధమ వ్యక్తిని నీ మనస్సులోంచి తుడిచిపెట్టు. నేను నీకే కాదు మా తల్లి తండ్రులకు కూడా ద్రోహం చేశాను. నన్ను క్షమించకు''.

''మా తల్లితండ్రులు చాలా యోగ్యులు. ఎంతో తృప్తితో బ్రతికిన వ్యక్తులు. కలిమి లేమిలకి తేడా తెలియని మహావ్యక్తులు. నేను ఎంత సొమ్ము పంపినా అది ఉపయోగించని వ్యక్తులు. భోగభాగ్యములు తృణప్రాయంగా భావించిన జీవులు. నువ్వు అన్నావే 'ఆ కుళ్ళు దేశం' అని, 'అదే కుళ్ళులో' ఈ నాటికి పంకజాలవలె వెలుగుతూన్న మహాత్ములు. నేను మా తల్లి తండ్రులను ఇంతగా పొగడటం మంచిది కాదు. ఇటువంటి వ్యక్తులు ఇంకా ఈ ప్రపంచంలో ఉన్నారంటే అది భారతావని అని చెప్పాలి''.

''సంగీతా! మా అమ్మ గురించి ఏమీ రాయలేదు ఆ ఉత్తరంలో ఆచారి బాబాయ్''.

.................................

.................................

''నేను ఇక్కడ ఫ్యాకల్టీ పోష్టు వదులుకుని భారతావనికి శాశ్వతంగా వెడుతున్నాను. నువ్వు నన్ను క్షమిస్తావని తలుస్తాను. కాలిఫోర్నియాలో మనకున్న జాయింట్ ఎకౌంట్‌తో నాకే సంబంధం లేదు. అది నేను బ్యాంకు వారికి స్పష్టపరిచాను. నాకు ఈ ప్రపంచంతో సంబంధం లేదు. నేను నీకు చేసిన ద్రోహం, మా తల్లిదండ్రులకు చేసిన తీరని ద్రోహం నన్ను నేను శిక్షించుకున్నా తీరదు. మరి నేను వెళ్ళిరానా! నీ ప్రియమిత్రుడు'' అని ఆఖరిసారిగా ఒక మెయిల్ అందించి ఇండియాకి తిరుగు ప్రయాణం కట్టాడు.

.................................

.................................

అనంతం విమానం జోరులో జోగుతూ కూర్చున్నాడు.

ఇంతలో ఒక ఎయిర్ హోస్టస్ వచ్చి ''ఏమి కావాలి'' అని అడిగింది.

''నో! థ్యాంక్సు!'' అని ఒక చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

కాస్సేపయాక జ్యూస్ తీసుకొచ్చి ఇచ్చి ఒక చిరునవ్వు నవ్వి వెళ్ళింది.

చెవులకి హెడ్ మైక్ తగిలించుకుని మాండలిన్ శ్రీనివాస్ కాఫి రాగం వింటూ జ్యూస్ త్రాగుతూ కూర్చున్నాడు. ప్యాంటు, టీ షర్టు వేసుకుని ఉన్నాడు. ఒక చిన్న బ్రీఫ్ కేసు, అందులో రెండు మూడు జతల బట్టలున్నాయి. పోర్టబుల్ ఆడియో క్యాసెట్ ప్లేయరు, కొన్ని క్యాసెట్లు భుజానికి తగిలించుకున్న సంచీలో ఉన్నాయి. ప్రయాణానికి సరిపడ డాలర్లు జేబులో ఉన్నాయి.

ఏవేవో ఆలోచనలు బుర్రని కలచి వేస్తున్నాయి. తప్పించుకుని బయటపడటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

ఎయిర్ ఇండియా విమానం మద్రాసు చేరుకుంది.

టైము రాత్రి పన్నెండుగంటలయ్యింది. ఆ రాత్రి ఎయిర్ పోర్టులో గడిపి ఉదయమే బయలుదేరి లోకల్ ట్రెయిన్‌లో పార్క్ స్టేషన్ చేరి సెంట్రల్ స్టేషన్‌కి నడిచాడు. సాయంకాలం వరకు ప్లాట్‌ఫారం మీద కాలక్షేపం చేసి సర్కారు ఎక్స్‌ప్రెస్ ఎక్కి మరునాటి ఉదయం తణుకు స్టేషన్‌లో దిగాడు.

బ్రీఫ్‌కేసు పట్టుకుని, భుజానికి సంచీ తగిలించుకుని స్టేషన్ బయటికి నడిచాడు.

కూలీ సుబ్బయ్య మెట్ల మీద కూర్చుని అక్కడివారితో ఏదో మాట్లాడుతూ కనిపించాడు. చాలా ముసలితనం వచ్చిందతనికి, జుట్టు మీసం నెరిసి పోయాయి.

అనంతాన్ని చూచి నడుచుకుంటూ వచ్చి

''అబ్బాయి గారు! ఎప్పుడు దిగారు బాబు అమెరికానుంచి, ఇదేనా రావటం'' అని అడిగాడు ఎంతో ప్రేమతో.

''అవునను సుబ్బయ్య ! ఎలా ఉన్నావు. మీ అబ్బాయికి లైసెన్సు వచ్చిందా'' అని అడిగాడు అనంతం.

అనంతం చేతిలోంచి బ్రీఫ్‌కేసు తీసుకుని నెత్తి మీద పెట్టుకుని

''రండి బాబు రిచ్చా ఎక్కుదురుగాని'' అని రిక్షా స్టాండుకి నడిచాడు.

''నేను రిటైరయిపోయాను బాబు. ఏం తోచక ఇలా వత్తూంటానండి. మా ఓడికింకా కూలీ లైసెన్సు రాలేదు బాబు. అక్కడా ఆక్కడా కూలిపని సేత్తావుంటాడండి'' అంటూ రిక్షాస్టాండు చేరాడు.

''ఆరి కాళ్ళు ఈరి కాళ్ళు పట్టుకుంటున్నా బాబు, ఆడి లైసెన్సుకి. ఇప్పుడొచ్చిన టేషన్ మాట్టారు మాదొడ్డ మడిసి బాబు, ఆయనే ఏదన్నా సేత్తేసెయ్యాలి బాబు''.

''మేట్టారు దేవుడి కాడికెల్లిపోయారు. మీ రొచ్చినప్పుడల్లా ఆరు టేషను కాడికొచ్చి ముందుగా నాతో సెప్పి మీ రైలు కోసం కాసుక్కూసునేవారు బాబూ. జేబులోంచి ఎంతోత్తే అంత సేతిలో పెట్టి 'ఎల్లిరారా సుబ్బయ్య' అనేవారండి. మంచోళ్ళని దేవుడు తొందరగా లాక్కెల్లిపోతాడు బాబు'' అని రిక్షాలో బ్రీఫ్‌కేస్ పెట్టాడు.

''మన చేతిలో ఏముంది సుబ్బయ్యా! అంతా మన నుదిటి మీదరాసిన ప్రకారం జరుగుతుంది.'' అని జేబులోంచి గుప్పిటకొచ్చిన డబ్బుతీసి సుబ్బయ్య చేతిలో పెట్టి ఒక నమస్కారం పెట్టాడు.

'మీరు సల్లగా వుండాలి బాబు!' అని దీవించాడు సుబ్బయ్య ఎంతో సంతోషపడుతూ.

రిక్షాకదిలివేల్పూరు రోడ్డుకు చేరుకుంది. అక్కడ వున్న ఒక హోటల్‌లో మకాం పెట్టాడు అనంతం.

***

# 13

ఆ మరునాటి ఉదయం సంచి భుజాన తగిలించుకొని కంతేరు బయలుదేరాడు అనంతం.

తణుకు బస్‌స్టాండులో కంతేరు బస్సుకోసం వేచి చూస్తున్నాడు

తణుకు-కంతేరు-తణుకు, ప్రైవేటు బస్సు సర్వీసు చూచి ఆశ్చర్యపడ్డాడు.

'ప్రతి అరగంటకీ ఒక బస్సు తిరుగుతోందిట!' చాలా సంతోషం వేసింది.

భుజానికొక సంచీ, హవాయి చెప్పులు, మామూలు జీన్సు ప్యాంటు, కాలరులేని బనీను వేసుకున్నాడు. ఆ మాసినగెడ్డం, కళ్ళజోడూ చూస్తే ఆ వూళ్ళో ఎవరూ తనని అనుమాలు పట్టే పరిస్థితి లేదు. సంచీలో మినరల్‌వాటర్ సీసా, రెండు, మూడు హిందూస్థానీ శాస్త్రీయ సంగీత పాటల క్యాసెట్‌లు, చెవిలో పెట్టుకుని వినే మైక్రోఫోన్ సెట్‌వున్నాయి. ఇవికాక ఒక బ్రెడ్, బిస్కట్‌ప్యాకెట్లు, ఒక రుమాలు, చిన్న తువ్వాలు కూడా ఉన్నాయి. జేబులో కొన్ని రూపాయల కట్టలు, చిల్లర డబ్బులున్నాయి.

ఏం తీసుకొస్తాడు కనుక అమెరికా నుంచి వచ్చేటప్పుడు. ఎవరికోసం తీసుకొస్తాడు? నాన్నకా, అమ్మకా!

అమ్మకీ, నాన్నకీ కూడా దేని మీద ఏ కోరికా వుండేది కాదు. అది అనంతానికి బాగా తెలుసు. అయినా ఈ పరిస్థితులలో అమ్మకి మాత్రం ఏ తీసుకురాగలడు. ఎందుకో ఒక తెలియని బాధ మనస్సులోకి తొంగిచూచింది. తనకు తెలియకుండానే కళ్ళు చెమర్చాయి.

'జీవితం చాలా దుర్భరం. తన జీవితమేనా ఇలా వుంది, అందరి జీవితాలు ఇలాగే ఉన్నాయా?' అనిపించింది.

ఇంతలో ఒక కుర్రవాడు పుస్తకాలు అమ్ముతూ తన దగ్గిరకి వచ్చాడు. ఎన్నో రకాల పుస్తకాలు చూపించాడు. జనరల్ నాలెడ్జి, ఇండియా, అమెరికా, జపాన్, చైనా షార్ట్‌స్టోరీ పుస్తకాలు, ఇంగ్లీషు తెలుగు నవలలు, వారపత్రికలు, ఇంగ్లీషు తెలుగుడైలీ పత్రికలు, ఇంకా ఎన్నెన్నో మోస్తున్నాడా కుర్రాడు. ఒక సంచీ కూడా వుంది వాడిదగ్గిర.

''అందులో ఏమున్నాయి'' అడిగాడు అనంతం.

''మీకు ఇష్టం అయితే చూపుతాను'' అన్నాడా కుర్రాడు.

''సరే'' అన్నాడు అనంతం.

ఆ పుస్తకాలు చూస్తే చాలా సిగ్గేసింది అనంతానికి, బాధ కూడా కలిగింది. అన్నీ తెల్లదొరల స్త్రీ, పురుషుల నగ్న శరీరాల బొమ్మలతో కూడిన పుస్తకాలవి.

''నాకక్కరలేదు'' అన్నాడు.

ఆ కుర్రాడు నవ్వుకున్నాడు. వాడికి పధ్నాలుగు పదిహేనుళ్ళుంటాయేమో ఇంతాచేసి. ''ఆంధ్రప్రభ ఇయ్యి'' అని ఒక వారపత్రిక కొన్నాడు ఆకుర్రాడికోసం. ఆ వారపత్రిక సంచీలో పెట్టుకుని అటు ఇటూ తిరగటం ప్రారంభించాడు.

బస్‌స్టాండు వెంకటేశ్వర టాకీస్‌కి ఎదురుగా వుండేది ఇది వరకు, అది రైలు కట్టకి ప్రక్కగా మార్చారు. అంతా కొత్తగానూ, వింతగాను కనిపిస్తోంది అనంతానికి.

అనంతం దాదాపు గత కొన్ని సంవత్సరాలుగా ఇండియాలో లేడు.

విపరీతమయిన జనసందోహం, తణుకు నుంచి ఆంధ్రలో ఎక్కడికయినా చేరుకునేందుకు బస్సువసతి, ధుమ్ము, ధూళీ, పేదరికం, కుక్కలు, పందులు, గేదేలు, చుట్టూ రకరకాల ఎడ్వర్టయిజ్‌మెంట్ బోర్డులు, రకరకాళ సినిమా పోష్టర్లు ఏమిటేమిటో అంతా హడావిడాగా వుంది వాతావరణం.

కుటుంబాలతో చిన్న చితకా ప్రయాణాలు, ఏమిటేమిటో జరిగిపోతున్నాయి. నిలబడి చూస్తున్నాడు.

అప్పుడప్పుడు అన్ని బస్సులు చూస్తూ ఏది ఎక్కడికివెడుతోందో ఎక్కడి నుంచి వస్తోందో చదువుతున్నాడు. 'ఇంకా కంతేరు బస్సు రాలేదేమి' అనుకున్నాడు.

తన చిన్నతనంలో సెలవులకి కంతేరు వెళ్ళి నెల, రెండునెలలూ తాతగారితో బామ్మతోటి గడిపేవాడు. నాన్న, అమ్మ వచ్చి కంతేరులో పదిరోజులుండి మళ్ళి వెళ్ళిపోయేవారు.

''తణుకు వచ్చి మాతో ఉండవచ్చుగదా పెద్దతనం వచ్చేసింది. చేసుకోవటం కష్టం'' అని బ్రతిమాలే వారు సుబ్బరామయ్య మాష్టారు.

''ససేమిరా!'' అనే వారు వారి తండ్రి బ్రహ్మయ్య శాస్త్రిగారు.

''నేను ఇక్కడే పుట్టాను, మా నాన్న , మాతాతలు ఇక్కడే వార్షీకాలు చేసుకునేవారు. నేను ఇక్కడే నిష్క్రమిస్తాను. పోనీ, మీ అమ్మని తీసుకెళ్ళు తణుకు'' అంటూండేవారు.

''ఆయన రాకుండా నేను మాత్రం ఎలా వస్తానురా! ఇలాగే వెళ్ళనీ మా జీవితాలు. కాలు చెయ్యి ఆడినంత కాలం మమ్మల్ని ఒంటరిగా వుండనివ్వండి. నీకు తెలుసుగా మీ నాన్నగారు మహావ్యక్తిత్వం గల మనిషి. ఈ ఊళ్ళో ఆయనకున్న గౌరవప్రతిష్టలెవరి కున్నాయిరా? ఆయన కంతేరు వదిలిరారు, మమ్మల్నిలా కాలం వెళ్ళబుచ్చునియ్యి నాయనా! ఎలాగు చివరికి నీ దగ్గిరకి వచ్చే వాళ్ళమేకదురా! ఇప్పటి నుంచీ ఎందుకు'' అంటూండేవారు మాష్టారు తల్లి కమలమ్మగారు.

సుబ్బరామయ్య మాష్టారు, వారి భార్య రాజేశ్వరమ్మగారు సర్దుకుపోతూండేవారు. అంతకీ రాజేశ్వరమ్మగారు మాష్టారుతో చెబుతూనే వుండేవారు.

''ఏమండీ! వాళ్ళనీ వయస్సులో వారికి ఇష్టంలేని పనులు చేయించటం మనకీ భావ్యం కాదు. వాళ్ల దంపతులిద్దరూ హాయిగా పార్వతీ, పరమేశ్వరుల్లా కంతేరులో కాలం గడుపుతున్నారు. మనం దానికి సంతోషించాలి. మనమే వాళ్లను చూచి వస్తూండాలి. అది మనకు వాళ్ళకు కూడా మంచిది '' అంటూండేవారు రాజేశ్వరమ్మగారు.

కోడలి మాటలు, తమకిచ్చే గౌరవమర్యాదలు చూచి చాలా ముచ్చట పడుతూండేవారు ఆ వృద్ధదంపతులు.

అనంతం ఇవేమీ మర్చిపోలేదు.

సెలవుల్లో కంతేరు వెళ్ళినప్పుడల్లా తాతగారితో పొలం వెడుతూండేవాడు.

బ్రహ్మయ్య శాస్త్రిగారు ఉదయమే లేచి స్నానం, జపం ముగించుకుని, చెంబుచేత పట్టుకుని ఒక రోజు కంతేరు, మరో రోజు పొదలాడ, కొత్తపాడు, కత్తవపాడు, కాకిలేరు, ఇరగవరం, 'భవతీ ఊ భిక్షందేహీ' అంటూ తిరిగి ఇంటికి పన్నెండు గంటలకి చేరుకునేవారు. ఒక్కొక్క ఊరిలో ఏడు ఇళ్ళ చొప్పున రోజుకొక ఊరుతిరిగి వచ్చేవారు. ఆ రోజు శాస్త్రిగారి రాకకోసం చూస్తుండేవారు ఆ మహాతల్లులు.

దోసెడు బియ్యం, వండుకునేందుకు ఒక అరటి కాయకాని, రెండు వంకాయలు కాని ఇచ్చి చారెడు కందిపప్పుగాని, పెసర పప్పుగాని ఇచ్చేవారు. నెలరోజులకొకసారి ఈ మాత్రం ఇవ్వటానికి వెనుతీసేవారుకాదు ఆ మహాతల్లులు. వారికి మంచి చెడూ చెబుతూ శుభకార్యాలకు ముహూర్తాలు పెడుతూ, వ్రతాలు, పెళ్ళిళ్ళు చేయిస్తూ అటూ ఇటూ కాలంగడుపుతూండేవారు.

తాతలకాలం నుంచి వస్తున్న ఆ రెండు ఎకరాలు, రావాడ సూరన్నకి కౌలుకిచ్చి చేయించేవారు. ఉదయం ఒకసారి, సాయంకాలం ఒకసారి బయలు భూమికని తన పొలం రోజుకు రెండుసార్లు వెడుతున్నందుకు సంతోషపడేవారు.

రావాడ సూరన్నకి మూడెకరాల మాగాణీ ఉండేది. అది అతని సొంతం. ఇలా అక్కడా అక్కడా వారి దగ్గిరా వీరి దగ్గిరా ఒకటి రెండు ఎకరాలు కౌలుకి తీసుకుని తన పొలంతోపాటు సాగుచేస్తూండేవాడు. రావాడ సూరన్నకి భార్య, కూతురు, కొడుకూ ఉన్నారు. పొలంలో సూరన్న కుటుంబీకులంతా కష్టపడి పనిచేసుకునేవారు.

వాళ్ళపొలంలోనేకాక ఇతర చోట్ల కూడా కూలికివెళ్ళి సంపాదించుకునే వారు. రావాడ సూరన్న చాలా నిజాయితీపరుడు. శాస్త్రిగారికి ఒక్కసారి కూడా బకాయిపెట్టి ఎరుగడు.

''ఉన్న రెండెకరాలు చేసుకుంటే ఏం వస్తుంది? కష్టమే మిగులుతుంది. పైగా పొలంలో దిగి మనం చెయ్యగలమా? మన ఆచారం ప్రకారం నాలుగిళ్ళు వ్యాయవారం చేసుకుని మంచి, చెడూ చెబుతూ, పెళ్ళిళ్ళు వ్రతాలు చేసుకుంటే మనకాలం సజావుగా వెడుతుంది. ఇది మన కర్తవ్యం. ఇవే మనం చెయ్యువలసిన పనులు. ఇది మన

ఆచారం''. అనుకుని బ్రహ్మయ్యశాస్త్రిగారు తన వృత్తి మీద చాలా నమ్మకం పెట్టుకుని జీవితం గడుపు తూవచ్చారు.

'తాత ఇంత కష్టపడుతూ నాన్నని ఎం.ఏ. దాకా ఎలా చదివించాడో, నాన్న తనని ఐఐటి, మద్రాస్‌కి పంపి బి. టెక్. ఎలా చెప్పించాడో' అని తలుచుకుంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది తెలుస్తూనే వుందిగా! అవున్న రెండెకరాల మీద అప్పులు చేసాడు. నాన్న ఎంతో కష్టపడుండాలి తన చదువుకి' ఒక్కసారి బాధకలిగింది అనంతానికి

'పై చదువులకు అమెరికా నుంచి స్కాలర్‌షిప్ వచ్చిందని తెలియగానే అమ్మ నాన్న ఎంతో సంబరపడటం' తాను ఈనాటికి మర్చిపోలేడు.

'ఆ రోజులు తలుచుకుంటే ఇప్పుడు బాధలే మిగిలాయి. నేను ఏవిధంగా సంతోష పెట్టాను అమ్మనాన్నను' ఒక్కసారి భరించలేని బాధకలిగింది.

'చివరికి నేనొక లయబిలిటీగా తయ్యారయ్యాను. అమ్మకీ, నాన్నకే కాదు ...ఈ దేశానికే' చలించిపోయాడు అనంతం.

'అరగంటకో బస్సు అన్నారు! ఇంకా కంతేరు బస్సురాలేదే' అనుకుంటూ అటూ ఇటూ తిరుగుతూ వేచి చూస్తున్నాడు.

దూరంగా ఒక వ్యక్తి కనిపించాడు. ఎక్కడో ఎప్పుడో చూచినట్లనిపించింది. గెడ్డం మీసం పెరిగివుంది. చిరిగినచొక్కా, ప్యాంటుకి ఒక కాలికి మోకాలు దాకా లేదు. చాలా మాసిపోయి అట్టలు కట్టేసి ఉన్నాయి ఆ బట్టలు. ప్రతి వాళ్ళనీ చెయ్యిచాచి యాచిస్తున్నాడా వ్యక్తి.

అతను తనలో తాను మాట్లాడుకుంటున్నాడు. కొందరు జాలేసి ఏదో ఇస్తున్నారు. కొందరు పొమ్మంటున్నారు. 'చూడడానికి పిచ్చివాడి వాలకంలా

కనిపిస్తున్నాడు' అని అనిపించింది అనంతానికి.

'ఎవరికి పిచ్చి? వాడికా? నాకా 'అనుకుని నవ్వుకున్నాడు అనంతం.

అతను తనలో తాను మాట్లాడుకుంటూ, ఆకాశాన్ని చూస్తూ చెయ్యి ఊపుతూ ఏదో గొణుక్కుంటున్నాడు.

జాలేసింది అనంతానికి.

అతను వచ్చి వచ్చి అనంతం దగ్గిరకి చేరి చెయ్యి చాపాడు. అనంతానికి కళ్ళు చెమర్చాయి. దగ్గిరగా చూచినప్పుడు కాని తెలియలేదు. అతనెవరో కాదు హైస్కూల్లో తెలుగు మాష్టారి అబ్బాయి రామలింగం. తన క్లాస్‌మేట్.

'ఏమిరా! రామలింగం. ఎందుకిలా అయ్యావురా?' అనుకున్నాడు అతను ఏమీ మాట్లాడకుండా చాచిన చెయ్యి దింపకుండా అనంతాని కేసి చాలా లోతుగా చూస్తున్నాడు.

''ఒరేయ్! రామలింగం'' అన్నాడు పైకి అనంతం.

సమాధానం లేదు.

అతను వినిపించుకున్నాడో లేదో తెలియదు. చెయ్యి మాత్రం ఇంకా చాచే వుంది. ఆశ్చర్యపోతూ జేబులోంచి ఎంత తీస్తున్నాడో తెలియలేదు అనంతానికి. ఆడబ్బు అతని చేతిలో పెట్టగానే అతను వెంటనే ఏమీ మాట్లాడకుండా ఆ డబ్బు జేబులో పెట్టుకుని ఏమీ ఆశ్చర్యం ప్రకటించకుండా ఒక సెల్యూట్ కొట్టి వెళ్ళి పోయాడు.

చాచిన చెయ్యిదించకుండా, అక్కడా అక్కడా కనపడ్డ సిగరెట్టు పీకిలు ఏరుకుంటూ అలా అలా కనుమరుగయ్యాడు రామలింగం.

అనంతం బిగిసిపోయి అలాగే చూస్తూవుండిపోయాడు అతనికేసి.

'ఏమయ్యింది రామలింగానికి, ఎందుకిలా అయ్యాడు' అనుకుంటూ ఎంతో బాధపడుతున్నాడు.

ఆ పక్కనే వున్న బడ్డీకొట్టు వాడు అంతహాడావిడిలోను అనంతాన్ని చూచి పకపక నవ్వాడు.

''ఏం బాబు! ఆడికి ఎంత దబ్బిత్తన్నారో మీకు తెలియదు, ఆడు మీద దగ్గిరెంత తీసుకున్నాడో ఆడికీ తెలవదు. ఆడో పిచ్చోడు బాబు! సదువుకున్న కుర్రాడు. ఒక్కొక్కసారి గట్టిగా అరుత్తూ ఇంగ్లీసులో మాటాడుతూంటాడు. టేషన్ కాడ, గాంధీ చౌక్ కాడ, అప్పు డప్పుడిక్కడా తిరుతుంటాడు. ఆడు ఎదవ సావాసాలు పట్టి గంజాయి, మందులు మింగి సెడతిరుగుళ్ళు తిరుగుతా వుంటే, ఆళ్ళ బాబు ఇంట్లోంచి పొమ్మన్నాడంట. సివరికి పిచ్చెక్కి అటూ ఇటూ తిరిగుతుంటాడంట. ఏవోవో సెబూతూంటారు. ఆడి ఖర్మ అలాకాలింది, ఎవ్వడు మాత్రం ఏం సేత్తాడు బాబు.'' అంటూ తన హడావిడిలోకి వెళ్ళి పోయాడు ఆ బడ్డీ కొట్టు పెద్ద మనిషి.

జుట్టు పీక్కున్నా అర్థం కాలేదు అనంతానికి.

'మనకి తెలియని విషయాలు అర్థంకానివి ఎన్నో జరుగుతుంటాయి జీవితంలో. జీవితానికో అర్థం పర్థం వుండదు. ఇంతేనేమో, ఇలాగే వుంటుందేమో! ఇంత జీవన మహాసాగరంలో తనకి జరిగిన దెంత. చాలా అల్పం అనిపిస్తుంది. తను ఇంకా పిచ్చివాడు కాలేదే? ఏమో తెలియదు'.

'నిజంగా రామలింగానికేమయి వుంటుందో? అంతగా మారిపోయాడు' అతన్ని చూచి బాధపడాలో, జాలిపడాలో, సంతోషించాలో అర్థం కాలేదు అనంతానకి.

అనంతం మనస్సు ఒక ఇర్వై సంవత్సరాల వెనక్కివెళ్ళింది.

స్కూల్లో చదువుతున్నప్పుడు లెక్కల పరీక్షల్లో రామలింగం, అనంతం పోటా పోటీలుగా వుండేవారు. ఎప్పుడూ ఇద్దరికీ నూటికి నూరు వస్తూండేవి. ఒక్క మార్కు తక్కువయితే చాలు ఎంతో చెలించి పోయేవాడు రామలింగం. మిగిలిన పరీక్షలు అసలు లెక్కపెట్టేవాడు కాదు. వాడు ఎంత సేపూ లిటరేచర్, హిస్టరీ, రాజకీయాలలో ఎంతో ఉత్సాహం చూపిస్తూండేవాడు. పేపరు ఈ మూల నుంచి ఆ మూలదాకా చదివేసేవాడు. వాడితో రాజకీయాలు మాట్లాడటానికి ఎవరూ వుండేవారు కాదు.

రామలింగం రాజమండ్రి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలో బి.ఏ.పొలిటిక్స్‌లో చేరటం, అనంతం ఐఐటి మద్రాసులో చేరటం ఒకేసారి జరిగింది. అప్పుడప్పుడు వేసవి

సెలవుల్లో తణుకులో చాలా అరుదుగా కనిపిస్తూండేవాడు రామలింగం అనంతానికి.

ఆ రోజుల్లో సాయంకాలం వేళ తణుకు క్లబ్బులో కదంబం చెట్టుక్రింద సోఫాల్లో కూర్చుని ఏవో కబుర్లు చెప్పకుంటూండేవారు ఆ చుట్టూ ప్రక్కల రిటైరయిన పెద్ద మనుష్యులు. అక్కడ చేరి తను కూడా ఏవో పొలిటిక్స్ మాట్లాడుతూండేవాడు రామలింగం. ఆ పెద్దమనుష్యులకు రామలింగం ఒక పెద్ద కాలక్షేపం. భారత రాజకీయాలు, ప్రపంచ రాజకీయాలు, అణు పరీక్ష రాజకీయాలు, లిబరలైజేషన్ రాజకీయాలు, అమెరికా–పాకిస్తాన్–చైనా, భారత–పాకిస్తాన్ రాజకీయాలు, అమెరికా వైఖరి, అమెరికన్ డామినేషన్, సాఫ్ట్‌వేర్ గిలిగింతలు వగైరాలు మాట్లాడుతూంటే అలా వింటూండేవారు ఆ చూట్టు ప్రక్కలవాళ్ళు. రామలింగం కోసం కనిపెట్టుకుని కూర్చునే వారు కొందరు పెద్ద మనుష్యులు.

అనంతానికి దాహం వేసింది. ఒక సోడా కొట్టమన్నాడు ఆ బడ్డీ కొట్టువాణ్ణి.

''కూల్ డ్రింక్స్ తాగుతారా బాబు'' అన్నాడు కొట్టువాడు.

''సరే ఇయ్యి'' అన్నాడు

కూల్‌డ్రింక్ ఇస్తూ ''ఏ వూరెల్తారు బాబు'' అన్నాడు కొట్టువాడు.

''కంతేరెళ్ళాలి''

''ఎదురుగుండా రాజమండ్రి బస్సుందిగా అది రాజమండ్రి నుంచి మార్టేరెడతది, కంతేరులో దిగచ్చుగా'' అన్నాడా పెద్ద మనిషి.

కూల్‌డ్రింక్ తాగి డబ్బులిచ్చి రాజమండ్రి నుంచి వచ్చిన బస్సుఎక్కికూర్చున్నాడు అనంతం.

అప్పటికే ఆ బస్సు దాదాపుగా నిండింది. వెనకాల సీట్లో కూర్చున్నాడు.

కండక్టర్ ఈల ఊదాడు, బస్సు కదిలింది.

తణుకులో ఆ జనసందోహం, దుమ్ము, దూళిలోంచి దూసుకుపోతోంది

బస్సు. హై స్కూల్, ఈమని వారివీధి, ఇంద్రభవనం, గుప్తాకొట్టు, ఈశ్వరవిలాస్, ఒంతెన, ముళ్ళపూడి వారిఇల్లు, చిట్టూరి వారి ఇళ్ళు దాటుకుని పోతోంది బస్సు.

ఎన్నెన్నో విషయాలు జ్ఞాపకానికొస్తున్నాయి అనంతానికి. తన చిన్నతనంలో ఎన్నో సార్లు తణుకునుంచి సైకిలుమీద కంతేరు కెళ్ళాడు.

ఇరగవరం, కొత్తపాడు, అంజనేయ గుడి దాటుకుంటూ కంతేరు పొలిమేరలో పెనుగొండ వైపు తిప్పి ఆపు చేశాడు బస్సు.

''కంతేరు, కంతేరు'' అన్నాడు కండక్టరు.

కంతేరు ప్రయాణీకులు దిగారు.

అనంతం కూడా దిగాడు.

బస్సెళ్ళిపోయింది.

ఏదో తెలియని ఆనందం కలిగింది. ఒక్కసారి చుట్టూరా చూచాడు.

'సే నెక్కడికెళ్ళాలి' అనుకుని ఊళ్ళోకి బయలుదేరాడు.

కంతేరులో కాలుపెట్టగానే ఎక్కడలేని ఆనందం పుట్టుకొచ్చింది అనంతానికి. ఒళ్ళు పులకరించింది. కళ్ళు చమర్చాయి. చిన్ననాటి నుంచి కాలేజికి వెళ్ళే దాకా అటుఇటుగా కంతేరుతో ఒక బంధం ఏర్పడిపోయింది.

తాతగారితో తాను కూడా 'భవతి భిక్షందేహి 'అంటూ తిరగడం, నాన్న తాతయ్యల మధ్య ఘర్షణలు గుర్తుకొచ్చి బాధపడ్డాడు.

'నాన్న కిష్టంలేని పని తాత చేయించలేక పోయాడు. చెంబుచేత పట్టి తిరగటం ఒక ముష్టి బ్రతుకు క్రింద బావించాడు నాన్న. గౌరవంలేని జీవితం అని సుతరాము ఇష్టపడేవాడు కాదు. అదే జరిగివుంటే తాను ఈ పరిస్థితులలో వుండేవాడు కాదేమో అనుకున్నాడు.

'తాతతో ఊరూరా తిరుగుతూంటే ఎంతో బావుండేది. అందులోని తృప్తి ఇప్పుడు వుందా?' అనుకున్నాడు.

అటూఇటూ చూస్తూ ఊరి లోపలికి వెడుతున్నాడు. హరిజనవాడ చూచి ఎంతో ఆశ్చర్యపడ్డాడు. ఎంతో పరిశుభ్రంగా వుంది. గుడిసెలు పోయి పెంకుటిళ్ళు వచ్చాయి. చాలా సంతోషం కలిగింది.

ఆ ఊరి మొదట్లో డాక్టర్ అంబేద్కర్ విగ్రహం చూచాడు. మొన్న మొన్న కట్టినట్లుగా వుంది. సామాజిక, రాజకీయ పరిస్థితులకు ఆశ్చర్యపడ్డాడు.

ఇంకా ముందుకు నడిచాడు. రావాడ సూరన్న గుడిసెలేదు. అక్కడ ఒక చిన్నసైజు మేడ వెలిసింది. 'బహుశా సూరన్న మనవడు వీరన్న కట్టుకుని ఉంటాడు ఈ మేడ' అనుకున్నాడు.

ఎన్నెన్నో మార్పులు చూచి చాలా సంతోషిస్తూ ఊరిలో ప్రవేశించాడు.

ఆదే చెరువు, వూరి మధ్యలో తామరాకులు కలువపూలతో కలకలాడుతోంది. చెరువుప్రక్కనే ఒక బోర్టు ఉంది.

''ఈ చెరువులో స్నానము చెయ్యరాదు. బట్టలు ఉతకరాదు. ఈ నీరు త్రాగునీరు. ఉల్లంఘితులు ఈ చెప్పుతో దెబ్బలు తిందురు'' అని వ్రాసివుంది ఆ బోర్టు మీద. ఒక చెప్పు వేలాడుతూంది ఆ బోర్టుకు. 'ఇంకా ఈ బోర్టు ఈ చెప్పు ఉన్నాయి' అనుకున్నాడు.

ఆ చెరువు ప్రక్కనే ఒక శివాలయం ఉంది. చినమేష్టారు దానికి అర్చకులు. వారి అన్నగారు పెద్ద మేష్టారు, ఆ ఉళ్ళో ఎప్పటి నుంచో స్కూలు నడుపుతూ వస్తున్న పూజార్లు వారు

చినవెంకటాచారి, పూజార్లు ఏదురెదురిళ్ళలో ఉంటారు.

చిన్నతనంలో పూజార్ల, ఆచార్ల పిల్లలతో ఆడుకూంటూండేవాడు అనంతం, అన్నీ కళ్ళకు కట్టునట్లు గుర్తుకొస్తున్నాయి. ఆ చెరువు చూస్తే నీళ్ళు త్రాగాలనిపించింది.

చిన్నతనంలో పొలాలగట్లని తిరిగి స్నేహితులతో కలసి ఆ చెరువులో నీళ్ళు త్రాగి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళే వాళ్ళు.

నీళ్ళుత్రాగటానికి భయం వేసింది, ఆరోగ్యసూత్రాలు వల్లించుకున్నాడు.

బ్యాగ్‌లో ఉన్న మినరల్ వాటర్ సీసా తీసి దాహం తీర్చుకున్ని ఒక్కసారి చెరువుకేసి చూచాడు.

రెండుమెట్లు దిగి చెరువుని చెత్తో తాకి నాలిక తడుపుకుని, కళ్ళుతుడుచుకుని బయటికి వచ్చి తృప్తి పొందాడు.

ఆ ఊరిలో కొంతమంది జనం అక్కడా అక్కడా తనని చూస్తూండటం గమనించాడు. ఆ ప్యాంటు, టీ షర్టుతో ఆ ఊరికో కొత్త మనిషిలా కొట్టొచ్చినట్లు కనపడతున్నాడు.

'పెద్దగా ఎవ్వరూ పట్టించుకోవటం లేదులే' అనుకున్నాడు.

నడకసాగించాడు

ఆ ఊరు ఒక్కసారి చుట్టివస్తే మహాపడితే ఒక అరగంట అవుతుందేమో, అంత చిన్న ఊరు కంతేరు.

అంకమ్మ గుడిదగ్గిరకి చేరాడు. ఆప్రక్కకుంటి మాష్టారు ఇల్లు, ఇటువస్తే కరణంగారి ఇల్లు, ఇంకా కొంచెం ముందుకుపోతే పూజార్లు, ఆచార్ల ఇళ్ళు, అటువెడితే సుబ్బిరెడ్డి గారిల్లు, ఇటు చూస్తే మునసబుగారిల్లు.

కుంటిమేష్టారు ఇంటికి ఎదురుగా పాడుపడి చాలా దీనావస్థలో ఉన్న ఇల్లు తన తాత బ్రహ్మయ్య శాస్త్రిగారిది.

ఆ ఇల్లు చూస్తే భయం వేసింది అనంతానికి. ఇంటిమీద పెంకులు అక్కడా అక్కడా కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. ఇంటి కిటికీ ఊచలు వెళ్ళాడుతున్నాయి. గోడలికి చాలా మట్టుకు బెల్లులూడి ఉన్నాయి. ఆ ఇంటి ద్వార బంధం చాలా పాతబడిపోయివుంది. ద్వారానికి ఒకే తలుపు. అదివంటి తలుపు ద్వారబంధం.

ఆశ్చర్యం వేసింది అనంతానికి. ఆ ఇంటికి తాళం వేసి ఉంది. ఇంకా ఆశ్చర్యం కిలిగించింది. ఆగడపకి పసుపురాసివుంది. అప్పుడే పెట్టినట్లు, కుంకంబొట్లు కూడా ఉన్నాయి.

ఆ ఇంటికి చిన్న చిన్న మట్టితో కట్టిన అరుగులున్నాయి. ఆ అరుగు మీద కూర్చుంటే గొంతుక కూర్చున్నారేమో అనిపిస్తుంది.

ఎదురుగా కుంటి మాష్టారి ఇంటికి చాలా ఎత్తయిన అరుగులున్నాయి. కుంటిమాష్టారు, తాతగారు ఎవరి అరుగుమీద వారు కూర్చుని గంటలు గంటలు పురాణాలు, భగవద్గీత వగైరా మాట్లాడుకోవటం ఇంకా జ్ఞాపకం వుంది అనంతానికి.

ఆ ఊళ్ళో ఆయన్ని కుంటి మేష్టారు అని పిలుస్తూంటారు. ఆయన అసలుపేరు రామశాస్త్రి. మంచి ప్రజ్ఞాశాలి. రామశాస్త్రిగారంటే ఎవరికీ తెలియదు ఆ ఊళ్ళో. కుంటి మాష్టారు అంటేనే తెలుస్తుంది.

ఆయనకు ఒకకాలు పోలియోతో పుట్టారని అంటూండేవారు. వారి పిల్లలు, మనవలుకూడా 'ఎవర్రామీరు అంటే', ' కుంటిమేష్టారు పిల్లలమండి' అనేవారు. ఆయన మనవలతో చాలా పరిచయం వుంది అనంతానికి.

'ఒకసారి రామశాస్త్రిగారు తాతగారితో ఏదో మాట్లాడాలని వచ్చి తలుపుతట్టారుట'.

'ఎవరు అని తాతగారు అడిగితే, నేనయ్యా శాస్త్రీ, కుంటి మాష్టారుని' అన్నారుట రామశాస్త్రిగారు. ఇది ఎప్పుడూ తాతగారు చెప్పి' పగలబడి నవ్వుతూండేవారు. ఆయనతో కుంటిమేష్టారు కూడా ఆ నవ్వుతో శృతి కలిపేవారు.

స్మృతి పథంలోకి ఏవేవో జ్ఞాపకాలు తొంగిచూచాయి.

'ఆ రోజులే వేరు' అనుకుని ఒక్కసారి విశ్రమించాడు అనంతం తన తాత ఇంటి అరుగుమీద కూలపడి.

ఆ ఊరి మొదట్లో హరిజనవాడ, చెరువుకి దగ్గిరలో ఐదు బ్రహ్మణ కొంపలు, చెరువుకి ఒక వైపు రెడ్లు, మరోవైపు కాపులు ఉంటూంటారు.

ఆ వున్న బ్రహ్మణ కొంపలలో ఒకటి తన తాత బ్రహ్మయ్యశాస్త్రి గారిది. ఆయన ఆ ఊరి పురోహితుడు. మరొకటి తపాలాఫీసు ఉద్యోగి కుంటి మాష్టారుది. మరొకటి శివాలయం అర్చకులు, ఆ ఊరిలో పిల్లలకి టీచరులు, మరొకటి వైష్ణవాలయం అర్చకులు పెద వెంకటాచార్యుల వారిది. ఆ మధ్యలో కరణంగారి ఇల్లు.

ఏ పల్లెటూరు తీసుకున్నా ఈ అయిదు కొంపలు తప్పకుండా ఉండేవి ఆరోజుల్లో. రాను రాను ఒక ఊరి నుంచి మరొక ఊరికి, ముఖ్యంగా పల్లెటూళ్ళ

నుంచి పట్నవాసాలకి భుక్తికోసం వలస పోవటం ప్రారంభమయింది. జనాభా పెరుగుదల, సాంకేతిక పరిణామాలలో మార్పులే దానికి కారణం.

అవూరి పద్ధతి, జీవితం ఎవరికీ క్రొత్తకాదు. ఇదేకుల విచక్షణతో ఎంతో కాలంగా జీవితాలు గడుపుతున్నారు ఆ ఉరిలో ప్రజలు.

పూర్వం విచక్షణా భావంతో గడిపినా ఒకరంటే ఒకరికి గౌరవం మర్యాదలు వుండేవి. ఎవరి వృత్తి వారు చూచుకునేవారు. కొంతవరకు తృప్తిగానే బ్రతికేవారని చెప్పుకోవాలి. అస్ప్రుశ్యత ప్రబలంగా ఉండేది.

ఇదే అస్ప్రుశ్యత ప్రస్తుతం రాజకీయనాయకుల చేతులలో రకరకాలుగా రూపులు దిద్దుకుని ఏన్నో రకాలుగాఎన్నెన్నోమాయని మచ్చలుగా మారింది ఈనాడు. అప్పటికీ, ఇప్పటికీ పెద్ద తేడా ఏమీ కనిపించదు.

రాను రాను రాజకీయంగాను, సామాజికంగాను, చాలా మార్పులు వచ్చాయి. క్రొత్తక్రొత్త రాజకీయ నాయకులు, పార్టీలు వచ్చి ప్రజలలో ప్రజలకి విరోధాలు పెంచారే కాని, బుద్ధులు చెప్పి ప్రజాదరణకోసం అభివృద్ధి పథకాలు ప్రవేశ పెట్టినవారు లేరు. ఒకవేళ పెట్టినా, అవి రాజకీయ లబ్ధికోసమే కాని మరొకటి కాదనిపిస్తుంది.

మిట్టమధ్యాహ్నం అయింది. రోడ్లమీద ఎవరులేరు, పొలం పనులు ముమ్మరంగా వున్న రోజులు

ఆకలివేసింది, బ్రెడ్‌తీసుకుని తిందాం అనుకున్నాడుకాని తిన బుద్ధికాలేదు. ఏం చెయ్యాలో తోచలేదు. ఈ టైములో ఎవరింటికి వెడతాడు? ఒకవేళవెళ్ళినా తనని ఎవరుగుర్తుపడతారు.

బాటిల్ ఓపెన్ చేసి మళ్ళీ మంచినీళ్ళు త్రాగాడు.

జన సంచారం చాలా తక్కువగా ఉంది.

అటూఇటూ పోయే వాళ్ళు ఒక్కసారి 'ఎవరూ? ఇతడు' అని క్రొత్తగా చూస్తూ పోతున్నారే తప్ప ''ఎవరు బాబు నువ్వు? ఏం కావాలి? ఎవరికోసం చూస్తున్నావు'' అని ఎవరు అడగటం లేదు.

తణుకులో కొన్న ఆంధ్రప్రభ సంచీలోంచి తీసి చదువుకుంటూ కూర్చున్నాడు.

ఎదురుగా వున్న ఇంటిబయట పోష్టుబాక్సు రంగు వెలిసిపోయివుంది. లోపలి నుంచి ష్టాంప్ కొడుతున్న చప్పుడు అప్పుడప్పుడు వినిపిస్తూంది. 'ఇంకా ఇక్కడ పోష్టు ఆఫీసుందన్నమాట' అనుకున్నాడు.

ఆడపాదడపా ఎవరో వచ్చి ఒక కార్డో, కవరో కొనుక్కుని వెడుతున్నారు.

ఎదురుగా ఒక ముసలతను పోష్టాఫీస్ ముందుగా నుంచున్నాడు. అతను మోకాళ్ళపైకి పంచెకట్టుకున్నాడు. చొక్కాలేదు. చెప్పులు లేవు. నెరిసిన మీసం మాసిన గడ్డం. తలపాగా చుట్టుకుని ఉన్నాడు. చెవిలో ఆరిన చుట్ట, చేతిలో కర్ర, నల్లటి శరీరం, కొంచెం బొద్దుగానే ఉన్నాడు. ఆరవై, డెభై ఏళ్ళుంటాయి. చూడ్డానికి ఒక చిన్న సైజు రైతులా ఉన్నాడు. ఆ పోస్టాఫీసు ఇంటిముందునుంచి పెద్దగా అరిచాడు.

''సూరిగారండా'' అని

లోపలి నుంచి ఒక కుర్రాడు, ముప్పై ఏళ్ళుంటాయి బయటికి వచ్చి ''నాన్న నిద్రపోతున్నాడు, ఎందుకలా అరుస్తావ్, ఏం కావాలి '' అని అడిగాడు.

''ఎంకడు దగ్గిర నుంచి ఈ మద్దె కాలంలో ఉత్తరం రాలేదు బాబు! ఎలాగున్నాడో ఏంటో తెలవదు, ఆడికో ఉత్తరం రాసి పెట్టండి దొరా! నా సెరమం సెప్పులు కుటితా! తవ కు'' అన్నాడు.

''ఒరేయ్ నాగూ! ఇప్పుడు నాకు టైము లేదు, రేపురా? ఒచ్చేటప్పుడు డబ్బులట్రా. దుబాయ్‌కి ఉత్తరం రాయటం అంటే తణుకుకి కార్డు రాయటం లాంటిది కాదురా'' అని లోపలికి పోయి తలుపేసుకున్నాడా కుర్రాడు.

చెవిలో చుట్టతీసి నోట్లో పెట్టుకుని ఎదురుగా ఆరుగు మీద కూర్చున్న అనంతాన్ని చేరి ''బాబూ! అగ్గి పెట్టుంటే ఓ పాలిప్పించండి ''అన్నాడు.

''నా దగ్గిర లేదు'' అన్నాడు అనంతం

ఆ రైతు అనంతంకేసి లోతుగా చూచి, ''ఎవరుబాబు! తమరు? ఈ ఊరికి కొత్తనుకుంటాను'' అన్నాడు.

సారా వాసన గట్టిగా కొట్టింది.

అనంతం ఏమీ మాట్లాడలేదు.

ఆ దారి గుండా పచ్చగడ్డి మోపు నెత్తిన పెట్టుకుని చుట్టనోట్లో పెట్టుకుని పొగ వదులుతూ వెడుతున్న ఒక మనిషిని చూచి గబగబా కొంచెం తూలుకుంటూ వెళ్ళి పిలిచాడా రైతు.

''ఒరేయ్ పోలిగా! సుట్ట ఎలిగించుకుంటాను ఒకపాలి నీ సుట్టియ్యరా'' అని చుట్ట వెలిగించుకుని వచ్చాడా రైతు. పోలిగాడు తన దారిన గడ్డి మోసుకుంటూ పోయాడు. ఆ రైతు హాయిగా చుట్టపొగ పీల్చుకుంటూ మళ్ళీ అనంతాన్ని చేరాడు.

''బాబూ! ఈ ఇల్లెప్పుడు తాళం ఏసుంటది. ఈ ఇంటిగలోళ్ళు ఇక్కడ లేరు. ఎక్కడున్నారో కూడా యారికీ తెల్దు. ఆళ్ళకోసం కనక మీరొత్తే వచ్చిన దారినెల్లి పోవలిసొత్తది'' అని కొంచెం ప్రక్కగా కూర్చుని హాయిగా చుట్టకాలుస్తున్నాడు.

అనంతం ఏమి మాట్లాడలేదు. ఆ రైతు కేసి చూస్తూ కూర్చున్నాడు.

కాసేపు ఆగి మళ్లీ మొదలెట్టాడు ఆ రైతు.

''బాబు! మిమ్మల్ని సూత్తోంటే జాలేత్తంది, ఎందుకు బాబు ఇక్కడ కుకున్నారు యారికోసం కూకున్నారు'' అని అడిగాడు ఎంతో ఆప్యాయంగా.

'తింటానికి తిండి, కట్టుకునేందుకు చాలిన బట్ట, ఉండటానికి చాలిచాలని గుడిసెలు కూడా లేని జీవితాలు గడుపుకుంటూ, మరొకరి బాగోగులు గూర్చి ఆలోచించే మహా మనుషులు ఏ దేశంలోను లేరు. ఈ త్యాగ బుద్ధి మరెక్కడా కనిపించదు. ఇదే మన దేశం బ్రతుకుతీరు. ఇదే మనమతం. దీనికి హిందూవుల మతం' అని చెప్పనవసరంలేదు, ఇది ఈ దేశంలో ఉన్న మానవుల మతం' అనుకున్నాడు.

'ఇది అనువుగా తీసుకుని కొందరు పెద్ద మనుష్యులు స్వలాభాపేక్షతో సమాజాన్ని వక్రబుద్ధితో పెడత్రోవ పట్టించి లబ్ధిపొందారు. ఇది ఇంకా కొనసాగుతోనే ఉంది.' అనుకుని బాధపడ్డాడు.

''మాదీ ఊరే! ఈ ఇల్లు మాతాతగారిది'' అన్నాడు అనంతం.

గబగబాలేచి, నోట్లో చుట్టతీసి చేత్తో ఆర్పి చెవిలో పెట్టుకుని, తూలుతూ కర్ర మీద ఆనుకుని, నమస్కారం చేసి ''బాబూ!' మీరు చాత్రిగారి మనవలా, అలా ముందే సెప్పంటే నాకు మీ దగ్గిర సుట్టకాల్చేదమ్ముండేదా బాబు''.

''అయ్యో బాబు! అయ్యో బాబు! మీరు చాత్రిగారి మనవలా!'' అని ఎంతో మర్యాదగా వాపోయాడా రైతు.

''మా తాత నీకు తెలుసా?'' అడిగాడు అనంతం.

''తెలుసంటారేంటి బాబు, ఆరి పొలంలో కూలి పని సేశానండి. ఆరంటే నాకెంతో గురి. ఆరీ ఇంట్లో ఉన్నప్పుడు ఈ ఇల్లు ఎంత కలకలలాడేదో మీకేం తెల్సుబాబు.''

''ఇంకా ఇప్పటికీ ఆశారిగోరు ఈగుమ్మం కడిగించి గడపకి పసుపురాయించి, ముగ్గెట్టిత్తా ఉంటారు బాబు'' అన్నాడా రైతు.

ఆ రైతులోని మంచితనం, మర్యాద, అప్యాయతలకి చలించి పోయాడు అనంతం.

'కూర్చో' మని సాజ్ఞ చేశాడు.

''అయ్యో బాబోయ్ మీసెంతని కూకుండేంత గొప్పోన్ని కానండి బాబు. నేను నుంచునే ఉంటా బాబు'' అని కొంచెం తూలుతూ నుంచున్నాడు ఆ రైతు.

''అయితే నేనూ నుంచునే ఉంటాను'' అని అనంతం నుంచున్నాడు.

''అయ్యో బాబయ్యో బాబు! అదేటండీ'' అని వాపోయాడా రైతు.

వెంటనే అతని భుజాలు పట్టుకుని కూర్చోపెట్టాడు అనంతం.

ఆ రైతుకి నోట మాటరాలేదు. బిగిసిపోయి కూర్చున్నాడు.

''మీ తాత గారు దేవుడండి. ఆరికి సేతులెత్తి దండం పెట్టాలి. ఆరి మనవడు గారు తమరు  నా కన్న సాలా సిన్నోరు బాబు తమరు. మిమ్మల్ని అ దేవుడు కాపాడతాడు.

''కుంటి మాట్టారా అరుగు మీద, మీ తాతగారి అరుగు మీద కూకుని మాటాడు కుంటుంటే, నేనిక్కడ ఇలాగే కూకుని ఇంటూండే వాణ్ణి బాబు.

''ఎన్నో కతలు, పురాణాలు మంచి, సెడ్డా, సెబుతూండేవారు బాబు''

''ఆ పేమ, ఆ మంచితనం, మనం ఇప్పుడు సూడంవండి''

''ఎంకడిని సదివించరా! ఎంకడిని సదివించరా! నాగా! అని ఏకరువు పెడతా ఉండేవారు''

''ఎంకడంటే, ఎవరో కాదు బాబు, నా కొడుకు. ఎంకడు సదువుకుంటే పెద్ద పెద్ద ఉద్యోగాలు సెయ్యొచ్చురా. ఆడి సదువుకి డబ్బిత్తానని కుంటి మాట్టారు, మీ తాతగారు అంటూండే వారండి''

''ఒరేయ్ నాగా! గవర్నమెంటోళ్ళు ఎన్నో పథకాలెడతన్నారు. నా మాటిని ఆణ్ణి బళ్ళోకి పంపరా అంటూండేవారు బాబు'' అంటూ ఏమిటేమిటో చెప్పుకుంటూ పోతున్నాడా ఆరైతు.

''నేనక్కడికీ అంటూండే వాణ్ణిబాబూ! అయన్నీ మనదాకారానిత్తారండి. అక్కడికక్కడే పంచేసు కుంటారంట'' అని ఒక్కసారి కాండ్రించి ఉమ్మేసి మోహం తుడుచుకున్నాడా రైతు.

అనంతం మనస్సు మనస్సులో లేదు. ఎక్కడెక్కడికో పోతోంది. ఏవేవో అలోచనలు బుర్రలో తిరుగుతున్నాయి. ఒక్కసారి తేరుకొని

''ఇప్పుడెక్కడున్నాడు మీ అబ్బాయి వెంకడు'' అని అడిగాడు అనంతం.

''దుబాయ్‌లో కూలిపని సెయ్యటానికెళ్ళాడు బాబు! ఎల్లిన కొత్తల్లో అప్పుడప్పుడు ఆడిచ్చేమం రాత్తా ఉండేవాడు. సానారోజుల నుంచాడి దగ్గిర నుంచి ఉత్తారాల్లేవు బాబు'' అని కన్నీళ్ళెట్టుకున్నాడా రైతు.

''ఎల్లేటప్పుడు సెప్పాడండి. నీకెందుకురా అయ్యా, డబ్బులు మూటకట్టుకొత్తా, మన కట్టాలన్నీ తీరతాయి. ఒరేయ్! అయ్యా, నువ్వు పెదరెడ్డిగారి కాడున్నప్పటి నుంచీ ఎట్టి శాకీరి సేత్తన్నావు. కుంచెడునేల కూడా కొనుక్కోలేకపోయావ్ కదరా! నీ బాబు కూడా అరికి శాకీరీ సేశాడు. ఆడూకోనుక్కోలేక పోయాడు. సరైన

సిన్న గుడిసె కూడా లేదు కదరా! పెద్దరెడ్డి బాగున్నాడు. ఆడి కొడుకు బాగున్నాడు. సదువుకుని పట్నంలో ఉద్యోగం సేత్తన్నాడు. నీకు నాకు ఇక్కడ గతిలేదురా! ఒరేయ్! అయ్యా నీకు పొలం కొనిపెడతాను, ఇల్లుకట్టిపెడతా నన్నెల్లనియ్యరా'' అని ఎన్నెన్నో సెప్పాడయ్యా.

''నేనంటానే ఉన్నానయ్యా! మనకెందుకురా అంత డబ్బు ఇక్కడే కూలిపని చేసుకు బతుకుదాం అని''.

''ఆడింటేగా బాబు. ఎదవ నాయాల ఎక్కడున్నాడో ఏంటో, ఏం తెలవటం లేదు బాబు'' అని బాధపడ్డాడా రైతు.

అనంతానికి మాటరాలేదు బిగిసి పోయి కుర్చున్నాడు.

''నువ్వేం చేస్తూంటావ్!'' అని ఒక వెర్రి ప్రశ్న వేశాడు.

''ఒల్లు బావున్నప్పుడు కూలి పని సేత్తా వుంటానయ్యా''. లేకపోతే ఇంటికాడ తొంగుంటానండి''.

''ఇది వరకైతే డప్పుకొడుతూ ఈది ఈదికి తిరుగుతూ, అరుత్తూ టముకేత్తా ఉండేవాణ్ణి. ముసలోడయిపోయావురా నాగూ! ఇప్పుడు నీకరిచే సత్తాలేదని తీసేసి కుర్రకారు సేతడప్పు కొట్టిత్తిన్నారండి పంచాయితీవోళ్ళు'' అన్నాడా రైతు.

''మరినిన్ను చూచేవాళ్ళెవరయినా ఉన్నారా?'' అని అడిగి ఒక్కసారి గతుక్కు మన్నాడు అనంతం.

'ఈ ప్రశ్ననేను వెయ్యవలసినది కాదేమో' ననిపించింది. ఒక్కసారి తనలో తాను కలవరపడ్డాడు. చాలా బాధగలిగింది. 'ఈ ప్రశ్న వేసే అర్హత నాకు లేదు' అనుకున్నాడు.

''మా కోడలిక్కడే ఉంది బాబు. ఎంకడికో కొడుకండి, ఆళ్ళిద్దరూ నన్ను సుత్తా ఉంటారండి. తింటానికి కూడెడతదండి. ఈ కుర్ర ఎదవకి సదువు లేదండి. పూజారి మాట్టారి నడిగితే ఆ మాల బళ్ళోపెట్టమంటారండి, అక్కడ పట్టించుకోరండి. ఆడిట్టమయితే బడికెడతాడండి లేక పోతే దున్నపోతులా రోడ్లట్టుకుని తిరగతా ఉంటాడండి'' అని చెప్పుకుంటా పోతున్నాడు ఆ రైతు.

'' రెక్కలు ముక్కలయ్యేట్టు పని సేయిత్తారంటండి దుబాయ్‌లో.

తాటరేగేట్టుకొట్టి సేయత్తారండి. ఆడు సచ్చినా పట్టించుకోరంటండి. ఎందుకండయ్యా ఎదవ సంపాదన''.

''ఈ మద్దెకాలంలో అడి దగ్గిరనుంచి చేమం తెలియటం లేదు బాబు. ఆడ కూతు రు రోజు ఏడుత్తా ఉంటదండి. ఆడి దగ్గిరనుంచి డబ్బు కూడా రావటం లేదు బాబు. ఉన్నాడో, సచ్చాడో తెలవటం లేదయ్యా'' అని బాధపడుతవా చెప్పుకుపోతున్నాడు.

''ఆ మద్దెనండయ్యా! తెల్లదొర సానమ్మలొచ్చారండి మనూరికి. ఎంతో ఆశలుపెట్టి కిరత్తానీ మతం పుచ్చుకోమని మాగూడెంలో ఇంటింటికీ వచ్చి పెచారం చేశారండి. దాంతో మా ఆడకూతురు కిరత్తానీ మతం పుచ్చుకుందండయ్యా. ఇంకప్పటి నుంచి అంకమ్మ గుడి కెళ్ళటం కూడా మానేసి మా గూడెంలో ఆళ్ళు కట్టిన సెచ్చి కెళతంది బాబు. ఎంకడు డబ్బు పంపకపోయినా తిండికి లోటులేదండి. ఆళ్ళే ఏదో ఇత్తా ఉంటారండి' అని బాధ పడ్డాడా రైతు.

''మరి నువ్వు తీసుకోలేదా కిరస్తానీ మతం'' అడిగాడు అనంతం.

''నాకిట్టం లేదయ్యా. సచ్చినా బతికినా ఇలాగే ఉంటానండి. అంకమ్మగుడి తప్ప నాకేం అక్కర్లేదు బాబు. పతి ఏటా అంకమ్మ జాతరకి నేనుంటే కాని ఏం జరగదండి. ఓపికున్నా లేకపోయినా ఆగరగ నెత్తి నెట్టుకుని కత్తి సేత్తోపట్టుకుని, ఊరాంగం వేత్తా అంకమ్మ తల్లికి కోడి పెట్టుని, మేకపిల్లని బలియ్యకపోతే కాని నాకు తోసదండి, ఈ ఉళ్లో నా మీద అంతనమ్మకం ఉందండి జనాలకి. నేను లేకపోతే ఆ తల్లి కెవరు సేత్తారు బాబు సేవలు'' అని చాలా గర్వంగా చెప్పుకున్నాడా రైతు.

''ఆ అంకమ్మ తల్లికి సేవసేత్తే ఊరు సల్లగా ఉంటదండి. కుర్రకారు పట్టించు కోవటం లేదు బాబు. కిరత్తానీ కూడు తింటూ అంకమ్మకి సేవసేత్తా ఉంటే నాకే బాధ కలుగుతా ఉంటది బాబు'' అంటూ దుఃఖించడా రైతు.

''ఏం చేత్తాం బాబు, మాయా తనలు మేం పడతన్నాం. లేనోళ్ళు కదా అని ఈ దొర సానమ్మలు మాకు ఆశచూపించి మతంలో సేరమని సతాఇత్తారండి. నేనేవనను బాబు మా ఆడకూతురుని'' అని ఎంతో బాధపడ్డాడా రైతు.

''నాకు తెలవకడుగుతాను బాబూ మేం కిరత్తానీ మతం పుచ్చుకుంటే ఈ

దొరసానమ్మలకేం ఒరుగుద్ది బాబు!'' అన్నాడా రైతు.

అనంతం ఒక చిరునవ్వు నవ్వి ఉరుకున్నాడు.

అనంతం ఈ మత మార్పిడులు గూర్చి విన్నాడే కాని ఎప్పుడూ ఇంత ప్రత్యక్షంగా గమనించలేదు.

ఎప్పుడో పోప్‌జాన్‌పాల్ ఇండియా పర్యటించినప్పుడు అర్యవిద్యా గురుకుల అధిపతి స్వామి దయానంద సరస్వతి చెప్పిన మాటలు ఎప్పుడో, ఎక్కడో చదివిట్లు గుర్తుకొచ్చాయి అనంతానికి.

మత మార్పిడులు ఆపు చెయ్యవలసినదిగా పోప్‌జాన్‌పాల్‌ని ఆయన కోరారు.

'పోప్ ఇండియా పర్యాటన మత పరమైన అనధికారమైనదా లేక వాటికన్ సిటీ అధినేతగా అధికారమైనదా' అని భారత ప్రభుత్వాన్ని ప్రశ్నించారు.

'ఏషియన్ బిషప్స్ కాన్ఫరెన్సులో పాల్గొనుటకు ముఖ్యఅతిధిగా వస్తున్న పోప్ పర్యటన భారత ప్రజలని తికమక పరుస్తోం ది. ఆయనను మన దేశానికి ఎంతో గౌరవంతో ఆహ్వానించటానికి నేను సంసిద్ధుడనవుతున్నాను అని చెప్పటానికి సంశయించను.'

'భారత పర్యటనకు ముందుగా ఒక్కసారి మత మార్పిడుల గూర్చి ఆలోచించ వలసింది' అని పోప్‌ను అర్థించారు.

'ఈ మార్పిడులను ఖండించాలి, ఎవరికి వారు తానంతట తానుగా వచ్చి మతం మార్చుకోవటం కల్ల. ఇది బలవంతంగా జరుగుతున్న ప్రక్రియ. దీనిని అక్కడికక్కడే ఖండించాలి' అన్నారు.

'ఈ ఆశా పూరితమైన బలవంత ప్రక్రియల వెనుక అంతర్జాతీయ మత సంస్థల మద్దతు ప్రభావం కనపడుతూంటుంది. ఎన్నో మిషనరీ సంస్థలు ఈ పనిలో మునిగి తేలుతూన్నట్లు' భావించాడు అనంతం.

ముఖ్యంగా క్రైస్తవులు, మహమ్మదీయులు ఈ ప్రక్రియలలో చాలా చాకచాక్యం చూపుతున్నారు.

'ప్రపంచమంతా క్రైస్తవులుగా మారాలి అనుకుని క్రైస్తవమత అధినేతలు, మహమ్మదీయులుగా మారాలి అని ఇస్లామిక్ అధిపతులు ఎంతో ప్రయత్నాలు జరుపుతున్నారు. ప్రస్తుతంలో ఈ మత సమస్యలు, మార్పిడులు చాలా జోరుగా సాగుతున్నందుకు' ఎంతో బాధపడ్డాడు అనంతం.

'ఈ రెండు మతాలు కూడా చాలా ఎగ్రస్సీవ్ మతాలుగా పరిగణించ బడతాయి, అహింస,నుండి హింసాత్మకంగా మార్చే శక్తి ఈ మతాలలో ఎక్కువగా కనపడతుంది. ఈప్రక్రియ ముఖ్యంగా ఈ రెండు మతాలలో కనబడుతూంటుంది. ఇది ఒక క్రిమినల్ యాక్ట్,' అని దుయ్యబట్టారు దయానంద సరస్వతి.

'మతం మార్చుకున్నవారు వారి తల్లితండ్రుల నుండి, వారి పూర్వీకుల నుండి వారి సంస్కృతి నుండి వేరు చేయబడినవారు అవుతారు.' గ్రీస్, రోమ్, అమెరికా ఆదివాసులు, అస్ట్రేలియా అదివాసుల సంస్కృతి ఈనాడు నాశనమవటానికి క్రైస్తవ మత ప్రచారంతో కూడిన మత మార్పిడులేకారణం. హిందూదేశంలో క్రైస్తవులు మహమ్మదీయులు ఎక్కడ నుంచి వచ్చారు అని ప్రశ్నించారు. ఇది సామదాన బేధ దండోపాయములతో మత మార్పిడుల ద్వారా జరిగిన ప్రక్రియ అని అనిపిస్తుంది. మత ప్రచారణ ఎవరూ అడ్డుపెట్టలేరు, నేను దీనిని తప్పుగా భావించి ఖండిస్తున్నాను' అని ఆయన ఎంతో విలపించారు.

'మహమ్మదీయులు అఫ్ఘాన్‌నిస్థాన్ నుంచి కైబర్‌పాస్ ద్వారా ఈ దేశంలో ప్రవేసించి దోచుకుని, సంస్కృతిని నాశనం చేసి బలవంత మత మార్పిడులు చేశారు'.

'ఆంగ్లేయులు రెండు వందలసంవత్సరాలు, మహమ్మదీయులు చేసిన దానికి ఎన్నో రెట్లు మప్పుపెట్టి ఆశలు చూపి అమాయక ప్రజల జీవితాలతో, ఆటలాడుకుని, దేశ సంప్రదాయం, సంస్కృతి మట్టుపెట్టి పీల్చి పిప్పిచేసి, మత మార్పిడులు చేసి దేశ సంపద దోచుకుపోయారు.'

'మిగిలింది నిరాశ నిస్ప్రహా, పేదరికం, నిరక్షరాస్యత, మతమార్పిడులు'.

'గత ఏభైసంవత్సరాలుగా ఈ దేశం తెల్లదొరల బారి నుంచి నల్లదొరల చేతులలో చిక్కుకుంది'

'మహత్ముని పేరు చెప్పుకుని, స్వలాభాపేక్షతో పదవీ కాంక్షలతో ఈ దేశాన్ని

ఏలుతూ వచ్చారు కొందరు మహానుభావులు' అనుకుని ఎంతో లోలోన క్షోభించాడు అనంతం.

అనంతం ఆ రైతుని చూచి ఎంతో బాధపడ్డాడు. అతనిలోని బలహీనతకి, నిస్సహాయతకి చింతించాడు.

తనలోని నిస్సహాయతకి కలవపరడ్డాడు.

'ఇతనొక మహాపురుషుడు, ఒక త్యాగి, నిరహంకారి, ఒక మహాయోగి ! ఈ మహా పురుషులు ఈ దేశంలో తప్ప మారే దేశంలోనూ కనపడరు' అనుకున్నాడు.

ఏమీ చెయ్యలేక జేబులో చెయ్యిపెట్టి చేతి కొచ్చిన డబ్బుతీసి ఆ రైతు చేతిలో పెట్టి, లేచి ఆ రైతుకి నమస్కరించి అక్కడి నుంచి కదిలాడు.

ఆ రైతుకేం చెయ్యాలో తెలియక నోరు వెళ్ళబెట్టుకుని చూస్తూండి పోయాడు.

అనంతం ఆచార్యాల వారి ఇంటికి దారి తీశాడు.

# 14

చినవెంకటాచార్యుల వారి ఇంటి తలుపువేసి ఉంది. ఎత్తయిన అరుగులతో కట్టిన పెంకుటిల్లది. అంత ఎత్తయిన అరుగుల ఇల్లు ఆ ఉళ్ళోలేదు. అనంతానికి అదే గుర్తు.

ఎదురుగా పూజార్ల అరుగుమీద ఎవరో ఇద్దరు పెద్ద మనుష్యులు మాష్టారుతో కబుర్లాడుతూన్నారు.

ఆచారి ఇంటి తలుపుకొట్టాడు అనంతం.

ఒక పదేళ్ళపిల్ల తలుపుతీసింది.

''తాతా! ఎవరో వచ్చారు నీకోసం'' అంది,

''లోపలికి రమ్మనమ్మా'' అని ఒక మూలుగుతూన్న ముసలి కంఠం మాటలు వినపడ్డాయి అనంతానికి.

''మా తాత మిమ్మల్ని లోపలికి రమ్మంటున్నాడు'' అని తలుపు బార్లాతీసిందా పిల్ల.

అనంతం గుమ్మం గడపదాటి వాకిలిలోకి ప్రవేసించాడు. ఇంట్లో చాలా చీకటిగా ఉంది. కిటికీ తలుపులు పూర్తిగా తెరిచి లేవు. ఇల్లుపేడతో అలికిన వాసన స్పష్టమవుతోంది. ఆ వాకిలికిరుప్రక్కల గదులున్నాయి. అవి పడకగదులులా ఉన్నాయి. ఆ వాకిలి వెనుక వంటిల్లు కనబడుతూంది. ఆవంటింటి ద్వారం తెరిచి ఉంది. ఆ ద్వారంలోంచి వైష్ణవాలయప్రాకారం గోపురంతో సహాస్పష్టంగా కనపడుతోంది. ఆ ఇంటి కిటికీలు చాలా చిన్నవిగా ఉండి ఎత్తులో ఉన్నాయి.

''మా తాత ఈ గదిలో పడుకున్నాడు రండి'' అని ఆ పిల్ల ఆ గది చూపించింది.

ఆ గదిలో అడుగుపెట్టాడు అనంతం.

ఒక పట్టి మంచం మీద పడుకుని ఉన్నాడు చిన వెంకటాచారి. ఆప్రక్కనే చిన్న ష్టూలు మీద కూర్చుని విసిని కర్రతో విసురుతున్నారు ఒకామె.

'ఆయన భార్య ఆచారి పిన్ని' అనుకున్నాడు అనంతం.

అనంతాన్ని చూచి ఆమె నుంచుంది.

''మీకోసం ఎవరో అబ్బాయి వచ్చాడు'' అంది ఆమె.

ఒక్కసారి తల ఎత్తి చూచి మళ్ళీ పడుకుని ప్రక్కకి తిరిగి లేవబోయాడు ఆచారి. ఆమె భర్తకి సహాయం చేసి కూర్చోబెట్టింది.

''మీరు పడుకోండి, లేవకండి'' అన్నాడు అనంతం.

''ఫరవాలేదు, నాకే రోగం రూచ్చు లేదు నాయనా'' అలా బద్ధకంగా పడుకుం టూంటాను.

''ఎవరు బాబు నువ్వు'' ప్రశ్నించాడు ఆచారి.

''చిన్నీ! ఆ హాల్లో కూర్చీ ఇలా తీసుకురామ్మా'' అంది ఆమె.

ఆ హాల్లో రెండే రెండు పాతపడిపోయిన చేతి కూర్చీలుంటాయి. ఎవరూ కూడా ఇంట్లో కూర్చుని మాట్లాడుకోరు. సామాన్యంగా ఆడవాళ్ళు దొడ్లల్లో కూర్చుని మాట్లాడు కుంటూంటారు మగవాళ్ళు వీధి అరుగుల మీద కూర్చుని మాట్లాడుకుంటుంటారు.

ఆ పిల్ల మోసుకుంటూ వస్తున్న కూర్చీనందుకున్నాడు అనంతం.

''కూర్చోబాబు'' అందామె.

''మీరూ కూర్చోండి'' అన్నాడు అనంతం.

వారిద్దరూ కూర్చున్నారు.

బామ్మ చేతిలో విసినికర్ర తీసుకుని అందరికీ విసురుతోందా పిల్ల.

''నాకొద్దమ్మా! తాతగారికి విసురు'' అన్నాడు అనంతం.

బామ్మ చేతికి విసినికర్రయిచ్చి, బామ్మ వెనకాలనక్కి అనంతాన్ని చూస్తూంది ఆ పిల్ల.

''నేను బాబాయ్, అనంతాన్ని'' అన్నాడు.

''ముఖం నాకు సరిగా గుర్తురావటం లేదు. చిన్నీ లైటు వెయ్యమ్మ'' అన్నాడు ఆచారి.

చిన్ని లైటువేసింది. ఆ వెలుగులో కొంచెం కళ్ళుచిట్లించి దగ్గిరగా చూచాడు ఆచారి.

''ఎవరు? అనంతం! మా సుబ్బరాముడి కొడుకు? అవునా బాబు'' అన్నాడు ఆచారి.

ఆచారి పిన్ని ఒక్కసారి అనంతం ముఖంలోకి దగ్గిరగా చూచి,'' అవునండి, రాజేశ్వరి కొడుకు అనంతం! ఎప్పుడొచ్చావు బాబు అమెరికానుంచి, క్షేమంగా ఉన్నావా'' అని ఎంతో ఆప్యాయంగా పలకరించిదామె.

''బాబూ! ఇలారా! నా ప్రక్కన కూర్చో'' అన్నాడు ఆచారి బొంగురుపోయిన కంఠంతో. అనంతం ఆచారి మంచం మీద ప్రక్కనే కూర్చున్నాడు. అనంతం తల నిమిరాడు ఆచారి. పట్టలేని దుఃఖం వచ్చింది ఆచార్లుకి. నోట్లోంచి సరిగా మాటలు రాలేదు.

''మీ బాబాయికి ఏం వచ్చినా తట్టుకోలేకపోతున్నారమ్మా! ఈ మధ్యగా ఒంట్లో బావుండటం లేదు'' అందామె.

''చిన్నీ! అమ్మని కాఫీ పెట్టమను బాబాయికి'' అన్నాడు ఆచారి అనంతాన్ని చూచి చిరునవ్వు తెచ్చుకుంటూ.

''అలాగే తాత'' అని చిన్ని ఇంట్లోకి వెళ్ళింది.

''ఒంట్లో బావుండటం లేదురా ఈ మధ్య. ఎక్కడికీ వెళ్ళటం లేదు. ఎవరికీ వైద్యం చెయ్యటం లేదు. కనీసం ఆ మహావిష్ణుకి సేవలు చేసే శక్తి కూడా లేకుండా పోయింది. ఆ అర్చకత్వం మా చిన్నాడు చిన్నికిష్టమ్మ కప్పచెప్పి ఇలా జీవచ్ఛవంలా బతుకుతున్నాను'' అన్నాడు ఆచారి.

''రాముడెక్కడున్నాడు బాబాయ్'' అడిగాడు అనంతం.

రామాచారి, అనంతం చిన్ననాటి స్నేహితులు. కంతేరు సెలవులకి వచ్చినప్పుడల్లా రాముడితో ఆడుకుంటూండేవాడు అనంతం.

రామాచారి, క్రిష్ణమాచారి, చినవెంకటాచారికి కొడుకులు, సీతాలు కూతురు.

''కాకిలేరు రామాలయంలో అర్చకుడుగా ఉన్నాడు. ఉదయం, సాయంకాలం సైకిలు మీదవెళ్ళి వస్తూ ఆ రాముడికి సేవలు చేస్తూంటాడు. ఈ చిన్ని ఎవరనుకున్నావ్‌రా! రాముడి కూతురు. పెద్దకోడలు ఇక్కడే ఉంటుంది. మళ్ళీ అక్కడో సంసారం ఇక్కడో సంసారం ఎందుకు? మాకు కూడా సాయంగా ఉంటుందని రాముణ్ణిక్కడే ఉండమన్నాను. ఇదిగో వాడొచ్చే టైము కూడా అయ్యింది.'' అన్నాడు ఆచారి ఎక్కడలేని ఉత్సాహం తెచ్చుకుంటూ.

పెద్దకోడలు ఒక స్టీల్ గ్లాసుతో కాఫీతెచ్చి అనంతానికిచ్చింది. వెనకాలే ఒక గ్లాసుతో త్రాగటానికి నీళ్ళు తెచ్చింది చిన్ని.

''ఇలా పెట్టుకో అమ్మా'' అని ఆచారి పిన్ని లేచి నుంచుంది.

ఆ స్టూల్ మీద కాఫీ గ్లాసు, మంచి నీళ్ళ గ్లాసు పెట్టి మరో కుర్చీ తెచ్చి అత్తగారిని కూర్చోపెట్టింది కోడలు.

''కాఫీ తీసుకో బాబు'' అన్నాడు ఆచారి. రెండుగుటకలు కాఫీ తీసుకుని స్టూలు మీద పెట్టి అడిగాడు అనంతం.

''బాబాయ్! సీతాలు ఎక్కడుంది''

ఎవరు మాట్లాడలేదు కొద్ది క్షణాలు. ఆచారి పిన్ని తలవంచుకుని నోట్లోగుడ్డ కుక్కుకుంది. ఆచారికి ఒణుకొచ్చింది. ఒణుకుతూన్న చేత్తో అనంతం చెయ్యిపట్టుకుని గట్టిగా నొక్కాడు. నోటమాటలేదు ఆచారికి.

''సీతత్తా, కొత్తమామ చచ్చిపోయారు'' అంది చిన్ని.

''చీన్నీ!'' అని అరిచి, ఒక్కసారి చిన్ని నోరుమూసింది కోడలు.

అనంతం బిగిసిపోయాడు. ఏం మాట్లాడాలో తెలియటంలేదు.

''సీతకి రాజోలులో పెళ్ళి జరిగింది. మేమంతా బస్సు చేసుకొని రాజోలునుంచి కంతేరు బయలు దేరామండి. కొత్తపెళ్ళికూతురు, భర్తకి వేరే టాక్సీ ఏర్పాటు చేశాం. మాబస్సు కంతేరు చేరింది. టాక్సీచేరలేదు. మాకు ఏమయ్యిందో తెలియలేదు బాబూ! సాయంకాలానికి వారి మృతదేహాల్ని కంతేరు చేర్చారు''.

''రావులపాలెం దగ్గిర సీతా వాళ్ళటాక్సీ ఒక లారీని గుద్దుకుందట. ఆ దేహాలు తీసుకొచ్చిన వాళ్లు చెప్పారు'' అంది పెద్దకోడలు అత్తగారి దగ్గిరకు వెళ్ళి నెత్తిన చెయ్యి వేసి నిమురుతూ.

చిన్ని తాత ప్రక్కనే చేరి తాత కళ్ళల్లోకి చూస్తూంది.

ఆచారి చూపుడువేలు తన నుదిటిమీద రాసుకుంటూ 'తలరాత' అన్నట్లు సాంజ్ఞ చేస్తూ తలవంచుకుని దుఃఖించటం ప్రారంభించాడు.

అనంతం వారందరినీ చూచి దుఃఖం ఆపుకోలేక పోయాడు.

ఎప్పుడూ అనంతానికి అంత దుఃఖం రాలేదు.

ఆపు చేసుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాడు కాని తనవల్ల కావటంలేదు.

జేబులోంచి రుమాలు తీసుకుని ముఖం తుడుచుకున్నాడు.

''అన్నయ్యగారు బాధపడుతున్నారు, అత్తయ్యగారూ! మీరు ఉరుకోండి'' అని సముదాయించింది అత్త మామలను ఆకోడలు.

కొంతసేపు ఎవరు మాట్లాడలేదు.

చిన్ని అందరి కళ్ళల్లోకి చూస్తూ కూర్చుంది.

అనంతానికి తన చిన్నతనంలో సంగతులెన్నెన్నో గుర్తుకొస్తున్నాయి.

''అమ్మ, నాన్నని తలుచుకుని నువ్వెంత బాధపడుతున్నావో మాకు తెలుసు బాబు'' అంది ఆచారి పిన్ని.

''నీ పరిస్థితి నేను అర్థం చేసుకున్నానురా!'' ఏం చేస్తాం ఆ పరమాత్ముడి చేతివ్రాత ఎవరు తప్పించలేరు.

''ఎప్పుడొచ్చావు బాబు అమెరికానుంచి, ఇంకా కొన్నాళ్ళుంటావా'' అడిగాడు ఆచారి కాస్త తేరుకుని.

''రెండు రోజులయ్యింది బాబాయ్'' అన్నాడు అనంతం.

''ఒకసారి అమ్మని చూచి రామ్మా'' అన్నాడు ఆచారి బొంగురుపోయిన కంఠంతో.

అనంతం తలవంచుకుని కూర్చున్నాడు.

''కాఫీ చల్లారిపోయింది వెచ్చబెట్టి తీసుకురామ్మా'' అంది ఆచారి పిన్ని కోడలు నుద్దేశించి''.

''ఒద్దమ్మా'' అని అక్కడున్నమంచి నీళ్ళు త్రాగాడు అనంతం.

ఎవరో తలుపుకొట్టారు.

''చిన్నీ! తలుపుతియ్యమ్మా'' అన్నాడు ఆచారి.

పరుగెత్తుకుని వెళ్ళి తలుపుతీసి ''నాన్నొచ్చాడు తాతా'' అంది.

''ఇలారమ్మను'' అంది ఆచారి పిన్ని.

రాముడు లోపలిగదిలోకి వచ్చాడు.

రాముడు, అనంతం ఒకరినొకరు చూచుకున్నారు. ''రాముడు!'' అన్నాడు అనంతం.

''మీరు!... మీరు!...'' అన్నాడు రాముడు.

''అనంతంరా! సుబ్బరామయ్యబాబాయ్ కొడుకు'' అంది ఆచారి పిన్ని.

''ఓరినీ, నువ్వా! ఎంత మారిపోయావురా'' అని ఎంతో ఆప్యాయంగా అనంతం చేతులు పట్టుకున్నాడు రాముడు.

వైష్ణవాలయంలో గంటలు గణ గణ మ్రోగాయి.

''బాబూ! అనంతాన్ని ఒకసారి గుళ్ళోకి తీసుకెళ్ళి దైవ దర్శనం చేయించరా!'' అన్నాడు ఆచారి.

రాముడు బొడ్డులోని పెద్దతాళం తీసి భార్యచేతిలో పెట్టి అనంతాన్ని తీసుకుని బయలుదేరాడు.

ఒకసారి రాముణ్ణి వెనక్కి పిలిచి చెవులో ఏదో చెప్పాడు ఆచారి.

''సరే అలాగే'' అని అనంతాన్ని తీసుకుని పెరట్లో ఉన్న ఆలయానికి వెళ్ళాడు.

''ఒరేయ్ చిన్ని కిష్టమ్మా! మనసుబ్బరామయ్య బాబాయ్ అబ్బాయ్ అనంతం వచ్చాడురా అమెరికా నుంచి'' అని అనంతాన్ని చూపించాడు రాముడు.

చిన్నికిష్టమ్మ అనంతాన్ని చూచి ఆశ్చర్యంగా ''ఎప్పుడో చూశాను చిన్నప్పుడు''అని నమస్కారం చేశాడు అనంతానికి.

ప్రతినమస్కారం చేశాడు అనంతం.

''ప్రదక్షిణాలు చేసిరా'' అన్నాడు చిన్నికిష్టమ్మ

గుడి చుట్టూ ప్రదక్షిణాలు చేశాడు అనంతం.

రాముడు చిన్నికిష్టమ్మ చెవిలో ఏదో చెప్పి ''అర్చనచేయించు'' అన్నాడు.

ప్రదక్షిణాలు చేసి వచ్చి అనంతం కళ్ళుమూసుకుని ఆది విష్ణుకి నమస్కారం చేసి గంటలు వాయించాడు మూడుసార్లు.

వెంటనే చిన్నికిష్టమ్మ రాజేశ్వరమ్మగారి పేర గట్టిగా మంత్రాలు చెప్పి అర్చన చేయించి హారతి అందించాడు అనంతానికి.

హారతి కళ్ళకద్దుకుని, కొన్ని రూపాయల నోట్లు జేబులోంచి తీసి పళ్ళెంలో

వేసి ''రాజేశ్వరమ్మగారిపేర అర్చన చేయించావా బాబూ! నేను నీకెంతో కృతజ్ఞత తెలుపు కుంటున్నాను. మా అమ్మపేరు, నక్షత్రంతో సహా నీకు జ్ఞాపకం ఉన్నాయి. నేను మీ అందరికీ ఎంతో ఋణపడి ఉన్నాను. నాకు వయస్సు వచ్చాక ఇంతమంచి మనస్సు కలవారిని ఇప్పుడిప్పుడే చూస్తున్నాను. ఇది నా అదృష్టంగా భావిస్తున్నాను''. అని ఏవేవో మాట్లాడుతున్నాడు అనంతం.

''కిష్టీ గుడికి తాళం పెట్టి వెళ్ళు టైమయ్యింది. నేనూ అనంతం కాస్సేపు అలా తిరిగివస్తాం. నాన్నతో చెప్పు ఇప్పుడే వస్తామని'' అని అనంతాన్ని తీసుకుని అలా చెరువు గట్టుదగ్గిరకి చేరుకున్నాడు

ఆరేవు గట్టుమీదున్న రాళ్ళమీద కూర్చున్నారిద్దరు.

ఎన్నెన్నో కబుర్లు, చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుని నవ్వుకున్నారు.

కొంతసేపు వారిద్దరూ మాట్లాడుకోలేదు.

చెరువుకేసి చూస్తూ కుర్చున్నాడు అనంతం.

'మానాన్న ఎలా పోయాడు, ఎన్నాళ్ళు మంచం మీదున్నాడు, ఏం జబ్బుచేసి పోయాడు, మా అమ్మ ఎక్కడుంది' అని ఎన్నెన్నో ప్రశ్నలు వేధిస్తున్నాయి అనంతాన్ని.

'ఏమని అడుగుతాను ఈ ప్రశ్నలు. అడిగితే ఎంత అసహ్యంగా ఉంటుంది. ఆచారి బాబాయ్, ఆచారిపిన్నిని, రాముడిని ఈ ప్రశ్నలు అడిగి తెలుసుకునే ధైర్యం, సాహసం నాకు లేదు' అని ఎంతో బాధపడ్డాడు అనంతం.

రాముడు అనంతం మౌనం అర్థం చేసుకున్నాడు.

''బాబాయ్ ఎలాపోయాడు, రాజ్యంపిన్ని ఎక్కడుంది చెప్పాడా నాన్న ''అడిగాడు రాముడు.

''రాముడూ! నేనడగలేదురా! ఏమని అడుగుతాను'' అని తలదించుకుని ఊరుకున్నాడు.

రాముడు మాట్లాడలేదు.

''ఓరి దరిద్రుడా నాన్న ఎప్పుడు, ఎలా, ఎక్కడ, ఏంజబ్బొచ్చి పోయాడో కూడా నీకు తెలియదు. అమ్మ ఎక్కడుందో ఏం చేస్తోందో, ఎలా బ్రతుకుతోందో అని ఆలోచనే లేదు నీకు. నువ్వు ఒక పశువా! మనిషివా! అని ఆచారి బాబాయి, నన్ను చూచి అనుకునే ఉంటాడు. నాకు భయం వేసింది బాబాయ్‌ని చూడగానే. ఎంత గొప్పమనిషిరా! మీ నాన్న, నువ్వు చాలా అదృష్టవంతుడివిరా. మీరంతా ఎంతో తృప్తితో హాయిగా బ్రతుకుతున్నారు. ఎన్నికష్టాలొచ్చినా ఓర్చుకుని అలా తామరాకు మీద నీటి బొట్టులాగ జీవితం గడుపుతున్నారు. ఎక్కడో లేడు దేవుడు, మీ నాన్నలో దేవుణ్ణి చూశానీనాడు. మీనాన్న, అమ్మలలో మహావిష్ణు, లక్ష్మీదేవిలను చూశానురా! ఈ రోజు''.

''నాకు మాటలు రావటం లేదురా నా మనస్సులో ఉన్న ప్రశ్నలకు నువ్వే సమాధా నం చెప్పరా. నాన్నను మళ్ళీ ఆ ప్రపంచంలోకి తీసుకుని వెళ్లి బాధ పెట్టతలుచుకోలేదు. నాన్నని చూస్తే నేను దుఃఖం పట్టలేకపోయాను. గట్టిగా అరిచి జుట్టు పీక్కుని ఏడుద్దామనిపించింది''.

''రాముడు!.... సీతాలు....'' అని నోట మాటరాక పట్టలేక ఏడ్చాడు అనంతం.

కాస్సేపు ఇద్దరూ మాట్లాడుకోలేదు.

''బాబాయ్, పిన్ని ఎంత కుమిలిపోతున్నారో. నేను ఏమని అడుగుతానురా మా నాన్న అమ్మగురించి. ఏ మొహం పెట్టుకుని అడుగుతాను. నా ప్రవర్తనకి నేనే సిగ్గుపడు తున్నాను. నా అసహాయతకి నేనే బాధపడుతున్నాను, నా ఖర్మకు నేనే బాధ్యుణ్ణి''.

''నేను అమ్మ, నాన్న గురించి అడగాలనే వచ్చాను. అడగలేకపోయాను'' అని కుళ్ళికుళ్ళి ఏడ్చాడు అనంతం.

రాముడు ఎంతో ప్రయత్నం చేశాడు ఓదారుద్దామని. అనంతం ఆగలేదు. ఏదేదో మాట్లాడుతున్నాడు, హిస్టీరియా వచ్చినవాడిలా ఒణుకుతూ. రాముడు అనంతం భుజాలు పట్టుకుని ''నువ్వు ముందు ఊరుకో, నేను చెప్పేదివిను'' అని సముదాయించాడు.

కాస్సేపు ఇద్దరి మధ్య నిశ్శబ్దం ఆవహించింది.

''ఒరేయ్ అనంతం! అటుచూడు అలా వెడుతున్నాడు ఒకతను, నీకు జ్ఞాపకం ఉన్నాడురా అతను'' అడిగాడు రాముడు.

మోహం తుడుచుకుని అతనికేసి చూచాడు. 'ఎవర్రా అతను అడిగాడు' అనంతం.

''సర్రయ్యరా! కోమటి సర్రయ్య, జ్ఞాపకం లేడూ ''

''ఆ... ఆ... జ్ఞాపకం వచ్చాడు'' అని ఒకసారి నవ్వాడు అనంతం.

''అట్లతద్దినాడు రాత్రి మనిద్దరం వాడి కొట్టుతాళంలో రేగడి మన్నుకుక్కాం'' అని పగలబడి నవ్వాడు అనంతం.

''ఆ మర్నాడు మా నాన్న నిన్ను నన్ను పట్టుకు వాయించాడు. మేమే ఆపని చేశాం అని గొప్పగా చెబితే!'' అని పగలబడ్డాడు రాముడు.

''పాపం మర్నాడు కొట్టుతియ్యటానికి తలుపురాక, తిప్పలుపడి చివరికి రంపం తీసుకుని ఒకగంటసేపూ కోశాడు తాళాన్ని'' అని చెప్పుకుని నవ్వుకున్నారు.

''ఎలా ఉన్నాడురా సర్రయ్య, ఇప్పుడెలా ఉంది వ్యాపారం''అడిగాడు అనంతం.

''ఏం వ్యాపారమో, ఎవ్వరూ వాడి దగ్గిర సరుకు కొనటంలేదురా. బస్సులడ్డాక పెనుగొండ, తణుకు వెళ్ళి సరుకులు తెచ్చుకుంటున్నారు, మాలగూడెంలో రెండుమూడు కొట్లు వెలిశాయి''అన్నాడు రాముడు.

''చిన్నతనం, పెద్దతనం అనిలేదు ఏవయస్సుకావయస్సే ఏదో చేస్తూంటాం. తరువాత చేసినదానిని తలుచుకుని బాధపడటమో! సంతోషించడమో! జరుగుతూంటుంది. చిన్నతనంలో చేసిన పనులను తలుచుకుని ఎంతో సరదాగా చెప్పుకుంటూంటాము ఒక్కోసారి. ఆపని మంచి పనికాదని తెలిసి కూడా.''

''ఆదే మాదిరిగా కొంతవయస్సు వచ్చినతరువాత కూడా కొన్ని పనులు తెలిసో తెలియకో కొంత స్వలాభాపేక్షతో సంకుచిత బావాలతో చేస్తూంటాము. కొంతకాలం

తరువాత మనం చేసిన పనులు తలుచుకుని బాధపడడమో, సంతోషించడమో జరుగుతూంటుంది. ఇది మానవ సహజం. చిన్నతనం, పెద్దతనం, ముసలితనంతో పనిలేదు. ఎల్లప్పుడూ మానవుడు తప్పులు చేస్తూంటాడు అవి సర్దటానికి ప్రయత్నిస్తూంటా డు.''

''తప్పొప్పుల పట్టీకకి ఒక అర్థం పర్థం ఉండదు. ఏదో ఒక పని పరిస్థితుల ప్రభావంలో చెయ్యవలసి వస్తుంది. ఆ పని కొన్ని చిక్కులకు దారి తీయవచ్చు. ఆ చిక్కులు సరి చేసుకుంటూ మిగిలిన జీవితాన్ని గడుపుతుంటాము. ప్రతిజీవి ఇలాగే గడుపుతుంటాడు.''

''అడుసు త్రొక్కనేల! కాలుకడుగనేల! అన్నారు పెద్దలు. ఒక్కొక్కసారి మనకు తెలియకుండానే అడుసులో కాలువేస్తాం. ఆకాలుకడుగుకునే పరిస్థితి కూడా ఉండక ఆ అడుసు ఎండిపోవడమో, ఎండి ఊడిపోవడమో జరిగి అడుసులో కాలు వేశామని కూడా మరిచిపోయే పరిస్థితి ఏర్పడుతూంటుంది.''

''కొందరు అడుసు తప్పించుకుపోయి వారనుకున్న గమ్యంచేరి సుఖశాంతిలు పొందటానికి ప్రయత్నిసారు''.

''ఏది గమ్యమో తెలియక అగమ్యగోచరంలోపడి మనం ఏర్పరచుకున్న చిక్కులు సరిచేసుకోలేక, పాకుకుంటూ, కుంటుకుంటూ, చచ్చీ చావకుండా బ్రతుకుతూ కాలక్షేపం చేసి చరిత్రహీనులమై నశించిపోతాం'' అని తలదించుకున్నాడు అనంతం.

అనంతం గెడ్డం పట్టుకుని తలఎత్తి చిరునవ్వు నవ్వి బుగ్గమీద చిన్నగా తట్టాడు రాముడు.

కాస్సేపు ఇద్దరి మధ్య మౌనం అలుముకుంది.

చెప్పటం ప్రారంభించాడు రాముడు.

''ఎక్కువగా బయటికి రావటం, తిరగటం మానేశాడు సుబ్బరామయ్య బాబాయ్.''

''మానాన్న తణుకు వెళ్ళినప్పుడల్లా బాబాయ్‌ని, రాజ్యం పిన్నిని చూచి వచ్చేవాడు. మనిషిలో ఆ ఉత్సాహం లేదు. సంగీత సభలుకి వెళ్ళడం మానేశాడు''.

''స్కూలుకి వెళ్ళడం, ఇంటికి రావటం ఎక్కడికీ వెళ్ళక పోవటం, పిన్నికూడా బయటికి వెళ్ళేదికాదు''.

''ఎంతసేపూ ఒక్క నాన్నతోనే చెప్పుకునేవారు ఏం చెప్పుకున్నా. వారి మనస్సులో ఎంతసేపూ నువ్వేకదులుతూండే వాడివి అని మా నాన్న చెబుతూండేవాడు'' అంటూ చెప్పుకుపోతున్నాడు రాముడు.

''ఒకసారి రక్తపుపోటు ఎక్కువగా వచ్చిందని బాబాయిని సత్యం డాక్టరుగారి ఆసుపత్రిలో చేర్చారు. ఆయన రెండు రోజులు ఆసుపత్రిలో అట్టేపెట్టుకుని ఇంటికి పంపి బెడ్‌రెస్ట్ కావాలి అని చెప్పాడుట''

''అప్పుడు నెలాళ్ళు సెలవు పెట్టి పడుకున్నాడు. మా నాన్న వచ్చి ఒకటే చెప్పటం రాజ్యం పిన్ని బాబాయికి చేసే సేవలు గురించి.''

''ఆ తరువాత ఒక్కసారి మాత్రం కంతేరు వచ్చాడు బాబాయ్ ఆ రెండెకరాలు బేరం ఇవ్వటానికి. మంచి బేరమే వచ్చింది. కాని ఏం లాభం మొత్తం అప్పులకి, ఆసుపత్రులకు, డాక్టర్లకి, హారతి కర్పూరంలా కరిగిపోయింది'' అన్నాడు రాముడు. చాలా తాపీగా

అనంతం అయోమయంలో పడి తలవంచుకున్నాడు.

''భూమి అమ్మినందుకు బాధపడలేదు బాబాయ్, రాజ్యం పిన్నికి ఉన్న అకాసిని నగలు అమ్మినందుకు చాలా బాధపడ్డాడని నాన్న చెప్పాడు'' అన్నాడు రాముడు.

ఒక్కసారి ఛెళ్ళున కొట్టినట్లయ్యింది అనంతానికి. ఒక్కసారి ఆకాశంకేసి చూచి ఊపిరి పీల్చుకున్నాడు.

ఆగలేదు, రాముడు చెబుతూనే ఉన్నాడు. ''మళ్ళీ కోలుకోలేదు నాన్న. గుండె పోటు రోజురోజుకి ఎక్కువయ్యింది. సత్యం డాక్టరుగారు ఏమీ చెయ్యలేని పరిస్థితి వచ్చి చివరికి పెదిమలు విరిచారు'' అని బాధపడుతూ చెప్పాడు రాముడు.

''ఎంతసేపూ నిన్ను తలుచుకుని దుఃఖిస్తూండేవాడు రా బాబాయ్. రాజ్యం పిన్నికి ఎంతో ధైర్యం రా! సముదాయిస్తూ కూర్చునేది బాబాయ్‌నీ. చివరికి బాబాయ్ పోయిన రోజు ఒళ్ళు తెలియకుండా పడుంది. సత్యం డాక్టరు గారు నిద్రకి ఇంజెక్షను కూడా ఇచ్చివెళ్ళారు. బాబాయి పోయి అలాపడున్నాడు. రాజ్యంపిన్ని గాఢనిద్రలోకి పోయింది. నాన్న ఒకటే చెప్పి ఏడ్చాడు. మొత్తం అంత్యక్రియలన్నీ నాన్న చేశాడు. మళ్ళీ ఇంటికి వెళ్ళి పిన్నిని ఏం చెయ్యాలో తెలియలేదు నాన్నకు''.

''బండి చేసుకుని ఇక్కడికి తెచ్చి మా ఇంట్లో ఉంచాం చాలా రోజులు''.

''నాన్న చెయ్యగలిగిన వైద్యం చేశాడు. పెనుగొండ నుంచి ఎలోపతి డాక్టరు గారిని తీసుకొచ్చి చూపించాడు''.

''ఈమె కోమాలోకి వెళ్ళింది చెప్పలేము. ఎప్పుడు తెలివివచ్చి మన మనుష్యులలోకి వస్తుందో. ఇలా ఎంతకాలమైనా బ్రతుకుతారు, లేక ఏమయినా అవచ్చు. పెద్ద పెద్ద డాక్టర్లకి చూపించినా ప్రయోజనం లేదు. కావాలంటే తణుకు తీసుకెళ్ళి తలకి స్కాన్ చేయించండి'' అని చెప్పాడు.

''నాన్న పిన్నిని తణుకు తీసుకువెళ్ళి చూపించాడు, వాళ్ళు స్కాన్ చేసి అదే చెప్పారు''.

''ఈ లోగా సీతాలు పోవటం. మా నాన్న, అమ్మ పిన్నికి చాకీరీ చెయ్యలేని పరిస్థితి రావటం జరిగింది. చూస్తూ, చూస్తూండగా అన్నీ ఈ రెండు మూడు నెలలలో జరిగాయి. నేను రాజ్యం పిన్నిని తణుకు తీసుకువెళ్ళి భారతిగారు పెట్టిన హోంలో చేర్చి వచ్చాను. వారానికి ఒకసారి చూచి వస్తూంటాను'' అని చెప్పి ''లే! లే! చీకటి పడుతోంది. ఇంటికి పోదాం'' అన్నాడు రాముడు.

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

'రాముడు! నన్ను ఒక్కసారి కూడా అడగలేదు, ఇంతసేపూ మాట్లాడుకున్నా. ఏమిరా అనంతం! నువ్వు బాబాయ్‌కి ఒక్క ఉత్తరం కూడా రాయకుండా ఎలా ఉన్నావురా ఇన్నాళ్ళు. అసలు ఏం జరిగింది. ఏం చేస్తున్నావు అమెరికాలో. నీలో ఎందుకింత మార్పు వచ్చింది' అని అడగలేదనుకున్నాడు అనంతం. తాను చెప్పలేకపోయాడు.

ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

''ఏమీరా! ఇంత ఆలస్యం చేశారు. ఇవాళ్టికి ఇక్కడే ఉండుబాబు''అని బ్రతిమాలాడు ఆచారి అనంతాన్ని.

''బాబాయ్ మళ్ళీ వస్తాను. రేపు చాలా పనుంది వెళ్ళిపోతాను'' అని రాముడు ఇచ్చిన భారతి అనాథ వృద్ధుల ఆశ్రమం అడ్రసు తీసుకుని తొమ్మిది గంటల బస్సుకి తణుకు బయలు దేరాడు అనంతం.

''బాబూ అనంతం ఒక్కక్షణం ఉండు'' అని ఆచారి రాముణ్ణి పిలిచాడు.

''ఒరేయ్! రాముడు ఆ గూట్లో ఉన్న కవర్లు అనంతానికియ్యి'' అని ఒక్కసారి మంచం మీద వాలి ఉపిరి పీల్చుకున్నాడు ఆచారి బాబాయ్.

ఆకవరు జేబులో పెట్టుకున్నాడు అనంతం. ఆకవరులో ఏముందో తెలియదు. బాబాయ్ తనకి ఆ కవరు ఎందుకిచ్చాడో తెలియదు.

''ఇందులో ఏముంది బాబాయ్'' అడిగాడు అనంతం.

''ఇంటికి వెళ్ళి చూచుకో! జాగ్రత్త, పారేసుకుంటావేమో'' అన్నాడు ఆచారి.

అనంతం అందరి వద్ద సెలవు తీసుకుని బయలుదేరాడు.

అనంతంతో కూడా రోడ్డుమీదకు వెళ్ళాడు రాముడు.

ఒక్కసారి ఆగి రాముడి చేతులు పట్టుకున్నాడు అనంతం.

''ఏమిరా! ఏమయ్యింది'' అన్నాడు రాముడు.

''నువ్వు నాకు ఒక్క ప్రామిస్ చెయ్యాలిరా'' అన్నాడు.

''ఏమిటి, ఏమయ్యింది'' అన్నాడు రాముడు.

''నేను అమెరికానుంచి వచ్చినట్లుగాని, నా ఉనికిగాని ఆ భారతీ హోం వారికి చెప్పకు'' అని అర్థించాడు అనంతం.

''సరే అలాగే చేస్తాను. నువ్వు చెప్పినట్లే చేస్తాను'' అని హామీ ఇచ్చాడు

ఎందుకు ఇంత ప్రామిస్ చేయించు కుంటున్నాడో అర్థం కాలేదు

మళ్ళీ 'రాముడు' అని పిలిచి కాస్సేపు మాట్లాడలేదు అనంతం.

''ఏమీరా! ఏమిటో చెప్పు. ఏమీ సందేహించకుండా చెప్పు''

''రాముడు! కొంతకాలంగా నాలోని ఆత్మవిశ్వాసాన్ని కొలుపోతున్నాను. నాకు నీ సహాయం కోరక తప్పటం లేదు. ఆ భారతి గారి హోంలోకి నన్నురానిస్తారా! అని అపనమ్మకంతో ఉన్నాను. నాపేరు, నావునికి తెలియచెయ్యదలుచుకోలేదు. అందుకని నన్ను రానియ్యరని భావిస్తున్నాను'' అన్నాడు అనంతం.

''నువ్వు ఏం చెప్పదలుచుకున్నావో, అసలు నీ ఉద్ధేశ్యం మేమిటో ఎందుకు ఇంత గుప్తంగా ఉండదలుచుకున్నవో నాకేం బోధపడటం లేదురా అనంతం. నేను నిన్ను ఇంతగా అడిగి బాధపెట్టదలుచుకోలేదు, నువ్వు చెప్పు నన్నేం చెయ్యమంటావో. పోనీ! నేను నిన్ను నాతోకూడా ఆశ్రమానికి తీసుకుని వెళ్ళమన్నావా? నీ ఉనికి చెప్పకుండా ఆమెతో నేను మాట్లాడతాను. నువ్వు పిన్నిని చూడవచ్చు'' అన్నాడు రాముడు.

ఎక్కడలేని సంతోషం వచ్చింది అనంతానికి.

''నీ కోసం హోటలు రూంలో, అదేవేల్పూరు రోడ్డు జంక్షన్‌లో ఉన్న టూరిష్టు హోటల్ రూం నెంబరు పదిలో రేపు ఉదయం కాచుకుని ఉంటాను. అంతకన్న నేను ప్రాథేయ పడేది ఏమీ లేదురా!'' అన్నాడు అనంతం.

''సరే! ఉదయం పదకొండు గంటలకు చేరుతాను'' అని ఒక చిరునవ్వు నవ్వాడు రాముడు.

బస్సుస్టాండ్‌కి వెడుతూ చూచాడు అనంతం ఒకసారి తన ఇంటికేసి. ఆ రైతు ఆ అరుగుమీద పడి ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు.

లాష్టు బస్సులో తణుకు చేరుకుని హోటలు రూంకి నడిచాడు, 'రేపు ఉదయం అమ్మని చూస్తాను' అనుకుంటూ.

# 15

రాముడు కాకిలేరు నుంచి సైకిలు తొక్కుకుంటూ తణుకులో అనంతం ఉన్న హోటలు రూంకి చేరుకున్నాడు.

రాముణ్ణి చూడగానే ఎక్కడలేని సంతోషం ముంచుకొచ్చింది అనంతంలో. ఎప్పుడోపోయిన ఆత్మవిశ్వాసం తలఎత్తింది.

''రాముడు! నన్ను భారతి గారి ఆశ్రమానికి తీసుకెడతావని నిన్ను రమ్మని అర్థించానురా! నీకు చాలా శ్రమకలిగించాను. కాకిలేరు నుంచి సైకిలు తొక్కుకుంటా వస్తావని నాకు తెలుసు. ఈ ప్రపంచంలో నాకెవరూ లేరని అనుకుంటూ అమెరికానుంచి ఇండియాకి వచ్చాను. ఇక్కడంతా నా వాళ్ళే, అంతా నా ఆత్మీయులే అని గ్రహించాను. ఇంతకన్న గొప్పదేశం ఉంటుందిరా ఈ ప్రపంచంలో''.

''ఎంత గొప్పమనుషులున్నారురా ఈ దేశంలో!'' అంటూవాపోయాడు.

కళ్ళు చమర్చాయి రాముణ్ణి చూడగానే.

''ఇందులో ఏముందిరా అనంతం. నాకు మరోదేశం గురించి తెలియదురా. నే నొక నూతిలో కప్ప జీవితం గడుపుతూన్నానని నాకు తెలుసు'' అని మడి బట్టలతో ఉన్న ఆ పసుపుపచ్చ సంచీ, ఓ మూల పెట్టి హాయిగా కాళ్ళు చాచుకుని అనంతం పక్కమీద వెల్లికిలాపడుకున్నాడు.

''ఆహా! ఏమి హాయిగా వుందిరా ఇక్కడ. ఏ.సి. రూం కదా ఇది. ఏం సుఖంగా ఉందిరా''.

''రాముడు! నువ్వేమయినా తింటావా? ఇడ్లీ, వడా, వగైరా, కాఫీ కూడా

తెప్పిస్తాను'' అని బెల్ నొక్కాడు అనంతం. ఒక కుర్రవాడు రూంలో ప్రత్యక్షమయ్యాడు. ఏవేవో ఆర్డర్ చేశాడు.

''నువ్వేది తెప్పించినా హాయిగా మనస్ఫూర్తిగా సేవిస్తానురా. ఆ శ్రీరామచంద్రుడి సేవపూర్తిచేసిన తరువాత కాని నేను ఏదీ ముట్టుకోను. నాన్న నాకు ఆ వార్షీకం అప్పచెప్పినప్పటి నుంచి ఏరోజు తప్పకుండా పాటిస్తూ వస్తున్నాను. అది అయిన వెంటనే కంతేరు చేరుకుని ఇంట్లో కాఫీ తాగవలసిందే. ఇక్కడికి రాగానే కొంచెం నక నకలాడుతోంది'' అన్నాడు రాముడు ఆవలిస్తూ.

''ఉదయం నాలుగు గంటలకి కాకిలేరు సైకిలు మీద వెళ్ళి అక్కడ రామాలయంలో సేవలు ముగించుకుని మళ్ళీ కంతేరు చేరుకునే సరికి పదిగంటలవుతుంది. అప్పుడు కొంచెం రాత్రి మిగిలిన అన్నం తిని కాఫీ త్రాగటం ఒక అలవాటయిపోయిందిరా''.

''ఇంక నిద్రముంచుకొస్తుంది. ఒక్కరెండు గంటలు నిద్రపోయి మళ్ళీలేచి కార్యక్రమాలు మొదలుపెడతాను. నాన్న అప్పటికే భోజనం నిద్ర అన్నీ ముగించుకుని ఏదేదో చెబుతుంటాడు.''

''శ్రీరామనవమి రోజుల్లో చాలా హడావిడిగా ఉంటుంది. ఏదో నాలుగురాళ్ళు నిలవవేసుకునే రోజులవి. శ్రీ రామచంద్రునికి దయ కలిగితే మనకు సుఖశాంతులు ప్రాప్తిస్తాయి. మిగిలిన రోజుల్లో పురాణకాలక్షేపాలు జరుగుతుంటాయి. నేను కూడా అప్పుడప్పుడు భగవద్గీత పారాయణం చేస్తూంటాను మా ఆలయంలో. నాన్నదగ్గరే నేర్చుకున్నాను. రోజులుగడిచిపోతున్నాయిరా జీవితమంతా ఇలాగే గడిచిపోతే చాలు.''

''చిన్నిని కాలేజికి పంపించి చదివించాలని ఉంటుంది. దానికింకా అంత వయస్సు రాలేదనుకో, ఏది ఏమయినా అంతా ఆ శ్రీరామచంద్రుడి దయా దాక్షిణ్యాల మీద ఉంది. నాకు ఆ గుడి తప్ప మరేమీ అక్కర్లేదు. ఈ తిరుగుడితో నా పని అయిపోతోంది. ఏదో ఇలాగే గడుస్తూంటాయి మా జీవితాలు.''

''అమెరికాలో ఉన్నవారికి ఇదంతా అదో పెర్రి మొర్రిగా ఉంటుంది కదురా'' అన్నాడు అనంతం కేసి చూచి.

''నేను జూలో జంతువులా కనపడుతున్నాను కదూ'' అని ఒక్కసారి నవ్వాడు అనంతం.

''అదికాదురా! నా ఉద్దేశ్యం, మీరంతా పెట్టి పుట్టారు. మేం అంతటి సుఖజీవితానికి నోచుకోలేదు'' అన్నాడు రాముడు.

''లేదురా రాముడు! సుఖం అన్నది ఎక్కడుంది? సంపదలో ఉందా! వస్తు సేకరణలో ఉందా! ఎక్కడుందిరా సుఖం! శాంతి! నిర్మలమైన మనస్సులో ఉంది. విశాలమయిన హృదయంలో ఉంది. అంత విశాలమయిన హృదయానికి చోటెక్కడుందిరా ఈ ప్రపంచంలో'' అన్నాడు అనంతం.

ఇంతలో ఆ కుర్రాడు ప్లేటునిండా ఇడ్లీ, వడా, పొంగల్, సాంబారు వగైరాలతో వచ్చి టేబిల్ మీద పెట్టి, ప్లాస్కులో ఉన్న కాఫీ నందించి వెళ్ళాడు.

''నేను వీటన్నింటికీ నా పొట్టలో చోటు చూపిస్తా'' అని ఒకసారి ప్లేటు మీదకు దుకాడు రాముడు.

అనంతం ఎంతో హాయిగా నవ్వుకున్నాడు. మధ్యలో ఒక్కసారి అనంతం కేసి చూచి ''మరి నువ్వో'' అన్నాడు రాముడు.

''నేను నీతో కాఫీ సాయం పడతా'' అన్నాడు అనంతం.

ఇద్దరూ ఒక్కసారి నవ్వుకున్నారు.

కాస్త స్థిమితపడి తాపీగా అన్నాడు రాముడు.

''అప్పుడే పిన్నిని చూచి పదిరోజులు దాటిందిరా. నాన్నతో చెప్పాను ఇవ్వాళ ఆలస్యంగా వస్తాను, ఒక్కసారి పిన్నిని చూచి వస్తాను అని కూడా చెప్పాను. అందుకని నాన్న నాకోసం ఎదురుచూడడు''.

''ఇంక మనం కదుల్దామా! ఎందుకయినా మంచిది ఒకసారి హోమ్‌కి ఫోన్ చేసి కనుక్కుందాం భారతి గారు ఉళ్ళో ఉన్నారా అని. ఎప్పుడూ చాలా చోట్ల తిరుగుతూంటా రామె''.

ఒక్కసారి గతుక్కుమన్నాడు అనంతం.

''పోనీ చెయ్యి, ఫోను నెంబరు తెలుసా'' అడిగాడు అనంతం.

''నాకు ఆ నెంబరు కంఠో పాఠం!'' అన్నాడు రాముడు.

అనంతం ఏమీ మాట్లాడలేదు

నెంబరు డయల్ చేశాడు రాముడు.

''హల్లో! నేను రాముణ్ణి, నమస్కారం అండీ, అంతా బావున్నారా! మా పిన్ని ఎలా ఉంది?.......... సంతోషం'' ఇంకా ఏమిటేమిటో మాట్లాడుతున్నాడు.

అనంతం మనస్సు మనస్సులో లేదు. భారతిగారితో మాట్లాడుతున్నాడు రాముడు. బహూశా ఆవిడ ఊళ్ళో ఉందేమో అనుకుని ఏదో తెలియని భయంలో పడ్డాడు.

ఏదో భరింపరాని తప్పుచేసిన వాడిలా బాధపడసాగాడు.

''బుచ్చిబాబుగారు! ఒక చిన్న మనవి. నేను, నా స్నేహితుణ్ణి కూడా వెంటబెట్టుకుని వస్తున్నాను మా పిన్నిని చూడటానికి, మీకేం అభ్యంతరం లేదుగా'' అడిగాడు ఫోన్‌లో రాముడు.

'అయితే రాముడు భారతీగారితో కాదు మాట్లాడేది' అనుకుని కొంచెం కుదుటపడ్డాడు అనంతం.

'ఎందుకు నాకింత మనోవ్యధ. ఈ ప్రపంచంలో నా అంతదగాకోరు ఎవ్వరూ ఉండరు' అనుకుని బాధపడసాగాడు.

''ఇంకా వారం పడుతూందాండి భారతిగారు రావటానికి, సరేనండి ఎలాగు నేను మళ్ళీ వచ్చేవారం వస్తాను, అప్పుడు కలుస్తాను లెండి అమెని. మేము కొద్దిసేపటిలో అక్కడుంటామండి నమస్కారమండి'' అని ఫోన్ పెటేశాడు.

''ఇక మనం బయలుదేరుదామా? భారతిగారు ఊళ్ళోలేరు, వారం దాకా రారుట. అమెకు ఎన్నో వ్యాపకాలు''

''చాలా గొప్పమనిషి అని చెప్పాలి. అసలు చాలా ధనవంతుల కుటుంబంలోంచి వచ్చిందావెం. కాని పాపం వ్యక్తిగత జీవితం ఒక

విషాదమయినదిరా!.... సరేలే అవన్నీ ఎందుకులే కాని మనం బయలుదేరుదాం''
అని ఆ మూలనున్న సంచీ పట్టుకున్నాడు రాముడు.

ఇద్దరూ రూంకి తాళంబెట్టి భారతిగారి ఆశ్రమానికి బయలుదేరారు.

''అనంతం! సైకిలు వెనకాల కూర్చోగలవురా?'' అడిగాడు రాముడు.

''నువ్వు డబుల్ రైడింగ్ చెయ్యగలిగితే నాకభ్యంతరంలేదు'' అన్నాడు అనంతం.

ఇద్ధరూ నవ్వుకుని బయలుదేరారు.

''చూశావురా! తణుకు ఎంత కాలుష్యం అయిపోయిందో. మన చిన్నతనంలో ఉన్నట్లు లేదు. అందుకే నాకు ఎప్పుడు తణుకువచ్చినా ఎప్పుడు మళ్ళీ ఇంటికి పోతానా, అనిపిస్తూంటుంది. కాని భారతిగారి హోం చాలా ప్రశాంతంగా, మంచి మంచి తోటలతో ఊరి బయట ఉంటుంది. అక్కడి కెళ్ళినప్పుడల్లా నాకు కూడా అక్కడే ఉండిపోవాలనిపిస్తుంది. అది కరుణతో కూడిన మహానిలయం రా! నువ్వే చూస్తావుగా, నేను ఏమీ చెప్పను.'' ఏవేవో మాట్లాడుతూ సైకిలు తొక్కుతున్నాడు రాముడు.

ఊ! ఊ !! అంటూ వూ కడుతూ కుర్చున్నాడు అనంతం

ఇద్ధరూ హోంని చేరుకున్నారు.

బయట బోర్డు మీద 'భారతీ అనాథవృద్ధుల నివాసస్థానం' అని వ్రాసి ఉంది. దాని క్రింద 'దర్మకర్త భారతి' అని ఇంకా ఎడ్రస్సు వగైరా వ్రాసి ఉంది.

''మా అమ్మ అనాథ!'' అనుకుని ఒక్కసారి దుఃఖం ఆపుకోలేకపోయి రాముడి చెయ్యిగట్టిగా పట్టుకున్నాడు అనంతం.

''ఏమిరా! ఏమయింది, బాధపడుతున్నావా. పిన్నికి ఏమీ తక్కువగా లేదురా! జరుగుబాటు. భారతి గారు ఎంతో మంచి మనిషి. ఈ ఆశ్రమంలో ఉన్న వారందరిని ఆమె తన తల్లులుగా భావించి రోజూ ఒక్కసారి అందరనీ చూచి వారి బాగోగులు కనుక్కుని సేవ చేస్తూంటారు. ఒక్క భారతిగారే కాదు, ఈ హోంలో పని చేసే ప్రతివ్యక్తి కూడా ఒకసేవా పూరిత భావంతో ఈ అనాథ వ్యక్తులకి సేవ చేస్తూంటారు. అంతకన్నా కావలసిందే ముందిరా జీవితంలో. 'మానవసేవయే మాధవసేవ' అని చెప్పారు మనపెద్దలు.''

''నాకు మానవసేవ చేసే ప్రాప్తి ఇంకా కలుగచెయ్యలేదు ఆ మాధవుడు. అందుకే ఆ మాధవునికి సేవచేసి తృప్తి పొందుతుంటాను'' అన్నాడు రాముడు.

''లోపలికి పోదాం'' అని అనంతాన్ని తీసుకుని మెయిన్‌గేటులోకి ప్రవేసించాడు.

భారతిగారు స్థాపించిన ఆశ్రమం దాదాపు ఒక ఎకరం నేలలో విస్తరించి ఉంది. ఎన్నో రకరకాల పూలచెట్లు, కొబ్బరిచెట్లు, వేపచెట్లతో నిండి కలకలాడుతోంది. అక్కడా అక్కడా ఒకళ్ళిద్దరు తోటమాలిలు పనిచేస్తున్నారు.

ఆ ఎకరం మేలలో ఉన్న ఆ తోట, ఆ కట్టడాలు చూస్తే అమెరికాలో మురళీకృష్ణ, జానకిరామయ్యగారి ఐదుపదకల ఫారమ్ హౌస్‌లు గుర్తుకొచ్చాయి అనంతానికి.

అక్కడా అక్కడా బంగాళాపెంకులతో కట్టిన కట్టడాలు ఎంతో అందంగా కనపడుతున్నాయి. ఒక్కొక్కట్టడం ఒక్కొక్కపెద్ద హాలు మాదిరిగా పెద్దపెద్ద కిటికీలతో అమర్చివున్నాయి.

''నీకు కనపడుతున్న కట్టడాలు ఒక్కొక్కటి ఒక్కొక్క పెద్ద హాలురా. అందులో ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క ప్రక్కవేసి ఉంటుంది'' అని చూపిస్తున్నాడు రాముడు.

ఆ కట్టడాలికి నెంబర్లు వేసి ఉన్నాయి. మొత్తం ఐదు కట్టడాలున్నాయి ఆ ఎకరం మేలలో. బయటనీడలో అక్కడా అక్కడా చాలా సిమెంటు సోఫాలు అమర్చి ఉన్నాయి.

''ఆ అయిదో నెంబరు హాలులో తొమ్మిదో బెడ్డు పిన్నిది'' చూపించాడు రాముడు.

''దానిని ఈ మధ్యనే టర్మినల్ హాలుగా పరిగణిస్తున్నారు'' అని కొంచెం తటపటాయించాడు రాముడు.

ఒక తెలియని వ్యథకలచి వేస్తోంది అనంతాన్ని.

'అమ్మని టెర్మినల్ వార్డులో ఉంచారా' అని బాధపడుతున్నాడు.

'ఇంకో క్షణంలో అమ్మని చూస్తాను. ఎలా ఉందో ఏమో! అసలు నేను అమ్మను ఆనవాలు కట్టగలనా. చాలా చిక్కిపోయి ఉంటుంది. నేను వచ్చినట్లు అమ్మకి తెలియదు' అనుకుంటూ ఏవేవో ఆలోచించుకుంటూ రాముణ్ణి అనుసరిస్తున్నాడు.

మద్రాసులో చదువుతుండగా సర్కారు ఎక్స్‌ప్రెస్‌లో తణుకు వెళ్ళినప్పుడల్లా నాన్న ప్రొద్దున్నే రైలుస్టేషన్‌లో ప్రత్యక్షమయ్యేవాడు.

అప్పటికీ అంటూండేవాడు అనంతం. ''నాన్నా !నాకు ఇంటికి రావటం తెలియదా! నువ్వెందు కొస్తావు ఇంతకష్టపడి''.

''నాకు మార్నింగ్ వాక్‌రా'' అంటుండేవారు సుబ్బరామయ్యగారు.

''నాన్నా అమ్మని కూడా తీసుకురాపోయువా!'' అంటే, ''ఒరేయ్ నేనెందుకొచ్చానని అడుగుతున్నావు, అమ్మెందుకురా!'' అంటూండే వారు సుబ్బరామయ్య మాష్టారు.

కొడుకు రాకకోసం ఎన్నెన్నో తినుబండారాలు తయారు చేసి ఇదిగో వస్తాడు ఇప్పుడు వస్తాడు అని కాచుకుని వీధి గుమ్మం దగ్గిరే కనిపెట్టుకుని కూర్చునేవారు రాజేశ్వరమ్మ గారు.

ఇంటికి వెళ్ళగానే ఒక్కసారి అమ్మని పట్టుకుని ఎక్కడ లేని ఆనందం పొందేవాడు.

''ఇంక నేను పనికి రాను వీడికి'' అంటూ ''వీడితో పాటు నాకు కూడా ఏమయినా పడేస్తే నేను స్కూలుకి పోతాను'' అని నాన్న అమ్మని వ్యంగ్యధోరణిలో ఏడిపించటం వగైరా వగైరా గుర్తుకొచ్చి మధనపడసాగాడు.

''అనంతం! ఆ కనపడే ఒకటవనెంబరు బ్లాకు పాకశాల, భోజనాలు, వంటలు అన్ని అక్కడే చేస్తూంటారు. ఆ రెండవనెంబరు బ్లాకులో అల్లికలకి, కుట్లుకి మిషనులు, పుస్తకాల లైబ్రరీ అన్నీ ఉంటాయి. ఎవరికి చాతనైన పని వారు చేస్తూంటారు.''

''అక్కడే అప్పుడప్పుడు పురాణకాలక్షేపాలు కూడా జరుగుతుంటాయి. నేను కూడా అప్పుడప్పుడు భగవద్గీత పారాయణం చేస్తుంటాను. కొందరిచేత ఖురాన్, బైబిలు కూడా చదివిస్తూంటారు భారతిగారు. ఆ మూడవబ్లాకు ఒక ఉచిత పాఠశాలగా రూపొందించారు. చదువుకోవాలి అని ఆకాంక్ష ఉన్నా వారికి ప్రత్యేకంగా ఈ పాఠశాల నిర్మిస్తున్నారు''.

''ఆమె దేశంలో నిరక్షరాస్యత గూర్చిఎప్పుడూ మాట్లాడుతుంటారు. ఈనాడు ఈ దేశం ఇంత దుర్భిక్షావస్థలో ఉండటానికి మూలకారణం నిరక్షరాస్యత అని ఆమె నమ్మకం. అనాలుగవ బ్లాకు మగవారికి కేటాయించారు'' అని ఏవేవో చెప్పుకుపోతున్నాడు రాముడు.

మొగటిబ్లాకు చేరుకున్నారు.

''ఇక్కడినుంచి చూసుకుంటూ వెడదాం'' అన్నాడు రాముడు.

ఇదేమీ వినిపించుకున్నట్లు లేదు అనంతం. ఆ అయిదవ బ్లాక్ వైపు నడుస్తున్నాడు.

అనంతాన్ని గమనించి అక్కడే నిలబడి చూస్తున్నాడు రాముడు.

అనంతం తిన్నగా ఆ అయిదవ బ్లాక్ చేరుకుని కిటికీలోంచి లోపలికి తొంగి చూస్తున్నాడు. అప్రక్కల మీద వ్రాసిన నెంబర్లు సరిగా కనపడటం లేదు ప్రక్కలమీద కొందరు తల్లులు విశ్రమిస్తున్నారు, కొందరు కూర్చుని ఉన్నారు.

మరికొందరు బయట అక్కడా అక్కడా సోఫాలమీద కూర్చుని గాలి పీల్చుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

''రాముడూ! ఎంతరా అన్నావ్!నెంబరు తొమ్మిదో బెడ్డా'' అన్నాడు అనంతం.

జవాబులేదు.

ప్రక్కకి చూచాడు అనంతం. రాముడు తనని దూరంగా నుంచుని చూడటం గ్రహించాడు.

నవ్వుకుంటూవచ్చాడు రాముడు.

''నీ ఆత్రుత గహించానురా అనంతం. లోపలికి పోదాం పద అని ఆ అయిదవ నెంబరు హాలులో ప్రవేసించారు. ఆబ్లాకు అన్నింటిలోకి చిన్నదిగా ఉంది. పది మంచాలు దాకా వేసిన హాలు అది.

''ఎంతరా నెంబరు'' అన్నాడు అనంతం అత్రంగా

''తొమ్మిది'' అన్నాడు రాముడు.

ఒక్కసారి గబగబా అటూ ఇటూ చూస్తూ నెంబర్లు లెక్కపెట్టుకుంటూ తొమ్మిదవ నెంబరు బెడ్ చేరుకున్నాడు అనంతం.

'రాజేశ్వరి' అని వ్రాసి ఉంది ఆ నెంబరు బోర్డు మీద.

రాజేశ్వరమ్మగారు చేతులు రెండు పొట్టమీద పెట్టుకుని ఎంతో నిర్మలంగా కళ్ళుమూసుకుని పడుకుని ఉన్నారు.

''అమ్మా!'' అని ఒక్కసారి పిలిచాడు అనంతం.

ఆమె కళ్ళు తెరవలేదు.

మళ్ళీ ''అమ్మా!'' అనిపిలిచాడు, కళ్ళుతెరవలేదు.

మూడవసారి 'అమ్మా!' అని పిలిచి దుఃఖం ఆపుకోలేక దగ్గరగా ఉన్న రాముణ్ణి పట్టుకుని

''మా అమ్మకి నేను వచ్చానని తెలియదురా! రాముడు!'' అని లోలోన కుళ్ళికుళ్ళి బాధపడసాగాడు.

రాముడు అనంతాన్ని ఓదార్చాడు. మిగిలిన ప్రక్కలమీద ఉన్న తల్లులెవ్వరు వీరిని పట్టించుకున్నట్లు లేదు.

''నువ్వు ఈ కుర్చీమీద పిన్ని ప్రక్కనే కూర్చో నేను ఇప్పుడే వస్తాను'' అని తన సంచిలో ఉన్న ఆగరొత్తులు తీసి కొంచెం ముందుకు నడిచాడు రాముడు.

అక్కడ ప్లాష్టర్ ఆఫ్‌ప్యారిస్‌తో చేసిన బుద్ధ విగ్రహం, ఆ ప్రక్కనే జీసస్స్‌క్రాస్

మీద ఒక బొమ్మ, ఒక మసీదు ఒక ఎత్తుగా ఉన్నటేబిల్ మీద అమర్చబడి ఉన్నాయి. ఆ ప్రక్కనే రాముడు చేయించిన సీతారామ, లక్ష్మణ, ఆంజనేయులతో కూడిన పెయింటింగు అమర్చబడి ఉంది.

అగరొత్తులు వెలిగించి ఒక్కసారి ఆ బొమ్మలకి చూపించి, చుట్టి అక్కడే ఉన్న అగవత్తులు స్టాండ్‌కి గుచ్చి, సంచీలో ఉన్న ఒక పొట్లం తీశాడు.

అందులో ఉన్న గంగ సింధూరం అక్కడున్నతల్లులందరికీ పెడుతూ వచ్చాడు.

పిన్ని ప్రక్కదగ్గరకి చేరి, అగంగ సింధూరం పొట్లం అనంతానికిచ్చి ''నువ్వు పిన్నికి పెట్టు'' అన్నాడు.

గంగ సింధూరం వేలికి చేసుకుని అమ్మ గెడ్డం క్రింద కంఠం మీద వ్రాస్తూ చూచాడు గెడ్డం మీద ఉన్న నల్లటి మచ్చ.

ఆ మచ్చ చూడగానే ఆపుకోలేని దుఃఖం వచ్చింది అనంతానికి.

''అమ్మా! నీమచ్చ నేను చెరుపుతాను అంటూ ఒక గ్లాసుతో నీళ్ళు సబ్బుబిళ్లా తెచ్చి వేలుతో సబ్బు చేసుకుని నీటిలో ముంచి ఆ మచ్చ మీద వ్రాస్తూ, తుడుస్తూ మళ్ళీ వ్రాస్తూ తుడుస్తూండేవాడు తన చిన్నతనంలో.

రాజేశ్వరమ్మగారు మధ్యాహ్నం ఇంటిపని చేసుకుని భోజనాలయ్యాక గడపమీద తలపెట్టుకుని నేల మీద కాస్తవిశ్రమిస్తూండేవారు. మాష్టారు పడక కుర్చీలో పేపరు చదువుతూ కునికి పాట్లుపడుతూండేవారు సెలవుల రోజుల్లో.

''ఒరేయ్! ఆ సబ్బుబిళ్ళా, ఆ నీళ్ళు ఆ ప్రక్కనబెట్టి నీవుకూడా కాస్సేపు ఇల్లాఒచ్చి నిద్రపో బాబు.''

''నాన్నగారిని కాస్సేపు పడుకోనియ్యి,'' అంటూ నిద్రమత్తులో మాట్లాడుతూండేవారు రాజేశ్వరమ్మగారు.

''వెర్రివాడా! పుట్టుమచ్చలు చెరగవురా'' అంటూండేవారు నిద్రలోనే , కొంతసేపటికి అమ్మ ప్రక్కనే పడుకుని నిద్రపోయేవాడు.

''ఎంత చిక్కిపోయిందిరా అమ్మ !మంచానికి అతుక్కు పోయింది. మళ్ళీ మామూలు మనిషి ఎప్పుడుందా'' అంటూ బాధపడసాగాడు.

''అనంతం ఒక్కసారి అలా తిరిగి వద్దాం రా!'' అని ఒక్కొక్క మంచం దగ్గిరకి తీసుకెడుతూ ఆ అనాథ మహిళల విషాదగాథలు వివరిస్తున్నాడు రాముడు.

ఆ వాతావరణం చూడగానే మనస్సు వికలమయి పోయింది అనంతానికి.

''అమ్మా! మెరీయమ్మా! బావున్నావా! కొడుకు దగ్గిర నుంచి ఉత్తరాలు వస్తున్నాయా'' అని పలకరించాడు రాముడు ఒకతల్లిని.

ఆ అమ్మచేతులు అడ్డంగా ఊపుతూ 'లేదు' అని సజ్ఞచేసింది.

అనంతం, రాముణ్ణి అనుసరిస్తూ ఆశ్రమమంతా ఒకసారి చుట్టుముట్టి.

''ఒక్కసారి అమ్మని చూచిపోదామా రాముడు'' అన్నాడు.

''అలాగే'' అని ఒక్కసారి మళ్ళీ రాజేశ్వరమ్మగారి ప్రక్కకి చేర్దారు.

రాజేశ్వరమ్మగారి కాళ్ళు పట్టుకుని ఒక్కసారి ఆమె ముఖంలోకి మనసారా చూస్తూ ఉండి పోయాడు కాస్సేపు అనంతం.

''పోదాం రాముడు'' అన్నాడు.

సైకిలు మీద హోటలువైపు బయలుదేరారు ఇద్దరూ.

ఇద్దరూ హోటలు చేరే వరకు మౌనంగా ఉన్నారు.

''ఏమిటిరా! నీ ప్లాను'' అడిగాడు రాముడు.

''నిన్న రెండురోజుల తరువాత కాకిలేరు వచ్చి ఆలయంలో కలుసుకుంటాను. నీతో ఎన్నో విషయాలు మాట్లాడుకోవాలి'' అన్నాడు.

''అంతకన్నా నాకు కావలసిందేముందిరా, తప్పకుండా మా ఆలయానికి వచ్చి శ్రీరామ దర్శనం చేసుకుందువుగాని. మనం అక్కడే మాట్లాడుకోవచ్చు'' అన్నాడు రాముడు.

''నీకు ఇబ్బంది ఉండదని భావిస్తున్నాను'' అన్నాడు అనంతం.

''ఎల్లుండి ఖాళీగా ఉంటుంది. మా ఆలయం ఎంతో ప్రశాంతంగా ఉంటుంది. చూద్దువుగాని, పదిగంటలకి సేవలు ముగుస్తాయి. అడపాతడపా భక్తులు వచ్చి దర్శనం చేసుకుని అర్చనలు చేయిస్తూంటారు. ఆలయం పదిన్నరకి మూయబడుతుంది. ఆ తరువాత భక్తులురారు. మనం ప్రశాంతంగా కూర్చుని దైవసన్నిధిలో మాట్లాడు కోవచ్చును'' అన్నాడు రాముడు.

అనంతం ఎంతో సంతోషించి, రాముణ్ణి సాగనంపి హోటలు రూంకి వెళ్ళి ఒక్కసారి బ్యాంక్‌పాస్ బుక్ చూచుకున్నాడు. కొన్నిలక్షల రూపాయలతో కూడిన ఆపాస్ బుక్కుని ప్రక్కమీద విసిరికొట్టి మంచం మీద వాలాడు.

***

# 16

అనుకున్న ప్రకారం ఆరోజు ఉదయం పదిగంటలకే కాకిలేరు చేరుకుని రామా లయంలోకి ప్రవేశించాడు అనంతం

రామాచారి సీతారాములకి సేవలు ముగించుకుని దర్శనానికి వస్తున్న భక్తులచే అర్చనలు జరిపించుతూ అనంతంకోసం వేచి చూస్తున్నాడు.

ఇంతలో గుడిలోపలికి వస్తున్న అనంతాన్నిచూచి లోపలికి రమ్మని మండపంలో కూర్చోమని చెప్పి తనకార్యక్రమాలు ముగించుకుని మండపాన్ని చేరాడు.

''ఏరా! ఎలా వచ్చావ్'' అడిగాడు రాముడు,

''సైకిలు మీద''

''సైకిలెక్కడిది''

''నిన్ననే ఒక సైకిలుకొన్నానురా. లేకపోతే తిరగటం కష్టం. బస్సులకోసం ఎంతసేపు కాచుకుని కూర్చుంటాం'' అని ఒక చిరునవ్వు నవ్వాడు అనంతం.

రాముడు చేతికి ఉన్న గడియారం చూచుకుని ''ఇంక భక్తులు వచ్చే టైము దాటింది. మనం సావుకాసంగా మాట్లాడుకోవచ్చు. నువ్వు కంగారు పడకు భోజనాల వేళకు తప్పకుండా తణుకు చేరుకుంటావు, ఇది నా పూచీ. నువ్వు ఎంతో అలిసిపోయి ఉంటావు, కాసిని మంచి తీర్థం పుచ్చుకుందువు గాని'' అని గర్భగుడిలోకి వెళ్ళి అక్కడున్న ఇత్తడి బిందెలో నీళ్ళు ఒక రాగి చెంబుతో తీసుకుని, నాలుగు అరటిపళ్ళు

కూడా తీసుకుని వస్తూండగా రాముడికి ఎదురుగా వెళ్ళి గంటవాయించి సీతారాముల దర్శనం చేసుకున్నాడు అనంతం.

''ఉండు, ఉండు; నీకు తీర్థం ఇస్తాను'' అని అక్కడున్న పళ్ళెంలో ఉన్న హారతి కర్పూరం వెలిగించి సీతారాములకు చూపించి అనంతం చేతిలో ఉద్ధరిణితో తీర్థం పోశాడు రాముడు. ఆ పళ్ళెంలో ఉన్న కుంకుమ తీసుకుని రాముడిచ్చిన పువ్వు చెవిలో పెట్టుకుని శఠగోపంతో దీవెనలు పొందాడు అనంతం.

''ఈ చెంబులో నీళ్ళతో ముఖం కడుక్కుని దాహం తీర్చుకో'' అని ఆ రాగి చెంబు అందించాడు రాముడు.

ఆ మండపం ప్రక్కగా ఒక బోగడ చెట్టుంది. ఆ బోగడ పూల వాసనకి ఎంతో హాయిని పొంది ముఖం కడుక్కుని చెంబుతో నీళ్ళు ఎత్తిపోసుకుని దాహం తీర్చుకున్నాడు. ''ఎంత అదృష్టవంతుడివిరా నువ్వు'' ఇంత ప్రశాంత వాతావరణంలో, దైవసాన్నిధ్యంలో ఇంత అలభ్యమైన సువాసనలతో, ఇంత పరిశుభ్రమైన ఆలయ ప్రాగణంలో హాయిగా తృప్తిగా గడుపుతున్నావు. ఇది అందరికీ రాదురా. దీనికి పూర్వజన్మసుకృతం కావాలి'' అని జేబులోంచి రూమాలు తీసుకుని ముఖం తుడుచుకుని మండపంలో వెల్లికిలా పడుకుని తృప్తిగా కళ్ళు మూసుకుని ఒక్కసారి ఆవలించి మళ్ళీ రాముడికేసి చూచాడు.

''ఏరా! అలిసిపోయావు కదూ! ఇంత దూరం సైకిలుతొక్కి ఎన్నేళ్ళయిందిరా'' అడిగాడు రాముడు.

''ఒరేయ్ రోజూ ఈ టైముకి ఇక్కడికి వచ్చి దైవ దర్శనం చేసుకుని ఇలా నువ్విచ్చే తీర్థం తీసుకుని ఇక్కడే ఇలానిద్రపోవాలని ఉందిరా ఈ ప్రశాంత వాతావరణంలో'' అన్నాడు అనంతం మళ్ళీ ఆవలిస్తూ..

''నీకెందుకురా! ఈ అవస్థలు, హాయిగా రేపోమాపో అమెరికా వెళ్ళిపోతావు, ఎందుకొచ్చిన పాట్లురా ఇవి. మేం పడుతున్నాం చాలదా'' అన్నాడు రాముడు.

''నువ్వు అలాగే అంటావ్. నాకు తెలుసు నువ్వు చాలా తృప్తిగా, హాయిగా బ్రతుకుతున్నావు. ఇంత చక్కని జీవితం ఎక్కడుందిరా''.

''అదిసరే! నీ తిరుగుప్రయాణం ఎప్పుడు'' అడిగాడు రాముడు.

''విమానంలోనా?'' ప్రతి సమాధానం ఇచ్చాడు అనంతం

''లేకపోతే కాలినడకనా'' అన్నాడు రాముడు నవ్వుతూ.

''సైకిలు కొన్నానుగా! ఇంక విమానాలు, కారులు అవసరంలేదు. అవసరం వస్తే దేవుడిచ్చిన కాళ్ళున్నాయి'' అన్నాడు నవ్వుతూ వ్యంగ్యధోరణిలో.

''ఏమిటిరా! నువ్వు మాట్లాడేది నాకేం అర్థం కావటంలేదు'' అన్నాడు చాలా ఆశ్చర్యంగా.

''రాముడూ! అమెరికాని శాశ్వతంగా వదిలేసి వచ్చానురా!''అని కళ్ళు మూసుకుని బోగడ పూలవాసన గట్టిగా పీల్చుకున్నాడు.

''మరి! నీ భార్య?'' అడిగాడు.

''మాకు విడాకులు జరిగింది''.

''రామ! రామ!''అని చెవులు మూసుకున్నాడు.

''దెబ్బలాడుకున్నారా? తప్పు కదురా. నువ్వు నీ భార్యకు విడాకులిచ్చి అమెరికా విడిచిపెట్టి భారతానికి వచ్చావా! శాశ్వతంగా! ఘోరం ! అన్యాయం.!''

''ఆ శ్రీరామచంద్రుడు ఈ వార్త విని చెవులు ముసుకుని ఉంటాడు ఈ పాటికి'' అని ఎంతో వాపోయాడు రాముడు.

అనంతం మాట్లాడలేదు, కళ్ళు మూసుకునే ఉన్నాడు.

''అనంతం, నా మాటవిని నువ్వు అమెరికాకి వెళ్ళిపో. తప్పురా! ఆ అమ్మాయి ఎంత బాధపడుతుందో. ఇది మన ఇంటావంటా లేదురా. చెయ్యరాని పని చేశావురా'' అని చాలా బాధపడ్డాడు రాముడు.

అనంతం ఇంకా కళ్ళు తెరవటం లేదు. కంట్లోంచి నీళ్ళు కారటం చూచాడు రాముడు

''అనంతం! ఏం జరిగిందో నాతో చెప్పవచ్చుగా'' అన్నాడు రాముడు బాధగా.

కళ్ళు తెరిచి ఒక్కసారి లేచి కూర్చున్నాడు అనంతం.

''నాకిప్పుడు ఎవ్వరూ లేరురా! భార్యలేదు, తండ్రిలేడు, తల్లి చావుబ్రతుకులలో ఆ టెర్మినల్ వార్డ్‌లో స్పృహ తెలియకుండా పడుంది. అమెరికాలో ఆ భోగభాగ్యాలతో భార్యతో కులుకుతూ కూర్చోమంటావా?'' అడిగాడు అనంతం.

''అమ్మాయి ఇండియాకి రానందా!'' అడిగాడు రాముడు.

''ఎలా వస్తుందిరా? అక్కడే పుట్టి పెరిగినపిల్ల.''

''మరి నువ్వెందుకు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నావు.'' అని ఒక వెర్రి ప్రశ్న వేశాడు.

''రాముడూ! ఈ ప్రశ్న నువ్వు నన్నడగవలసింది కాదురా. నువ్వు రోజు సేవలు చేస్తున్నావే ఆ శ్రీరామచంద్రుడు, ఆయన్నడుగు, ఏం చెబుతాడో చూద్దాం!'' అని ఒక చిరునవ్వు నవ్వాడు.

''అవునులే గ్రహించాను, నొదటవ్రాసిన రాతని ఎవరూ తప్పించలేరు. ఇంతకీ ఏమిటి నీ నిర్ణయం'' అడిగాడు. రాముడు.

''జీవితమంతా భారతంలో గడపటం, చేతనయితే అమ్మకి సేవ చెయ్యటం'' అని వూరుకున్నాడు అనంతం.

''నాకు అర్థం కావటం లేదు. సరిగా విడమర్చి చెప్పు'' అడిగాడు రాముడు.

మద్రాసులో ఆచారి బాబాయిని చూచి అమెరికాకి వెళ్ళినప్పటి నుంచి జరిగినదంచా చెప్పి ''ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్'' అన్నాడు.

రాముడు మాట్లాడలేదు.

''రాముడు! నేను నిన్ను వేడుకుంటున్నాను. నా ఉనికి ఆ ఆశ్రమం నడుపుతున్న భారతి గారికి గాని, ఆశ్రమానికి సంబంధించిన వ్యక్తులకు గాని చెప్పకు. అమెరికాలో ఉన్న బ్యాంకులో సొమ్ము ఆ అమ్మాయికిచ్చేశాను. ఇక్కడ ఇండియన్ బ్యాంక్‌లో ఉన్న సొమ్ము భారతిగారి పేర ఆశ్రమానికి వినియోగపరచవలసిందిగా వారి ఎక్కవుంటుంకి ట్రాన్స్‌ఫర్ చేశాను. ఇప్పుడు నాకెవ్వరూ లేరు. నా కేమీ లేదు.... అంటే, అంతా నా వాళ్ళే, అన్నీ నావే అని అర్థం'' అని ఒక్కసారి హాయిగా నవ్వాడు అనంతం.

రాముడు బిగిసిపోయి కూర్చున్నాడు.

''ఏమిరా! ఏం మాట్లాడవేం. నేను చేసినపని తప్పంటావా? ఆ అమ్మాయికి, నాకు మధ్య ఏ రకమయిన ఏహ్యాభావం లేదురా. ఎవరి స్వేచ్ఛవారిది. ఒకరి స్వేచ్ఛకు మరొకరు అడ్డురాకూడదు. ఆ అమ్మాయి ఇష్టప్రకారమే జరిగిందంతా. నన్నొక దుర్మార్గుడంటావా? నువ్వేమన్నా నేను భరించే శక్తి ఆ శ్రీరాముడు నాకు కల్పించాడు''. అని ఒక్కసారి కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచి రాముణ్ణి చూచాడు అనంతం.

''కంతేరులో మా తాత ఇంటి చూరు నుంచి బూజులు దులిపి అక్కడే కాలక్షేపం చెయ్యదలుచుకున్నాను. సైకిలుంది ఒక ఊరి నుంచి మరొక ఊరికి వెళ్ళటానికి. తాత మాకుడు ఉంది. ఒరేయ్! మీ ఇంటికొస్తే గుప్పెడు బియ్యం వెయ్యివురా. మాతాతకి నువ్వేకదురా వేసేవాడివి. మాతాతకి చెంబు మోసే శక్తి లేనప్పుడు ఆ ప్రక్కనే చెంబు పుచ్చుకుని, 'భవతీ భిక్షాం దేహి' అన్నప్పుడు ఒక దోసెడు బియ్యంతో వచ్చి నువ్వు నాచెంబులో పొయ్యలేదా'' అడిగాడు అనంతం. తన చిన్నతనం రోజులు గుర్తుచేస్తూ.

పట్టరాని దుఃఖం వచ్చింది రాముడికి.

ఒక్కసారి లేచి గబగబా గర్భగుడిలోకి వెళ్ళి గంట మ్రోగిస్తూ నుంచున్నాడు.

రాముడి వెనుకగా అనంతం వెళ్ళి చెయ్యిపట్టుకుని గంటవాయించటం ఆపాడు.

రాముణ్ణి మండపం దగ్గిరకు తీసుకుని వచ్చి అరాగి చెంబులో ఉన్న మంచి నీళ్ళిచ్చి త్రాగమన్నాడు.

రాముడు ఆ చెంబులో నీళ్ళు ఖాళీచేసి ఒక్కసారి కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచి అనంతం రెండు చేతులు పట్టుకుని.

''నాకు మాటలు రావటం లేదురా. నీకు నేను ఏం చెప్పాలో తెలియటం లేదు, నీలో ఉన్న ఆ మహాశక్తిని అర్థం చేసుకునే శక్తి నాకు లేదు. నేను ఒక సామాన్య జీవిని. ఇప్పుడు నేను అచేతనుణ్ణి, నన్నేం చెయ్యమంటావు'' అడిగాడు రాముడు.

''నువ్వు నాకొక్క ఉపకారం చెయ్యాలిరా'' అడిగాడు అనంతం.

''చెప్పు నువ్వు ఏం చెయ్యమన్నా, ఏం అడిగినా నేను సిద్ధంగా ఉన్నాను. నా ప్రాణం ఇయ్యమన్నా ఇస్తానురా. అన్నింటికీ మనకి ఆ శ్రీరాముడే రక్ష''.

''రాముడు! ఆ భారతిగారి ఆశ్రమంలో నాకు ఏదయినా ఒక చిన్న ఉద్యోగం దొరుకుతుందా. ఏదయినా సరే. తోట పనిగాని, చాకలిపనిగాని వంటశాలలోకాని ఆ ఆశ్రమంలో ఏదయినా ఫరవాలేదురా! దానికి నాకు నీ సహాయం అవసరం. అమెరికా వెళ్ళిన తరువాత వంటపనిలో చాలా నైపుణ్యం సంపాదించాను'' అని ఓ పెద్ద నవ్వు నవ్వాడు అనంతం.

నోటమాటలేదు రాముడికి. వెర్రివాడిలా ఒకనవ్వు నవ్వాడు.

''ఏమిటిరా నువ్వు మాట్లాడేది? నాకేం అర్థం కావటం లేదు'' అని నొక్కి అడిగాడు.

''ఈ అంతిమ దశలో నేను మా అమ్మకి సేవ చేసుకునే భాగ్యం కల్పించగలవా?''

''అదృష్టమంటే నీదేరా, అక్కడున్న అమ్మలకి ఇక్కడ దైవానికీ సేవలు చేస్తున్నావు. అందులో కొంత భాగ్యం నాకు కూడా కల్పించగలవా'' అని అర్థించాడు అనంతం.

''నీ అంతటి మహాజ్ఞాని, సాంకేతిక నిపుణుడు, నాలాగ ఇలా సేవలు చేస్తూండటం సమంజసమంటావా? నీ ప్రజ్ఞ ఈ ప్రపంచానికి చాలా అవసరం. పాడుచేసుకోకు, నీవు చెయ్యవలసిన గొప్ప కార్యాలు ఎన్నో ఉన్నాయి. ఇదేమిట్రా నువ్వు,'' అని ఎంతో ఆశ్చర్యపోతూ వాపోయాడు రాముడు.

''రాముడూ! మన మనస్సుకు తోచిన మంచి కార్యం ఏదయినా మనం చెయ్యగలిగితే అది మనకు చాలా సంతృప్తినిస్తుందిరా. నా బోటి సాంకేతిక పరిజ్ఞానం గల వారు కోకొల్లలుగా ఉన్నారు ఈ ప్రపంచంలో. ఈ పరిజ్ఞానంలోపడి ఎన్నో మహత్ కార్యాలు మరిచిపోతున్నాం. నాకు తెలిసిన జ్ఞానం సముద్రంలో ఒక నీటిబొట్టు వంటిది. ఈ జ్ఞానం నాభోగభాగ్యాలకే పరిమితమౌతుందే తప్ప ఎందుకూ పనిరాదు.

ఇంతవరకు నేను చేసిన పరిశోధన వినాశన కార్యాలకుపయోగపడేదే కాని ప్రజలుకోరుకునే శాంతి పరమైనది కాదు. ఏ దేశం చూచినా ఈ పరిశోధనలోనే ఎక్కువ ప్రయత్నాలు చేస్తున్నది. నాకు విసుగు పుట్టింది. నా బుర్ర తిరిపోయింది. నా చదువు సంధ్యలు నా జీవిత ప్రమాణం పెంచుకునేందుకే ఉపయోగ పడతాయే కాని ప్రజాశ్రేయస్సుకుపయోగపడదు. ఇదే నేను అమెరికా వెళ్ళి నేర్చుకున్న గుణపాఠం''.

''అపరిమితంగా డబ్బుచేసుకున్నాను. కాని నాడబ్బులో ఒక్క కానీ కూడా మా తల్లి తండ్రులకుపయోగపడలేదు. మా నాన్నని రక్షించుకోలేక పోయాను. మా నాన్న జబ్బుకి మా అమ్మ నేను పంపిన సొమ్ములో ఒక్క రూపాయి కూడా ఖర్చు పెట్టలేదు. కనీసం ఒక ఇల్లు కొనుక్కోమని రాసినా 'మాకిది చాలు' మేము హాయిగా బ్రతుకుతున్నాం' అని నన్ను మభ్యపెట్టారు. ఇప్పుడు కూడా మా అమ్మని రక్షించుకునే స్థితి నా చేతులు దాటిపోయింది. ఎందుకురా నాకీ డబ్బు? ఎవరి కోసం? కనీసం ఈ డబ్బు భారతిగారు అనాథలకి ఉపయోగించుకుంటే నాకంత కన్న తృప్తి మరొకటి లేదు''.

''నేను కార్యవాదిని కాదు. నా వల్ల ఏమీ కాదు. నేను ఎందుకూ ఎవరికీ పనికి రానివ్యక్తిని, మంచి చేసేవారికి తోడ్పడగలిగితే చాలు, అంతకన్న నాకేమీ అక్కరలేదు. ఈ చల్లని వాతావరణంలో 'మంచి' ఆలోచించుకుంటూ, 'మంచి' చేస్తూ, 'మంచిని' చేస్తున్నవారికి తోడ్పడుతూ ఉంటే అంతకన్నా కావలసిందేముంది''.

''సమాజమంతా 'మంచి' పనులు చేస్తూ 'శాంతి'ని కోరుకుంటూ మనకున్నది చాలు అని తృప్తిపడుతూ ఒకరికొకరు సహాయపడుతూ కాలక్షేపం చేస్తే అంతకన్న కావలసిందేముంది. మనకున్న సాంకేతిక పరిజ్ఞానం చాలుననుకుని మనస్సుని మళ్ళించుకుని ఒక క్రమశిక్షణతో ఆధ్యాత్మికంగా మనోవికాసము పెంపొందిం చుకొనుటలో ఉన్న తృప్తి, అసంతృప్తితో భోగభాగ్యాలనుభవించటంలో లేదురా.'' అని ఒక్కసారి రాముణ్ణి చూచాడు.

రాముడు ఏదో ఆలోచనలో పడి తదేక దృష్టితో అనంతాన్ని చూచాడు.

''ఏరా! అనంతం, ఇవేనా నువ్వు అమెరికాలో నేర్చుకున్న పాఠాలు'' అని ఒక నవ్వు నవ్వాడు.

అనంతం మాట్లాడలేదు.

''అనంతం! భారతంలో చాలా మార్పులు వచ్చాయిరా. దుర్మార్గం పెచ్చు పెరిగిపోతోంది. దొంగకి, దొరకి తేడాలు పోయాయి. కంచే చేను మేసే రోజులు వచ్చాయి. ప్రజలకి ఏ రక్షణా లేదు. ప్రభువులు ప్రభుత్వాల పేరుతో అధికార దుర్వినియోగాలలో మునిగి తేలుతున్నారు. నువ్వూ, నేను ఏమీ చెయ్యలేము. మనం మనదేశాన్ని ఉద్ధరించలేము'' అని ఊరుకున్నాడు రాముడు.

''అంతమాత్రాన మనం చూస్తూ ఊరుకునే పరిస్థితి కూడా రానియ్యాకూడదు. ఎన్నో సేవా సంస్థలు రావాలి. ప్రజలకు మంచి బుద్ధులునేర్పి చైతన్యవంతులుగా చెయ్యాలి. ఆపత్కాలంలో ప్రజలను ఆదుకునే సేవా సంస్థలు మెండుగా ఉండాలి''.

''మతబద్ధంగా ఉన్న సేవా సంస్థలు మన కొద్దు. ప్రచారసేవా సంస్థలు మనకొద్దు. కులబద్ధమయిన సేవా సంస్థలు మనకొద్దు''.

''భారతంలో ఎన్నో రకరకాల సేవా సంస్థలున్నాయి. ఏదో ఒక లబ్ధితో కూడిన సేవా సంస్థలు మనకొద్దు.- భారతంలో ఎన్నో మాఠాలు మితిమీరిన ధనసంపదలతో ఉన్నాయి. ఎన్నో ఆలయాలలో ధనం పేరుకుపోతోంది. ఈ సంస్థలు ప్రభువులు చేసే పనులలో నిమగ్నమై యున్నారు.''

''వీరు ప్రభుత్వాలు చెయ్యవలసిన పనులు మానుకుని సామాజిక మనోస్థితిని శుభ్రపరచవలసిన బాధ్యతలు స్వీకరించాలేకాని మఠాల పేర్లతో, ఆలయాల పేర్లతో'' ఇంజినీరింగు కాలేజీలు, మెడికల్ కాలేజీలు వగైరా వగైరాలు స్థాపించి నడపటం అర్థంలేని పని. ఆపత్కాలంలో ప్రజలకు తోడ్పడి మానవసేవ చెయ్యవలసిన బాధ్యతలు వీరిపైనున్నాయి. సమాజంలో ఎన్నో మార్పులు రావాలి''అని వెల్లకిలాపడు కుని కళ్ళుమూసుకుని ఆలోచనలో పడ్డాడు అనంతం.

ఒక్కసారి చేతిగడియారం చూచాడు రాముడు.

''అనంతం! పన్నెండుగంటలవుతోంది. పదపోదాం. నాన్న నాకోసం కాచుకుని కూర్చుంటాడు.'' అని ఒక చేత్తో అనంతాన్ని పట్టుకుని పైకి లేపాడు.

గర్భగుడికి తాళం పెట్టి ఆలయ ప్రాంగణ తలుపులు మూసి తాళం పెట్టి ''నీ నిర్ణయం అ మోహంరా, అలాగే కానీయ్'' అని ఇద్దరూ సైకిళ్ళమీద బయలుదేరారు.

''అదేమిటిరా? పెట్టి బేడాతోవచ్చావ్''అడిగాడు రాముడు.

''హోటలు ఖాళీ చేశాను. మన ఊరు వచ్చేశాను''అన్నాడు ఎంతో సంతోషంగా.

''మరెక్కడుంటావు. భోజన సదుపాయాలు ఏం చేశావ్? మా ఇంటికొచ్చెయ్'' అన్నాడు రాముడు.

''లేదురా! నాక్రొత్త జీవితం ఈవాళ నుంచే ఈ రామాలయం నుంచే మొదలవు తుంది. కంతేరు వెళ్ళగానే తాతల ఇంటి తాళాలు తీసుకుని కాలక్షేపం చెయ్యటం మొదలుపెడతాను. ఒకటి,రెండు నెలలు సునాయాసంగా గడుపుతాను, ఈలోగా మిగిలిన జీవితాన్ని సునాయాసంగా గడపటానికి మనస్ఫూర్తిగా ప్రయత్నం చేస్తాను''. అని పెద్దగా హాయిగా నవ్వాడు అనంతం.

శృతికల్పాడు రాముడు.

# 17

కంతేరులో బ్రహ్మయ్యశాస్త్రి గారింటికి రెండే రెండు గదులున్నాయి. మిగిలినది చిన్నవసారా. ఇంటి చూట్టూ కొబ్బరి చెట్లు, అరటి, నిమ్మ, జామ, కరివేపాకు చెట్లతో కలకల్లాడుతూండేది. ఒక గది వంటకి, పూజకి. పడకకి మరొకగది ఉపయోగించు కునేవారు. శాస్త్రిగారి కుటుంబం ఎల్లవేళలా ఆ వసారాలోనే కాలక్షేపం చేసేవారు.

ఇల్లు ఒక కొలిక్కి తెచ్చి 'అక్షరం' అన్న పేరుతో ఒక బోర్డు తయారుచేసి ఇంటి బయట తగిలించాడు అనంతం. ఆ క్రింద 'ఉచిత పాఠశాల' అని రాసి ఉంది. 'ఇది అందరిదీ అని ప్రక్కగా క్రింద రాసి ఉంది. అప్పటికే అనంతం కంతేరులో స్థిరపడి సు మారుగా ఒక వారం దాటింది.

భారతిగారు తిరిగి తణుకు వచ్చారని తెలిసి రాముడు అనంతాన్ని తోడుగా తీసుకుని ఉదయమే ముందుగా కాకిలేరు సైకిళ్ళమీద బయలుదేరారు. అనంతం బాగా మాసినగెడ్డంతో ఉన్నాడు. ఎన్నోరోజులుగా సంరక్షణ లేదు. మామూలుగా వేషధారణ పట్టించుకునే మనిషి కాదు. పొట్టిలాగు, కాలరులేని బనీను వేసుకుని ఉన్నాడు.

రామాచారి ఎప్పటిలాగే క్రాపు, కొంచెంగా మాసిన గెడ్డం పంచి, భుజం మీద కండువా, ఒక చిన్న పసుపచ్చని సంచీతో బయలు దేరాడు. ఆ సంచీ ఎప్పుడూ తన సైకిలుకి తగిలించి ఉంటుంది.

ఏవేవో చిన్ననాటి కబుర్లు చెప్పుకుంటూ రామాలయం చేరుకున్నారు.

రాముడు, సీతారాముల సేవలలో నిమగ్నమైయున్నాడు. భక్తులు వచ్చి పోతున్నారు. సేవలు పదిగంటలకు ముగిశాయి. అంతవరకు ఆమండపంలో హాయిగా బోగడపూల వాసనలు ఆఘ్రూణిస్తూ కళ్ళు మూసుకుని వెల్లకిలా పడుకుని నిద్రావస్తలోకి తొంగిచూస్తూన్నాడు అనంతం.

''అనంతం'' అనిలేపాడు రాముడు.

''కార్యక్రమాలు ముగిశాయా'' అడిగాడు అనంతం బద్ధకంగాలేస్తూ.

''అన్నీ ముగిశాయి. ఇవ్వాళ సాయంకాలం మనిద్దరం కలిసి తణుకు వెడుతున్నాం తెలుసుగా! భారతిగారికి నిన్ను పరిచయం చేస్తాను'' అన్నాడు.

''మరి సాయంకాలం స్వామి వారి సేవలు ఎవరు చేస్తారు'' అడిగాడు.

''ఇవ్వాళ చిన్నికిష్టమ్మకప్పచెప్పాను. కంతేరులో నాన్న చూసుకుంటాడు'' తాపీగా చెప్పాడు రాముడు.

'అన్ని ఏర్పాట్లు చేసుకున్నావన్నమాట. నా జీవితమంతా ఎవరినో ఒకరిని కష్టపెడుతూనే ఉన్నానురా! ఇహ ముందు పరులకోసం నేను కష్టపడే యోగ్యత నాకు ఆ శ్రీరామచంద్రుడు ప్రసాదించగలిగితే చాలు నేను ధన్యుణ్ణి'' అన్నాడు అనంతం.

ఇద్దరూ సైకిళ్ళు తొక్కుకుంటూ కంతేరు పొలిమేర చేరుకున్నారు.

రాముడు సైకిలు తణుకు వైపు మళ్ళించాడు.

''అటు మళ్ళిస్తున్నావు. ఇప్పుడేపోతున్నామా తణుకు'' అడిగాడు అనంతం.

''అవును తిన్నగా తణుకు భారతిగారి ఆశ్రమానికి వెళ్ళి అక్కడే కాస్సేపు ఆ తోటలో విశ్రమిద్దాం. ఈ సంచీ చూచావా ఇందులో ఏ ముందో, మహాప్రసాదం! చక్కెరపొంగలి, పులిహోర, కడుపునిండా తిందాం. ఆమె మూడుగంటలకు ఆఫీసుకు వస్తారు. నేను కూడా అప్పుడే అమెను కలిసి చాలా రోజులయింది'' తాపీగా సైకిలు తొక్కుతూ మాట్లాడుతున్నాడు రాముడు.

అనంతం ఏమీ మాట్లాడకుండా రాముణ్ణి అనుసరిస్తూ సైకిలు తొక్కుతున్నాడు.

ఇద్దరూ కాస్సేపు మాట్లాడుకోలేదు.

''ఏమిరా! ఆయాసం వస్తోందా, ఏం మాట్లాడటం లేదు'' అడిగాడు రాముడు

''పందెం కడదామా''అన్నాడు అనంతం.

''ఇప్పుడు నీకు నాతో పందెం కట్టే స్థితిలేదు. అనవసరంగా నాతో పెట్టుకోకు ఓడిపోతావ్'' అన్నాడు రాముడు తాపీగా తొక్కుతూ.

ఒక్కసారి వేగం పుంచుకున్నాడు అనంతం.

కొంత దూరం తొక్కిఆయాసపడుతూ రాముడి కోసం ఆగాడు.

''ఒరేయ్ నేను చెప్పాను గదా! ఇది మనిషి నడిపే వాహనం. మనిషిని నడిపే వాహనం కాదు! హాయిగా తాపీగా పోదాం''అని కబుర్లు ప్రారంభించాడు రాముడు.

''చాలా చక్కగా చెప్పావురా, హాయిగా తాపీగానే పోదాం''అన్నాడు అనంతం.

''భారతిగారు ఒక మహోన్నతమైన వ్యక్తిరా. ఆమె కొంతకాలం చాలా దుర్భరమైన జీవితాన్ని గడిపారు. ఆమె తన జీవితాన్ని ఒక పాఠంగా తీసుకుని ఒక క్రొత్త జీవితాన్ని ప్రారంభించారు. నీ కథని తెలిసిన వెంటనే నాకు ఎందుకో ఆమె కథ గుర్తుకొచ్చింది'' అన్నాడు రాముడు.

''ఏమయ్యింది ఆమెకు''అడిగాడు అనంతం ఆతృతగా.

''అనంతం! నేను ఎవ్వరిని ఏ రకంగానూ ఏహ్యాభావంతో చూడలేను. అమెకు జరిగిన అన్యాయానికి ఎప్పుడూ బాధపడుతూంటాను''అన్నాడు రాముడు.

అనంతం ఏమీ మాట్లాడలేదు.

''ఈమె చాలా ఉన్నత కుటుంబంలోంచి వచ్చిన వ్యక్తిరా. ఆమె

తల్లిదండ్రులు ఎంతో సంస్కారంతో కూడిన భాగ్యవంతులు. వారికి ఈమె ఒక్కతే ఆడపిల్ల. ఎంతో గారాబంగా, బాధ్యతతో పెరిగిన వ్యక్తి. 'మంచి సంబంధం వచ్చింది, కుర్రాడు చాలా మంచి ఉద్యోగంలో, అందులోను అమెరికాలో ఉన్నాడు, అన్ని విధాలా భారతికి తగినవాడు' అని ఒక కుర్రవాడి చేతిలో పెట్టారు. భారతిగారు ఆ కుర్రవానితో అమెరికా చేరుకున్నారు. అప్పటికే ఆ అబ్బాయి ఒక చైనా అమ్మాయిని పెళ్ళి చేసుకుని కాలక్షేపం చేస్తున్నాడుట. అది ఈమె అమెరికా వెళ్ళే దాకా ఆమెకు, ఆమె తల్లితండ్రులకు కూడా తెలియదు''.

''కట్నం మాత్రం దండిగా పుచ్చుకున్నాడంటారు. భారతిగారు చివరికి ఆ కుర్రవాడింట్లో ఒక వంటలక్కపని చెయ్యటం తప్ప మరే పనిచేయలేకపోయింది. ఆమెనొక వుంపుడుకత్తెవలె చూచుతూ ఆమెతో శారీరకసుఖాలు అనుభవించటానికి చాలా ప్రయత్నాలుచేసి చాలాబాధలు పెట్టసాగాడు ఆ కుర్రవాడు. ఆ ఊళ్ళో ఎవరో ఆమెను ఆదుకుని ఆ కుర్రవాడి నిజాలు బయట పెట్టి చివరకి అమెను, విడాకులకి ప్రోత్సహించారు''.

''ఇది తెలిసి ఆమె తల్లితండ్రులు తట్టుకోలేక కృశించి, చివరికి ప్రాణాలు కూడా కోల్పోయారు''.

''ఆమె ఆ కుర్రవాని బారినుండి తప్పించుకుని బయటపడి అయిదారు సంవత్సరాల క్రితమే ఇండియాకి తిరిగివచ్చి ఈ ఆశ్రమాలు స్థాపించి మానవసేవ చేస్తూవచ్చారు. భారతిగారు ఎంతోచురుకైన వారు చాలా తెలివైన వ్యక్తి. ఆమె ఆస్థి అంతా ఈ ఆశ్రమాలకిచ్చి అనాథలకి సేవ చేస్తున్నారంటే అంతకన్న మహాతల్లిని మనం చూడము, ఆమె తల్లులకు తల్లి. ఆమె ఆశ్రమానికి ఏ లోటు లేదు. ఆమెకున్న ధనమే ఆమె ఖర్చుపెడుతుంటారు. ఇది చూచి కొందరు దాతలు ఈ ఆశ్రమానికి దానాలు ఇస్తూంటారు. కొందరు అన్నదానాలు చేస్తూంటారు. కొందరు ధనసహాయం, కొందరు బట్టలు వగైరా వగైరాలు ఇస్తూంటారు. ఆ శ్రీరామచంద్రుని దయ ఉన్నంతకాలం ఆమె శ్రమ ఫలించగలదు, నీ బోటివారు ఆమెకు సహాయం చేస్తూంటే ఆ ఆశ్రమం ఒక స్వర్గంగా మార్చగల శక్తి ఆమెకుంది''.

''ఆ ఆశ్రమానికి నువ్వు చేసిన గుప్తదానం మహోన్నతమైనది. ఆమె

సంతోషానికి అవధులుండవు'' అని చెప్పుకుపోతున్నాడు రాముడు.

వింటూ సైకిలు తొక్కుతున్నాడు అనంతం.

''ఒరేయ్! అనంతం అన్ని దానాలలోకి ఏ దానం గొప్పదిరా'' అడిగాడు రాముడు చాలా సావుకాశంగా.

''ఏమోరా! నాకు తెలియటం లేదు. నేను ఏదో గొప్పదానం ఇచ్చి మహత్కార్యం చేశానని అనుకోవటం లేదు. నాకు వద్దు అనుకున్నది వారికిచ్చాను. కాని ఆమె ఒక మహత్కార్యం తలపెట్టింది. ఆమెకునా హృదయపూర్వక నమస్కారములర్పించు కుంటాను''అన్నాడు అనంతం.

''అన్ని దానాలలోకి అన్నదానం చాలా గొప్పదంటారు ఆకలివేసే వానికి అన్నం పెడితే తృప్తి చెందుతాడు. కడుపునిండా తిని ఇహ తినలేను అని తృప్తి చెందుతాడు. దానం పుచ్చుకున్నవాడు తృప్తి చెందాలి. అది అన్నదానంలోనే ఉంది. పొట్టనిండాక ఇంక తినలేడు కనుక. మిగిలిన దానాలు నువ్వు ఎన్ని చెయ్యి దానం పుచ్చుకునే వానిలో తృప్తిఉండదు. ఇంకా కావాలి ఇంకా కావాలి అనుకుంటాడు. ఆదానానికి ప్రయోజనం ఉండదు''.

''నీవిచ్చిన సొమ్ము ఆమె ప్రత్యేకంగా ఆశ్రమవాసుల భోజనానికి ఉపయోగపడితే నువ్వు చాలా ధన్యుడవు''అన్నాడు రాముడు.

''ఆమెకున్న ఔదర్యంతో ఆమె దేనికి ఉపయోగించినా నాకు ఆనందమే'' అంటూ తృప్తిగా నవ్వాడు అనంతం.

ఇద్దరూ తణుకు చేరుకుని కేశవస్వామి ఆలయానికి దారితీశారు.

''ఈ ఆలయంలో కాస్సేపు విశ్రమించి, భోజనం చేసిన తరువాత ఆశ్రమానికి వెడదాం'' అని తీర్మానించాడు రాముడు.

''ఈ ఆలయానికి పూజారి మా పెద్దనాన్న కొడుకు అనంతాచారి. 'నీ పేరే''' అన్నాడు రాముడు.

సంగీతని తాను హిందూసంప్రదాయం ప్రకారం పునర్వివాహం చేసుకుందా మనుకున్న కేశవస్వామి ఆలయం అది.

ఒక్కసారి గంటమ్రోగించి కేశవస్వామికి సాష్టాంగ ప్రమాణం చేసుకున్నాడు.

'నేను చేసిన పనికి నన్ను శిక్షిస్తావో, క్షమిస్తావో! అంతా నీ నిర్ణయం. నేను దేనికయినా సిద్ధమే. నాకు జ్ఞానోదయం ప్రసాదించమని' మనస్సులో వేడుకున్న వెర్రివానిలా కనిపించాడు రాముడికి అనంతం.

''అనంతం! అంతా ఆదైవ నిర్ణయంరా పద ఆ మండపంలో కూర్చుని ఆత్మారాముణ్ణి సంతృప్తి పరుద్దాం'' అని ఒక నవ్వు నవ్వి ఇద్దరూ మండపం చేరుకుని భోజనం చేసి కాస్సేపు విశ్రమించారు.

''ఇహ బయలుదేరుదాం! భారతిగారు వచ్చే ముందుగా అక్కడికి చేరుకుందాం. అక్కడున్న అమ్మలను చూడవచ్చును'' అని సైకిళ్ళ మీద బయలు దేరారు.

ఆశ్రమం చేరుకుని అక్కడా, అక్కడా బయట కూర్చున్న అమ్మలను పలకరిస్తూ ఆ తోటంతా కలియ చూస్తున్నారు.

''ఇక్కడ ఈ అమ్మలకి, సేవ చేస్తూ జీవితకాలమంతా సద్వినియోగపరుచుకునే యోగ్యత ఏ కొందరికో లభిస్తుంది. ఇంతకన్న అదృష్టం ఎవరికీ రాదు. దీనిలో ఉన్న తృప్తి మరి ఎందులోనూ లేదు. ఈ అవకాశం నాకు భారతిగారు కలిపించగలిగితే దన్యుణ్ణి'' అన్నాడు అనంతం.

''ఈ అవకాశం నీకు దొరికితే నాకు నీ మీద ఒక అసూయభావం కలుగుతుందేమో'' అన్నాడు రాముడు నవ్వుతూ.

''ఆ మూల చూచావురా! అనంతం. ఆ చిన్న పర్ణశాల అదే భారతిగారి కుటీరం ఆమె ఎప్పుడూ ఇక్కడి వారందరినీ కనిపెట్టుకుంటూ అక్కడే ఉంటారు''.

అనంతం ఆపర్ణశాలకేసి చూస్తూనుంచున్నాడు.

ఎవరో ఒకామె అపర్ణశాల బయటికి వచ్చింది.

''ఆ వస్తున్న వారే భారతిగారు, అతి సామాన్యమైన వ్యక్తి'' అంటూ రాముడు భారతిగారిని సమీపించాడు.

అనంతం అక్కడే ఉండి చూస్తూనుంచున్నాడు.

''రామాచారిగారా! నమస్కారం ఎంత సేపయ్యిందండి వచ్చి'' అడిగారామె. ప్రతి నమస్కారం చేశాడు రాముడు.

''ఇదిగో ఇప్పుడే వచ్చామండి. అదిగో అక్కడ నుంచున్నాడే, అతడే మా స్నేహితుడు'' అని ఆమె వెంట నడిచాడు.

అనంతాన్ని సమీపించి భారతిగారిని పరిచయం చేశాడు రాముడు.

''రండి! మా ఆఫీసురూంకి వెళ్ళి మాట్లాడుకుందాం'' అన్నారామె.

ఆ ముగ్గురూ ఆఫీసురూము చేరుకున్నారు.

రాముడు ఆమెను అనుసరిస్తూ రూంలోకి ప్రవేశించాడు. అనంతం బయట నిలబడి ఉన్నాడు.

''అతన్ని కూడా లోపలికి పిలవండి'' అందామె రాముణ్ణి ఉద్దేశించి.

రాముడు బయటకివచ్చి అనంతాన్ని తీసుకుని లోపలికెళ్ళాడు.

చేతులు కట్టుకుని నుంచున్నాడు అనంతం. రాముడు కూడా నుంచునే ఉన్నాడు.

ఆమె వారిని చూచి ఎంతో మర్యాదగా కూర్చీలు చూపించి కూర్చోమన్నారు.

రాముడు కూర్చున్నాడు. అనంతం నుంచునే ఉన్నాడు.

''ఫరవాలేదు కూర్చోండి. ఇక్కడ మాకు ఏ ఎడమరికలు ఉండవు. మనం అంతా ఒక్కటే. మనం ఒక కార్యక్రమంలో నిమగ్నమయి ఉన్నాము. నువ్వు, నేను అన్న బేధాలు లేవు ఇక్కడ, మీరు కూర్చుంటే నేను చాలా సంతోషిస్తాను'' అందామె.

కూర్చోమని సౌంజ్ఞ చేశాడు రాముడు.

అనంతం ఎంతో సంతోషపడుతూ కూర్చున్నాడు.

''ఇతను మా స్నేహితుడు, ఇతనికెవ్వరూ లేరు, ఏమీ లేనివాడు. అక్షరజ్ఞానం ఉన్నవాడు. నిన్న నేను ఫోనులో చెప్పినది ఇతని గురించే. మీరు ఏ పని ఇచ్చినా చేసే

వ్యక్తి, అందులో సందేహంలేదు'' అన్నాడు రాముడు.

'తమపేరు' అడిగిందామె.

కొంచెం తటపటాయించాడు అనంతం.

'కృష్ణుడు' అన్నాడు రాముడు.

రాముడికేసి చూచి ఒక్కసారి నవ్వి అనంతం కేసి చూచి అడిగిందామె.

''ఎంతవరకు చదువుకున్నారు''అని.

''తెలుగు, ఇంగ్లీషు చదవ గలను, రాయగలను మాట్లాడగలను''అని ఊరుకున్నాడు అనంతం.

''సంస్కృతం కూడా వచ్చినవాడు''అన్నాడు రాముడు.

''మీరు ఏం పనులు చేయగలరు'' అడిగిందామె.

''తోటపని చెయ్యగలను. చిన్నపాపలకు చదువు నేర్పగలను, బజారుపని కూడా చెయ్యగలను'' అని ఎంతో నమ్రతగా మాట్లాడాడు అనంతం.

రాముడు వెర్రిమోహం వేసుకుని చూస్తూ కూర్చున్నాడు.

''మీరు ఎక్కడ ఉంటారు'' అడిగిందామె.

''కంతేరులో'' అన్నాడు అనంతం.

''మరి ఎలా వస్తారు, సైకిలుందా''

''ఉందండి''

''మీరు ఎన్ని గంటలు పని చెయ్యగలరు''.

మాట్లాడలేదు అనంతం.

''ఇతడు సాయంకాలం ఆరుగంటల నుంచి కంతేరులో తన ఇంట్లో ఒక పాఠశాల నడుపుతుంటాడు. అందులో చదువుకునే విద్యార్థులు, విద్యార్థినులు ఆ చుట్టు ప్రక్కల కూలి చేసుకుని బ్రతుకుతున్నవారు. వారితో పాటు చిన్న పిల్లలు కూడా వస్తూంటారు. వారందరికి ఉచిత విద్య నేర్పుతుంటాడు'' అన్నాడు రాముడు.

ఆమె ఒక్కసారి కళ్ళజోడుతీసి టేబులుమీద పెట్టి, పెన్నుమూసి, కుర్చీమీద వెనుకకు జార్లబడి అనంతంకేసి చాలాలోతుగా చూచింది.

అనంతం తలదించుకున్నాడు.

''మీరు ఉచిత పాఠశాల పెట్టి ఎలా బ్రతుకుతున్నారు'' అడిగిందామె.

''పౌరోహిత్యం చేస్తూంటాను''

''ఇది మా తాతలనాటి నుంచి వస్తూన్న వార్షికం.''

ఒక్కసారి తలవంచుకుని కళ్ళు మూసుకున్నారామె.

రాముడు అనంతంకేసి జాలిగా చూచాడు.

అనంతం తలవంచుకున్నాడు.

ఆమె తలపైకెత్తి అనంతాన్ని ఉద్దేశించి ''మీరు ఉదయం మీ కార్యక్రమాలు ముగించుకుని ఆశ్రమానికి మధ్యాహ్నం ఒంటిగంటకి రాగలరా''అడిగిందామె.

తలవూపాడు అనంతం.

''మళ్ళీ మీరు అయిదుగంటలకు మీ వూరుచేరుకుని మీ కార్యక్రమాలు నిర్వహించుకోవచ్చును. ఇక్కడ ఆశ్రమవాసులకు కూడా మీరు మీకు తోచిన విద్యని ప్రసాదించవచ్చును. ఇక్కడున్న మా అమ్మలకి వారి వారి పిల్లలకు ఉత్తరాలు రాసి పెట్టవచ్చును. మీకు అడ్డులేదు. మీరు ఏం చేసినా నాకు ముందుగా చెప్పనవసరం లేదు. ఇది ఒక సేవా ఆశ్రమం. మాకు సేవా దృష్టికలవారు కావాలి. మీలో ఆదృష్టిని నేను చూస్తున్నాను. మీ బోటి వారు మాకు చాలా అవసరం. మాకు వ్యాపార దృష్టిలేదు. ఇది మీకు ఇష్టమేనా'' అడిగారామె.

''ఇది నేనొక మహాప్రసాదంగా భావిస్తాను'' అని ఎంతో సంతోషపూర్వకంగా నమస్కారం చేశాడు అనంతం.

''జీతమెంత? అని మీరు అడగలేదు'' అందామె.

అనంతం మాట్లాడలేదు.

''ఇతను చాలా అభిమానవంతుడు అవేమి తెలియవితనికి. అంతా మీ దయ'' అని ఒదిలి పెట్టాడు రాముడు.

''ఈ దేశం ఒక మహోన్నతమైన దేశం. ఇక్కడికి ఎవరొచ్చినా నేను వారిని మహానుభావులుగా భావిస్తాను. అది మన అదృష్టంగా అనుకుంటాను నేను'' అందామె.

''రామాచారిగారు! మీరు ఒక్క పదినిమిషాలు ఓపికపడితే ఈ మధ్యగా జరిగిన ఒక సంఘటన చెబుతాను''అందామె.

''మహాభాగ్యం చెప్పండి''అన్నాడు రాముడు.

''ఎవరో ఒక మహాపురుషుడు మా ఆశ్రమానికి లక్షలు లక్షలుగా రూపాయలు గుప్తంగా దానం చేశాడు. అతను అమెరికాకి సంబంధించిన భారతీయుడు. అమెరికాలో ఉన్న భారతీయుడు ఇంతగా మహోన్నతమయిన సత్కార్యానికి తోడ్పడుతున్నాడంటే నాకు చాలా ఆశ్చర్యం వేసింది. దీనితో మన ఆశ్రమం అనాథలకి మరింత సేవ చేయ గలదని భావిస్తున్నాను. ఆ మహాపురుషునికి నేను ఆశ్రమం తరపున ఏవిధంగా ఋణం తీర్చుకోవాలో అర్థంకావటం లేదు. ఆ మహాపురుషునికివే నా నమస్కృతులు''అని చేతులెత్తి నమస్కరిస్తూ నుంచున్నారామె.

రాముడు, అనంతం ఒకరినొకరు చూచుకుని ఆమెతో బాటునుంచున్నారు. ఇద్దరూ ఆమెకు నమస్కరించారు.

''చాలా సంతోషకరమైన వార్త చెప్పారు. మీ ఆశ్రమం మరింతగా వృద్ధి చెందాలని ఆ శ్రీరామచంద్రమూర్తిని ప్రార్థిస్తాను. ఒక్కసారి ఆశ్రమంలో నా కార్యక్రమం ముగించుకుని అమ్మలని దర్శించి, మా వూరు వెడతాం. ఇతనికి ఒక ఉపాధి కల్పించి నందునకు నా దన్యవాదాలు''అన్నాడు.

''ఇవాళ సుదినం, అంతా ఆ దైవకృప, వెళ్ళిరండి''అని వారిని పంపారామె.

స్నేహితులిద్దరూ ఎంతో తృప్తిగా బయటకు నడిచారు.

రామాచారి ఎప్పటి లాగే అక్కడున్న అమ్మలందరినీ పలుకరించుకుంటూ వెళ్ళాడు. అనంతం రాముణ్ణి అనుసరించాడు. టర్మినల్ వార్డులో ఉన్న

రాజేశ్వరమ్మగారి వద్దకు వెళ్ళారిద్దరు. అనంతం ఉప్పొంగిపోతూ అమ్మకి నమస్కరించాడు. రాముణ్ణి గట్టిగా పట్టుకుని సంతోషంగా ఆలింగనం చేసుకున్నాడు.

''నువ్వెంతో అదృష్టవంతుడివిరా అనంతం, రాజ్యం పిన్నితోబాటు ఎంతో మంది అమ్మలకి సేవ చేసుకుంటావు'' అన్నాడు.

ఇద్దరూ రాజ్యం పిన్నికి నమస్కారం చేసి బయటకు నడిచారు.

# 18

రోజులు గడుస్తున్నాయి. అనంతం ప్రతి రోజు కంతేరు నుంచి సైకిలు తొక్కుకుంటూ ఆశ్రమానికి చేరుకునేసరికి సరిగ్గా ఒంటిగంట అవుతుంది.

''బాబు! అనంతం! నిన్ను చూచి మా గడియారం సరిదిద్దుకుంటామయ్యా'' అంటూంటారు. మేనేజరు బుచ్చిబాబు గారు నవ్వుతూ.

ముందుగా భారతిగారిని చూచి నమస్కరించి, పలకరించి వెంటనే టెర్మినల్ వార్డుకి వెళ్ళి రాజేశ్వరమ్మగారిని చూచి మనస్సులో నమస్కరించుకుని, ఆ వార్డులో ఉన్న ఇద్దరు ముగ్గురు బాగా ఒడిలిపోయిన అమ్మలను పలుకరించి, మిగిలిన వార్డులలో అందరి అమ్మలను ఒక్కొక్కరినే పేరు పేరుగా పిలిచి తానుచేయవలసిన కర్తవ్యం తెలుసుకుని తన పనులలో నిమగ్నమయి కాలం గడుపుతూ వస్తున్నాడు.

అనంతం ఆశ్రమానికి వచ్చాక భారతిగారు భోజనానికి వెడతారు. ఇది ప్రతిరోజు జరిగే కార్యక్రమం.

ఆరోజు రామాచారి భారతిగారికి రాసి ఇచ్చిన ఉత్తరం అందించి తన కార్యక్రమాలు ప్రారంభించాడు.

'అమ్మ రోజురోజుకు క్షీణించిపోతోంది' అని బాధపడుతున్నాడు. ఆ రోజు రాజేశ్వరమ్మగారు ఊపిరి అందక బాధపడటం గ్రహించి హడావిడిగా వెళ్ళి భారతిగారికి కబురందించాడు.

''కృష్ణా! మీరు ఏమీ అందోళన చెందవద్దు. ఆమెకు ఇలా అప్పుడప్పుడు జరుగుతూంటుంది. కాస్సేపట్లో డాక్టరుగారు వచ్చి చూసుకుంటారు. మీరు భయపడకండి అన్నీ సజావుగా జరుగుతాయి. ఆ టెర్మినల్ వార్డులో అమ్మలను మన శక్తి వంచన లేకుండా కాపాడటానికి మనం, మన ప్రయత్నాలు చేస్తాము. రాజేశ్వరమ్మ గారి పరిస్థితి ఈ మధ్య కాలంగా రోజురోజుకు క్షీణిస్తోంది. ఆమె మూడు నెలలుగా అలా మంచాన్ని అంటుకుని స్పృహ తెలియక బాధపడుతున్నారు. కొడుకు అమెరికాలో ఎడ్రస్సు తెలియకుండా ఉన్నాడని అంటారు. భర్తపోయాక ఆమె ఈ ప్రపంచంలో లేరు. దుర్మార్గం పెరిగిపోయి ఒళ్ళుపై తెలియని పరిస్థితులలో ఉంటూంటారు కొందరు వ్యక్తులు అమెరికాలో. నాకు ఆదేశమన్నా, అక్కడున్న మన భారతీయులన్నా మహా చికాకు. నేను ఎప్పుడూ ఏదేశాన్ని, ఏమనిషిని ధూషించిగాని, భూపించి కాని ఎరుగను. ధూషించటం నాలోని బలహీనతని సూచిస్తుంది. నేను ఏమీ చెయ్యలేను. కొన్ని పరిస్థితుల ప్రభావాలు నన్ను తోటి మానవుల్ని కూడా దూరం చేస్తున్నాయి. అది నా ప్రారబ్దం అనుకుంటూంటాను'' అని ఎరితో బాధగా చెప్పుకుంటూ ఒక్కసారి మళ్ళీ ఈలోకంలోకి వచ్చారు.

''మనకవన్నీ అనవసరం. మనకున్నది ఇక్కడి అమ్మలు, అనాథలు. వారికి సేవ చేసి మిగిలిన విషయాలు మరిచిపోదాం. ఇది ఆభగవంతుడు ఎంతవరకు తీసుకువెళ్ళగలడో అంత వరకు ప్రయాణం చేద్దాం. ఆ తరువాత ఎదీ మన చేతులలో లేదు''.

''కృష్ణా మీ దీక్ష నన్నోక చైతన్యవంతురాలిగా చేస్తూంది. మీ బోటివారు నాకు కావాలి'' అన్నారు అనంతం ఇచ్చిన కవరు విప్పుతూ.

కళ్ళజోడు పెట్టుకుని ఉత్తరం చదువుకున్నారు.

''కృష్ణా! ఈ రోజు కాకిలేరు రామాలయంలో భగవద్గీతా పారాయణం సాయంకాలం ఆరుగంటలకు జరుగుతుంది. మీరు కూడా అక్కడికి వస్తారని తలుస్తాను. ఈలోగా ఆ మేరీయమ్మని కలవండి'' అని చెప్పి భోజనానికి వెళ్ళారు భారతిగారు.

ఆమెకేసి చూస్తూ కొంతసేపు నిలబడిపోయాడు.

అమ్మని చూస్తే ఏడుపొచ్చింది అనంతానికి. అక్కడి నుంచి కదిలి మేరియమ్మ దగ్గరకి చేరి ఆమెని పలుకరించాడు.

''అవమ్మా! మేరీయమమ్మా! అబ్బాయి దగ్గర నుంచి ఉత్తరం వచ్చిందా?'' అడిగాడు.

''లేదు. ఇంకో ఉత్తరం రాసిపెట్టుబాబు!'' అడిగింది ఆమె.

''అడ్రస్సు మారిందేమోనమ్మా'' అన్నాడు అనంతం.

''నాకు తెలవదు. ఆ ఒక్క అడ్రస్సే నాదగ్గిరుంది, రాసిపెట్టుబాబు'' అంది దీనంగా. అనంతం మనస్సు మనస్సులో లేదు. ఎక్కడికోపోయి సంచారం చేస్తూంది. ఒక్కసారి తమాయించుకుని మేరీయమ్మ చెప్పిన ప్రకారం ఉత్తరం వ్రాయటం మొదలు పెట్టాడు.

ప్రతి మంచానికి ప్రక్కనే ఒక చిన్నటేబులు, దాని మీద కొన్ని కాగితాలు, పెన్ను ఉంటాయి. కొందరు చదువుకున్న అమ్మలు వారిఅవసరాలు ఆకాగితాల మీద రాస్తారు. కొందరు చదువురాని అమ్మలు ఆ కాగితాల మీద ఒక టిక్ పెడతారు. అప్పుడు అక్కడున్న వారు ఆ టిక్కు చూచి వారిఅవసరాలు అడుగుతారు.

ప్రతి టేబులు మీద ఒక బెల్లుంటుంది. అది అత్యవసరాలకి వాడతారు.

కిరిష్టియన్ మిషనుకు చెందిన దొరసాని అమ్మలతో మేరియమ్మ కొడుకు, కోడలు, ఊరురా, దేశదేశాలు కూడా తిరుగుతుంటారు. అసలు వారికి తీరిక ఉండదు. వారు తణుకు వాసీలు అవటం మూలాన మేరీఅమ్మని ఈ ఆశ్రమంలో ఉంచటం జరిగింది. మేరీఅమ్మ తణుకు వదిలి ఎక్కడికీ పోదు. భారతిగారి ఆశ్రమం తప్ప మరే ఆశ్రమంలోనూ ఉండటానికిష్టపడదు.

''ఈ ఉళ్ళో తాలుకాఫీసులో ఉన్న ఉద్యోగం వదులుకుని భార్యాభర్తలిద్దరూ తిరగని ప్రదేశం లేదు బాబు. అందులో వచ్చే డబ్బు తాలుకాఫీసులో రాదుటండి. సరే! మీ ఇష్టం. నన్ను మాత్రం బాధపెట్టకండి అని చెప్పాను. నేను ఈ ఊరు విడిచి ఎక్కడికీ పోను. నన్ను భారతిగారు కంటికి రెప్పలా చూచుకుంటారు. వాళ్ళు అప్పుడప్పుడు డబ్బు పంపిస్తూంటారు బాబు. ప్రేమాభిమానాలుండవు. కొడుకుగదా! నాకు తప్పుతుందా బాబు. కడుపులో పేగు రెపరెపలాడుతూ వుంటుంది. ఈ ఒక్క ఉత్తరం రాసి పెట్టండి బాబు'' అని అడిగింది ఆమె.

ఆమె చెప్పినట్లే రాసి ఉత్తరం యధావిధిగా పోష్టుచేశాడు.

మేరియమ్మ ఎంతో సంతోషించి దీవించింది.

ఆరోజు పని ముగించుకుని అయిదుగంటలకు బయలుదేరి తిన్నగా కాకిలేరు రామాలయం చేరుకున్నాడు అనంతం.

''తొందరగా తెములు. స్నానంచేసి దర్శనం చేసుకుని అక్కడ ఆరేసిన పంచి కట్టుకుని తెమిలికూర్చో. అప్పుడే భక్తులు రావటం మొదలుపెట్టారు'' అని కొంత హడావిడి చేశాడు రాముడు.

ఆరుగంటలకు భగవద్గీతా పారాయణం మొదలుపెట్టాడు అనంతం.

అనంతం కంఠం చాలా శ్రావ్యంగా ఉంటుంది. వేదం ఎంతో చక్కగా చదువుతాడు. భగవద్గీత, రామాయణ, భారతం సంస్కృతంలో చదివి బాగా అర్థం చేసుకుని దాని పర్యవసానం క్షుణ్ణంగా తెలుసుకున్న వ్యక్తి. తాతగారి దగ్గిర చేసిన శిష్యరికమేగాక అమెరికాలో ఉన్నప్పుడు ఎంతో వంటబట్టించుకున్న మేధావి అనంతం.

''ఒరేయ్! అనంతం నువ్వు వచ్చావంటే నాకు ఇంకేమి అక్కర్లేదురా. ఈ రామాయణ, భారత, భగవద్గీత పారాయణలు, నీ కప్పగించేస్తున్నాను. నాకు నీకున్న విద్వత్తులేదు. ఈ వ్యవహారం నువ్వే చూసుకో'' అన్నాడు రాముడు.

ప్రతివారం ఈ పారాయణం జరుగుతూంటుంది. ఆఖరిని పళ్ళెం త్రిప్పుతుంటారు.

''ఈ పళ్ళెంలో వచ్చిన సొమ్మునీదే, నాకు దానితో నిమిత్తంలేదు'' అని ఖచ్చితంగా చెప్పేశాడు రామాచారి అనంతంతో.

అనంతం భగవద్గీత పారాయణంలో నిమగ్నమయ్యాడు. అతని ఉచ్ఛారణకి, రాగయుక్తంగా పలికే ఆశ్లోకాలకి, అదే రాగబద్ధంగా చెప్పే వచనాలు, నిర్వచలాలకి ముగ్ధుడయి ఎంతో శ్రద్ధగా వింటూ గర్భగుడిప్రక్కగా గోడకి చేరగిలబడి కూర్చున్నాడు రామాచారి.

గీతాపారాయణం జరుగుతోంది.

''భౌతిక జీవితమునకు సంబంధించిన అజ్ఞానము నుండి మానవజాతిని ఉద్ధరించటయే భగవద్గీత ప్రయోజనము. అనగా జీవితమునందలి దేహాభిమానము నుండి విముక్తి కలుగుటకై భగవద్గీత బోధింపబడినది''.

''భౌతిక ప్రకృతికి బద్ధమైన జీవితము నుండి ముక్తుడు కాగోరువాడు, స్వతంత్రముగ నుండతలచువాడు మొదటగా తానీ భౌతికదేహము కాదని గుర్తింపవలయును. ఇదియే భగవద్గీతా సారాంశము''.

కురుక్షేత్ర యుద్ధారంభమున అర్జునుడు తన సారథియైన శ్రీ కృష్ణపరమాత్మునితో చెప్పుచున్నాడు''.

అర్జును ఉవాచ

శ్లో : కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా
యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ

త ఇమే వస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వాధనాని చ
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః

మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబధిన స్తథా
ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతో పి మధుసూదన

అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహకృతే
నిహత్య ధార్తరాష్ట్రాన్నః కాప్రీతిః స్యాత్ జనర్ధాన

తాత్పర్యము : ఓ గోవిందా! మేమెవరి కొరకు రాజ్యమును, సౌఖ్యమును, జీవితమును కోరుచున్నామో వారందరునూ యుద్ధరంగమున సన్నద్ధులై యుండగా ఆ రాజ్యాదుల వలన మాకేమి ప్రయోజనము ? ఓ మధుసూదనా! గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మనుమలు, బావమరుదులు ఇంకను ఇతర బంధువులందరును ప్రాణమును, ఆస్థులను విడచుటకు సంసిద్ధులై నా ఎదుట నిలబడియుండగా, వారు నన్ను చంపగోరువారైనప్పటికీని నేను వారిని చంపగోరనేల?

ఓ జనార్ధనా! కేవలం మీ భూలోకరాజ్యమటుండ ముల్లోక రాజ్యాధిపత్యమున కైనను నేను వారితో యుద్ధము చేయుటకు సిద్ధపడలేకున్నాను. ధృతరాష్ట్ర కుమారులను చంపుటవలన మే మెట్టి ఆనందమును పొందగలము?

• • • • •
• • • • •

గర్భగుడికి తిన్నగా బయటకుపోయే ఆలయ ద్వారం తెరిచి ఉంటుంది. ఆ రోడ్డు మీద పోయే ప్రతి మనిషి స్పష్టంగా కనిపిస్తూంటాడు.

'భారతిగారు ఇంకా రాలేదు' అనుకుని అక్కడి నుంచే కూర్చుని ఎదురు చూస్తున్నాడు.

'భగవద్గీతా పారాయణం ప్రారంభమయి అప్పుడే పదిహేను నిమిషాలు దాటింది. ఆమెకూడా వస్తే ఎంత బాగుణ్ణు' అనుకుంటున్నాడు రామాచారి.

ఇంతలో ఒక కారు గేటుకు ఎదురుగా ఆగింది. కారు తలుపు తీసుకుని భారతిగారుదిగారు.

ఎంతో ఉప్పొంగిపోతూ హడావుడిగా బయటకు వెళ్ళాడు రామాచారి.

''ఆలస్యమయింది క్షమించండి'' అన్నారామె.

''ఎంతమాట ఏమీ ఆలస్యం కాలేదు. మీరు వచ్చారు. అదేపదివేలు రండి లోపలికి దయచేయండి'' అన్నాడు.

• • • • •
• • • • •

శ్లో : కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః
ధర్మేనష్టే కులం కృత్స్నం అధర్మో భిభవత్యుత

తా : వంశము నాశనముగటవలన శాశ్వతమైన వంశాచారములు చెడిపోవును. ఆవిధముగా వంశములో మిగిలి ఉన్నవారు నాస్తికులగుదురు.

అనంతం వర్ణించే శ్లోకం బయటకి ఎంతో స్పష్టంగా వినపడింది.

ఒక్కసారి కళ్ళుమూసుకుని ఆ మైకులోంచి వచ్చే శ్లోకం వింటూ నుంచున్నారామె. ఆ క్షణంలో అప్రక్కనే మాట్లాడకుండా నిలబడి ఉన్నాడు రామాచారి.

''మీరు పారాయణం చెయ్యటం మానుకున్నారా? ఎవరాయన?'' అడిగారామె.

''ఎంతో విద్వత్తుగల ఒక మహాజ్ఞాని అతడు. నా అదృష్టం కొద్ది దొరికాడితడు. రండి విందురుగాని'' అని ఆమెను ఆలయంలోపలికి తీసుకుని వెళ్ళాడు.

ఆలయంలోకి వచ్చే ద్వారంకి కొంచెం అటుగా ఉంటుంది మండపం. ఆమండపానికి ఎదురుగా పరుచబడిన బరకాల మీద భక్తులు కూర్చుని ఎంతో శ్రద్ధగా వింటూ ఆనందిస్తున్నారు. ఆలయంలోకి ఎవరు వచ్చేది వెళ్ళేది కనబడదు ఆమండపంలో కూర్చున్న వారికి.

ఆమె ఆలయంలో అడుగుపెట్టగానే అప్రక్కగా మండపంలో శ్లోకాలు అలపిస్తూ నిర్వచనం చెబుతున్న అనంతాన్ని చూచి ఆశ్చర్యపోయారు.

''ఎవరూ! కృష్ణగారా!''అన్నారు ఆశ్చర్యంగా.

''అవునండి, మీ కృష్ణ అదే మన కృష్ణ, గీత బోధించిన వాడు శ్రీకృష్ణ పరమాత్మేకదా'' అన్నాడు హాయిగా నవ్వుతూ.

''మీరు మాట వరసకైనా నాతో ఒక్కసారి కూడా చెప్పలేదు. కనీసం ఉత్తరంలో కూడా కృష్ణగారు పారాయణం చేస్తారని వ్రాయలేదు. పైగా కృష్ణగారు కూడా నిన్న నాకు ఈ విషయం చెప్పలేదు. చాలా ఆశ్చర్యంగా ఉంది'' అన్నారామె రామాచారి కేసి తమాషాగా చూచి

''కృష్ణకు ఈ పద్ధతులు అంతగా నచ్చవు. అందుకే మీకు ఉత్తరం రాసి పంపాను'' అన్నాడతను ఎంతో సంబరపడుతూ

''రండి అక్కడ మీకు ప్రత్యేకస్థానం ఉంది కూర్చుందురుగాని '' అని ఆహ్వానించాడు.

''రామాచారి గారూ! నేను ఆ మండపానికి ఎదురుగా వెళ్ళి ఆయనకెదురుగా కూర్చుని ఆయన దీక్షని, ఏకాగ్రతని పాడుచేయదలుచుకోలేదు. నేను ఇక్కడే ఈ గర్భగుడి దగ్గిరే కూర్చుని ఆయనకు కనపడకుండా వింటాను. మీరు నన్ను క్షమించాలి'' అని అక్కడే కూర్చుని ఏకాగ్రతగా వింటున్నారామె.

రామాచారి ఎప్పటిలాగే తన స్థానంలో కూర్చుని ఉన్నాడు.

• • • • •
• • • • •

శ్లో : ఉత్పన్నకుల ధర్మాణాం మనుష్యాణాం జనార్ధనా!
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ

తా : ప్రజలను కాపాడుచుండు ఓ కృష్ణా! కులాచారములకు భంగము కలిగించు వారు శాశ్వతముగా నరకలోక నివాసులగుదురని పరంపరాగతముగా నేను విని యున్నాను.

• • • • •
• • • • •

శ్రీ భగవాను ఉవాచ

శ్లో : క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప

తా : ఓ పార్థా! నీచమైన ఈ నపుంసకత్వమునకు లోబడకుము. ఇది నీకు తగదు. ఓ పరంతప! తుచ్ఛమైన హృదయదౌర్బల్యము విడిచి యుద్ధము చేయుము.

భాష్యము : పూజ్యులైన భీష్మాది గురువుల యెడల, బంధువుల యెడల తనకు గల ఉదారస్వభావముచే తాను యుద్ధమును వర్జించుచున్నానని అర్జునుడు వాదింపవచ్చును. కాని కృష్ణుడు అట్టి ఔదార్యమును హృదయ దౌర్బల్యముగా భావించెను. ఏ ప్రమాణ గ్రంథమును మిధ్యాభూతమైన అట్టి ఔదార్యమును అంగీకరింపదు. అందుచే కృష్ణుని ప్రత్యక్ష మార్గదర్శకత్వమున నున్న అర్జునుని వంటి వ్యక్తులు అట్టి ఔదార్యమును గాని, అట్టి అహింసనుగాని విడిచి పెట్టవలయునని పరమాత్మ యొక్క భావము.

• • • • •

• • • • •

శ్లో : నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోన్తస్త్వనయో స్తత్వదర్శిభిః

తా : భౌతిక శరీరమునకు ఉనికి లేదనియు, శాశ్వతమైన ఆత్మకు మార్పులేదనియు నిశ్చయింపబడినది.

• • • • •

• • • • •

శ్లో : జాతస్య హి ధ్రువో మృత్యు ధృవం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేర్థే న త్వం శోచితు మర్హసి

తా : పుట్టినవాడు చావక తప్పదు. మరణించిన మిమ్మట మరల అతడు జన్మింపకను తప్పదు. అందుచే పరిహరించుటకు వీలులేని ధర్మ నిర్వహణము నందు నీవు దుఃఖింపరాదు.

• • • • •

• • • • •

శ్లో : త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యోభవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్

తా : ఓ అర్జునా! వేదములు ప్రధానముగా సత్త్వ రజస్తమోగుణములను ప్రకృతి గుణములను గూర్చి తెలుపును, నీవు ఈ మూడు గుణములకు అతీతుడవుకమ్ము. సుఖదుఃఖాది ద్వంద్వములను, లాభక్షేమములను గూర్చిన కుతూహలము లేనివాడవై ఆత్మనిష్ఠుడవు కమ్ము!

• • • • •
• • • • •

శ్లో : కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్

తా : అర్జునా ! రజోగుణ సంపర్కము వలన పుట్టిన కామమే (కోరిక) కోపముగ పరిణమించును. అది ఈ ప్రపంచమునకు సర్వమును మ్రింగునట్టియు, పాపముతో కూడినట్టియు గొప్ప శత్రువు.

• • • • •
• • • • •

శ్లో : ఇన్ద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతైర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినామ్

తా : ఇంద్రియములు, మనస్సును, బుద్ధియు ఈ కామమునకు స్థావరములు. వీని ద్వారా కామము జీవుని యదార్థ జ్ఞానమును కప్పిపుచ్చి అతనిని కలత పెట్టును.

భాష్యము : భౌతిక ప్రకృతికి బద్ధమైన ఈ దేహమునకు సంబంధించిన ఇంద్రియములు కామమునకు మూల కారణములగును. ఇంద్రియ ప్రవృత్తులకు లోబడి క్రియారూపము దాల్చునదిగా వాంఛించు స్వభావము

కలది మనస్సు, మనోవాంఛను క్రియారూపము దాల్చునదిగా నిర్ణయించునది బుద్ధి.

బుద్ధి కామ సహితములయిన ప్రవృత్తులకు కేంద్రమగును. కామ సహితమైన బుద్ధి జీవాత్మ మిధ్యాహంకారమును పొంది లౌకిక వస్తుజాలముతోడను, తద్వారా మనస్సుతోడను, ఇంద్రియములతోడను. తాదాత్మ్యము చెందునట్లో నరించును.

ఈ జీవాత్మ లౌకిక భోగానుభవము నందు తగుల్కొని అదియే నిజమైన సౌఖ్యమని భ్రాంతినొందును.

• • • • •
• • • • •

శ్లో : ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా.
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్.

తా : గొప్ప బాహుబలముగల ఓ అర్జునా ! ఈ విధముగా లౌకికములయిన ఇంద్రియ ముల కంటెను, మనస్సు కంటెను, బుద్ధికంటెను, ఆత్మ అతీతమని తెలిసికొనిన మానవుడు అత్యున్నతమైన ఆధ్యాత్మిక బుద్ధిచే మనస్సును నిశ్చలమొనరించుకొని, ఆవిధముగా ఆధ్యాత్మిక బలమును సంపాందించుకొని, అపణ్యశక్యముగాని కామ మను శత్రువును జయింపవలెను.

• • • • •
• • • • •

శ్రీ భగవానువాచ

శ్లో : బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప

తా : శత్రు విజేతవైన ఓ అర్జునా! నీవును నేనును పెక్కు జన్మము లెత్తితిమి. అవి యన్నియును నాకు జ్ఞాప్తియందున్నవి. నీకు జ్ఞప్తియందు లేవు.

శ్లో : అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా

తా : నేను పుట్టుకలేని వాడనైననూ, నా లోకతీతమైన శరీరమెప్పుడు నాశమునొందక పోయినను జీవులందరికి నే నధీశ్వరుడనైనను, నేను ప్రతి యుగమునందును అతిలోకమైన నామూల రూపముతో అవతరించుచుందును.

శ్లో : యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం

తా : భరత వంశీయుడవైన ఓ అర్జునా ! ఎప్పుడెప్పుడు ధర్మాచరణమునకు హానియు, అధర్మమునకు అభ్యుదయమును కల్గుచుండునో అప్పుడు నే నవతరింతును

శ్లో : పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

తా : పవిత్రులయిన భక్తులను రక్షించుట కొరకును, దుష్టులను శిక్షించుట కొరకును, ధర్మ సిద్ధాంతములను పునః ప్రతిష్ఠించుట కొరకును ప్రతి యుగమునందును నేనే స్వయముగా నవతరించుచుందును''.

పుస్తకం మూసి అక్కడ కూర్చున్న భక్తులకు నమస్కరించి

''భగవంతుడు మానవునకు ప్రసాదించిన స్వల్పమైన వక్తిత్వమే మానవ వికాసమునకు గాని, మానవ వినాశనమునకుగాని తోడ్పడుచుండును.

అలోచనా శక్తితో కూడి, విచక్షణా జ్ఞానముతో కలిగిన మనస్సే ఈ స్వల్పమైన వ్యక్తిత్వముతో కూడినదిగా భావింపవచ్చును.

మానవునకు, ఇతర జీవములకు గల బేధము ఇచట మనము గ్రహింపగలము.

మనస్సు భౌతిక ప్రకృతికి బద్ధమై యున్నను, ఆధ్యాత్మిక భౌతిక ప్రపంచముల ...యికగా పరిగణింపవచ్చును.

ఆత్మాహుతికి, అనగా ఆత్మవంచనకు ఏ మాత్రము వెనుదీయక తనకు గల స్వల్ప... వ్యక్తిత్వమును వృధా చేయుచు తాత్కాలికమైన ఆనందమును, లబ్ధి పొందుటకై అధర్మమమునకు అక్రమ చర్యలకు పాల్పడి మనస్సు మానవుని కలత పెట్టుచుండును.

దీనికంతటికి కారకులైన ఇంద్రియములను నిగ్రహించు శక్తి కొరకు మానవుడు తన మనస్సుకు గల స్వల్పమైన వ్యక్తిత్వమును సద్వినియోగపరచుకొనగలిగి మనసా, వాచా, కర్మ తనకు గల ధర్మమును పాటించిన ఈ భౌతిక ప్రపంచమునుండి ఆధ్యాత్మిక ప్రపంచము చేరుకొని శాశ్వతానందము నొందగలడు అని పరమాత్మ మానవులకు గీతోపదేశము ద్వారా తెలియ జేయుచున్నాడు.''

''ఇది మున్ముందు వచ్చు అధ్యాయములకు ఉపోద్ఘాతముగా భావించవలసినదిగా సభా సదులకు నా విన్నపములు'' అని భగవద్గీతా పారాయణము ముగించాడు అనంతం.

''ఇంతటితో ఈనాటి భగవద్గీతా పారాయణం ముగిసింది. మొదటి మూడు అధ్యాయములు, నాల్గవ అధ్యాయం ప్రారంభ దశ వరకు సంగ్రహముగా అక్కడక్కడ శ్లోకములు వర్ణించుకుంటూ ఉపోద్ఘాతముగా చెప్పియుంటిని''.

''ఇది ఒక మహాసముద్ర యోగము. ప్రతి అధ్యాములోను ప్రతి శ్లోకము వివరముగా భాష్యముతో సహా మున్ముందు మనము చెప్పుకొనుటకు రామచంద్రుడు మనకు ఆశీస్సులు అందించుగాక అని కోరుకుంటూ, మీ వద్ద సెలవు తీసుకుంటున్నాను'' అని ముగించి ఒక్కసారి భక్తులను చూచి తన్మయత్వం పొందాడు అనంతం.

ఆ రోజుకు భగవద్గీతా పారాయణం ముగిసింది. భారతిగారు ఆనందభాష్పాలని తుడుచుకుంటూ లేచారు.

భక్తులు లేస్తున్నారు అని గ్రహించి హారతి ఇచ్చి గంటవాయించి హారతి పళ్ళెం భక్తుల మధ్యగా నడుస్తూ త్రిప్పివచ్చి ప్రసాదాలు పంచి పెట్టాడు రామాచారి.

అనంతం హారతి నందుకుని ప్రసాదం తీసుకున్నాడు. భక్తులందరూ అనంతానికి నమస్కరించి బయటకు వెళ్ళారు.

గర్భగుడికి ఎదురుగా నుంచుని ఉన్నారు భారతిగారు.

అనంతం పుస్తకం మూసి మండపం నుంచి కదిలి గర్భగుడికి చేరాడు.

''కృష్ణగారికి నమస్కారాలు''అన్నారామె.

ప్రతి నమస్కారం చేశాడు అనంతం.

''మీ రాక మమ్ములనెంతో ఆనందపరచింది''అన్నాడు అనంతం.

''ఆ శ్రీకృష్ణ పరమాత్ముడు గీతని బోధించిన సమయంలో ఆ అర్జునకు కలిగిన అనుభూతి ఎలా ఉంటుందో అన్నది ఈ రోజున అర్థం చేసుకోగలిగాననిపిస్తుంది.''

''అది సరే... తెలుగు, ఇంగ్లీషు చదవటం, రాయటం, మాట్లాడడం వచ్చునన్నారు. మీకు సంస్కృతం కూడా వచ్చునండీ అన్నారు రామాచారి గారు. పోనీ ఇప్పుడైనా చెప్పగలరా మీకు రాని విద్య ఏమిటో తెలుసుకుందామని ఉంది''అన్నారామె ఆశ్చర్యంతో కూడిన ఆప్యాయత ప్రకటిస్తూ.

''మానవసేవ''అని తల వంచుకున్నాడు.

''గీతాపారాయణం చెయ్యటమే తప్ప నాకు మరేమీ తెలియదు. అది కూడా నేనెంత వరకు చెయ్యగలగుతున్నానో నాకు తెలియదు. మీరు గీతని మనసా, వాచా, కర్మా ప్రతినిత్యం పాటిస్తున్నారు. మీరు ఒక కర్మ యోగిని అని చెప్పాలి. మీ దగ్గిర శిష్యరికం చెయ్యటమే నాకొక మహాభాగ్యం'' అని ఎంతో తృప్తిగా నవ్వాడు.

''అంతా ఆ భగవత్కృప''అని ఒక్కసారి తన వాచీ చూచుకుని ''రామాచారిగారి వద్ద వరం పొంది, 'ఆ సీతారాముల దీవెనలు పొందగలమా'' అని నవ్వారు.

''ఎంతమాట! ఎంతమాట!'' అని రామాచారి గబగబా గర్భగుడిలోకి వెళ్ళి పళ్ళెం తీసుకుని హారతి వెలిగించి గంట వాయించి, బయటకు వచ్చి వారివురికి తీర్థం ఇచ్చి, శెఠగోపం పెట్టి అరటి పళ్ళందించాడు.

''మిమ్మల్ని కారులో మీ ఊళ్ళో దింపి తణుకు వెడతాను మీరంగీకరిస్తే'' అన్నారు.

''చాలా సంతోషం. మేము సైకిళ్ళ మీద వచ్చామండీ. మళ్ళీ నేను రేపు ఇక్కడికి, కృష్ణుడు తణుకు రావటానికి మళ్ళీ కారు పంపిస్తారా?'' అన్నాడు రాముడు నవ్వుతూ.

''సరే మీ ఇష్టం. నాకేమీ అభ్యంతరం లేదు. అలా చెయ్యమన్నా చేస్తాను''అని ఒక్కసారి గట్టిగా నవ్వారామె.

వస్తానండి, మళ్ళీ కలుసుకుందాం అని బయల్దేరారు.

''మీరు మా వూరు వచ్చి మా ఇళ్ళకు రావలసిందిగా కోరుకుంటున్నాము''

''ఇదివరలో మీరే మా ఇంటికి వచ్చి రాజ్యం పిన్నిని మీ కారులో తణుకు తీసుకుని వెళ్ళి ఆశ్రమంలో చేర్చారు. జ్ఞాపకం ఉంది అని తలుస్తాను'' అన్నాడు రాముడు.

ఎంతమాట తప్పకుండా వస్తాను. ఎంతో సంతోషం, ఈ సారికి క్షమించాలి''అని వారివురి వద్ద సెలవు తీసుకుని హడావుడిగా బయటకు నడిచి కారులో కూర్చుని క్షణికంలో అదృశ్యమయ్యారు భారతిగారు.

ఒక్కక్షణం రాముడు, కృష్ణుడు ఆమె వెళ్ళిన వైపు చూస్తూండిపోయారు. ఆలయానికి తాళం బెట్టి ఇరువురు స్నేహితులు కంతేరు బయలుదేరారు.

ప్రయాణం చేస్తూనంతసేపూ అనంతం ఏమీ మాట్లాడలేదు.

''ఏమిరా! అలా ఉన్నావ్'' అడిగాడు రాముడు.

''అమ్మ ఆరోగ్యం రోజురోజుకు క్షీణిస్తోందిరా, ఈ రోజు భారతిగారు కూడా చాలా బాధపడుతూ చెప్పారు. ఒక్కసారి తణుకు వెళ్ళి చూచి వద్దామని

ఉంది'' అన్నాడు అనంతం సైకిలు తొక్కుతూ.

''ఇంత రాత్రి ఏమని వెడతావురా భారతిగారు ఉన్నారుగా. పాపం! డాక్టరుగారు విసుగులేకుండా ఎన్నోసార్లు వచ్చి చూచి పోతుంటారు. నువ్వు వెళ్ళి ఏం చేస్తావ్''.

''భారతిగారిని మాటిమాటికి కష్టపెట్టడం నాకిష్టముండదురా. పాపం ఆమె జీవిమంతా సేవ చేస్తూనే ఉన్నారు. నేను ఒక ఉద్యోగిగా భావించుకుని అక్కడకు వెళ్ళి నా కార్యక్రమాలు నిర్వర్తించుకుని వస్తూపోతూండటం నాకేం బాగుండటం లేదు. నేను ఎందుకు ఇలా చేస్తున్నానో నాకే అర్థం కావటం లేదు. నేను ఎవరికీ ఏ రకంగానూ సేవ చేయులేకుండా ఉన్నాను. ఒక పనికివూలిన వానిగా భావించుకుంటున్నాను. నేను ఆమెకు ఏమాత్రంగాను చేదోడు వాదోడుగా లేను'' అని ఒక క్షణికకాలం మాట్లాడ లేకపోయాడు.

''ఆ ఆశ్రమంలో ఉన్న తల్లులను చూస్తుంటే అమ్మ కూడా వారితో పాటే అన్న ఒక భావన కలుగుతూంది.'' అన్నాడు అనంతం.

''ఇది చాలా గొప్ప విశేషం. నువ్వు అనుకున్నంతగా బాధపడవలసిన అవసరం లేదురా! నువ్వు చాలా అదృష్టవంతుడివి. రేపు ఉదయం వెడుదువుగాని తొందరగా పోదాంరా'' అని కబుర్లు చెప్పుకుంటూ కంతేరు చేరారు స్నేహితులిద్దరూ.

ఉదయం ఎవరి కార్యక్రమాలలో వారు నిమగ్నమయ్యారు. ఇవి అంతులేని కార్యక్రమాలు. వీటికి సెలవలు లేవు. ఇది ఒక అనంతమయిన ప్రవాహం. అడ్డూ, ఆపులేని ప్రవాహం. అలసటలేని ప్రవాహం.

క్రిష్ణుడి ఉనికిని చూచి టైము చూచుకుని ఒక చిరునవ్వు నవ్వారు బుచ్చి బాబుగారు.

భారతిగారి ఆఫీసురూంలో ప్రవేశించి చిరునవ్వుతో ఆమెకు నమస్కరించాడు. ఆమె ఒక్కసారి ఎంతో ఆశ్చర్యంతో కృష్ణుణి ఒక క్రొత్త వానిని చూచినట్లు చూచి, నిలబడి ప్రతి నమస్కారం చేశారు.

బయటకు వెళ్ళిపోతున్న క్రిష్ణని పిలిచారు.

"క్రిష్ణగారు! నేను మీతో వస్తా, ఆశ్రమం అంతా ఒక్కసారి చూద్దాం. ఈ మధ్యగా నాకు కుదరటం లేదు" అని క్రిష్ణనితో పాటు ఆశ్రమంఅంతా కలియచూస్తున్నారు భారతిగారు.

ఏదో ఒక కొత్త అనుభూతి పొందుతున్నారు. ఏదో ఒక తెలియని ఉత్సాహంతో అతనికూడా తిరుగుతున్నారామె.

అతను తన కార్యక్రమాలు నిర్వర్తిస్తూ ఒక్కొక్కరి బాధలు, సంతోషాలు, ఆమెకు చెబుతూ వచ్చాడు.

"మీ భోజనం ఆలశ్యమవుతోంది. మీరు వెళ్ళిరండి, నేను చూచుకుంటాను" అన్నాడతను.

"ఏమీ ఇబ్బంది లేదు. మీకు ఇబ్బంది కలిగితే చెప్పండి. నేను వెళ్ళి హాయిగా భోజనం చేసి కళ్ళీ బిగించి నిద్రపోయి వస్తాను అన్నారు" నవ్వుతూ.

"అయ్యో! నా ఉద్దేశ్యమదికాదండి. నేను భోజనంచేసి వచ్చి కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నాను" అన్నాడతను.

"నేను ఎందుకో ఒక తెలియని ఆనందాన్ని పొందుతున్నాను. ఒకక్రొత్త అనుభూతిని రుచిచూస్తున్నాను. మీ బోటివారి సాహవాసం దొరకటం నేను పూర్వజన్మ లో చేసుకున్న పుణ్యంగా భావిస్తున్నాను. ఇంక రేపటి నుంచి నేను కూడా మీతో ఆశ్రమమంతా తిరుగుతాను మీకు అభ్యంతరం లేకపోతే" అన్నారు.

అనంతానికి ఏమి మాట్లాడాలో తెలియలేదు.

"ఇది మీరు నిర్మించిన ఒక ఆలయం" అన్నాడు.

"ఈ ఆలయానికి మీరు ఒక పూజారి. నేను ఒక ట్రస్టీగానే

భావించుకుంటాను. వీరందరూ మనదేవుళ్ళు'' అన్నారామె.

''నేను పూజారిని, మీరు ట్రస్టీ అయినప్పుడు భక్తులెవరు?'' ప్రశ్నించాడు అనంతం నవ్వుతూ.

ఒక్కసారి దిగ్భ్రాంతి చెందారామె.

''నేను వెళ్ళి భోజనంచేసి ఆలోచించుకుని చెబుతాను'' అని చెప్పి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు భారతిగారు.

'ఇతను ఎవరు? ఎక్కడివాడు? ఇతని తల్లి తండ్రులెవరు? ఒక్కసారి కూడా రామాచారి తనతో చెప్పలేదే? ఎందుకు చెప్పలేదు. ఇతను సామాన్యుడుకాడు. ఇతనొక మహాజ్ఞాని' అని కృష్ణని తలుచుకుంటూ ఆమె తనకుటీరం చేరుకున్నారు.

# 19

కంతేరులో చిన వెంకటాచారి ఇంటిముందు కారు ఆగింది. భారతిగారు కారు తలుపు తెరుచుకుని దిగారు.

రాత్రి రెండు గంటలు దాటుతోంది.

కాకిలేరు రామాలయంలో అనంతం చేసిన భగవద్గీతా పారాయణం జరిగి వారం కూడా కాలేదు.

''రామాచారి గారు! రామాచారి గారు!'' అని పిలిచి చిన వెంకటాచార్యులవారి ఇంటి తలుపుకొట్టారు భారతిగారు.

''ఎవరూ?'' అంటూ బద్ధకంగా లేచి వచ్చి తలుపు తీశాడు రామాచారి.

''అయ్యో మీరా? ఇంత అర్ధరాత్రి వచ్చారు. రండిలోపలికి ఏమిటి విశేషం'' అడిగాడు రామాచారి.

''మీరు బయటకు రండి ఒక్కసారి'' అని మెట్లుదిగి కారుదగ్గిరకు వెళ్ళారు'' భారతిగారు.

ఏదో ఒక తెలియని ఆవేదన మొదలయ్యింది రామాచారిలో.

''ఏం జరిగిందండి? మీరు ఇంత అర్ధరాత్రి వేళ తణుకు నుంచి రావటం నన్ను ఎంతో కలవర పెడుతోంది.'' అంటూ ఆమెను కారు వరకు అనుసరించాడు.

''ఏమీలేదు మీరు నాతో ఒక్కసారి ఊరుకు రాగలరా? రాజేశ్వరమ్మగారు చని పోయారు'' అన్నారామె.

ఒక్కసారి మాట్లాడలేకపోయాడు రామాచారి.

''ఈ మధ్యగా ఆమె చాలా బాధపడుతున్నారు. డాక్టరుగారు ఇంతవరకు ఆమెను బ్రతికించటానికి శయూశక్తులా ప్రయత్నించారు. కాని ఏమీ లాభం లేకపోయింది''. అన్నారామె.

'' మీరు ఇంత అర్ధరాత్రివేళ ఒక్కరు డ్రైవ్ చేసుకుంటూ ఈ కబురందించారు, ఫోను చెయ్యవలసింది'' అన్నాడు రామాచారి.

''ఇంత రాత్రి ఫోను ఎవరూ పట్టించుకోరు. బుచ్చిబాబు గారు కూడా వచ్చారు నాతో, కారులో కూర్చున్నారు'' అన్నారామె.

బుచ్చిబాబుగారు కారులోంచి దిగారు.

''బాబు! రామూ! నీకు తెలుసుగా భారతమ్మ ఉన్నట్లుండి ప్రయాణమయ్యింది. మీ నాన్నగారు ఈ వార్త విని కంగారు పడతారు. అసలే పాపం కష్టాలలో ఉన్నారు. కాని ఉండబట్టలేక బయలుదేరి వచ్చాం. ఈ కబురు అందచెయ్యటానికి ఫోను పలకటం లేదు'' అన్నారు బుచ్చిబాబుగారు.

''ఫరవాలేదు మా అమ్మ, నాన్న నిద్రపోతున్నారు. కొంతకాలంగా నిద్రమాత్రలు వేసుకుంటున్నారు'' అన్నాడు రామాచారి.

''రామాచారిగారు! మీరీ వార్త కృష్ణగారికి కూడా అందచెయ్యండి. మీరు కృష్ణగారు కూడా వస్తే బాగుంటుంది.'' అని వూరుకున్నారు.

''అలాగే! తప్పకుండా, ఇప్పుడే బయలుదేరి వెడదాం'' అన్నాడు.

అప్పటికే రామాచారి భార్య గుమ్మం దగ్గిర నిలబడి వుంది.

ఒక్కసారి ఆమెని పిలిచి ఏదో చెప్పాడు రామాచారి.

''అలాగే నేను మామగారికి, అత్తగారికి చెబుతాను. కాని ఈ కబురు మాత్రం చెప్పను. తరువాత మీరు వచ్చి చెబుదురు గాని''అందామె.

''చిన్నికిష్టమ్మని కాకిలేరు పంపు. నాన్న, ఇక్కడ చూచుకుంటాడు. నాకు అంగవస్త్రం, బనీను ఒక సంచీలో వేసి తీసుకురా'' అని చెప్పి భారతిగారితో ఏదో మాట్లాడుతున్నాడు.

''ఇప్పుడు క్రిష్టగారు కూడా మనతో వస్తారా? పాపం! ఆయన పనులు మానుకుని ఈ సమయంలో రాగలరా'' అడిగిందామె.

''ఎందుకురాడు! వస్తాడు''అని భార్య ఇచ్చిన సంచీ పుచ్చుకుని వారితో బయలుదేరాడు రాముడు. కొంచెం దూరం వెళ్లాక

''ఇక్కడ ఆపండి ఇదే క్రిష్ణ ఇల్లు'' అన్నాడు రాముడు.

భారతిగారు కారు ఆపారు.

రాముడు కారుదిగి క్రిష్ణ ఇంటి తలుపుకొట్టాడు.

తలుపు తెరుచుకుని కృష్ణ బయటకు వచ్చి రాముణ్ణి చూచి ఆశ్చర్యపోయి ''ఎవరొచ్చారు''అడిగాడు.

''భారతిగారు, బుచ్చిబాబు గారు'' అన్నాడు రాముడు.

గబగబా బయటకు వచ్చి వారివురికి నమస్కారంచేసి ఆతృతగా వారికేసి చూచాడు.

''కారు ఎక్కుబాబు క్రిష్ణా! ఒకసారి తణుకు వెడదాం''అన్నారు బుచ్చిబాబుగారు.

క్రిష్ణకి నోటమాట రాలేదు. రాముడికేసి, భారతిగారికేసి వెర్రిగా చూచాడు.

''ఏమయింది సార్! ఏమయ్యింది మేడమ్'' అడిగాడు క్రిష్ణ.

''నువ్వు ఒక సంచి, కండువా తీసుకుని బయలుదేరు. నీ అవసరం చాలా ఉంది. అక్కడ అమ్మలకి ఒంట్లో బావుండలేదు. రేపు ఉదయం స్కూలు పిల్లలకి సెలవు ఇయ్యి'' అన్నాడు ఆచారి.

ఎవరు ఏమి మాట్లాడుతున్నారో, ఎందుకు ఇలా ఎవరి గురించి మాట్లాడుతున్నారో బోధపడక చూస్తూండిపోయాడు అనంతం.

'క్రిష్ణగారూ! ఏమీ కంగారు పడకండి ఏమీ కాలేదు' అన్నారు భారతిగారు.

'రావయ్యా క్రిష్ణ! తొందరగా పోదాం' అన్నారు బుచ్చిబాబుగారు.

రాముడు లోపలికి వెళ్ళి ఒక సంచితో బయటకు వచ్చి ఇంటికి తాళం పెట్టి సుద్దముక్కతో తలుపుమీద 'ఇవాళ సెలవు' అని రాసి అనంతాన్ని కారు ఎక్కించుకుని అంతా బయలుదేరారు.

భారతిగారు కారు నడుపుతున్నారు. ప్రక్కనే కూర్చున్నారు బుచ్చిబాబుగారు రాముడు, అనంతం వెనుకగా కూర్చున్నారు.

'క్రిష్ణగారూ! రాజేశ్వరమ్మగారు చనిపోయారు. ఈ వార్త రామాచారిగారికి చెబు దాం అని వచ్చాం. ఎంత ప్రయత్నించినా మీ వూరి ఫోను పలకలేదు. మిమ్ములను కూడా పిలుచుకుని వెడదాంఅన్నారు రామాచారిగారు'' అన్నారామె.

''క్రిష్ణ నెందుకయ్యా ఇంత రాత్రివేళ? అతడు మామూలుగా అతని కార్యాక్రమాలు చూచుకుని వస్తాడులే అంటే వింటేనా రామం'' అన్నారు బుచ్చిబాబుగారు.

అనంతానికి దుఃఖం ఆగలేదు. ప్రక్కనే ఉన్న రాముడు అనంతం భుజం మీద చెయ్యివేశాడు, తలనిమిరాడు.

దుఃఖం ఆపుకోలేకపోయాడు అనంతం. తన తువ్వాలు అందించాడు రాముడు.

''అందరూ నా అమ్మలే'' అనిపించింది.

''ఎంతసేపయ్యింది భారతిగారు! అమ్మ చనిపోయి'' అడిగాడు కృష్ణ.

''పదిగంటలకి. పాపం.! డాక్టరుగారు చాలా శ్రమపడ్డారు. కాని లాభంలేక పోయింది'' అన్నారామె.

''ఉదయం మీరు ఆశ్రమం చూసుకుంటే రామాచారిగారు, బుచ్చిబాబుగారు కార్యక్రమాలు చూసుకుంటారు'' అన్నారామె.

''అలాగే! తప్పకుండా'' అన్నాడు కృష్ణ.

రాముడు, అనంతం ఒకరినొకరు చూచుకున్నారు.

ఆశ్రమానికి చేరింది కారు.

అందరూ కారుదిగి రాజేశ్వరమ్మగారు పడుకున్న మంచం దగ్గర చేరారు.

ఆశ్రమం అంతా చాలా నిశ్శబ్దంగా ఉంది. అమ్మలందరూ నిద్రపోతున్నారు.

అమ్మని చూడగానే దుఃఖం ఆగలేదు అనంతానికి.

రామాచారి ఎంతో కష్టం మీద దుఃఖం అపుకుని అనంతం వీపుతట్టాడు.

''ఎవరి బ్రతుకులు ఎలా ఉంటాయో మనం ఏం చెప్పలేము, బాధపడకండి బాబు! అమ్మా మీరు వెళ్ళి విశ్రమించండి'' అన్నారు బుచ్చిబాబుగారు.

భారతిగారు ఏమీ మాట్లాడకుండా ఆమె కుటీరానికి వెళ్ళారు.

''బుచ్చిబాబుగారూ! తమరుకూడా వెళ్ళి కాస్సేపు పడుకోండి నేను, క్రిష్ణ ఇక్కడుంటాం'' అన్నాడు రామచారి.

బుచ్చిబాబుగారు కూడా వెళ్ళిపోయారు.

అనంతం, రాముడు కాస్సేపు మాట్లాడుకోలేదు.

''ఏ మతాల వారికి ఆవిధంగా కర్మకాండ జరుపుతారు. ఆఖరికి ఎలక్ట్రిక్ క్రిమిటోరియంకి పంపుతారు'' అన్నాడు రాముడు.

''రాముడూ! కార్యక్రమం అంతా నేను జరుపుతాను. ఇందుకే కదరా నేను ఇన్నాళ్ళు అమ్మని చూసుకుంటున్నాను. కనీసం నేను చెయ్యవలసిన కార్యక్రమాలు నన్ను చెయ్యనియ్యి నాకు తృప్తిగా ఉంటుంది'' అన్నాడు అనంతం.

''అవునులే! ఎంతకాలం దాచిపెడతావు, ఇంక టైము వచ్చింది. తప్పులేదు బయటపడు. మీరిద్దరూ కలిసి ఇక్కడున్న అమ్మలకి సేవ చెయ్యగలిగితే అది మహోన్నతమయిన విషయం'' అన్నాడు రాముడు.

అనంతం ఏమీ మాట్లాడలేదు. అలా రాజేశ్వరమ్మగారి కాళ్ళదగ్గర కూర్చుని

చేతులు ఆమె కాళ్ళ మీద వేసుకుని దుఃఖించసాగాడు.

ఆదిశంకరుడి మాతృపంచకం గుర్తుకొచ్చి వర్ణించుకున్నాడు.

శ్లో : అస్తాం తావదియం ప్రసూతి సమ యే దుర్వార శూల వ్యథా
నైరిచ్యే తనుశోషణం మలయమిశయ్యాచ సాంవత్సరీ !

ఏకస్యాపి న గర్భభారభరణ క్లేశస్య యస్యాక్షమః
దాతుం నిష్కృతి మున్నతోపి తనయస్తస్మై జనన్యై నమః

అమ్మా! నేను జన్మించు సమయములో నీవు పురిటినెప్పులతో ఎంతో బాధపడి ఉంటావు. ఏ తల్లికైనా అది భరించలేని సమయము.

ఆ తరువాత కొంతకాలం అపరిమితమైన ఆహార నియమాలు పాటించి శక్తిని కోల్పోయావు.

నేను విసర్జించిన మలమూత్రాదులలో దొల్లి కొట్టుమిటలాడి నిద్ర కోల్పోయావు.
అన్నింటినీ మించి నీవు నన్ను తొమ్మిది నెలలు నీ గర్భమునందు దాచుకుని ఎలా మోశావమ్మా! నాకు నిష్కృతి లేదు.

'నేను ఆ చేతనుణ్ణి, నీ ఋణం తీర్చుకునే శక్తి నాకు లేదమ్మా! ఇవే నా నమస్కారములు అందుకో తల్లీ'

శ్లో : గురుకులము పస్రుత్య స్వప్నకాలేతు దృష్ట్వా
యతిసముచితవేషం ప్రారుదోమాంత్వముచ్చైః
గురుకుల మథసర్వం ప్రారుతత్ తే సమక్షం
సపది చరణ యోస్తే మాతరస్తు ప్రణామః

అమ్మా! నీకు జ్ఞాపకం ఉందా? ఒకసారి నేను సన్యాసము స్వీకరించానని కలగని, ఎంతో భయోత్పాతము చెంది నాకొరకు గురుకులానికి పరుగున వచ్చి ఎంతో దుఃఖించినప్పుడు, మాతోటి విద్యార్థులు నిన్ను వేళాకోళము పట్టించినారు.

నాయందు నీవు చూపిన అఖండమయిన ప్రేమానురాగములకు నేను ప్రతిఫలముగా ఏమీ ఇయ్యాలేనమ్మా!

నీ పాద పద్మములకి వేనా నమస్కారములు

శ్లో : న దత్తం మాతస్తే మరణసమయే తోయమపి వా
స్వధావానోదేయో మరణదివసే శాస్త్ర విధినా!
నీజప్తోమాతస్తే మరణ సమయే తారకమనుః
అకాలే సంప్రాప్తేమయి కురు దయాం మాతరకులామ్

అమ్మా! నీ మరణ సమయములో కూడా నేను నీ నోటిలో తులసీ తీర్థము పోయుటకు కూడా నోచుకోనయితినే! శాస్త్రాలు చెప్పినక్రియలు ఆచరించకపోతినే. నీకు తర్పణాలు సమర్పించలేకపోతినే! నీ చెవిలో తారకమంత్రము చెప్పగ లేకపోతినే!

'ఎంతో ఆలస్యముగా వచ్చి నీ దీవెనలు కొరకు వేడుకొనుచున్నాను'.

శ్లో : ముక్తా మాణిస్త్వం నయనం మమేతి
రాజేతి జీవేతి చిరం సుతత్వమ్

ఇత్యుక్త వత్యాస్తవ వాచి మాతః
ద దామ్యహం తండులమేవ శుష్కమ్

అమ్మా! నీవు నన్ను ఉయ్యాలలో ఉపుతూ, నా మణిపూస, నావజ్రం, నా రాజా యనుచు ఎంతో ఆప్యాయతతో నన్ను ముద్దాడిన నీ నోటికి నేను ఎండిన బియ్యము మాత్రమే అర్పించుచున్నాను.

'అది కూడా చేయలేని స్థితి నాది.'

శ్లో : అంబేతి తాతేతి శివేతి తస్మిన్
ప్రసూతి కాలేదయదవో చ ఉచ్చైః!

కృష్ణేతి గోవింద హారే ముకుందే
త్వహోజనన్యై చిరతే యమంజలి

అవమ్మా! నీవు ప్రసూతి నెప్పులు భరించుచూ, ఈశ్వరా, హరి నామసంకీర్తనములు చేయుచూ నాకు జన్మనిచ్చితివే ఇది ఎప్పటికీ తీరని ఋణం.

''ఏ జీవికీ ఈ ఋణం తీర్చుకునే అవకాశం లేదు. ఇది అసాధ్యము. అమ్మా! నేను నీకు ఏదీ చేయలేదు, ఇవే నా నమస్కృతులు. అందుకో తల్లీ'' అని ఆదిశంకరుని తలుచుకుంటూ తల్లిని చూస్తూ దుఃఖిస్తూ రాజేశ్వరమ్మ గారి కాళ్ళ దగ్గిర కూర్చుని ఎంతో కలత చెందుతున్నాడు అనంతం.

రామాచారి అనంతాన్ని ఓదారుస్తున్నాడు.

''అనంతం ! నీవు జ్ఞానివి. వివేకంతో మెలుగు స్వభావం నీది. నీ ధర్మం నువ్వు నిర్వర్తించావు. ఇంక కర్తవ్యం గురించి ఆలోచించు. బాధపడి ప్రయోజనం లేదు''

''పోయిన వారు చాలా అదృష్టవంతులు. ఈ భౌతిక ప్రపంచము నొదిలి ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని చేరి, ఆ పరమాత్మలో కలిసిపోయారు. లే! లే! బాధపడకు'' అని ఊరడించాడు.

రామాచారిలో శ్రీ కృష్ణపరమాత్మని చూడగలిగాడు అనంతం.

'ఇది సత్యం! నాధర్మం నేను నిర్వర్తిస్తాను' అనుకుని ఒకసారి లేచి రాజేశ్వరమ్మగారికి నమస్కరించి రామాచారి ప్రక్కగాచేరి నిలబడి యున్నాడు.

వారిద్దరు కాస్సేపు మాట్లాడుకోలేదు.

''అనంతం! నీ పరిస్థితులు భారతిగారికి తెలియ చెయ్యవలిన టైము వచ్చింది. నీవు ఈ ఆశ్రమానికిచ్చిన దానధర్మాలు గుప్తంగా ఉంచనవసరం లేదు. నేను కూడా నీతో సహకరిస్తాను. భారతిగారితో అంతా వివరంగా చెబుతాను. ఇది ఈశ్రమానికెంతో మేలు చేస్తుంది' అమ్మ ఆత్మ తృప్తి పడుతుంది. ఏమంటావురా?'' అని ఒక్కసారి అనంతం ముఖంలోకి చూచాడు.

అనంతం కళ్ళ వెంబడి నీరు కారుతోంది. ముఖం ఎంతో వికసింపుగా ఉంది. మనస్సు ఎంతో నిర్మాలంగా ఉన్నట్లు గ్రహించాడు రామాచారి.

''నీ కంటి నీరు నాకానంద భాష్పాలుగా కనిపిస్తోందిరా. ఇంత కంటే నాకు కావలసినదేముంది'' అని ఒక్కసారి లేచి అనంతాన్ని పట్టుకుని హృదయపూర్వకంగా హత్తుకుని ఊరడించాడు రామాచారి.

తెల్లవారుతూంది. భారతిగారు, బుచ్చిబాబుగారు రాజేశ్వరమ్మగారి ప్రక్కనే చేరుకున్నారు.

''అన్ని ఏర్పాట్లు చేశాము. పురోహితుడొస్తున్నాడు. మామూలుగా అంత హడావిడి చెయ్యకుండా పుణ్యావచనం చేయించి వ్యాన్‌లో పంపిస్తాము. సాధారణంగా ఇక్కడున్న అమ్మలకి ఏం జరిగిందో తెలియనియ్యము. వారు కంగారు పడతారు, బాధపడతారు'' అన్నారు బుచ్చిబాబుగారు.

''ఆశ్రమంలో ఉన్న అమ్మలందరికీ ఎవరో ఒకరు వాళ్ళ వాళ్ళు వుంటూనే ఉంటారు. కాని రాజేశ్వరమ్మగారికి ఎవరు లేకపోవటం చాలా బాధాకరంగా ఉంది. అంతా ఈ రామాచారిగారే చూసుకుంటారు. ఇంతవరకు అబ్బాయి అమెరికా ఎడ్రస్సు ఎవరికి తెలియదు''అంటూ కొంత ఆవేదన ప్రకటించారామె.

రెండు చేతులతో మొహం కప్పుకుని దుఃఖం ఆపుకోలేకపోయాడు అనంతం.

క్రిష్ణ దుఃఖించటం చూచి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు భారతిగారు, బుచ్చిబాబుగారు.

''మా క్రిష్ణ! చాలా బోళా బోళీ మనిషి. ఎవరికి ఏ కష్టమొచ్చినా తట్టుకోలేడు'' అని ఆచారి అనంతాన్ని ఊరడిస్తూన్నాడు.

అనంతం తమాయించుకున్నాడు

''భారతిగారూ! అమెరికాలో ఎడ్రస్సు తెలియకుండా తిరుగుతున్న రాజేశ్వరమ్మ గారి పుత్రుడు గుప్త దాన కర్త అనంతక్రిష్ణశర్మ ఇతడే. క్రిష్ణుడు, మీ కృష్ణుడు, మన క్రిష్ణుడు'' అని అనంతాన్ని భారతిగారికి, బుచ్చిబాబుగారికి పరిచయం చేశాడు రాముడు.

భారతిగారు, బుచ్చిబాబుగారు ఒక్కసారి బిగిసిపోయి అనంతాన్ని చూస్తూండి పోయారు.

కాస్సేపు అంతా ఆశ్చర్యంలో ఉండిపోయారు.

ఎవరూ కాస్సేపు మాట్లాడలేదు.

నోటిమాట రాలేదు భారతిగారికి.

చూస్తూ నుంచున్నాడు రామాచారి.

"ఇంతకాలంగా అజ్ఞాతవాసంలో గడుపుతున్న అనంతక్రిష్ణశర్మగారిని కారణ మడగవచ్చునా?" అడిగారామె.

తలవంచుకుని నుంచున్నాడు అనంతం.

"అజ్ఞాతంలో ఉన్నావారికి ఇక్కడి అమ్మలకి స్వయంగా సేవచేసే అవకాశం ఎక్కువగా ఉంటుందని ఇతడి ఉద్దేశ్యం" అని ఊరుకున్నాడు రాముడు.

ఎంతో ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి పోయారు భారతిగారు.

బుచ్చిబాబుగారు హడావిడిగా బయటకు వెళ్ళారు.

"నాకు మాటలు రావటంలేదండి క్రిష్ణగారు. నన్ను క్షమించండి, తరువాత మాట్లాడుకుందాం. రాజేశ్వరమ్మగారు ఎంతో అదృష్టవంతురాలు, ఆమెకు తెలియకుండానే చివరదశలో కొడుకు చేత చాకీరి చేయించుకున్నారు. క్రిష్ణగారు ఎంతో పుణ్యం చేసుకున్నారు".

"మీరు మా ఆశ్రమంలో ఉండటమే మాకు ఒక మహాభాగ్యం. నాకు అమెరికా మీదున్న ఏహ్యభావాన్ని తొలగించారు, నాకు ఒక మహాభాగ్యం కలిగించారు" అని దుఃఖం ఆపుకోలేక బడబడ ఏడ్చిందామె.

"అమ్మలు లేచి తిరిగే వేళయ్యింది. త్వరగా కార్యక్రమాలు నిర్వర్తించండి." అని రాజేశ్వరమ్మగారి కాళ్లకు దణ్ణంపెట్టి దుఃఖాన్ని ఆపుకుంటూ త్వరత్వరగా కుటీరం చేరుకున్నారామె.

రాజేశ్వరమ్మగారి దేహాన్ని ఆ ఇద్దరు స్నేహితులు బయటకు తీసుకుని వెళ్ళి వాన్‌లోకి చెర్చారు.

బుచ్చిబాబుగారి వద్ద సెలవు తీసుకుని వారికి డాక్టరుగారిచ్చిన డెత్ సర్టిఫికెట్ తీసుకుని వ్యాన్ ఎక్కి ఎలక్ట్రికల్ క్రిమెటొరియంకి బయలుదేరారు.

కార్యక్రమాలు పూర్తి చేసుకుని అనంతం, రాముడు ఆశ్రమం చేరుకునే సరికి మిట్టమధ్యాహ్నం ఒంటిగంటయ్యింది.

వారికెదురుగా వచ్చారు బుచ్చిబాబుగారు

''బాబూ! క్రిష్టా! ఈ రోజుకి ఇంటికివెళ్ళిపో నాయనా! కొన్నాళ్ళు నీకు విశ్రాంతి అవసరం'' అన్నారు బుచ్చిబాబుగారు.

ఒక్కసారి ఆయనకేసి చూచి చిరునవ్వు నవ్వి వార్డులలో ప్రవేశించి తన కార్యక్రమాలు నిర్వర్తించసాగాడు అనంతం.

రామాచారి, బుచ్చిబాబుగారు అలా చూస్తూండి పోయారు.

కాస్సేపు వారు మాట్లాడుకోలేదు.

''బుచ్చిబాబుగారు! ఇతడి మనస్తత్వం అసాధారణమైనది. అతనికితోచినట్లే కానియ్యండి. నేను ఒక్కసారి భారతిగారిని చూచి సెలవు తీసుకుని మా ఊరు వెడతాను'' అని భారతిగారి కుటీరం చేరుకున్నాడు రామాచారి.

వార్డులన్నీ తిరుగుతూ అమ్మలందరిని పలుకరించుకుంటూ తను చెయ్యవలసిన కార్యక్రమాలు నిర్వర్తించుకుంటూ టెర్మినల్‌వార్డు చేరుకున్నాడు అనంతం.

టెర్మినల్‌వార్డులో ఒకరికి ఒకరు కనపడకుండా అడ్డుగా తెరలుకడతారు. అక్కడున్న అమ్మలకి రాజేశ్వరమ్మగారి గూర్చివైనం తెలియదు.

అనంతం రాజేశ్వరమ్మగారి ప్రక్క దగ్గిరకి చేరి దుఃఖిస్తూ దుప్పట్లు తీసి మడత పెడుతున్నాడు.

ఇంతలో భారతిగారు, బుచ్చిబాబుగారు అక్కడికి వచ్చారు.

''క్రిష్ణగారు! మీరు ఇంటికి వెళ్ళికొంత విశ్రాంతి తీసుకోండి, మీకోసం రామాచారిగారు బయటకాచుకుని వున్నారు. మళ్ళీ నేను మిమ్మల్ని రేపు మధ్యాహ్నం

కంతేరు వచ్చి కలుస్తాను. అంతవరకు మీరు నావేడుకని పాటించవలసిందిగా కోరుకుంటున్నాను.'' అని కళ్ళు తుడుచుకుంటూ అనంతాన్ని అర్థించారు భారతిగారు.

అనంతం ఆమెకేసి చూచి ఒక చిరునవ్వు నవ్వి నమస్కారం చేసి వారి వద్ద సెలవు తీసుకుని రామాచారితో కంతేరు బయలుదేరాడు.

# 20

ఆరోజు రాజేశ్వరమ్మగారు చనిపోయిన రెండవరోజు. కాకిలేరు రామాలయంలో కార్యక్రమాలు ముగించుకుని రామాచారి కంతేరు చేరుకునే సరికి పన్నెండు గంటలు కావస్తోంది.

అనంతం ఇంటిబయట భారతిగారి కారు ఆగి ఉంది. సైకిలు ఆపు చేసుకుని అనంతం ఇంటి తలుపుకొట్టాడు రామాచారి.

తలుపుతీశారు భారతి గారు

'నమస్కారం! ఎంతసేపయిందండి మీరు వచ్చి' అడిగాడు రామాచారి.

'సుమారుగా రెండుగంటలయ్యింది.' అన్నారామె.

'వాడేడీ!' అడిగాడు రామాచారి.

'బయలుదేరుతున్నారు. మీరు చెప్పండి అయనకు. ఆశ్రమానికి వెళ్ళే టైమయ్యింది కదా! నా కారులో రావచ్చుగా. మళ్ళీ శ్రమతీసుకుంటూ అంత దూరం సైకిలు తొక్కుకుంటూ రానవసరం లేదు కదా! నేను కూడా వెడుతున్నాను కదా! ఆయన కార్యక్రమాలకి నేను అడ్డురాను''అన్నారామె.

ఇంతలో అనంతం తన సంచి తీసుకుని బయటకువచ్చి సైకిలు తాళంతీసి స్టాండు తీశాడు.

రామాచారి అనంతం దగ్గిరకి వెళ్ళి, మళ్ళీ సైకిలుకి తాళం వేసి, అనంతాన్ని వీపు మీద నెమ్మదిగా తట్టాడు.

అనంతం, భారతిగారు, రామాచారి బయటకు వచ్చారు.

రామాచారి వద్ద సెలవుతీసుకుని అనంతాన్ని కారులో ఎక్కించుకుని భారతిగారు తణుకు బయలుదేరారు.

రామాచారి ఆనందబాష్పాలు తుడుచుకుంటూ వారు వెళ్ళేవైపు చూస్తూ నుంచున్నాడు.

''ఆ సీతారాములు వీరికి వెయ్యి ఏనుగుల బలం ప్రసాదించి, వీరు అనుకున్న ఆ మహాత్కార్యాలు జరుగునట్లు ఆశీర్వదించుగాక!'' అనుకుని సైకిలెక్కి ఎంతో హాయిగా ఇల్లు చేరుకున్నాడు రామాచారి.

***

ఈ అనంతమైన భౌతిక ప్రకృతికి బద్ధమై, ఇంద్రియాల పరిమితికి కట్టుబడి పయనించు సమస్త జీవరాసులలో మానవుడు విచక్షణా శక్తి గల వానిగా తన భావన.

ఈ ప్రకృతిలో మునిగితేలి గమ్య అగమ్యాలు తెలియని స్థితిలో పడి, కొట్టు మిటలాడి, ఎవరికి ఎవరోతెలియక, ఎవరు ఏ గట్టు ఎందుకు చేరుతారో ఎవరూ వూహించలేరేమో?

ఈ గట్టు, ఆగట్టు అనుచూ పరిష్కారమార్గములు నిర్ణఇంచుటకు మనమెవ్వరము?

ఏగట్టు అయినా మనకు తెలియని ఆత్మతృప్తినిచ్చు ఆధ్యాత్మిక ప్రపంచానికొక మొదటి మెట్టుకాగలిగినచో ఆజీవి ధన్యజీవి కావచ్చునేమో?

ఏమో!

తెలియదు.

***